శ్రీ

# శివభక్తవిజయకథావళి



ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి

ప్రథమముద్రణము
1963





వెల రూ 2.50
(పోస్టేజీ ప్రత్యేకము)

Acc No. 11671

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా!

శివభక్తవిజయ కథలను నేను బెక్కెండ్లనుండి వచనరూపంబుగ వ్రాసి ప్రకటింపఁ దలఁచితిని గాని యట్లుగాలేదు. వత్సరము క్రింద శివానుగ్రహంబునఁ గొన్ని కథలను వ్రాసితిని. ప్రస్తుతమందు వాని ముద్రింపించితిని. ఇందుఁ గొన్నికథలు పౌరాణికములును మఱికొన్ని చారిత్రకములు నై యున్నవి. కల్పితకథలిందుఁ జేర్పఁబడలేదు. పౌరాణిక కథలందాయాపురాణశ్లోకంబు లాదందుఁదాత్పర్యార్థముతో వ్రాయఁ బడినవి. స్తుతుల యవసరమందుఁ గూడఁ బురాణగ్రంథంబులందలి స్తుతులను శ్రీ శ్రీ పుష్పదంత శంకరాచార్యాది పూజ్య విరచిత స్తవంబులందలి శ్లోకంబులను భావార్థములతో నిందు వ్రాసితిని. చారిత్రకథలందు భక్తశిరోమణులగుఱించి యవ్వారిచే రచింపఁబడిన గ్రంథంబుల నుండియు నవ్వారిని గుఱించి యితర కవిపండితులు వ్రాసిన గ్రంథంబుల నుండియుఁ బ్రస్తావానుకూల పద్యంబులను గ్రహించి యిందుఁ జేర్చితిని. ప్రస్తుతకాలమందుఁగూడఁ బలువురు సనాతన ధర్మబద్ధులై దైవభక్తి కలిగి యుండుట నిట్టి భక్తచరిత్రంబులఁ జదువుటయందును వినుటయందును నాసక్తి నొందియుందు రనివిశ్వాసము. ఇక నిందలిరచన అందఱు దెలియునట్లుగా సాధారణ శైలినే యిందుఁగూర్చితిని. ఇఁకఁ జారిత్రిక భక్త చరిత్రంబులం దవ్వారి కాలమానమును గూడ నందందుఁ దెలిపితిని గాని నేఁటి వఱకు మహామహులగు శ్రీభట్టభాస్కర శంకరాచార్యాదుల కాలమానమునుగూర్చి యింకను మేధావులు చర్చించుచునే యున్నారు. అందుచే నివమిత్థమని వ్రాయుటకు నిశ్చయములేకున్నను నేదేని యొండొకమార్గము ననుసరించి వ్రాసితిని. ఇందెందేని నా వ్రాయుటయందు పౌర్వాపర్యక్రమంబునఁ గాని మఱి యిఁక నెందేని భిన్నమార్గంబుగఁ దోచినయెడల నందందు యథోచితంబుగ స్వాభిప్రాయానుసారంబుగనే యోజింతురుగాతయని మనవి. మఱియు ముద్రాప్రమాదంబులందుఁ జాలవఱకు శుద్ధపత్రికలోఁజేర్చి దిద్దితిని. మిగిలినవాని యథాతథంబుగ దిద్దికొని చదువుకొనుటకై కోరుచు శివభక్త విజయ కథావళిని దమసమక్షమం విడుచున్నాఁడను. ఓంతత్సత్.

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి

# ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి విరచిత

# గ్రంథములు

1. శివపురాణము (పద్యకావ్యము – ద్వితీయముద్రితము)
క్యాలికోబైండు. వెల రూ. 12.00

2. హరదత్త విజయము (పద్యకావ్యము)
3 సం॥లు ఆంధ్రవిశ్వవిద్యాలయమందు భాషాప్రవీణ పరీక్షకుఁ బాఠ్యమైనది. వెల రూ. 2.00

3. సుభద్ర (భారతనాటకము)
3 సం॥లు మద్రాసు విశ్వవిద్యాలయమందు విద్వాన్ పరీక్షకును,
3 సం॥ ఉస్మానియా విశ్వవిద్యాలయమందు B. O. L. పరీక్షకును
పాఠ్యమైనది. వెల రూ. 1.50

4. అభినవరామాయణము (పద్యకావ్యము) వెల రూ. 1.

5. భ్రామరీద్విశతి (శ్రీశైలవిభవము) వెల 0.75 న. పై.

అన్నిటికి పోస్టేజీ ప్రత్యేకము

ప్రాప్తిస్థానము:–

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి

43 మారేడుపల్లి, శికిందాబాదు,

# తప్పొప్పులు

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | విఘ్నేశ్ప | విఘ్నేశ్వ |
| 3 | 11 | దర్శంబు | దర్శనంబు |
| 22 | 26 | ఈయంతి | ఈయంత |
| 33 | 18 | దివ్యోక్త | దివ్యోక్తి |
| 35 | 25 | యయాంపూత | యయాప్రాతం |
| 36 | 6 | మైనట్టి | వైనట్టి |
| 48 | 8 | బముతో | బములతో |
| 48 | 24 | విశ్వస | విశ్వాస |
| 87 | చివర | జుష్టాంబాం | జుష్టామంబాం |
| 100 | 17 | 13 | 14 |
| 104 | 7 | హితుండుండై | హితుండై |
| 108 | 7 | భోగవత్ | భోగవతీ |
| 108 | 17 | జజ్రి | వజ్రి |
| 126 | 23 | 15 | 16 |
| 140 | 23 | బరిణంబును | బరిణయును |
| 155 | 20 | త్రంగత్తు | త్తుంగస్త |
| 176 | 15 | యశంబున | యంశంబున |
| 209 | 11 | నికురంబ | నికురంబః |
| 209 | 12 | వరాత్మా | వరమాత్మా |
| 209 | చివర | పూరైః | పూర్వైః |
| 212 | 10 | సోధుం | సోఢుం |
| 221 | 18 | 77 | 770 |
| 224 | 15 | గాంచనే | గాంచెనే |
| 233 | 19 | నిడుగుడమల | వనిపురి |
| 244 | 8 | జేస్త్వాం | జేత్వాం |
| 311 | 10 | శివాలింగం | శివలింగం |

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ?20 | 10 | మతుండయ్యె | మృతుండయ్యె |
| 328 | 9 | కత్యంబుల | కృత్యంబుల |
| 333 | 5 | ర్వ్యవసితా | ర్వ్యావసితా |
| 334 | 28 | దోదూాయ | దోధూాయ |
| 350 | 9 | గాల్యన్న | శాల్యన్న |
| 350 | 13 | మను | మన |
| 350 | 14 | దను | దన |

చేర్పులు

| | | |
|---|---|---|
| 214 | 11 | 28. జగద్గురులు – ఏకోరామ సిద్ధారాధ్య గురులు |
| 216 | 8 | 29. జగద్గురులు – ఉద్భటారాధ్య గురులు |
| 229 | 24 | 30. జగద్గురులు – వేమనారాధ్య గురులు |
| 234 | 1 | 31. జగద్గురులు – విశ్వారాధ్య గురులు |
| 237 | 1 | 32. జగద్గురులు – శ్రీపతి పండితారాధ్య గురులు |
| 241 | 21 | 33. జగద్గురులు – మంచన పండితారాధ్య గురులు |
| 244 | 4 | 34. జగద్గురులు – శ్రీమల్లికార్జున పండితారాధ్యగురులు (అని చేర్పవలయును) |
| 236 | 22 | యేమి ? యని తలఁచెఁగాఁబోలు (అనియును జేర్పవలయును) |

---

# కథా సూచి

పేజీ.

---

శ్రీ శివాభ్యాన్నమః



# శివభక్తవిజయకథావళి

శ్లో॥ విఘ్నధ్వాంతనివారణైకతరణి ర్విఘ్నాటవీహవ్యభుక్
విఘ్నవ్యాలకులోపమర్దగరుడో విఘ్నేభపంచాననః
విఘ్నోత్తుంగగిరీంద్రమర్దనపవి ర్విఘ్నాబ్ధికుంభోద్భవః
విఘ్నాఘౌఘఘనప్రచండపవనో విఘ్నేశ్వరః పాతు నః.

తా॥ విఘ్నముల నెడుచీకట్లను బాఱఁదోలుటకు సూర్యుఁడును విఘ్నంబుల నెడు నడవుల కగ్గియును విఘ్నంబులను పాముల మర్దించుటకు గరుడుఁడును విఘ్నంబులను నేనుగులకు సింగమును విఘ్నంబులను గొప్ప కొండలకు వజ్రాయుధమును విఘ్నములను సంద్రముల కగస్త్యుండును విఘ్నములను మేఘములకుఁ బ్రచండమారుతుఁడునగు విఘ్నేశ్వరుఁడు మమ్ము రక్షించుఁగాఁత.

శ్లో॥ భూమిష్ఠాపి న యాత్ర భూ స్త్రిదివతో ప్యుచ్చై రధస్థాపి తా
యా బద్ధా భువి ముక్తిదా స్యు రమృతం యస్యాం మృతా జంతవః
యా నిత్యం త్రిజగత్పవిత్రతటినీతీరే సురై స్సేవితే
సా కాశీ త్రిపురారిరాజనగరీ పాయా దపాయా జ్జగత్.

స్కాందకాశీఖండము.

తా॥ పూజ్యమైన యేపురి భూమియందున్నను గ్రిందనున్నట్టిదిగాక స్వర్గమున కన్న మిన్నగనుండునో ఏయది భూమియందుఁ గట్టఁబడినదైనను మోక్షమునిచ్చునో ఎందు మృతప్రాణులు మోక్షమొందెదరో ఏయ్యది నిత్యము దేవతలచే సేవింపఁబడుచున్న త్రిజగత్పవిత్రమైన గంగానదీతీరమున నున్నదో అట్టి త్రిపురహరరాజనగరియగు శ్రీకాశి జగంబు నపాయంబునుండి రక్షించుగాఁత.

శ్లో॥ జ్యోతిర్మాత్రస్వరూపాయ నిర్మలజ్ఞానచక్షుషే
నమశ్శివాయ శాంతాయ బ్రహ్మణే లింగమూర్తయే.

తా॥ జ్యోతిర్మయస్వరూపుఁడును నిర్మలమైన జ్ఞాననేత్రముగలవాఁడును శాంతుఁడును బ్రహ్మంబును లింగాకారుండునగుశివునకు నమస్కారము.

శ్లో॥ నమశ్శివాయ సోమాయ సగణాయ ససూనవే
ప్రధానపురుషేశాయ సర్గస్థిత్యంతహేతవే.

తా॥ ప్రకృతిపురుషులకీశ్వరుండును సృష్టిస్థితిలయంబులకుఁగారణంబును ఉమాసహితుఁడును సపుత్రుఁడును సపరివారుండునగు శివునకు నమస్కృతి. శివపురాణము.

శ్లో॥ ధరణిమయీంతరణిమయీంపవనమయీంగగనదహనహోతృమయీ
మంబుమయీ మిందుమయీ మంబామనుకంపమాదిమామీక్షే.

తా॥ కరుణతో అష్టమూర్తిస్వరూపమైన ఆదిమయగునంబను బరికించుచున్నాను.

శ్లో. కాంచీరత్నవిభూషాం కామపి కందర్పసూతికాపాంగీం
పరమాం కళా ముపాసే పరశివవామాఙ్కపీఠికాసీనాం.

మూకపంచశతి.

తా॥ రత్నభూయిష్ఠమైనయొడ్డాణముగలట్టియు మన్మథునిబుట్టించునపాంగములుగలట్టియు పరశివుని యెడమతొడయనుపీఠమునఁగూర్చుండియున్నట్టియు అనిర్వాచ్యమైనట్టిపరమకళ నుపాసించుచున్నాను.

శ్రీపరమేశ్వరులును, సత్యజ్ఞానానందస్వరూపులును, అనంతకోటికల్యాణగుణాకరులునునగు నుమామహేశ్వరులచే సృష్ట్యాదియందుఁదపోయోగవిహారార్థమై లీలాస్థానంబుగ సృష్టింపఁబడినదియును, జగత్కారకులనిరంతరావాసంబుచే నవిముక్తంబగుట అవిముక్తంబనియు చిత్ప్రకాశవిలసితంబగుట కాశియనియు, ఆనందనివాసభూమియగుట ఆనందవనంబనియుఁ బ్రసిద్ధినొందిన మహనీయదివ్యస్థలపంచక్రోశమందొకప్పుడు భాగీరథీపుణ్యసలిలాభివ్యాప్తంబగు శ్రీమణికర్ణికాచక్రపుష్కరిణీతీర్థంబులందు స్నానంబొనర్చి శ్రీవిశ్వేశ్వరాన్నపూర్ణాడుంఠిమాధవకాలభైరవాదులఁబూజించి తక్కుదేవతలసేవించి ముక్తిమంటపశాలయందు

సుఖాసీనుండై యున్న శ్రీశివయోగాచార్యులకులీశ్వరశిష్యపారంపరీసిద్ధ యోగుండగు సుమిత్రయోగాచార్యునకు శివభక్తాగ్రగణ్యులగుభవదేవా దులు ప్రణమిల్లి సాంజలులై పరమశివభక్తిరసానందాస్వాదనేచ్ఛతో దేవా! కృతయుగము మొదలుచేసి నేటి యీకలియుగవర్తమానకా లంబు వఱకు శివభక్తినొనర్చి యైహికపారమార్థికంబులం దనిసి మోక్షం బుంజూఱంగొన్నట్టి సనాతనాధునాతనభక్తులచరిత్రంబులను గొన్నిబో ధించి మ మ్మానందితచిత్తులనొనర్పుం డని ప్రార్థించిరి. ఆగురుదేవుండు మురిసి తనహృదయంబున నార్యామహాదేవులకును నాత్మగురునకును వందనలబొనర్చి గురుధ్యానపురస్సరంబుగ నిట్లు వాక్రుచ్చె. సుదినంబిది. 'పుణ్యం పుణ్యస్యకారణం' బనెడునుడికి దృష్టాంతంబు లభించె. కాశీక్షేత్రా గమనంబును, గంగాస్నానంబును, సపరివారవిశ్వేశ్వరదర్శంబును, శైవక థాసుధారసోదయంబునకుం గారణంబులయ్యె. ధన్యులమాదుము. శివ భక్తచరిత్రంబులు పెక్కులు లెక్కకుమీఱియున్నను, ప్రస్తుతము హృద యగతంబులైనవాని మీ కుపన్యసింతును. చిత్తైకాగ్రంబునొంది యాల కింపుడు.

# శ్రీ నందికేశముని

శ్లో॥ త్వంభాభిరాభిరభిభూయ తమస్సమస్త
మస్తంనయ స్వభిమతాని నిశాచరాణాం
దేదీప్యసే దినమణే గగనం హితాయ
లోకత్రయస్య జగదీశ్వర! తన్నమస్తే. స్కాందకాశీఖండము.

తా॥ నీ వీ కాంతులచేఁ జీకటినెల్లఁ దిరస్కరించి నిశాచరులయభిమతం బులను నాశంబుఁజెందింపుచున్నావు. ఓదినమణీ! ముల్లోకముల హితమునకై యాకసమందుఁ బ్రకాశించుచున్నావు. ఓజగదీశ్వరా! అట్టి నీకు నమస్కారము.

పూర్వాపరసముద్రంబులకుఁగొలగఱ్ఱయును అనంతరత్నంబుల కాకరంబును సర్వౌషధీబృందంబులకు మందిరంబును దపస్వుల కిరవును గంగాయమునాదిపుణ్యనదులకుఁబుట్టుభూమియును దేవమునులజన్నంబు లకు వేదికయును నగు హిమధరాధరంబు పరిసరాటవీప్రదేశంబందు నివ

సించి తపంబొనరించుచున్న మునులలో నుత్తమశ్లోకుఁడును సాలఙ్కాయన మునిపుత్త్రుండునునగు శిలాదుండను మునివర్యుం డుత్తమపుత్త్రలాభార్థమై మహేంద్రుని గుఱించి తపం బొనరించుచుండె. కొంతకాలంబున కా జేజేల దొర ప్రసన్నుఁడై వచ్చి నీయభీష్టంబు నడుగుమనియె. శిలాదముని మ్రొక్కి అయోనిజుఁడును అమరణుఁడును నగుసుపుత్త్రుని గోరుదుననియె. బిడౌజుం డు యోజించి ఇట్లొసఁగుట నాకశక్యంబు. నాకకాదు పద్మాక్షుపద్మసంభవులకుఁ గూడ నిట్లిచ్చుట శక్యంబుగాదు. అనాదినిధనుఁడగు శంకరుఁ డొక్కరుఁడే యిందర్హుఁడు. మునితల్లజా! నీవు నియమం బారసి హరుసమ్ము ఖొ బరమేశ్వరునిగుఱించి తపింపు మాహరుఁ డట్టివరంబును నీ కీయఁగలఁ డని చెప్పి యదృశ్యుఁడయ్యె. మునీంద్రుఁ డంత మోదంబొంది తత్ క్షణంబందుఁ దపం బారంభించి శివుని గుఱించి తపించుచుండె. హృదయ పద్మంబందు శివుని ధారణచేసి యన్నపానంబులను వర్జించి యనితరమన స్కుండై పెద్దకాల మేకనియతితోఁ దపస్సొనర్చుచుండె. ఇట్లు రేఁ బవలు విడువక విసువక దేహంబుపైని దలఁపులేక తపించుచున్నయామునిపైని నొక వల్మీకంబు పొడమె. అందు వజ్రసూచీముఖంబులగు కీటంబులు పొదలి మునిదేహంబందలి యసృఙ్మాంసంబుల నెల్లఁ బారణంబుచేసె. ఆవలఁ జర్మంబు గూడ హరింపఁబడియె. అప్పుడస్థిపంజరంబును శివధ్యాన ధారణలతో సమాధినున్న జీవాత్మంబు శేషించియుండె. అట్లుఁ గొంతకా లము గడచినంత జగదీశ్వరుఁడాదరంబున ఉమాదేవితో పుత్త్రులగుషణ్ముఖ గజముఖులతో ప్రమథులతో దేవమునిబృందములతో పుష్పకం బెక్కి వచ్చి మునీంద్రుని దఱిసి వల్మీకంబును బాపి వరమిచ్చెద అభీష్టం బడుగు మనియె. చిరకాలసమాధిస్థుఁడై యున్నమునికి దేహజ్ఞానంబు లేనికతమ్మున శివవచనంబు గోచరంబుగాకయుండె. శంకరుం డారసి స్మృతియొదవు నట్లు మునిశిరంబుపైఁ జేయుంచి నిమిరిన వేగిరంబున మునీంద్రుండు కన్నులుదెరచి పరమేశ్వరునిజూచి యానందంబున మ్రొక్కె. శివుఁడు వరమిచ్చెద నభీష్టంబు దెలుపుమనియె. ముని శిరంబం దంజలిఁ జేర్చి పరమ శివా! అయోనిజుఁడును నాశములేనివాఁడునునగు సుపుత్త్రు నొసఁ గుము సంతోషించెదను. ఇదియే వరమనినఁ బరమేశ్వరుఁడు మందహాసము చేసి యిట్లనియె. మునీశ్వరా! వినుము అయోనిజుఁడును అవినాశుండు

నగుపుత్త్రుండు కేటాకఁ డెట్లు పుట్టును? అందులకుఁగాను నీదుమనోరథ సిద్ధి యగునట్లు నాయంశంబున నీకుఁబుత్త్రుని జన్మింపజేసెదను. తండ్రివై పెంచి యానందంబును యశంబునొందుమని యంతర్ధానొందె. మునివర్యుండు తపంబును సమాప్తం బొనరించి స్వాశ్రమంబున కేగి మునులందఱితో శివదత్తవరప్రకారంబు నెఱింగించె. అంద ఱానందించిరి. శిలాద ముని వరసిద్ధి కెదురుచూచుచు జన్నం బొకం డొనర్పయత్నించుచు న్నంత శివవరప్రకార మొకనాఁటియుషఃకాలంబు శుభసమయంబున శివాంశంబున బాలుండు జన్మించె. తోడనే శిలాదుండు బాలునిఁ జూడఁగ బాలకుఁడు బాలేందుకిరీటముతో భుజచతుష్టయముతో భస్మానులిప్త గాత్రంబుతో మందహాసభాసుర నేత్రయుగ్మంబుతోఁ గనుపట్టె. ఆకసంబు నుండి శిశువుపైఁబుష్పవర్షంబు గుఱిసె. గంధర్వాప్సరోజనంబులు గాన నృత్త్యంబులు సల్పిరి. పలుకుచెలువయు నలువయు సిరియు హరియు శివయు శివుఁడును ఇంద్రుఁడు మున్నగునిలింపులును దేవమునులును జేరవచ్చి శిశువునుజూచి సంతసించి యాశీర్వదించి శిలాదుని మెచ్చి తమతమనెలవుల కరిగిరి. మునివర్యుఁ డంతఁ బుత్త్రుని నక్కునఁజేర్చుకొనిన శిశు వీశ్వర రూపముఁబాపి బాలుఁడై యుండె. ముని యపుడు బాలుని జూచి తొంటిరూపంబునకన్న భిన్నంబుగ నుండుట కాత్మలో నొక్కించుకఁ గొంకి మునులసన్నిధానంబునఁ బుత్త్రునకు జాతకర్మంబులొనరించి నంది యనినామకరణంబొనర్చి యర్థిజనులకు సర్వార్థంబులిచ్చి సంతుష్టులఁ గావించె. అనంతరము కొమరున కైదవయేడువచ్చినంత ఉపనయనమును సల్పి దేశికులకడ వేదాధ్యయనారంభముచేయించె. మునిపుత్త్రుఁడు సాంగములగువేదంబులను షడ్దర్శనంబులను సులువుగఁజదివి పారంగతుఁడై సంగీతకళయందుఁగూడఁ బ్రావిణ్యంబు నొందె. అల్లన్ని దేండ్లకు సమస్తవిద్యాపారంగతుఁడై వినయవివేకములతోనొప్పుచు జనకునిమనంబున కానందమొసఁగుచుండె. ఒకనాఁడు మిత్రావరుణు లను మహామునులవ్వారియాశ్రమంబునకు వచ్చిరి. శిలాదముని పుత్త్రునితోఁ గూడ నమ్మునులకు మ్రొక్కి పూజించి తుష్టిగ మృష్టాన్నంబులిడి యారగింపఁజేసిరి. అంత వార లర్భకుని జూచి శిలాదునితో నిట్లనిరి మునీంద్రా! ఈపాపఁడు చదువులందుఁ జతురుండును వినయవివేకంబు

లశ సిథియుక్తై నిన్నానందింపఁజేయుచున్నాఁడు. ఐనను ఈబాలుని కాయువు స్వల్పంబుగఁ గన్పట్టుచున్నది. అందులకై ఆయుర్వృద్ధికై నీవు పరిరక్షింపుమని వారు యథేచ్ఛగ జనిరి. శిలాదముని విషప్రాయంబగు నవ్వారివచనంబున స్మృతిఁబాసి కొండొకతడవునకుఁ దెలిసి విషాదంబుఁ జెంది కుమారునిఁజూచి ఘోరంబుగ విలపించుచుండ నంది జనకునిఁ గాంచి తండ్రీ! ఏలయిట్లుకుందెదవు? వెఱవఁబనిలేదు. ఎట్టికీడును నన్నొందదు. అంతకుఁడేనియు నెట్టిభూతంబు లేనియు నన్ను డాయఁజాలరు. తాలిమినొందుము. భయంబుఁబాయు మనిన నమ్ముని కుమారా! నీవిట్టిక్షేమమునొందుటకు హేతువెద్దియుఁబొడకట్టదు చదువుననుగాని చాతుర్యంబునఁగాని జగంబున మిత్తినిగెల్చి బ్రతికినట్టివా రెవరేనియుండిరా? యనిన నంది యిట్లనియె జనకా! చదువునను జాతుర్యంబునను మిత్తిని గెలువలేరు కాని పరమేశ్వరునికరుణ నార్జించి మిత్తిని గెల్చుట సుకరంబు. దుర్లభంబుగాదు. సెలవొసఁగి యాశీర్వదించి పంపుము. శివుని గొలుచుటకై హిమశైలంబున కేగెదననిన నమ్మునివర్యుండు సంతసమ్ముతో నిన్ను పరమాత్మమైనశివుండు సాకుఁగాతఁ. నీవు తపస్సొనరించి శివుని మెప్పించి చిరాయువును గడింతువుగాత! యని దీవించి సెలవొసంగె. నందియుఁ దండ్రికిని తాతకును సంతసమ్మున వందనమ్ములొనర్చి దివ్యగంగాతీరంబు హిమశైలశిఖరంబుఁజేరి తపంబారంభమొనరించి ప్రత్యహంబు పంచాక్షరీమంత్రాయుతజపంబొనరింపుచు జమకానువాకసహితంబుగ ఏకాదశవారరుద్రాధ్యాయపఠంబుల శివలింగంబు నభిషేకింపుచు సహస్రబిల్వార్చనంబొనర్చుచుఁబూజించుచుండె. అంత నచిరకాలమందే వందారుజనమందారుండును దయాసముద్రుడునగు పరమశివుం డుమాదేవితో కుమారగణేశప్రముఖులతో దివ్యవర్గంబుతో మునిపుత్త్రునకు దర్శనంబిచ్చి మస్తకముపై హస్తమునిచి వత్సా! వరమునకుఁ బాత్రుండవైతివి. వాంఛితంబులడుగు మిచ్చెదననియె. శైలాది శివాంఘ్రిపద్మములకు మ్రొక్కి యామ్నాయశిఖలచే నమ్మహేశ్వరులఁ బ్రస్తుతించె. శంకరుం డాబాలుని వాత్సల్యంబుతోఁ గౌగిటనొంది యానందంబుచింద నిట్లనియె వత్సా! నీయభీష్టంబు నెఱుంగుదు. నీజనకుఁడు నీయాయువుకై వెఱపొందగా నీవిందు వచ్చి తపించుచుంటివి. నీకు జరామరణమ్ములు గలుగవు.

ఎల్లకాలం బసశ్వరమూర్తివై నీవు నీతండ్రితాతలతోఁగూడ నా సన్నిధి నుండుఁడని బంగరుపద్మహారంబు నందికేశునిగళంబందు వేసె. అంత నతండు పంచముఖుండును త్రినేత్రుండును దశభుజుండునై చెలువొందె. శంకరుఁడంతనే తనజడల నున్నగాంగోదకంబును నంజలిఁబట్టి నందిపైఁ జల్లె. దాన నైదునదులు త్రిసోత్రి జటోదక స్వర్ణోదక జంబూనది వృష ధ్వని యనుపేరులఁ బరఁగుచు నచ్ఛోదకంబులు మహావేగంబులునై జపేశ్వరసన్నిధానంబునఁ బ్రవహించుచు విరాజిల్లె. ఈపంచనదులందు స్నాతుండై జపేశ్వరుని బూజించునట్టివాఁ డీశ్వరసాయుజ్యంబు నొందు నిందుసందియంబు లేదు. ఇఁక శంభుండు శాంభవినిఁ జూచి దేవీ! ఈబాలకుని గణేంద్రునిగా నభిషేకింపఁదలంచెద నీ వెట్లు లెంచెదవనిన నా జగజ్జనని యిట్లనియె. దేవా! అట్లు నందికి గణాధిపత్యపట్టాభిషేకం బొనర్పుఁడు. ఈ బాలుఁడు నాసుతుండై వాసిఁ జెందు. నీదయామృతదృష్టికిఁ బాత్రుఁడయ్యె ననిన శివుఁడు గణపాలురఁ గనుఁగొని నంది నాపుత్త్రుండు, మీయందఱ కితండు విభుండుపూజ్యుండు. మీ రిపుడు వీని గణాధీశునిగఁ బూని యభిషేకింపుఁడు. నేఁటినుండి యితఁడు మిమ్మేలఁగలఁడని ప్రభుఁడు సెలవిచ్చిన నవ్వారలెల్ల మురిసి సకలసన్నాహంబులొనర్చి నందిని గారవించి పట్టంబుఁగట్టి యభిషేకించి రాసమయంబునఁ బరమేశ్వరానుమతితో హరివిరించనులును హరిహయుఁడు మున్నగుదిక్పాలురు రవీందులు సర్వసుపర్వు లచ్చరలు గంధర్వచారణవిద్యాధరులెల్లరు వచ్చి నంది కభిషేకించి శిరంబుల నంజలులు చేర్చిరి. శివుఁడంత మరుత్తుల యనుఁగుకూఁతును సుకీర్తి యనుకన్యను దెప్పించి నందికొసఁగించి యుద్వాహంబొనర్పించె. సకలసురలును మునులును సంతసించి యాశీర్వదించిరి. మఱియు నయ్యవసరంబున జగదీశ్వరుండు చందురునివెలుఁగుల నలరుశ్వేతచ్ఛత్రింబొకఁడును.చామరద్వయంబును వానినిబట్టెడునట్టిదేవకన్యలను కాంచనసింహాసనంబును నవరత్నఖచితంబులగుచామీకరకిరీటాదిభూషణంబులను పార్వతీదేవికంఠంబునుండి తీసియిచ్చినయాణిముత్యాలదండయును బంగరువిరులసరంబును ఒకభద్రగజంబును ఒకయనడ్వాహంబును సింహధ్వజంబుగలపసిండిరథంబును నందికొసఁగె. నందియును దత్సతి సుకీర్తియును బాలేందుధరున కార్యకు సరస్వతీవిరించులకు రమా

విష్ణులకును పదంబులఁబడి వందనములొనర్చిరి. అత్తఱి శివుఁడు ప్రేమతో శైలాది కిట్టులనియె. కుమారా! ఈతన్వి సుకీర్తియు సతంబు నీచిత్తంబును రంజింపఁజేయు. నీవును నీదు వెలందియుఁ బావనుఁడగు శిలాదమునియుఁ దజ్జనకుండును సుఖంబుగ నావాసంబున నుండుఁడు. మీకు సర్వశ్రేయం బులు చేకురఁజేయుదు.

క॥ నాకిష్టుఁడవై మంతిరి, వై కడిఁదిబలంబు వెలయ ♦ ననుచరుఁడవునై
లోకములకెల్ల జేతవు, నైకడుపూజ్యుండ వగుచు ♦ నలరుము వత్సా!

గీ॥ నీదుతండ్రియుఁ దాతయు ♦ నాదుగణము
లందుఁ బ్రాముఖ్యముఁ జెంది ♦ యుందురికను
నే నెచట నుందు నీవందు ♦ నిలువు మెందు
నీవు వసియింప నేనందు ♦ నిలిచియుందు. ఆంధ్రశివపురాణము.

అనినంత పరమేశ్వరియు వరములొసఁగ నెంచి నందికేశుని జూచి పుత్త్రా! నేనును వరములిచ్చెద. నీదుమానసికవాంఛలఁ దెల్పుమనగ నంది తల్లీ! నీపదద్వయమందుఁ బాయనిభక్తి నిమ్మనియెను. అఖిలాండేశ్వరి "తథాస్తు"ని యొసఁగి భక్తితోఁగూడ నాతనికి దత్సతికిని దివ్యభోగ భాగ్యంబులను పుత్త్రపౌత్త్రాభివృద్ధియు ననుగ్రహించె. శివుఁడంత నంది కేశుని బెండ్లముతో తండ్రితాతలతో దచ్ఛిష్యులతో నిజసన్నిధానం బును జేర్చికొని సుఖంబుగనుంచె. హరివిరించనాదిసర్వగీర్వాణులు మున్న గువారు సంతసించి శివానుగ్రహంబును బ్రశంసింపుచు నిజధామంబుల కేగిరి. ఇది నందికేశదివ్యచరిత్రము శ్రోతలకుఁ బాఠకులకు సర్వాఘహారం బఖిలసుఖకరము.

## 2. అగస్త్యమహాముని - లోపాముద్రాదేవి

శ్లో॥ లోకేతి వేలమతి వేలమహామహోభిః
నిర్మాసికౌముదముదంచసముత్సముద్రం
విద్రావితాఖిలతమాస్సుతమాంహిమాంశో
పీయూషపూరపరిపూరిత తన్నమస్తే. స్కాందకాశీఖండము.

తా॥ లోకమందు గొప్పకాంతులచేఁ గలువలకు సంతసంబును సముద్రము నావందముగలదానిగాను జేయుచున్నావు. పోఁగొట్టబడినసమస్తాం

ధకారములుగలట్టియు మంచువంటిచల్లనికిరణములుగలట్టియు నో యమృతపరిపూర్ణుఁడా ! నీకునమస్కారము.

ఆదియుగంబందు మిత్రావరణపుత్త్రుండు కుంభసంభవుం డగస్త్యుం డనునొకమునివర్యుండుకలఁడు. అతఁడు పుట్టుకనుండి శివధ్యానపరుండై శివలింగపూజనొనర్చుచు శివభక్తులతోఁజెలిమిసేయుచు బ్రహ్మచారియై పెద్దకాలంబు వనంబందు ఘోరతపంబుసేయుచుండె.

ఆ యనఘుని పితృదేవతలు వంశాంకురోత్పత్తి నపేక్షించి యొకనాఁ డతం డున్నవనప్రదేశమం దొకవృక్షం బందలిశుష్కజీర్ణశాఖ నూతఁగొని యధోముఖులై వ్రేలుచుండుఁడు నమ్ముని సూచి ఏల యిట్లు పడుచుంటి రనియడిగిన వారలిట్లనిరి. అయ్యా! మేము నీదుపితృదేవులము నీవు వివాహంబును మాని సంతతినొందక యిట్లు బ్రహ్మచర్యంబునఁదపింపుటఁజేసి మా కూర్ధ్వలోకగమనంబున కవలంబములేదు. ఇపుడేని మాయున్నతిఁ గోరి నీ వొకకులకన్యను బెండ్లాడి సంతానంబునుబడసిన మేమెల్లర మూర్ధ్వలోకంబుఁ జేరుదుమనిరి. అగస్త్యుండు దనకతంబున నవ్వారికధఃపాతముగాకుండుటకై అట్లే పెండ్లాడి సంతతిఁ బడసెదను తాముఁకస్వస్థు లగుఁడని నొడివి తత్కాలంబందు సంతానమును గాంక్షించియున్నవిదర్భరాజునొద్దకుఁబోయి తనతపశ్శక్తిచే నామహారాజున కొక కొమరితను బుట్టించె. ఆమె లోపాముద్రియనుపేరితో సరసీవనంబునఁ బద్మలతవలె నీతియందు లక్ష్మివలె ఆనక్తునందువిద్యవలెఁ బెఱిగి యౌవనవతియై రూపవతియై సుగుణవతియై వయస్సునఁ జక్కఁదనమున ఉత్తమగుణంబులఁ జదువునఁ దెలివితేటలఁ దనకుఁ తోడువచ్చుపెక్కండ్రుకన్యలతో సేవింపఁబడుచున్నంత రాజపుత్రు లనేకు లామెరూపలావణ్యముల నారసి మన్మథబాధలఁబొగలుచుండియు గూడ నగస్త్యమునిభయంబున సంపఁగిపూగుత్తినిజేరఁబోవనిపుష్పంధయంబులట్లు దొలంగిమిన్నకుండిరి. విదర్భాధీశుండును దనపుత్త్రికిఁబెండ్లిసేయుటకు వరునకై దేశదేశంబులరయుచుండె. అంతలోనొకనాఁ డగస్త్యుండు విదర్భరాజసభకేతెంచి పూజితుండై లోపాముద్రను దనకిచ్చి పెండ్లిసేయుమనిరాజునకుఁజెప్పె. అప్పు డప్పుడమిఱేఁడు దెప్పరంబగుదుఃఖంబునొంది జాదిలతికను బోలినట్టి సుకుమారి తనకుమారిని జటావల్కలధారియును బర్ణాశియును నాటవికుం

డునునగునగస్త్యునకు ధారవోసిన నాతం డామెనుగూడనట్లేయునుచుననియు అట్లు కూతునీయకున్నఁదమనందఱను భస్మీకృతులనొనర్పఁగలఁడనియును దానును బెండ్లమును మిక్కిలివగచుచున్నంత నంతఃపురంబందునున్నలోపాముద్రియదియెఱింగి సత్వరంబుగఁ దలిదండ్రులఁదారసించి అగస్త్యమునియే తనకుఁదగినపెనిమిటియనియు అమ్మహాత్మునిదక్క తానన్యులఁబెండ్లాడననియు వేగిరం బమ్మునిచంద్రునకుఁదన్నొసంగి వివాహంబుసల్పుఁడనియు స్పష్టంబుగ వక్కాణింప వారపు డడలుమాని వివాహప్రయత్నంబొనరించి శుభలగ్నంబున దక్కోమలాంగిని మానివర్యునకిచ్చి విధ్యుక్తంబుగవివాహంబుసలిపిరి. అనంతర మా తాపసచూడామణి యా రమణీమణియందుఁగల దుకూలాంబరమణిమయసువర్ణభూషణంబుల నెల్లఁ ద్రోచివైచి నారచీరెలుజడలుదాల్పఁజేసి తోడ్కొనిపోయి గంగాద్వారంబున శివనిష్ఠుండై త్రికాలంబులందు నియతశివలింగార్చనంబొనర్పుచు శివపంచాక్షరీమంత్రజపంబుతో నిత్యంబు శివలింగార్చనంబొనరింపుచు ఘోరతపంబొనరించుచుండె. మహారాజపుత్రియగు లోపాముద్రయుఁ బరిశుద్ధాంతరంగంబున భర్తకు సహచారిణియై యామోదంబుతోడ సంతతము పరిచర్యలొనర్చుచుండె.

అంతనొక్కనాఁడు నూత్నయౌవనవిరాజితయును మందహాససుందరముఖారవిందయును ఋతుస్నాతయు నగులోపాముద్రనుజూచి యగస్త్యుండు మన్మథశరార్తుండై క్రీడాసక్తుండగుట నెఱింగి యక్కాంతాలలామంబు భర్తకు మ్రొక్కి యిట్లనియె దేవా! నాయొడలికి నామనంబునకు నాప్రాణంబుల కొడయడవునీవు. దారాపరిగ్రహంబు ధర్మప్రజాసంపత్యర్థమాట ధర్మంబు ననుష్ఠింపుచుంటివి. ప్రజోత్పాదనంబునకై యిపుడుగడంగుచుంటివి. ఇందు నీకడ్డియేమియుండును? ఐనను ఈనీదాసికభిమతంబుగఁ గ్రీడింపుము. ఏను రాజకులంబున జన్మించుటఁజేసియుఁ బెండ్లాడువఱకు రాజోచితవస్త్రమాల్యానులేపనభూషణంబుల నొందియుండుటఁజేసియు నామనం బవ్వానిగొండొకఁగోరుచుండును. కావున నిట్టి సంతోషసమయంబున నాకుఁబ్రియంబుగ సముచితవస్త్రానులేపనసుగంధమాల్యాభరణంబుల నన్నలంకరించి నీవును నట్లే యలంకృతుండవై ఈఋతువాసరంబులందు భోగసౌఖ్యంబులొంది సంతానంబుఁబడయు

మని వేఁడుకొనయె. తాపసేంద్రుండు పత్నిఁ జూచి నీకోరినయట్లుసల్పు టకు నాయొద్దఁదపోధనంబుదక్క నితరంబు లేకయుండుటయు స్వల్పంబు నకై తపోధనంబును వ్రియంబొనర్చుట యుచితంబుగాకుండుటయు నెఱిం గించి యైనను నీయభిమతంబునకై ప్రయత్నింతు నని ధనార్థియై వసుమి త్రుండనురాజుపాలికిఁబోయి యతనిచే బూజితుండై రాజేంద్రా! నీయా దాయవ్యయంబులకు మించినధనంబున్న నాకిచ్చునదియని యర్థింపఁగా నతం డట్లులేకుండుటను దెలుప నతఁడును దానును బృహదశ్వుండనురాజు నొద్దకేగి యతనిని పూర్వంబట్లడిగె. ఆతండును ధనంబులేకుండుటను దెలిపిన మునివరుం డాభూపాలయుగ్మంబును దోడ్కొని ప్రాదశ్వుండను వేఱొకమహారాజుచెంగటకుఁజని యన్నరవరునిగూడఁదొల్లింటివిధంబుగ నడిగె. అతండు దనయొద్ద ద్రవ్యంబులేమిఁ దెలిపి యచ్చోటి కనతిదూ రంబున మణిమతీపురంబనునొండుపురంబుగలదనియు దాని నిల్వలుండను రక్కసుండు తోడబుట్టగువాతాపియనువానితోఁగూడ నేలుచుండునని యును వానియొద్ద బంగార మపారంబుగనున్నదనియు నచ్చటికిఁబోయిన నద్ది సమృద్ధంబుగ లభించుననియునుజెప్పి యారాజసత్తములతో నమ్ము నీంద్రు నిల్వలాంతికమునకుఁగొనిపోయె. ఇల్వలుండు వారలనెదుర్కొని పూజించి యెప్పటియట్లు వాతాపిని బక్వముగావించి యగస్త్యునకు భోజ నముసమర్పింపఁగా నద్దానినెఱింగి రాజర్షు లగస్త్యునికి మ్రొక్కి (యప వారితముగా) వానియింటఁగుడువవలదనియు వాతాపియనేఁడువీని తమ్ముఁడు బ్రాహ్మణులకుభోజ్యమై భోజనానంతరమం దవ్వారలయుద రంబులఁజీల్చుకొని చంపి మరలవచ్చుననియు అందులకై దనుజుండా రక ధనం బిచ్చివ నొనిపోవుదమనియు అట్లయకున్న వేఱొకచోటికిఁబోవు దమనియుఁజెప్పిరి. అపుడగస్త్యమునీంద్రుండు మందహాసముచేసి నిర్భయ ముగ ఆగశాంతము తృప్తిగభుజించినంత నిల్వలుం డనుజుని బిలుచుటఁ జూచి కడుపుఁదడివికొని గాఢంబుగఁ ద్రేపె. వాతాపి మహాపాశుపతుం డగునగస్త్యమునియుదరంబున జీర్ణంబయ్యె. అంత నిల్వలుండు మునీం ద్రుని సామర్థ్యంబున కడలి దుఃఖితుఁడయ్యును గప్పిపుచ్చి సంతుష్టుని యట్లు నమస్కరించి మునివర్యునియాగమనకారణంబడుగ సంయమి వర్యుం డిట్లనియె. ఈరాజవర్యులతో నేను ధనార్థినై నీయొద్ద నద్ది

యుండు లెఱింగి వచ్చితి ననుఁడు నతఁడు దమకెంతధనంబువలయునో యంత నొసంగుదుననియె. అగస్త్యముని యీభూపతులకు మువ్వురకుఁ బ్రత్యేకము పదివేలుపాడియావులు పదివేలగద్దియలపసిండియు నొసఁగుము. అయ్యవి ద్విగుణంబుగ నాకొసఁగి యొకపసిండిరథంబుఁగూడ నొసంగుమనియె. ఇల్వలుండు తథాస్తని దివ్యాశ్వయుతంబగుబంగారంపుటరదంబును వారభిలషించినట్లుగాఁ బాడియావులను బసిండియు సమర్పించె. మునీంద్రుండు రాజచంద్రులతో నాదివ్యరథంబు నెక్కి బంగరును గోగణంబులనుగొని సత్వరంబుగ స్వాశ్రమంబుఁ జేరె. భూపతులు మువ్వురు మునీంద్రునిసెలవొంది పైడిని బాడియావులఁగొని స్వకీయరాజధానుల కేగిరి. మునీంద్రుం డిట్లు లోపాముద్రాదేవికిఁ బ్రియంబాపాదించి సంతానంబును గుఱించి దేవీ! వేయిగురుకొమరుల నభిలషించెదవా? లేక వేయిగురుకొడుకులట్టిగుణాధికు నొక్కపుత్త్రుని గోరెదవా ? యనియడిగె. ఆగుణవతీలలామ దేవా! శ్లో॥ ఏకోపి గుణవాన్ పుత్త్రః నిర్గుణైశ్చ శతైశ్చకిం॥ (గుణవంతుఁడగు పుత్రుండొకఁడుచాలు నిర్గుణులైన కొడుకులు పలువురేల) మహావీర్యగుణవంతుఁడైన నొక్కపుత్త్రు నొసంగుము. గుణహీనులు పెక్కండ్రు సుతు లేటికనియె. అగస్త్యుండును సంతుష్టుండై యామెతో భోగసౌఖ్యంబులొంది యుత్తమపుత్త్రుని గనెద వని యనుశాసించి తపోవనంబున కేగె. లోపాముద్రాదేవియు నేడేండ్లు గర్భంబుధరించి యనంతరము దృశ్యుండనుపుత్రుని గనియె. అతండు సూర్యునివలెఁ దేజోనిధియై పుట్టుకతోడనే సరహస్యంబులగు వేదంబులఁ బఠింపుచు నఖిల దిశలకు వెలుంగుచేసె. పదఁపడి యమ్మునివర్యునకుఁ దేజస్వియనుపుత్త్రుం డుద్భవించి తపంబునకై యపారంబగునిధ్మభారంబువహించుటఁ జేసి యిధ్మభారుండనియాహ్వాయఁబుఁబడసె. ఇట్లగస్త్యమునీంద్రుండు పుత్త్రపౌత్త్రివంతుడై పితృదేవులను బుణ్యలోకగతుల నొనర్చి పితౄణంబుఁ దీర్చె. తపంబున శివపూజనంబున దేవఋణంబును సర్వవేదాధ్యయనంబున ఋషిఋణంబును దీర్చికొనియె. ఇదిగదా ప్రశంసనీయము. ఇదిగదా పవిత్రచారిత్రసౌగంధ్యము. కళత్రపరిగ్రహము తనకిష్టము లేకున్నను శివలింగార్చనంబును తపంబునిష్టంబైనను బితృదేవతల కుత్తమలోకప్రాప్తికై నపట్టుదలనంత మట్టుపఱచి సంసారంబునొంది వారియభీష్టంబు నెర

వేర్చె. శివపూజావ్రతంబు దపోవ్రతంబుగూడఁ జెడకుండఁ గాపాడుకొనుచు బదఁపడి నద్దాని నసాధారణంబుగ నిర్వహించికొనియె. సమర్థులగు వారి తెఱఁగి ట్లేకదా. అనేకులగు మునులను బ్రాహ్మణులను బాటసారులను మోసగించి వారల ప్రాణధనంబుల నపహరించి భక్షించిన వాతాపి దైత్యుని జఠరాగ్ని కాహుతి చేసి లోకరక్షణంబొనరించె. ఇంకను వినుం డొకప్పుడు నివాతకవచ కాలకేయాదులను పెక్కురు రక్కసులు ఉక్కుమిగిలి నిశీథంబందు నిదురించుచుండు మునిసముదయంబును గోకులంబును బట్టికొని భక్షించుచుఁ బల్లెలందు బట్టణంబులం దట్లే మనుష్యులను హింసించి వారలధనంబుల నెల్లఁ గొల్లగొట్టి పవలంతయు సముద్రగర్భంబందుఁ బ్రవేశించి యందే వాసంబు చేసికొని జనంబుల నెల్ల గారింపుచుండుటను గాంచి మహేంద్రుం డఖిలలోకకంటకులై యున్న యవ్వారి దౌష్ట్యం బబ్జగర్భున కెఱింగించి తచ్ఛమనోపాయం బడిగిన నవ్విధాత యిట్లనియె. వాసవా! భూవలయంబునం దగస్త్యుం డను మునివర్యుండు గలం డాతఁడు శివభక్తాగ్రగణ్యుం డాతని సతి లోపాముద్రయను భద్రచరిత్ర పతివ్రతాశిరోమణి. నీవు నిలింపులతో నాదంపతులసన్నిధానమున కేగి యిప్పలాశులవలన నగుముప్పును వారల కెఱింగించి రక్షింపుఁ డని సాయ మపేక్షించిన నవ్వారు మీ యార్తిని దీర్తురని నుడివె. అంత నన్నముచిహంత దేవసంతతులతో నత్యంత వేగంబునఁ బ్రశాంతంబగు నాకలశసంభవుని యాశ్రమప్రాంతంబుఁ జేరి సమయం బారసి తత్సన్నిధి నొంది కుందుచు నమస్కరించి తమయాందోళనంబు నెఱింగించి ప్రోవు మని ప్రార్థించె. అపు డగస్త్యుండు న న్నేమి చేయు మనియడిగెద రనిన మహాత్మా! జగత్కంటకు లగు నారక్కసులఁ బొలియించుటకు జలధి యడ్డంబై యున్నది. దీని పొలకువ యడంపు మన్న నా క్షణంబం దా తాపసేంద్రుండు గడలి నంత నొకయఱచేతఁ బడసి యాపోశనంబుగఁ గ్రోలె. "దుష్కరం కిం మహాత్మనాం" మహాత్ముల కశక్యంబైనది లేదు. దనుజులెల్ల బయలుపడుట చూచి మహేంద్రుండు దివ్యసేనలతో సమరంబున కేగి నక్తంచరుల నెల్ల నాశనం బొనరించె. హతశేషులగు కొందఱసురులు పాఱి పాతాళంబుఁ జేరి యందు డాగిరి. ఆపైని సముద్రము లేని కొఱఁతకు దేవతలు భయంపడి సురల నగస్త్యుని జేరఁ బోయి సముద్రంబు నెప్పటియట్లనుగ్రహింపు మనుటయు నమ్మహర్షి

వారలతో సాముద్రోదకంబు నా యుదరంబందు హుతం బయ్యె. అద్దాని మీ రిప్పు డొందలేరు. వేఱునీరంబుల సంపాదించుకొనుఁ డనియె. అంత వారలు తిరుగ బ్రహ్మదేవుని జేరి జరిగినయవ్విధం బంతయుఁ దెలిపి నీళుల నర్థింపుఁడు. సర్వలోకపితామహుండగు పితామహుం డపుడు వారలకు బ్రస్తుతం బట్లు సమకూరదనియుఁ గొండొకకాలంబున భగీరథుం డను భూనాథుం డొకండు భూమి కాకాశగంగను దెచ్చి తన్నీరంబుల నాపల్లంబుల నింపిన సముద్రము మరల నమరు నని వారి నంపె. అంతఁ గొన్ని నాళ్ళు కట్లు విధ్యుక్తప్రకారంబు సంద్రంబు యథాపూర్వంబుగ సిద్ధం బయ్యె. అగస్త్యుని యప్రతిమప్రతాపంబు సర్వతోముఖవ్యాప్తి యయ్యె. ఇఁక నొకప్పుడు తొల్లి దేవేంద్రుండు వృత్రాసురబ్రహ్మహత్యన్ జేసి నిస్తేజుండై యసురమర్దనంబునకును దేవమునిజనరక్షణంబునకును స్వర్గపరిపాలనంబునకునుఁ జాలక యున్నఁజూచి నిలింపు లెల్ల భీతులై యక్కాలంబున మర్త్యలోకం బేలుచున్న నహుషమహారాజనువాని సమర్థునిగ నారసి యవ్వాని యొద్దకుఁబోయి స్వర్గపాలనంబునకై యర్థించిరి. అతండును ముప్పదిమూడుకోట్ల దేవతలును దమతమయొక్కొక తేజంబుఁ దన కిచ్చునెడల నట్లే స్వర్గపీఠంబు నధిరోహించి త్రిలోకంబు లేలెద నని చెప్పెను. వా రంద ఱామోదించి యతఁడు కోరివట్లుగాఁ దమతమ తేజంబు లొసఁగిరి. స్వయముగఁ దేజస్వియగు నహుషచక్రవర్తి దివ్యతేజఃపుంజరంజితుండై సహస్రసూర్యసంకాశుం డగుచు సత్వరంబు స్వర్గంబుఁ జేరి యమరేంద్రసింహాసనంబం దభిషిక్తుండై జయధ్వానంబు లెసంగ ముల్లోకంబులఁ బాలించుచుండె. ఇంద్రుండును దాదవ్వుల నహుషునిఁ గాంచి యడలి విస్మితుండై యాక్షణంబున సూక్ష్మరూపంబు నొంది స్వర్గంబుఁ బాసి యెందేనిజనియె. ఆ యింద్రునకై తదర్ధాంగి యగు శచీదేవి యొక్కతెయే పొక్కుటదక్క తక్కిననిలింపుల కేమియక్కరలేక తలంపరైరి. కలిమిని బలిమినిఁ దొలంగినవాని నెవ్వరు కనికరించి తలంతురు? అటు మీఁద నహుషచక్రవర్తి నిర్వక్రవిక్రమంబుతో జాగరూకుఁడై యఖిల లోకంబులు సుఖంబుగ నేలుచుండ ముప్పదిమూడుకోట్ల దేవతలును మహేంద్రునట్లా మానవసార్వభౌముని భక్తిమై గొల్చుచుండిరి. ఇట్లతండు తుంబురునారదాదులవీణాగానంబులకును హాహాహూహూలు

మున్నగుగంధర్వుల సంగీతకౌశలభంగులకును రంభోర్వశ్యాద్యప్సరస్సుందరీనాట్యవినోదంబులకును నానందించుచు మహాభోగంబులొందుచు ముదము మీఱియుండె. అంతఁ గొంతకాలంబు గడచినమీఁద నొక్కనాఁడింద్రాణి యెట్లో నహుషునిదృక్పథంబందుఁ బడియె. జగన్మోహనాంగి యగు నాయమరరాజార్ధాంగిని గనుగొనినంతనే యతండు మోహపరవశుండై పశుభావంబు నొంది యా సుందరీమణితో భోగంబు లొందఁ గోరి యామె నింద్రదేవిని గా నెఱింగి బృందారకులఁ బిల్చి యిట్లనియె. నేను నాకంబున కొడయఁడనై త్రిలోకంబుల నేలుచు మహేంద్రసింహాసనంబు నెక్కి యుండ దిక్పాలకులును దక్కిన దేవతలందఱును మునులును ఋషులును కిన్నరకింపురుషచారణవిద్యాధరయక్షరక్షోవీరులును గంధర్వాప్సరోజనంబులును గ్రమం బెఱింగి నన్ను మహేంద్రు నట్లు వేఱు వేఱుగ సేవించుచుండుట మీరు చూచుచుంటిరి గదా! ఈ స్వర్గం బీసుధర్మ యిందలి నందనవనం బిచ్చటి కల్పవృక్షంబు లైరావతంబు మాతలి యివియవి యననేల యింద్రునిసర్వస్వమున కేను నాథుండనై యుండ నీ పౌలోమి యొకర్తుక యిన్నినాళ్ళనుండి నాయండఁ జేరి నాకు స్వైవసంబు కాకయున్న దేల? మీ రెట్లూరకుంటిరి? గతంబునకు క్షమించితిని. మీ రిపుడేని చని యామెకు హితంబుఁగ జెపి నా యుదంతం బంత నెఱింగించి వేవేగ నారమణీమణిని దోడ్కొని నా యంతఃపురంబుఁ జేర్పుఁడు. అట్లుసేయ రేని మీరు పశ్చాత్తప్తులగుదు రని శాసించె. కామాంధునకుఁ గన్నుమిన్నగుపడునా? విబుధులు వానిదుర్మతికి మదిలో నేవం బొంది పరాంగనాసంగమేచ్ఛ యధఃపాతహేతు వనియు నందును పతివ్రతావంచనం బగ్నిజ్వాలానుసరణం బనియుఁ బౌలోమి పతివ్రతాశిరోమణి యనియు నా పవిత్రమూర్తియందలి వ్యామోహంబుఁ బాపికొని యచ్చరలతో నిష్టంబుఁదీర్చుకొనుమనియుఁ జెప్పిరి. మత్తుండును దుర్నీతుండు నగువానికి న్యాయవచనంబు లెట్లు రుచించును? దివ్యులహితోక్తులకతఁ డెంతయేనిఁ గినిసి తొల్లి యింద్రుం డహల్యను జెందినపుడు మీ రీధర్మశాస్త్రంబుల నేమిచేసితి రని కసరి తనశాసనం బతిక్రమింపక మాఱుమాటాడక యింద్రాణిని దెచ్చి యప్పగింపుఁడనియుఁ గాకున్న తమయందఱ భరితంబుపట్టెదననియును జెప్పెను. ఆలోఁ బరిచారకలచే వాసవదేవి

యీాయుదంతం బంతయు విని ఖిన్నయై విన్నయై సత్వరంబుగ దేవగురుని గృహంబున కేగి గురుచరణంబులఁ బడి యా వృత్తాంతం బంతయు నెఱిం గించి తనదుపాతివ్రత్యధర్మంబు రక్షించుట కభయం బడిగె. బృహస్ప తియు నామె కభయంబొసంగి తనయింటనుండుమనియె. వేల్పు లెల్లరు నహుషున కదరి పాపకృత్యం బని యెఱింగియుఁ దా మట్లు శచీదేవిని తెచ్చి యీాకున్న నతండు దేవతలనందఱఁ బీడించుననియును స్వర్గంబును ధ్వంసంబునొనర్చుననియును దలంచి స్వర్గరక్షణకై యెట్లైని యీాయమ నొడంబఱచి నహుషున కిచ్చుటయే యుచితం బనుకొని బృహస్పత్యాశ్ర మంబుననున్న నామెను గొనివచ్చుటకై యచ్చటికిఁజని యీా మెకట్టెదుట సర్వంబు గురునకు దెలిపి లోకరక్షణకై యింద్రదేవిని నహుషునొద్దకు బంపు మని యడుగఁగా వాచస్పతి రోసి మందహాసంబుఁజేసి యిట్లనియె.

క. నహుషుండు పనుచువాఁ డఱె!
విహితానుష్ఠానపరులు వీ రఱె! హో! లో
కహితం బఱె యిది! మనకున్
మహనీయము గాక యెట్లు మానఁగ వచ్చున్. తిక్కయజ్వభారతము.

అని యుల్లసంబాడి పాతివ్రత్యధర్మరక్షణకై తన్ను శరణంబు గోరివచ్చిన శచిని శుచిని దా నట్లు దిక్కులేనిదానినట్లుజేసి నహుషునొద్ద కంపననియు నద్ది యకార్యం బనియు నిహపరదూరం బనియు రూఢిగఁ జెప్పె. అందుపై బృందారకు లింక నెట్లుసేయుదము కర్తవ్య మెద్ది యనిన దేవమంత్రి కొండొకచింతించి పౌలోమి నహుషుపాలికి జని యుచితవచ నంబులాడి యతనిఁ గలియుటకుఁ గొంతకాలంబు గడువడిగి కొని వచ్చిన నాలో నింద్రుని వెదకి తెచ్చుదమని చెప్పుటయు వా రంద ఱానందించి గీష్పతి నభినందించిరి. అనంతర మింద్రాణి పరిచారికలతో నహుషునొద్దకుఁ బోయి తనకుఁగొంతకాలంబు గడువునీయవలయుననియు నీలో నింద్రుం డున్నదియు లేనిదియుఁ దెలిసికొని యుల్లంబుత్తలంబునొందకయుండ స్థిమి తంబుచేసికొని తనశుద్ధాంతమునకు వచ్చెదననియు నందులకై తన్ను వేగి రింపవలదనియును నడగిన నాతండు సంతసించి యట్లేయకొనియె. ఇంద్రి దేవియు తిరుగ గురునియిరవుఁజేరి యట్లు గురున కెఱింగించె. అంత విబు ధులందఱును గురుఁడును జగన్నాథుండగు మహావిష్ణుదేవుని ధ్యానంబు

చేసి తత్సన్నిధిఁబడసి యింద్రునకు బ్రహ్మహత్యచే నొదవిన తేజోహైన్యం
బును స్వర్గపాలనంబునకై నహుషపట్టాభిషేకంబును బ్రస్తుతంబు వాని
దౌష్ట్యంబును దెలిపి పౌలోమీపాతివ్రత్యరక్షణావశ్యకతను గూర్చి
యర్థించిరి. భగవంతుఁ డప్పు డశ్వమేధంబు నొనర్పఁ జేసిన నింద్రునకు
బ్రహ్మహత్య పాయు ననియుఁ బదఁబడి సర్వము నిర్వాహంబగుననియు
జెప్పి యంతర్ధానంబుచెందె. సురలెల్ల రాతరవాయినే యింద్రుని వెదకి
కలిసికొని శచిని గొనివచ్చి దేవాచార్యునియార్త్విజ్యంబున హయమేధం
బొనర్పఁ జేసిరి. దాన నింద్రుండు బ్రహ్మహత్యాదోషంబు బాసెఁ గాని
నహుషునోర్చుటకుఁ జాలఁ డయ్యె. శచియును దానొనర్చికొనిన శపథకా
లంబు సమాప్తంబగుచున్నదనియు దుర్విచారుండగు నహుషుండు దన్ను
దొందరించి భంగపఱచుననియును నడలుకొన నింద్రుం డామెతో నహు
షునకు మునివర్గవాహనుఁడవై లోకంబుల సంచరించుచుండుమనియు
నాపైఁ గొలఁదికాలములోఁ దన్ను వరించి తన యంతఃపురంబుఁ జేరుదున
నియుఁ జెప్పుమనియు నట్లైన వానికిఁ దేజోభంగం బగుననియును నప్పుడు
వానిఁగడతేర్పుట సులభంబనియును జెప్పి శచీదేవినంపె. దివ్యులెల్ల రమ
రావతికేగిరి. శచియు గురుమందిరంబందుండియే చెలికత్తెతోడ
మునులుమోయున ట్లందలంబు నెక్కి తిరుగుమనియు నచిరకాలంబునఁ దాను
వరించివచ్చి తన రాణివాసంబుఁ జేరెద ననియును నహుషునకు జెప్పియంపె.
అతఁ డట్లువిని మురిసి తత్కాలంబందే సప్తఋషులను మఱియు నితరదివ్య
ఋషులను బిలిచి యందలంబు మోయునట్లు విధించి యద్దాని నెక్కి లోకం
బులెల్ల దిరుగుచుండె. దానఁ జేసి దేవతలొసఁగిన తేజంబులే గాక యాత్మ
తేజంబులుగూడ నంతరించె. అంత నొకనాఁ డందలంబు మోసి యలసి వేసరి
యున్న మునివర్యు లమ్మనుజపతిని జూచి వేదంబులు నీకుఁ బ్రమాణంబు
లేనా? యనియడిగి రాతండు ప్రమాణంబులుగావని యఱచె. అదిగని
వారలలో నగస్త్యుండు సత్యంబులును సర్వులకుఁ బ్రవృత్తినివృత్తిసాధ
కంబులగు నామ్నాయంబులు ప్రమాణంబులుగావా? యనియడుగఁగా
నమ్మూర్ఖుండు "వినాశకాలే విపరీతబుద్ధిః" యన్నట్లహంకరించి స్వపదం
బునఁ గుంభసంభవునిశిరంబుపైఁ దన్నె. అంత నమ్మునీంద్రుండు హుంక
రించి దురాత్మా! మహర్షుల నందఱఁబట్టి యందలంబు మోయఁబెట్టి నిఖిల

జనసేవ్యంబులగు నామ్నాయంబు లప్రమాణంబులని తెగడి యకారణం బుగ నన్ని ట్లవమానంబుచేసినదురితంబు నిపుడే యనుభవింపుము. ఈక్షణంబుననే కొండచిలువవై పుడమిఁగూలుమని శాపంబొసంగి వెంటనే యనుగ్రహంబున నీవు కొంతకాలంబు న్యాయంబుగఁ ద్రిలోకంబులేలిన కతంబున నీకఁబెక్కేండ్లకు మావంశంబున ధర్మరాజనా నజాతశత్రుండు పొడమి నీచేయుప్రశ్నంబుల కుత్తరంబు లొసంగు. అపుడీ వాతనవుఁ బాసి పుణ్యలోకంబుఁ జెందుదువు పొమ్మనియెను. తద్క్షణంబున నతం డట్లు కొండపామై భువింపబడి యరణ్యంబుఁజేరె. తోడనే యగస్త్యుం డింద్రునిజేరి సర్వం బెఱింగింప నాతండు మహాత్మా! నీవు శైవమునివి గావు శివుఁడవే! ఇట్టి పరిత్యక్షశివుఁడవగు నిన్నవమానించి నహుషుండు స్వర్గంబేలునే? ఇఁక నీదీనుని బాలింపుఁడనిన మహర్షివర్యుం డింద్రుని యడలుదీర్చి స్వర్గంబునకంపి శచియొక్కయు సర్వసుపర్వులయొక్కయు బెడదమాన్పి జగజ్జేగీయమానచరిత్రుం డయ్యె. ఇట్టితేజస్వికన్నను జగ మందు ఘనుండెవ్వఁడు? సమర్థుండెవ్వడు? మఱియు వినుండు. మున్ను శివుండు మంచుగొండయందుఁ బార్వతీదేవిని బెండ్లాడునపుడు దక్షిణదిశ యందలి సర్వజనంబులు పెండ్లి కాహూతులై వచ్చియుండుట నోషధి ప్రస్థంబం దొక్కయెడనే సకలజనంబులు వసించియుండుటచేత దక్షిణం బున నొక్కండునులేక శూన్యంబగుడు నెక్కుడుభారంబుగల యుత్తర ప్రదేశంబు క్రిందై వ్రాలుచుండుటను జూచి సర్వజగద్విభుండగు మహే శ్వరుం డారసి కుంభసంభవమునినిబిలిచి మునివర్యా! ఉత్తరభూమి క్రృంగు చున్నది. నీవు వేగిరంబుగ దక్షిణప్రదేశము జేరి యందు వసింపు మపుడు సర్వము సమానమగును. నావివాహోత్సవము నీ కిందెట్లో యందు నట్లే కన్పట్టునట్టు లనుగ్రహించెద ననిన నమ్మహాత్ముం డట్లే చని యందు వసించె. భూతలం బంత సమం బయ్యె. అగస్త్యుం డం దించుకసేపు వసించి తాను నందఱిలోనే యుండఁదలంచి తనదు కమండలంబు నం దొకచోనుంచి తానును మరల హిమాద్రినిజేరి వివాహోత్సవమందు కూర్చుండె. అపుడును భూతలంబు సమానంబుగనేయుండె. ద్రష్టలంద ఱదిచూచి యంద ఱొకయెత్తగస్త్యముని యొకయెత్తు. అగస్త్యముని యొకయెత్తగస్త్యముని కమండలు వొకయెత్తని యమ్మహాత్మునిశ్లాఘిం

చిరి. అంతఁ గొంతకాలంబుమీఁదఁ గుమారస్వామి జన్మించి శివుని యాస్థానంబుముందఱ నొకచో పహరా చేయుచున్నపుడు చతుర్ముఖుండు శివదర్శనార్థమైవచ్చి వడివడిగఁ గక్ష్యాంతరంబులఁగడచి శివుని జేరఁబోవుచుండె. అపుడు కొమరుసామి దన్నుసరకుసేయక దాటుచున్న బ్రహ్మదేవున కడ్డపడి సెలవడుగకపోయెదవేమి ? యనియడిగె. అతండు నేఁ బితామహుండ శివసముఖమున కేగుచున్నాననియె. అపుడు సుబ్రహ్మణ్యుఁడు మందహాసముచేసి పితామహుఁడవైనఁ బ్రణవార్థమును జెప్పుమనియె. విరించియు నీశ్వరమాయామోహితుండై ప్రణవార్థంబు నెఱింగియుఁగూడ నపార్థంబుఁజెప్పె. కుమారుఁ డాగ్రహించి పద్మజుని బట్టికొని చెరసాలయందుంచి యతండొనర్చు సృష్టికార్యంబుఁ దానే యొనర్చుచుండె. అంత నాయుదంతంబంత మహాదేవుం డారసి కుమారుని బిలిచి యేల ఇట్లొనర్చితివనియడుగ బ్రహ్మదేవుఁడు ప్రణవంబున కన్యార్థంబు జెప్పుటచే నట్లుశిక్షించితి నని షణ్ముఖుండు నుడివె. పరమేశ్వరుఁ డక్కజంబొంది యాయర్థమును నీ వెఱింగితివేనిఁ జెప్పు మనిన శక్తిధరుండు శివకర్ణాంతికమందు శ్రుతినిర్ణీతార్థంబును నుడివె. అందుపై శంకరుండు మురిసి కొమరుని ముద్దుచేసి విధాతను విడిపించి సత్యలోకంబున కసిపె. తత్కాలంబునఁ దన్ను సేవింపవచ్చిన కలశసంభవుని జూపి యిమ్మునిని పరమశైవశిరోమణి. ఉపదేశపాత్రుఁ డీయనఘునకీ మంత్రార్థంబుపదేశింపుమని తనయున కాదేశించె. షడాననుండు జనకాజ్ఞచే నాక్షణంబం దగస్త్యుని కమ్మహార్థంబుపదేశించె. షడాననుండు జనకాజ్ఞచే నాక్షణంబం దగస్త్యుని కమ్మహార్థం బుపదేశించె. అగస్త్యుం డానందభరితుండై గురుండగు మహాసేనునకు బరమగురుండగు మహేశ్వరునకార్యకు సాష్టాంగపడి మ్రొక్కి ధన్యోస్మి యని నిజాశ్రమంబున కేగె. ఆహా! భక్తశిరోమణులును బవిత్రాంతరంగులు నగువా రెందులకేగినను నం దభ్యుదయలక్ష్మి యెదురుగవచ్చి గారవించి వరించునుగదా!

ఇట్లనన్యసామాన్యుండగు నమ్మునిమాన్యుం డెల్లలోకంబులఁ జరించుచు నఖిలజనసేవితుడై భక్తులగువారల ననుగ్రహించుచు శివరాజధానియగు వారణాసినిఁ జేరి యందు గంగాతీరంబున బిల్వవనంబున నొక్కచో శివలింగంబుఁ బ్రతిష్ఠించి యందే యాశ్రమంబేర్పఱచుకొని

తో పాముద్రాసహాయుండై శివుఁ బూజించుచు నచ్చటఁ గాపురంబుండె. అంతఁ గొంత కాలం బతిక్రమించినంత నవంధ్యావైభవంబగు వింధ్యాచలంబు మేరుశైలంబుతో మచ్చరించి సూర్యాది నవగ్రహంబులు మేరుగిరికిఁ బ్రదక్షిణంబు నెరపుటయుం దీరసంబునొంది యొక్కనాఁ డర్కునిఁ గాంచి మేరువుకన్న నే మిన్నయగుటెఱుంగవా ? నన్నేటికి ప్రదక్షిణంబు సేయవని యడిగె. భానుండు కాంచనగిరికి నే వాంఛించి ప్రదక్షిణింపను. అద్ది విధివిహితంబు. విధివిధికి లోఁగి యట్లుచరించెద. ఒరులెట్లుగోరిన నట్లు దాను సల్పుటకు వలనుగాదనియె. అంతవింధ్యాద్రి హుంకరించి చూచెదవులే విధి విధి యని తిరస్కరించి మనునాఁ డర్కోదయంబునకన్నమున్నే తనయు త్తుంగశిఖరాగ్రంబులఁ గమలజాండకటాహంబున సూర్యరథమార్గంబున కడ్డంబగునట్లు పెరిగి నిల్చియుండె. భాస్కరుండు నియతిప్రకారంబుగ శతాంగంబెక్కి వెలువడి తనయరుణకిరణచ్ఛటాజాలం బుదయగిరి గైరికాదిధాతురుచులతో వియ్యంబుసయ్యాటలొంద నంధకారపరంపరాసన్నివేశంబు లెండేని బిలాంతరాళంబులఁ జెంద మిన్నంది సాగివచ్చుచుండుడు మధ్యమార్గంబున నాకసంబు భేదించి నిల్చియున్న వింధ్యపర్వతంబు ప్రముఖ శిఖరశిలాఘట్టనంబున రథంబు దీవ్రపరిహారంబునొందియుఁ బగుల కస్తంభించి వడిసెడి గమనంబుమాని నిల్చె. తక్కినగ్రహంబులును దారల తోడ నట్లే గతులుమాని బెండువడి నిల్చియుండె. ఇట్లు వింధ్యాద్రికెలుఁగెలకుల నవగ్రహంబులు జిక్కువడియె. ఒక్కచో సూర్యోదయము లేక చీకటితో నావరింపఁబడియుండె. మఱొకచోఁ బ్రదోషంబు లేక యెండచేఁ గాములుచుండె. ఇవ్విధంబుగఁ గొంతకాలం బరుగఁ బ్రత్యహస్సంధ్యాబలి హోమంబులును, జపతపస్స్వాధ్యాయంబులును, స్వాహాస్వధాకారపూర్వక దేవపితృయజ్ఞంబులును గుంటువడి నిల్చిపోయె. ఇట్లకాండప్రళయం బుప్పతిల్లుటఁజూచి నముచిసూదనప్రముఖులు పితామహునిజేరఁబోయి యమ్ముప్పు తెఱం గెఱింగించి యద్దాని భంగించు నుపాయంబడిగిరి. విరించి సుమేరుపై యీసునవింధ్యాద్రి యీజగద్గోళంబు భేదించుకొని యడ్డంబుగ నిల్చినదనియు నద్దాన నిట్టిచెట్ట చేకూరినదనియు నిద్దానిఁగాశియందుఁ గాపురంబున్న కలశజన్ముండు లోపాముద్రావల్లభుండు పరిహారంబు సేయు ననియు నందులకై యమ్మునీంద్రునిఁజేరి యర్థించుఁడనియును జెప్పె.

అంత మహేంద్రుండు దివ్యమునివర్గంబుతో నాచార్యుండగువాచస్పతితోఁ గూడవారణాశికేగి యందు నభోవాహినీపుణ్యసలిలసంకలితంబులగు మణికర్ణికాపుణ్యతీర్థంబుల స్నానమాడి శ్రీవిశ్వేశ్వరాన్నపూర్ణాడుంఠిమాధవకాలరాజాదులను సేవించి యగస్త్యాశ్రమంబు వెదకి గంగాతీరంబున బిల్వవనంబందు స్వప్రతిష్ఠితశివలింగంబున కెదుటఁ బులిచర్మంబుపైఁ బద్మాసనంబుతోఁ గూర్చుండియుండినట్టి,

క॥ రుద్రాక్షభూతిముద్రా, ముద్రితనిఖిలావయవుని ♦ ముక్తిపదశ్రీ
భద్రాసనస్థు లోపా, ముద్రాపరిపూర్ణపార్శ్వు ♦ మునిపుంగవునిన్

క॥ పంచబ్రహ్మంబును శ్రీ, పంచాక్షరమును నఘోర ♦ పాశుపతంబున్
గించిత్ప్రస్ఫురదధరో, ష్ఠాంచలమున జపముసేయు ♦ నాదిమశైవున్.

సీ॥ అంతర్విలోకన♦వ్యాప్తియుద్వాసించి, బాహ్యంబునకుదృష్టి♦పాఱవిడిచి
లీల రుద్రాక్షమా ♦ లికదక్షిణశ్రవ, శ్శష్కులిశిఖయందు ♦ సంతరించి
పదిలంబుగా మున్ను♦బరిధవించినయట్టి, నలినాసనంబుబం♦ధమువదల్చి
వేదాగమపురాణ♦ విద్యోద్భవములైన, పురమర్దనస్తోత్ర♦ములుపఠించి

గీ॥ అప్పుడప్పుడ యోగస ♦ మాధియుడిగి
యధికశాంతిఁ బ్రసన్నాత్ముఁ ♦ డైనవాని
ప్రణవపంచాక్షరీమంత్ర ♦ పరమసిద్ధుఁ
గుంభసంభవమునిని గ ♦ న్గొనిరిసురలు.(శ్రీనాథమహాకవికాశీఖండము)

అంత నద్దేవమును లమ్మహనీయునకెదురుగ సాష్టాంగపడియుండ నమ్మునివర్యుండు వారల విలోకించి తారసించి విధివిహితాతిథ్యంబుసల్పి కుశలప్రశ్నంబుచేసి యాగమనకారణంబడిగె. దివ్యమునులందఱియంగీకారంబుతో గీష్పతి యిట్లనియె. వింధ్యపర్వతంబు గర్వంబున నాకసంబునాక్రమించుటఁజేసి సూర్యాదినవగ్రహంబులు చిక్కువడి యొక్కయెడ సంచారంబుఁదక్కియుంకుటయు దాన జగత్క్షోభంబు సంభవించుటయుఁ దత్పరిహారంబునకై తామెల్లఁబద్మగర్భుని జేరి యర్థించుటయు నాయజుండిక్షోభంబును గుంభసంభవుండు దక్క నితరులు దీర్పలేరనియు నతండిపుడు గాశియందు వసించియున్నవాఁడు గావున మీర లమ్మునిఁజేరి శరణంబర్థించిన నతఁడు మీయుపద్రవంబుఁ బాపునని యానతిచ్చుట నిందఱమిందుల

కరుదెంచితి మిటమీఁదకార్యంబు యుష్మచ్ఛరణ్యాం బనిన నగస్త్యుం డుస్సురని నిట్టూర్పువిడిచి పుణ్యరాశియగుకాశినిబాయుట యెక్కుడుక్లేశంబైనను లోకక్షోభాపనోదంబునకై యనుమతించి యట్లే యత్నంబొనర్తు మీరు విజయముచేయుఁడని వారలనంపె. అనంతర మాకాశిని బాయలేక పెద్దతడవుచింతించి యిట్లనియె.

శ్లో॥ కాశీద్విజాశీర్భి రహోయదాప్తాంకస్తాం ముముక్షు ర్యదివా ముముక్షుః
గ్రాసం కరస్థం సవిసృజ్య హృద్యం। స్వకూర్పరం లేఢి విమూఢచేతాః

తా॥ బ్రాహ్మణులయాశీస్సులచేత లభింపఁబడిన కాశిని మోక్షేచ్ఛగలట్టి యెవఁడు విడువఁదలఁచును? చేతనున్నట్టి హృద్యమగునన్నము విడిచిపెట్టి యామూఢుఁడు తనమణికట్టును నాకుచున్నాడు.

శ్లో॥ విత్రస్తపాపాం త్రిదశైర్దురాపాం। గంగాసదాపాం భవపాశశాపాం
శివావిముక్తా మమృతైకశుక్తిం । ముక్తావిముక్తాం నపరిత్యజంతి.

తా॥ పాపములనుబోగొట్టినదియు దేవతలచేతఁగూడఁ జెందశక్యముగానిదియు గంగాపవిత్రోదకములుగలదియు సంసారపాశములనువదలించునదియు ఉమామహేశ్వరులచేత విడువఁబడనిదియు మోక్షామృతముక్తాఫలమునకు ముఖ్యమగుశుక్తియైనదియు ముక్తులచేఁగూడ విడువఁబడనియట్టి ఈకాశిని యెవరును విడువరు.(స్కాందకాశీఖండము)

ఇట్లు పలుమఱుపలుతీరులఁ బరితపించి యవ్వలఁ బ్రయోజనములేదనికొని విరమించి భాగీరథిఁ దీర్థమాడి అన్నపూర్ణా విశ్వనాథ డుంఠి మాధవ కాలభైరవులను దక్షిణకేదారదేవ యక్షరాజ లోలార్కాదులను సేవించి సెలవడిగికొని లోపాముద్రయు దానును మిన్నేటిదాటి నియతప్రయాణంబులొనర్చి వింధ్యాచలారణ్యంబు దరిసిరి. వింధ్యుండు గడుదూరంబుగనే యాదిమదంపతులగు శివుల బోలిన యమ్మునిదంపతులఁ బొడగాంచి కాశీవియోగదుఃఖపరితప్తాంతరంగుండును గించిదంకురితక్రోధవశాకలితకుటిలభ్రూకుటిముఖారవిందుండును నగు కుంభసంభవమునిం బరికించి భయకంపితుండై ఈయంతికాంతకప్రతిముఁ డిట కేటికి వచ్చెనో? మొదట నీయన కోపాగ్నికింధనమును గాకున్నమీఁద బృందారకశైలంబుతో మచ్చరింపవచ్చు నని తత్క్షణంబు శిరంబులు నేలకొరుగ డించె.

అంతనె సూర్యరథంబును దక్షిణతారకాగ్రహంబు లడ్డిదొలగి యథాపూర్వంబుగ సంచారంబుచేసె. వింధ్యుండు సుగంధపుష్పఫలోదకంబులం గొని యెదురుపోయి

సీ॥ పరిణవపంచాక్షరో♦పనిషత్ప్రపంచంబుఁ, గడదాక నెఱిఁగిన♦కరతలాని
వాతాపిదైత్యు♦నిల్వలునితోఁ గూడంగ, జఠరాగ్ని వేల్చిన♦సవనకర్తఁ
గోపించి నహుషుని♦గుంభీనసంబుగా, హుంకారమిచ్చిన ♦ యుగ్రతేజు
వానకాలమునాఁడు♦వండువట్టిననీటి, కాలుష్య ముడిపిన ♦ కతకఫలముఁ

గీ॥ బాండుభసితత్రిపుండ్రాంక ♦ ఫాలభాగు
భస్మరుద్రాక్షమాలికా ♦ భరితవక్షు
భార్యయును దాను నేతెంచు ♦ పరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు♦కలశభవుని.(శ్రీనాథమహాకవికాశీఖండము)

సమీపించి మ్రొక్కి విధివిహితాతిథ్యం బొసంగి మణిమయపీఠంబులం దా దంపతుల నాసీనుల నొనర్చి పరిణతుండై నిలిచినఁ జూచి కలశోద్భవమౌని యవ్వాని కిట్లనియె. అద్రీశ్వరా! ఈ పువ్వుఁబోడియు నేనును దక్షిణయాత్రఁ గావింపఁబోవుచుంటిమి. వృద్ధుఁడ నగుట నీ యున్నతశిఖరంబుల నెక్కుటకును దిగుటకును శ్రమంపడుదును. నేను మగిడివచ్చునంతకు నీ విట్లె నేల కొదిగి యుండవలయును. నా యాజ్ఞ మీఱుదువేని నీవ యెఱుంగఁగలవు. పెక్కులాడ నేటి కనుడు వింధ్యుఁడదరిపడి మహాత్మా! తమయాజ్ఞను దాటువా రెవ్వరుందురు. మీరు మరలి వచ్చుదాక నిట్లే యుండుదు ననిన నగస్త్యుం డాతని దీవించి లోపాముద్రతో దక్షిణదిశాభిముఖుండై యానంబుచేసె. వింధ్యుండు గండంబుఁదప్పిఁకొని బ్రతికితి నని సంతసించె. భస్మరుద్రాక్షాలంకృతుండగు శైవుఁ డెవఁడేని దక్షిణదిశనుండి వచ్చుచుండిన నగస్త్యముని యొకో యని యత్తఱి చూచును గాని మరల నా మహాత్ముఁ డేలవచ్చు? అహంకారమున నెదిటివా దన్ను నెఱుంగక యీరసపడి యనిమిత్తంబుగఁ బ్రతిఘటించి భువనక్షోభంబు సల్పిన వింధ్యున కిట్లు భంగపాటొదవుట యక్కజంబు గాదు. అదరిపాటొందువారల కెందు నధఃపాతంబు దప్పదు. ఒరులదుఃఖంబుఁ బాపిన పరోపకారపారీణు లగు నగస్త్యమునివంటివారలకు సుకృతకీర్తిధనంబు లనివార్యంబులు. అంత సూర్య రథంబుతోఁ

దక్కిన గ్రహంబులు యథావిధి సంచరించుట నహోరాత్రంబులు పూర్వం బట్లేర్పడియె. విధ్యుక్తధర్మానుష్ఠానంబులు వెలసె. అమరమును లందఱు సంతసించి యగస్త్యుని బ్రస్తుతించి రంత నగస్త్యమౌని దక్షిణభూమిని జేరి భువనేశ్వరంబును జగన్నాథంబును బట్టిసమును దాక్షారామంబును శ్రీశైలంబును హంపీ విరూపాక్షక్షేత్రంబు మున్నగు దివ్యస్థలంబులను సేవించి సామిమల కేగి యందు స్కందుని బూజించి సేవించిన నమ్మహా సేనుండు ప్రత్యక్షుండై మునీప్సితప్రకారంబుగఁ గాశీస్థలింగతీర్థంబుల యుత్పత్తియుఁ దన్మాహాత్మ్యంబు నుపన్యసించి కొన్నియుగంబులమీఁద వేఱొకజన్మంబునఁ గాశీవాసంబు మరల సిద్ధించు నని యెఱింగించె. లోపాముద్రియు నగస్త్యుండును సంతోషభరితులైరి ట్లసాధారణ తపోధనుండును బరమపాశుపతుండు నగు నగస్త్యమునీంద్రుని చరిత్రంబు మీకు వినిచితి నిది సర్వపాపఘ్నం బఖిలకల్యాణకారణం బిఁక వామదేవ మహామునిచరిత్రంబుఁ జెప్పెద నాలకింపుఁ డనియె.

# 3. వామదేవ మహాముని

శ్లో॥ ఆకాశరూప! బహిరంతరతోవకాశ
దానాద్వికస్వరమిహేశ్వర! విశ్వమేతత్
త్వత్తస్సదాసదయ! సంశ్వసతిస్వభావాత్
సంకోచమేతి భవతోస్మినత స్తత్త్వాం. (స్కాందకాశీఖండము)

తా॥ ఆకాశరూపుఁడవగు నోపరమేశ్వరా! ఓసదయుఁడా! లోపలను వెలపలను నీయవకాశదానమువలన ఈప్రపంచమంతయు వికసించుచున్నది. నీవలన నిట్టూర్పువిడుచుచున్నది. స్వభావమున సంకోచమునొందుచున్నది. అట్టినీకునమస్కారము.

వామదేవసమానుఁడగు వామదేవుఁ డను మునివర్యుండొకఁడు మాతృగర్భమునుండి నగమీవలకువచ్చినంతనే పరిపూర్ణబ్రహ్మజ్ఞానంబు నొందినట్టిదిట్ట. తపోధనుండు మహాశాంతుండు శివయోగి లోకానుగ్రహార్థంబు త్రిలోకంబులందు సంచరించుచుండు నాయనఘుం డొకప్పుడు మిక్కిలిఘోరంబును మనుష్యరహితంబును నగు క్రౌంచారణ్యప్రదేశంబు

నందు స్వేచ్ఛాగతినిఁ బ్రయాణముచేయుచున్నంత నందు ఘోరాకా రుండును గఠోరాక్రందనుండును బ్రబలక్షుధాపీడితుండును నగు నొక బ్రహ్మరాక్షసుండు పరికించి తనభయంకర ముఖగహ్వరంబుఁ దెఱచి వికృతంబులును దుర్గంధంబులును దీర్ఘంబులును ధూమ్రవర్ణంబులునగు దంతంబులఁ బటపటగొరుకుచు ఘోరధ్వనుల నొనర్చుచుఁ బరుగెత్తి వచ్చి యమ్మునివరుని గదిసి పట్టుకొని భక్షించుట కుద్యమించె. శివయోగియగు నమ్మునివర్యుం డెద్దియుఁ బలుకక వెఱవక స్థిమితంబుగ నిలువఁబడి యుండె. అంత బ్రహ్మరాక్షసుఁ డాయోగివర్యునిఁ బొదివి గట్టిగ సందిటఁబట్టుకొని చెరుకుగడను ద్రుంచుకొని నమలునట్లు గబళించుట కుత్సహించినంతనే యమ్మహాపురుష దేహస్పర్శనంబున నవ్వాని పాపంబు లెల్ల భస్మంబులగుటయు నాక్షణంబునఁ గొండొకవిజ్ఞానంబు వాని కుదయించె. అక్కజంబేమి! స్పర్శవేది స్పర్శంబున నినుము బంగారగుటయు నమృతరసాస్వాదనంబున మర్త్యుం డమరుండగుటయు సత్పురుషునిదర్శనస్పర్శనాదిసాంగత్యంబున దుర్జనుండు సజ్జనుండగుటయు వినుచుండుటలేదా! అట్లే రక్కసుం డమ్మునిచంద్రుని నమాంతంబుగ భక్షింపఁగడంగి పట్టినంతనే యమ్మహాత్ముని భస్మదిగ్ధదేహస్పర్శనంబున వానిపాపంబు పటాపంచలై విజ్ఞానంబు పొడమి పూర్వజన్మజ్ఞానం బొదవె. అంతనె యతం డాయోగీశ్వరుని యడుగులఁబడఁగ మఱియును విజ్ఞానం బినుమడింపఁ నవ్వాఁడు పునఃపునర్వందనంబులొనర్చి యిట్లనియె. "దేవా! క్షమింపుము. క్షమింపుము. యోగీంద్రచూడామణీ! నీదుచరణంబులు సకల పాపహరణంబులు. నాబోఁటియార్తులకు శరణంబులు. భక్తజనమకుటంబుల కాభరణంబులు. తండ్రీ! మహాపాతకుఁడను ఘాతుకుఁడను లోకభయంకరుండను దుర్విచారుండను మదగర్వితుండను కామనిహతుండ నగు నేనెక్కడ? పుణ్యరాశివగు నీదరిసెనం బెక్కడ? నీ వకారణ కారుణికుఁడవు. దీనబాంధవుఁడవు. ప్రత్యక్షశివుండవు. కారణములేకయే నాకు మహాభాగ్యము చేకూరె. హర్షం బొసఁగితివి. ఇఁకనుగూడ పాప సముద్రంబుననున్న న న్నుద్ధరింపు" మని తిరుగఁ బదంబులఁబడిన నాయడవిరక్కసున కా యోగీశ్వరుం డిట్లనియె. "ఓయీ! నీ వెవ్వఁడవు? ఏమికతంబున నీనట్టడవి నుంటివి? ఇట్టి భయంకరమగు నేవపు రాక్షసా

స్మృతి నెక్కడఁ జెందితివి? నన్నిపు డేటికిఁ బట్టుకొని విడిచితి" వని యడిగిన నారక్కసుండిట్లనియె. "మహాత్మా! నేనిప్పటి కిఱువదియైదవది యగు పూర్వజన్మంబున యవనదేశం బేలెడు ఱేఁడను. దుర్జయుఁడను పేరిటివాఁడను. దురాత్ముఁడను మోహపరవశుఁడను స్వేచ్ఛావిహారుం డను దురాచారుండను పరిత్యక్తకులాచారుండను నై యెల్లప్పుడు హస్తమునం దాయుధంబులధరించి నిర్దయుఁడనై భయంకరుఁడనై తిరుగు చుంటిని. ఇట్టి నేను పడుచుప్రాయంబునఁ బెక్కండ్రు చక్కదనంపు పెండ్లము లం గూడ కామలోలుఁడనై యింద్రియంబుల గెలువక పాపబుద్ధిన్ జేసి పరిచారకులతోఁ బ్రతిదినంబు దేశదేశంబులందలి యందకత్తెలగు పడు చులను దెప్పించి దిన మొకక్రొత్తయువతితోఁ గలిసి భోగించుచుంటిని. ఇట్లు రేయిం బవ లా భామలతో భోగంబు లొందుచు మఱునాఁడు క్రొత్త వారికై వెదకుచుంటిని. నాచేఁ గ్రీడింపఁబడి విడువఁబడిన పడఁతులను వేఱొకరుఁ బాణిగ్రహించుటకేని వీలులేని యట్లు బందియందు నిర్బంధించి యుంచితిని. బందినున్న నమ్మందభాగ్యలు పురపురఁబొక్కుచు రాత్రిం బవలు వెక్కివెక్కి యేడ్చుచుండిరి. జాతిభేదంబుచూడక యెందైనఁ గంటి కింపైనదాని గవయక విడువకుంటిని. సుందరతరుణీసురతానందంబే బ్రహ్మానందం బని నిశ్చయంబుతో నుంటిని. ఇట్టి దుష్టుండనగునాదు నూర నుండఁజాలక యచటి యుత్తములగు బ్రాహ్మణజనంబులు మఱియు మర్యాదతో నున్న తక్కినవారలును నిండ్లను వృత్తులనుబాసి యితర దేశంబులకుఁ బాఱిపోయి యందే కాపురంబుండిరి. అంతఁ గొంతకాలం బుపై నాదు దురావనంబుననే సిరి యంత సురిగె. బంధుమిత్రామాత్య పరిజనంబులు వాసి పోయిరి. క్షయరోగంబు సంప్రాప్తంబయ్యె. ఒడలి యందలి రక్తమాంసంబులు దరిగె. బలంబు సన్నగిలె. అలఁతవచ్చె. పొడి దగ్గు హెచ్చె. ఆయుధంబు లొందిన హస్తం బవలంబనంబునకై కఱ్ఱను బట్టె. ఇట్టి చెట్టయదను గనిపెట్టి దాయలు ముట్టి నన్ను నెట్టి రాజ్య పట్టంబుఁ గట్టుకొనిరి. అటుమీఁద నే నవ్వారిచెఱయం దుండి బిచ్చంబు పడవేసినకూడు గుడుచుచుఁ గొన్నినాళ్ళలోఁ గాలధర్మంబు నొందితి.

శ్లో॥ ఆయు ర్వినశ్య త్యయశో వివర్ధతే
భాగ్యం క్షయం యా త్యతిదుర్గతిం వ్రజేత్
స్వర్గాత్ చ్యవంతే పితరః పురాతనాః
ధర్మవ్యపేతస్య నరస్య నిశ్చితం. (పంచతంత్రం)

తా॥ ధర్మంబుఁబాసి యధర్మంబునఁ బ్రవేశించినట్టివాని కాయువు నశించును. అపకీర్తి పెరుగును. కలిమి పోపును. చెడ్డదశ చేకూరును. పుణ్యలోకంబుల నున్నపితృదేవత లధఃపాతంబు నొందుదురు. సందియము లేదు.

అంత యంతకదూత లాగ్రహంబునఁ దారసించి నన్ను బెడకేలు గట్టి కొట్టుచుఁ దోడ్కొనిపోయి యమునిముందఱఁ బడఁద్రోసిరి. భయంకరాకారుండగు నాకాలుండు నన్ను జూచి కను లెఱ్ఱఁజేసి తిట్టి వీనిఁ గొనిపోయి శుక్లకుండంబునం బడనెట్టి పదివేలయేడులుంచి బాధించుఁ డని చెప్ప వార లట్లే బల్లెంబుల శూలంబులఁ గ్రుచ్చుచు నడినెత్తిని గుదియలచే మొత్తుచుఁ దోడ్కొని పోయి య ట్లొనర్చిరి. అందు దురంతదుఃఖంబుఁ జెంది యట్లుగడపి యా పాపశేషంబున ఘోరాటవిని బ్రహ్మరాక్షసుండనై పుట్టి యాకట మలమలమాడుచు పిమ్మట నాతనువుఁ బాసి యట్లే పెక్కు నికృష్టఘాతుకజన్మంబు లొంది యిరువదియైదవ జన్మమందుఁ దిరుగ బ్రహ్మరాక్షసుండనై యీ యడవియం దుండి యాకలిచే గ్రుస్సుచుంటిని. నేఁడు తమ్మును జూచి యశనేచ్ఛచే మ్రింగఁబూనియిట్లుదరిసి పట్టుకొంటిని. తేజోరాశులును బుణ్యనిధులు నగు మీ దేహస్పర్శంబున నాదోసంబు లవిసిపోవుడు. నిట్లు పూర్వజన్మస్మృతి యొదవె. మహాత్మా! ఇట్టిసామర్థ్యంబు తమకు దుశ్చరంబగు తపస్సుచే నొదవెనా? యోగంబున సంభవించెనా? నానాపుణ్యతీర్థసేవనంబున సిద్ధించెనా? అనంతశక్తిమంతంబులగు మంత్రంబులఁ జేకూఱెనా? దైవానుగ్రహమున నుదయించెనా? యథార్థం బెఱింగింపుఁడు. మిమ్ము శరణంబుఁగోరి మీచరణంబు లొందితిని. మీపాలబడితిని. నన్ను బాలముంచినను నీట ముంచినను దామే శరణ్యము. నాయఘంబులఁ బార మొందింపుడు. నన్ను రక్షింపు"డని యర్థించె. దయాళుం డగు వామదేవుఁడు వాని కిట్లనియె, ఓయీ! యీ సామర్థ్యం బంతయు నామేన నున్నభస్మంబున నొసరివడి.

షులు. సర్వజనహితులు. అని యిట్లు
శ్రీవామదేవమహాముని యిట్లు భస్మప్రకా
నానావిధానేకధాతుప్రభాచిత్రితంబై బహు
పుష్పలతావితానంబుతోడను ననేకఫలద్రు
తోడను ననేకఫలద్రుమంబులతోడను సర్వ[illegible] డను బా[illegible]డమి
మీఱు మందరాద్రిమణిమయకందరంబున మహారత్నసింహాసనంబున మూలప్రకృతియు ననపాయినియునైన యుమాదేవితోఁ గూడ నాసీనుండై యున్న విశ్వైకనాథుఁ డనంతకోటి కల్యాణగుణాకరుండు కాలాగ్నిరుద్రుఁ డనేకకోటిరుద్రులతోఁ బరివేష్టింపఁబడి సేవింపబడు చున్నంత నింద్రాది దిక్పాలురతో సర్వసుపర్వులు సూర్యాదినవగ్రహంబులు వసువులు విశ్వేదేవత లాశ్వినేయులు వశిష్ఠాదిబ్రహ్మర్షులు నారదాదిదివ్యర్షులు తుంబుర్వాదిగంధర్వులు రంభోర్వశీప్రముఖాప్సరసలు సప్తమాతృకలు శేషవాసుక్యాది నాగరాజచూడామణులు కిన్నరులు కింపురుషులు సాధ్యులు విద్యాధరులు చారణులు వైణికులు ముక్తులగు మహాపురుషులు స్త్రీలు యోగులు విరాగులు కుమారులగు వీరభద్ర షణ్ముఖగజముఖులు ప్రమథగణేశ్వరులగు నంది భృంగి చండీశ మహాకాల మణిమచ్ఛంకుకర్ణాదులు యోగదృష్టులతో నాటిన మానసంబులతో నీశ్వరు నభినందించి సేవించుచుండిరి. అట్టిసమయంబున మహాయోగీశ్వరుండగు సనత్కుమారుఁడు పరమేశ్వరుని సమీపించి మ్రొక్కి శిరమున నంజలిఁ జేర్చి దేవా! సర్వపాపహరం బగునదియు నిహంబునఁ బరంబున నెక్కుడుఫలం బిచ్చునదియును ధర్మంబులలో నెల్ల శ్రేష్ఠంబగునదియును సులభంబగునదియును నగు నొకధర్మం బెఱింగించిన నద్దాని నాచరించి లోకములు సుఖించు నని ప్రార్థించిన బాలేందుకిరీటుఁ డానందించి లోకానుగ్రహార్థం బిట్లు వచియించె.

"యోగివర్యా! సర్వోత్తమంబును శ్రుత్యుక్తంబును సులభంబునగు ధర్మంబు భస్మధారణంబు అద్దానికన్న వేఱొకండు లేదు. సత్యం" బన సనత్కుమారుండు సంతసపడి యా విభూతియెట్టిద్రవ్యం బెట్లుధరింపవలయు నెందెందు ధరింపవలయు నద్దానికి దైవం బెవరు సకలంబు దెల్పుఁడని యడిగిన నఖిలేశ్వరుం డిట్లు నుడివె. "యోగీంద్రా! అగ్నిదగ్ధంబగు

నామయంబె యీభసితంబు. ఇద్దాని నుదకంబుచేఁ దడిపి సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రంబులచేఁ ద్ర్యాయుషమంత్రంబులచేఁ ద్ర్యంబకమంత్రంబున నభిమంత్రించి శిరంబందు నుదుట వక్షంబందు త్రిపుండ్రంబులుగ ధరింపవలయును. మృత్యుంజయనామంబున శిరంబునను ద్ర్యంబకనామంబున నుదుటను ఫాలనేత్రనామంబున వక్షంబునను త్రిపుండ్రంబుల ధరింపవలయును. నుదురందు ముందుగఁ గనుబొమలమధ్యమందు ధరింపవలయు నాపైని బైముఖంబందు శిరస్సువఱకుఁ గన్నులవఱకుఁ దాల్చవలయును. ఈత్రిపుండ్రంబు లగ్నిత్రయస్వరూపంబులు వేదత్రయరూపంబులు త్రిగుణవిశిష్టంబు లకారోకారమకారరూపంబులు రుద్రమహేశ్వరసదాశివాత్మకంబులు. భస్మధారణంబునకు సమష్టిగ సదాశివుండే దైవంబు. ఇట్లు భస్మ త్రిపుండ్రంబులను శ్రేయస్కాముఁడు మోక్షకాముఁడునగు వాఁడు నిత్యంబు త్రికాలంబులందు ధరింపవలయును. ఇట్లు సర్వవర్ణంబులవారు సర్వాశ్రమంబులవారు స్త్రీలు పురుషు లీ భస్మంబును ధరించి శ్రేయంబు బొందుదురు. దీర్ఘాయురారోగ్యంబులను భోగభాగ్యంబులఁ జెందుదురు. సర్వాఘంబులఁ బాసి మత్పదంబు డాయుదురు. వారలకుఁ బునరావృత్తి లేదు లే దిది వేదసిద్ధాంతం బని తెలిపినంత సనత్కుమారుండు హర్షించి మ్రొక్కె ననంతరం బాస్థానంబు ముగించి రిది భస్మస్వరూపం బని చెప్పి యవ్వానికి సుంత యభిమంత్రితభస్మంబుఁ గమండలోదకంబునఁ దడిపి ధరింపఁజేసె. తత్కాలంబందే యతం డా రాక్షసదేహంబుఁ బాసి దివ్యమూర్తియై వామదేవునియడుగులకు మ్రొక్కి సూర్యనిభంబగు శివపుష్పకం బెక్కి శివలోకంబున కేగె. శివయోగివర్యుండగు వామదేవమహాముని వాని నట్లుద్ధరించి లోకహితార్థం బెందేనిఁ జనియె. మఱియు నొకప్పుడు వామదేవుఁడు స్కందశైలంబున కేగి యందుఁ గుమార సరోవరంబునఁ దీర్థమాడి మహాసేనుంగాంచి నమస్కరించి యంజలినొంది నిలిచి యుండె. కుమారుం డమ్మునిని జూచి గారవించి కుశలం బడిగె. వామదేవముని యంత లోకోపకారార్థంబుగఁ బ్రణవస్వరూపంబును బ్రణవార్థము నుపాసనాఫలంబు మున్నగువాని నడిగి తెలిసికొని జగత్కారణంబును గూర్చియుఁ బుడమియందుఁ గర్తృత్వభోక్తృత్వంబులను గుఱించియు నడుగుటయు సుబ్రహ్మణ్యుఁ డిట్లుపదేశించె.

సచ్చిదానందాత్మకుఁడగు శక్తివిశిష్టపరమశివుండే యీ సర్వజగత్కర్త. అతఁడే బ్రహ్మము ఆత్మము సాక్షి పతి సత్యము. అట్టిసత్యస్వరూపుఁడగు శివుఁడే మాయాసంకుచితరూపుండై పురుషుఁ డనంబడు. అట్టి పురుషుఁడే జీవుఁడనియు సంసారి యనియు వ్యవహరింపఁ బడు. అతఁడే కర్తృత్వభోక్తృత్వంబులతో సుఖదుఃఖంబు బొందుచుండు. వాని కంతఃకరణచతుష్టయంబు సాధనంబు లని చెప్పె. వామదేవుం డట్లు దెలిసికొని యింతకు దుఃఖంబుఁబాసి పరమేశ్వరానందంబు నొందుటకుఁ దెరు వెద్ది యని యడుగుటయుఁ గుమారుం డిట్లనియె. మునీంద్రా! మోక్షార్థియగుజనుండు సద్గురూపదేశం బొంది సర్వంబును శివతేజంబుగ విశ్వసించి సేవించిన నవివేకకార్యంబు లన్నియు నంతరించు. శివైకవిజ్ఞానం బుదయించు. దాన సగుణనిర్గుణోపాసనలను బొనర్చి శివానుగ్రహంబుఁ జెందు. అదియే యనన్యసామాన్యంబగు శివానందంబు నందించు నిదియే శివాద్వైతసిద్ధాంతం బిద్దియె సర్వోపనిషత్సిద్ధాంతం బని యుపదేశించి నీ విద్దానిఁబాషండులకుఁ జెప్పక భక్తులగువారికిఁ జెప్పు మనియు శివాద్వైతవిదులలో నెల్ల గరిష్ఠుఁడవై శివజ్ఞానోపదేష్టవై శివాచారంబునకుఁ బ్రవర్తకుఁడవు గాఁగలవనిచెప్పె. అంత మునీంద్రుఁ డానందించి గురుండగు కుమారునకు సాష్టాంగపడి మ్రొక్కి సెలవొంది యథేచ్ఛఁ జనియె. అటుమీఁద గురూక్తప్రకారం బనేకులకుఁ బాశవిచ్ఛేదకంబగు బ్రహ్మవిద్యనొసంగి యుద్ధరించె. ఇట్లు పరమపావనం బగు వామదేవమహాముని చరిత్రంబుఁ జెప్పితి నిఁక శివభక్తయైన యరుంధతీదేవిచరిత్రంబుఁ జెప్పెద వినుం డనియె.

## 4. అరుంధతీదేవీ వశిష్ఠ మహామునులు

శ్లో॥ త్వంపావనేపథిసదాగతిరప్యుపాస్యః
కస్త్వాం వినాభువనజీవన! జీవతీహ
స్తబ్ధప్రభంజనవివర్ధితసర్వజంతో
సంతోషితాహికుల సర్వగ తన్నమస్తే.

తా॥ భువనజీవనా! నీవు పావనమగుపథమం దెల్లప్పుడు సంచారముగలవాఁడవై యుపాస్యుఁడవైతివి. నిన్ను వినాచేసి ఎవ్వఁడు ప్రపంచ

మందు జీవించును? చేష్టారహితములగువాని జలింపఁజేయువాఁడా! వృద్ధిఁజెందింపఁబడిన సర్వప్రాణులుగలవాఁడా! సంతోషింపఁజేయఁబడిన సర్వసమూహములుగలవాఁడా! సర్వప్రదేశంబులందు సంచరించువాఁడా! నీకునమస్కారము.

స్కాందకాశీఖండము.

శ్రీసంధ్యాదేవి యనునామెజనకుఁడగు చతురాస్యునిచేతను నగ్రజులగు మరీచి మున్నగువారిచేతను గామబుద్ధి నవమానింపఁబడి తాను నట్లే జనకుని నగ్రజులను జూచి కామవంచితయై పశ్చాత్తాపంబొంది తన కొదవినయట్టి కలంకంబును బరిహరింపఁజేయుటకై చంద్రభాగాధునీ పరిభాసితంబగు చంద్రభాగాద్రిని జేరి తపంబొనరింపఁబూని యందుల కేగుచున్నంత విధాతయు నంతకుమున్నే పశ్చాత్తప్తుండై కుమారీతపో గమనంబు నెఱింగి పశ్చాత్తప్తులైన తనయులను జూచి యందుఁ గడునుత్తముఁడగు వశిష్ఠున కిట్లనియె. కుమారా! మీతోఁబుట్టువు సంధ్య తన కొదవిన కాలుష్యంబును బాపికొనఁబూని తపస్సొనరింపుటకై చంద్రభాగాద్రికిఁ బోవుచున్నది. బాలిక మంత్రవిధి నెఱుంగదు. నీ వందుల కేగి యామెకు మాంత్రికదీక్ష నిచ్చి తపఃప్రకారం బుపదేశించి రమ్ము. మఱియు నీ వీ వేసంబు మార్చి లాఁతిమునివలెఁ బొమ్మని యనుశాసించె. ఉచితజ్ఞుఁడగు నాతండు తండ్రిసెలవెట్టు లట్లచ్చటి కేగె. ఈలో సంధ్యాదేవి చంద్రభాగాద్రిశిఖరంబుఁ జేరి చంద్రభాగానదీతీరంబున లోహితతీర్థతటంబం దొకపర్ణకుటీరంబు నిర్మించికొని స్నాతయై తపంబున కుపక్రమింపఁ జూచుచుండె. తత్కాలంబందే ప్రాగ్దిక్కునుండి తోఁచు భాస్కరుఁ డట్లు పవిత్రతేజోవిభాసితుఁడగు వశిష్ఠుఁ డటకు వచ్చుచుండుటను జూచి యామె వినయముతో లేచి మ్రొక్కి నిలిచె. పావనుఁడగు నావశిష్ఠుఁ డామెను బరికించి ఉత్తమా! నీ వెద్దియో విచారించుచున్నట్లగుపడుచున్నావు. హేతువేమి? ఎవ్వనిపుత్త్రివి? నిర్జన వనంబం దేటికిట్లుంటివని యడిగె. అపుడామె మహాత్మా! నేను హిరణ్యగర్భునితనూజను. తపస్సొనరించుటకై యిందుఁ జేరితిని. అందులకు మంత్రంబును దపోవిధానంబును నెఱుంగక విచారించుచుంటిని. ఇట్టియుదనున మహామంత్రమూర్తులగు మిమ్ము నిధానంబట్లుఁ గాంచితిని. కారు

ణ్యాముతో నాకు మంత్రోపదేశపురస్కరముగఁ దపోవిధానం బెఱింగింపుఁడని ప్రార్థించె.

అంత నా యనఘుం డామెను తీర్థస్నానంబును మంత్రస్నానంబును భస్మస్నానంబు నొనర్పఁజేసి భూతశుద్ధి పూర్వకంబుగ షడధ్వశుద్ధినిఁ గలాన్యాసంబు నొనర్చి పంచాక్షరీమంత్రం బుపదేశించి సంతతంబు మనంబును శివైకతానం బొనర్చుచు మౌనంబుతో మంత్రజపం బొనర్చుచు మౌనంబుతోడనే మహేశ్వరునిఁ బూజింపుమనియు దీన సకలసిద్ధు లొనఁగూడు ననియు సందియంబొకింతయు లేక యిట్లు సల్పు మనియు పర్ణజల భక్షణంబు నాహారంబు నొందుమనియు నచిరకాలంబున శివానుగ్రహంబున నభీష్టసిద్ధి యగునని యమ్మునివరేణ్యుఁ డంతర్ధానంబునొందె. సంధ్యాదేవి యిట్లు శివదీక్షనొంది యానందంబునఁ జేతంబును శివపాదారవిందంబులం దవధానంబునఁ బ్రతిష్ఠితం బొనరించి పర్ణజలాశనంబుతో రేఁబవలు శివోపాసన నొనర్పుచుండె. పెద్దకాలం బట్లు నియమంబుతో శివారాధనంబు సల్పుచుండఁ బరమశివుఁడు మెచ్చి యనుగ్రహింపుటకై యాయమ ముందటఁ బ్రత్యక్షమై నిలిచె. అంత సంధ్యాదేవి పరమేశ్వరునిఁ జూచి యరుసంబుతోఁ బదంబులకెరఁగి భయభక్తులతో నెట్టులుఁగూడ నుతింపలేక దీనమై కరపద్మంబులు మోడ్చి నిల్వఁబడియుండె. దయానిధియగు నామహేశ్వరుం డాయమకుఁ దత్క్షణమందు దివ్యజ్ఞానంబును దివ్యోక్తి సామర్థ్యంబు నొసఁగఁగాఁ దెలివొంది యాయలికుంతల యంజలిన్ దలనొంది సంబరంబున నిట్లు స్తవం బొనర్చె.

క॥ స్థూలముసూక్ష్మంబనఁబడు, నేలాటివిధంబుగాక ♦ మెఱుఁగుటకుఁగడున్
పేలమరక జ్ఞానంబున, నే లభియింపఁబడువాని ♦ నే సేవింతున్.

క॥ శాంతము నిర్మలమును న, త్యంతము జ్ఞానైకగమ్య ♦ మవికారమునున్
ధ్వాంతపథేతరలలితమ, నంతం బాత్మప్రకాశ ♦ మగుశివుఁ గొలుతున్

క॥ ఎవ్వనిరూపంబులు నభ, మివ్వసుమతి సలిల మగ్గి ♦ యిప్పవమానుం
డవ్వైవస్వతుఁ డాదిశ, లవ్విశ్వాకారుఁ గొలుతు ♦ నహరహము రహిన్

క॥ కమలజరూపంబున స,ర్గము హరిరూపమునఁ బెంపు ♦ ఖండపరశురూ
పమునలయంబొనరించుప,రమశివుభజియించెదన్ గ ♦ రముభక్తి మెయిన్

క॥ నీవే పరమాత్మవు శివ, నీవేచిద్విద్యవెందు ♦ నిరుపమభావా!
నీవే బ్రహ్మము దేవా!, నీవే సర్వస్తువవు ద ♦ నిందిత విభవా!

క॥ మ్రొక్కెదనీకుమహేశ్వర, మ్రొక్కెదగీర్వాణవంద్య! మ్రొక్కెదశంభూ
మ్రొక్కెదఁదపోమయా! యిఁక, దిక్కెవ్వఁనను బ్రోవుమయ్య! దీనశరణ్యా!

శివపురాణము.

ఇట్లు నుతిచేసినట్టి యిందువదనపలుకు లాలకించి భక్తవత్సలుండగు శంకరుఁ డామెను గనుగొని, బాలా! నీతపంబును మెచ్చితిని. సంతసించితిని. నీయాస్తవంబునకుఁ గూడ మురిసితి. వరంబు లొసంగెద. నీదు కోర్కె లడుగుమనెను. అట్లు పలికిన మహేశ్వరుని వచనంబులకు సంతుష్టయై యాచేడియ జగత్ప్రభునకుఁ బౌనఃపున్యంబుగాఁ బ్రణమిల్లి యిట్లు విన్నవించె.

దేవా! నేను వరమునొందఁ దగియుంటినేని నాదుదురితంబునంతయుఁ బాసి శుద్ధనై తోఁచినయెడలఁ బుడమియందుఁ బ్రాణులకుఁ బుట్టుకతోడనే కామంబు పుట్టక యౌవనదశయందుఁబొడముగాత. మఱియును నేనెవ్వని నాథునిఁగ వరించెదనో ఆవరునియందే నామనం బహర్నిశంబు దృఢశుద్ధిగ రహించుఁగాక. ఆవిభుఁడు గూడ నన్ను బ్రియమ్మున జేకొనియుండుఁగాక. వేఱొం డెవఁడేని నన్ను గామమునఁ జూచిన నవ్వాఁడు క్లీబుఁడగుఁగాక. ఈవరములు నా కిండని మ్రొక్కిన నమ్మహేశ్వరుండు తథాస్తని నీవుకోరినయట్లు లోకమునందు బుట్టెడువారి కొదవునట్టి బాల్యయౌవన కౌమారవార్ధకదశలందు యౌవన ప్రారంభమందే కామంబుపొడము. నీకు విభుండగువాఁడు లోకోత్తరుఁడు, నిరుపముఁడు, తపస్వి, సుందరుఁడు, కల్పపరిమితాయుష్కుండగును. మీ రిరువురన్యోన్యప్రేమాస్పదులై చంద్రచంద్రికల ట్లవినాభావంబున నుందురు. మఱియు నీహృదయ మెఱింగియుండుటఁ జేసి మఱొకఁడు చెప్పుచున్నాఁడను. నీ వీదేహంబును గశ్మలంబుగ నెంచి పరిత్యజింప నెంచితివి. కావున నీచంద్రభాగాసరిత్తీరమందు మేధాతిథియనుఋషి మునులతో పదిరెండేండ్లపరిమితిగలయాగం బొకటి చేయుచున్నాఁడు. నీ వందులకేగి నాయనుగ్రహంబున యెవ్వనికంటఁబడక యుత్తరజన్మమందు నీ వెవ్వని చెట్టఁబట్ట నెంచితివో వాని మనమునఁదలఁచి ఆయగ్నికుండమునఁ బ్రవేశిం

పుము. ఆమీఁద నుత్తరజన్మంబున నాయనుగ్రహముతో నామేధాతిథికిఁ గూతువై జన్మించి తపంబుజేసి నాయనుగ్రహంబున నీయభీష్టవరునిఁ జేకొని పెండ్లాడగలవు. కావున నిట్లు చేయుమని శివుఁ డంతర్హితుండయ్యె. ఆమెయు సంతసించి మేధాతిథియజ్ఞవాటిఁ జేరి శివానుగ్రహంబుతో నెవ్వరికిఁ గనుపడక హృదయమందు వశిష్ఠుని నాథునిగఁ గోరి యగ్ని యందుఁ బ్రవేశించె. అగ్నియుఁ బురోడాశమయంబగు నామె దేహంబును దహించి యద్దాని సూర్యమండలంబునకుఁ జేర్చె. రవియును నా దేహంబు విభజించి ఊర్ధ్వభాగంబు నుపస్సంధ్యగాను శేషభాగంబును సాయం సంధ్యగాను వెలయించె. ఇటఁ బరమేశ్వరానుగ్రహంబున నా దేవిప్రాణం బులు దివ్యదేహంబునొంది మేధాతిథి యజ్ఞావసానమందు జాతవేదవేది యందు బంగారుతీవియఁబోలి పొడసూపిన నాతండు మురిసి యందుకొని యభిషేకంబుచేసి వస్త్రాదుల నలంకరించి యరుంధతియని నామకరణంబు చేసి సంతసంబునఁ బెంచుచుండె. ఆమెయు నైదవయేడు వచ్చినంతనే చంద్రభాగాతీరంబునఁ జటులతపంబుచేయుచుండఁగ శివానుగ్రహంబున నామెజనకుండగు మేధాతిథి బ్రహ్మపుత్రుండగు వశిష్ఠుని బ్రార్థించి తెచ్చి యాయరుంధతినిచ్చి వివాహంబుచేసె. ఆవివాహంబందు హరిహరహిర ణ్యగర్భులును నిందుర్రేఁడు మున్నగు సకలామరులును పాల్గొని మహోత్స వంబుగూర్చిరి. త్రిమూర్తుల హస్తంబులచేఁజల్లబడిన పుష్పంబుల మక రందధారలనుండి శీప్రి మున్నగు నేడునదు లుద్భవించి ప్రవహించె. వివాహంబైనంత వశిష్ఠుం డరుంధతినిఁదోడ్కొని స్వాశ్రమంబునకుఁ జేరె. ఆపుణ్యదంపతులు నిరంతరము శివపూజసేయుచు శివభక్తి నొన ర్చుచుండిరి. అవ్వారలదాంపత్యఫలంబుగ శక్తిమహాముని మున్నగువా రాత్మజు లుదయించిరి. లోకకల్యాణకరంబగు నీ యరుంధతీవశిష్ఠుల చరి త్రంబు లఘుప్రకారంబుగఁ జెప్పినాఁడను.

శ్లో॥ యయాం పూతమన్యే । నిధిరపి పవిత్రస్యమహసః
పతిస్తేపూర్వేషామపి ఖలు । గురూణాం గురుతమః
త్రిలోకీమాంగల్యా । మవనితలలీనేన శిరసా
జగద్వంద్యాం సంధ్యా । ముషసమివ వందే భగవతీం,

తా॥ నియమముచేతఁ దేజోనిధియగు సూర్యుఁడు దన్నుఁ బవిత్రునిగఁదలఁచు చున్నాఁడో, నియమమెనిమిటి ప్రాచీనులైనగురులకు గురుఁడో అట్టి ముల్లోకములకు మాంగల్యమైనట్టియు, ముల్లోకములకుఁ బూజనీయ మైనట్టియు నిన్ను నేలకొాదిగినశిరస్సుచేఁ బ్రాతస్సంధ్య నట్లు నమస్కరించుచున్నాను. (భవభూతి ఉత్తరరామచరితము.)

# 5. అనసూయాత్రి మహామునులు

శ్లో॥ విశ్వైకపావక ! న తావకపావకైక
శక్తేర్మృతేఽమృతబతామృతదివ్యకార్యం
ప్రాణిత్యదో జగదహో జగదంతరాత్మన్
తవ్ పావక! ప్రతిపదం శమదం నతోఽస్మి.

తా॥ విశ్వమునకుముఖ్యుఁడవగునోపావకా! ఓ అమృతుఁడా! నీదు ముఖ్యమైన పావకశక్తి వినా అమృతమగు దేవకార్యము కాదు. ఎంత కష్టము. ఓజగదంతరాత్మా! నీశక్తినివినాగ నీజగముకూడ జీవించునా! ఆశ్చర్యము. అందువలన శమమునిచ్చు నీపదమునుగూర్చి నమస్కారము. (స్కాందకాశీఖండము.)

గోదావరీ దక్షిణప్రదేశవనంబునం దరవిందగర్భుని పుత్త్రుండగు నత్రిమహాముని పత్నియైన యనసూయాదేవితో శిష్యులతో నివసింపుచుఁ దపంబొనర్చుచుండె. అందుఁ గొంతకాలంబున భయఙ్కరంబైన కరవేర్పడ పదిరెండేండ్లు వర్షంబులు గురియక మహాక్షామంబు సంభవించె. ఎచ్చోటను తడియైన లేకుండె. ఆశ్రమవృక్షంబు లన్నియు నెండిపోయె. అపు డెల్లజంతువులు దాహంబుతో నడలి యెండేనిఁ బాఱిపోయె. వేడిగాడ్పులుచెలరేగె. ఎందును హాహారవంబులు మ్రోయుచుండె. నిత్యవృత్తికి నీరంబనునది శూన్యంబయ్యె. అపు డనసూయాదేవి నాథుని జూచి నే నీ హాహాధ్వనుల వినజాల. దాహార్తులగు దీనప్రజలఁ జూడఁజాల నేమిసేయుదు ననిన నాధీరోత్తముఁ డపుడే శివుని దలఁచి ప్రాణాయామం బొనరించి సమాధినొంది తపించుచుండె. అంతేవాసు లందఱు కలిదప్పులఁ గీడ్పడి యెద్దడి నెదురలేక ప్రాణభీతులై యెండేని జనిరి. అనసూయాదేవి సమాధియోగంబున నున్నవిభుని సేవింపుచుఁ దాను

గూడ నొకమృణ్మయలింగం బొనర్చికొని మంత్రంబులఁ జదువుచు భావ మయంబులగు సకలోపచారంబుల సమర్పింపుచు నహోరాత్రంబులం దర్చించుచుండె. అపుడు దురాత్ములగు నిశాచరులు గొంద ఱనసూయా సుందరోజ్వలమూర్తిని జూచి కామించి తన్నాథుండు తపస్సమాధియం దుండుటయు శిష్యులందఱు వలసబోవుటయుఁ దెలిసికొని యిదియే యద నని యా యనఘుమూర్తిని డాయవచ్చుచుండిరి. అంత నాయా దేవీ పావన తనూద్భూతాగ్నిజ్వాలలు భీషణంబులై తమదేహంబుల దహింపవచ్చు చుండుటను జూచి రక్కసు లుక్కుచెడి హాయనుచుఁ గూయిడుచు దిక్కులకు బాఱిరి. అంతరిక్షంబందు విమానంబులెక్కి చూచుచున్న సర్వామరబృందంబు లనసూయాపాతివ్రత్యతేజంబున కానందించి భూమికి డిగ్గివచ్చి యనసూయాత్రిమునులకు మ్రొక్కి సన్నుతించి పోయి రప్పటి కనసూయాత్రిమునుల తపోవత్సరంబు లేబదినాల్గు దాటె. అపుడు గూడ వృష్టి యొనరదయ్యె. తత్కాలంబం దత్రిముని యాకస్మికముగ సమాధిని వదలి బాహ్యప్రపంచమును జూచె. అనసూయాదేవి హరుసంబునఁ బెనిమిటికి మ్రొక్కి నిలిచియున్నంత మునీశ్వరుండు పురంధ్రిని జూచి దప్పి యొదవె నెందేని యుదకమ్ముఁ దెమ్మనియె. అపు డామునీంద్రదేవి కమండలువంది యాశ్రమంబునంతఁ గలయఁగన్గొనిన నెందును సలిలం బగుపట్టకున్నఁ జూచి హా! ఏమిసేయుదు ? నాథుం డుదకంబుఁగొనిరమ్మ నియె. ఎందును నద్ది దుర్లభం బిఁక నేమిసేయుదు ? విభునిదాహం బెట్లు దీర్తు ? నని మానసంబునఁ బరితపించుచుండ నంత నే స్వర్గంగ యొక యంగనయై యనసూయను వెనుకొని వచ్చి సాధ్వీమణీ ! నీ వేమివాం ఛింతు విచ్చెదఁ జెప్పుము.

కం॥ నీ సెలవుం గడుఁగూరిమిఁ, జేసెదఁ జెప్పుమమ్మ! యిట్లు శివసేవనమున్
నీసామిసేవనంబును, వాసిగ నొనరించినట్టి ♦ పావనవెలమిన్.

శివపురాణము.

ఇట్లడిగిన ననసూయాదేవి యా గంగాదేవిం జూచి హర్షించి తల్లీ! నీ వెందుండివచ్చితివో నీదుసంపత్తి నొకింత నెఱింగింపు మనియె. అపు డామె నేను గంగను శివవల్లభను నీ యీప్సితంబు లడుగుదువుగాక!

యనిన ననసూయ సాష్టాంగపడి మ్రొక్కి తల్లీ! మధురోదకంబులిమ్మనె. గంగాదేవి యంతనే సతీమణీ! ఒకచిన్నగర్తంబొనరింపుము. అందు మధురనీరంబులఁ గూర్తుననియె. అనసూయ హర్షంబుతోఁ బల్లంబు నొకచిన్నగుంటను నిర్మించఁ దత్క్షణంబందు గంగాదేవి స్వాదూదకంబుల నింపించె. అనసూయ కమండలమం దుదకంబు నింపికొని గంగాదేవికి మ్రొక్కి తల్లీ! నే నిపుడే నీసన్నిధికి మరలవచ్చెదను. నే వచ్చుదనుక నీ వరుగక యుండే యుండుమని ప్రార్థించినంత భాగీరథి యంగీకరించె. అనసూయ తీర్థములఁ గొని నాథునకొసఁగఁగా నతండు వేగిరంబుగ నా సలిలంబులఁ ద్రావి యానందించి దేవీ! ఈ తీర్థంబు లెందుండి తెచ్చితివి? ఇవి యపూర్వంబు లమృతోపమానంబు లెపుడెపుడు నీ విచ్చునట్టి నీరంబు లిట్టివిగావు. దాహాగ్నితప్తంబగు నా హృదయంబుందలి వేదనఁ బాపి సుఖం బొసంగినవి. ఇట్టిసలిలంబులు నీకెట్టులభించినవి చెప్పుమనిన అనసూయ యించుక యోజించి మహాత్మా! తమ తపోబలంబునను, శివునియనుగ్రహంబునను మనవనమం దొక్కచో గంగోదకంబులు చేరినవి. అందునుండి యాతీర్థంబులను దెచ్చితి ననియె. అప్పు డత్రిమహాముని సంతసించి వేగిరంబుగ సతితో నటకేగి సలిలపూరితంబైన సరోవరంబుఁ జూచి యక్కజంపడి మురిసి తానందుఁ దీర్థమాడి నిత్యకర్మంబుల నెరవేర్చుకొనియె. అనసూయాదేవియు నం దవగాహనంబు చేసి నంతఁ బరమేశ్వరుండును గంగాదేవియు నాదంపతులకు దర్శనం బిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరములిచ్చెద మడుగు డనిరి. అప్పు డనసూయ గంగాదేవి కిట్లనియె.

క॥ తల్లీ! యీతాపసవని, నెల్లప్పుడు మఱచిపాయ ♦ కీవుండవలెన్
జల్లగ నాయెడఁ గలకృప, ఫుల్లాంబుజనయన! భువనములు పొలుపొందన్

క॥ లోకోపకారమును నగు, వీఁకన్ గరుణాతిశయము ♦ వెల్లివిరియఁగా
నీ కమనీయోదకముల, నీకాననను సతము నిలిపి ♦ తేని మహాత్మా!

శివపురాణము.

అని యనసూయ గోరిన నా హరురాణి పతివ్రతాతిలకమా! నీ వొకవత్సరము శివపూజ యొనర్చినఫలంబు నాకొసఁగుము. నే నట్లే

యుందు సాన్నిధ్యంబొంది యుదకంబులఁ దఱుగనీక యుంచెద ననియె, అనసూయయు నట్లొకయేటి శివపూజాఫలంబు గంగకు ధారవోసె. దేవధుని నిజోక్తిప్రకారంబు పుష్కరణియందు సాన్నిధ్యంబు జేసియుండె, అంత ననసూయాత్రిమును లుభయులు ప్రసన్నుడై దరిసెనం బిచ్చిన మహేశ్వరు నిట్లు ప్రార్థించిరి.

క॥ మందాకిని యెట్లులమా, యందాదర మెసఁగ నిందు♦నమృతమయంబై
పొందికఁజేరి వసించెనొ, యిందుధరా! యట్లులరసి♦యీవుండుమిటన్,

శివపురాణము.

అని ప్రార్థించి యడిగిన శివుం డట్లేయని ఆ యనసూయారచిత పార్థివలింగంబందుఁ బ్రవేశించి యత్రీశ్వరుడను పేరితో జగంబు నేలుచుండె. మఱియు నాదిదేవుండగుశివుం డనసూయాత్రులఁ గాంచి కొలఁది కాలంబులో మీకు నాయంశంబున నొకపుత్రుడును హరి బ్రహ్మలయంశంబుల నొక్కొకపుత్రుండును జన్మింపఁగలరని యాదేశించి భాగీరథితో నంతర్హితుండయ్యె. యథాపూర్వంబుగ వనంబంతయు బహుపల్లవపుష్పఫలభరితతరులతావ్రాతంబులోఁ జెలువొందె. మేఘంబులు సువృష్టినాపాదించె. ఎద్దడి దొలఁగిన పిమ్మట వలసఁబోయినమునులెల్ల కుటుంబములతోఁ బుత్త్రమిత్రభాతృలతో మరల వచ్చి శాంతిహోమంబుల నెరపి యానందంబున నుండిరి. అత్రిమహామున్యంతేవాసులును మరలఁ జేరి యవ్వారిని సేవించుచుండిరి. శివోక్తప్రకారంబుగఁ గొంతకాలంబుమీఁద నమ్మునిదంపతులకు శివాంశంబున దుర్వాసమునియు, విష్ణ్వంశంబున దత్తాత్రేయుండును బ్రహ్మాంశంబునఁ జందురుండును బుత్త్రులై జన్మించి పెంపొందిరిది మహనీయులగు ననసూయాత్రిమహామునుల చరిత్రంబు.

## 6. గౌతమ మహాముని

శ్లో॥ పానీయరూప పరమేశ! జగత్పవిత్రం
చిత్రం విచిత్ర! సుచరిత్ర! కరోషినూనం
విశ్వం పవిత్ర మమలంకిల విశ్వనాథ!
పానావగాహనతఏత దహోనమస్తే. స్కాందకాశీఖండము.

తా॥ పానీయరూపుఁడవగునోపరమేశ్వరా! ఓవిచిత్రుఁడా! ఓసుచరిత్రుఁడా! ఓవిశ్వనాథుఁడా! ఈజగంబును బవిత్రమైనదానిగాను జిత్రమైనదానిగాను జేయుచున్నావు. స్నానపానములచేత నీవిశ్వమంతయును బవిత్రము మాలిన్యరహిత మగుచున్నది. అశ్చర్యము. అట్టినీకు నమస్కృతి. స్కాందకాశీఖండము.

మహనీయంబును పవిత్రతమంబును నగు బ్రహ్మగిరిప్రదేశంబందు మునికులపతియును మహాతపోనిధియును నగు గౌతమమహాముని నివసించి పత్నితోఁ దపంబుసేయుచు శిష్యజనంబులకుఁ దపోనియమంబులను వేదంబులను బాణినీయన్యాయాదిశాస్త్రంబులను జెప్పుచుఁ ద్రిసంధ్యంబుల నియతంబుగ శివలింగంబునుబూజింపుచు అతిథుల నభ్యాగతుల హర్షింపఁ జేయుచు గోకులంబును బోషింపుచు సర్వభూతహితంబుగఁ బ్రవర్తింపుచుండె. అంతఁ గొంతకాలంబు మీఁద దైవేచ్ఛచే. ననావృష్టి పొడలి కఱవేర్పడి యన్నపానంబులకుఁ గడున్ గడు దుర్భిక్షం బయ్యె. ఎందు దవ్వోగినను త్రావుట కుదకంబు దొరుకదయ్యె. ఎచ్చోటికిఁ బోయినను దినుట కేలాటియాకు లేనియు లభింపకుండె. చిచ్చువంటియాకలిచే మలమలమాడుచు మనుష్యులు దేకువచెడి దిగులువడి గగ్గోలువడి యేకాకులై కాకులవోలె ప్రాణాతురులై నలుగడలఁ బఱుగిడిపోయిరి. మృగపక్షిప్రముఖంబగు సర్వప్రాణిచయంబు గూడఁ బ్రాణభీతితో నఱచుచు నెందేనిఁ బారిపోయె. అట్టిమహాక్షామంబు సమయంబున సర్వజనక్షోభంబును సర్వభూతంబుల యార్తనాదంబులను విని యడలి గౌతమమహాముని హృదయంబున క్షోభపడి కనికరించి దయాళుఁడై సర్వభూతార్తిఁ బాప సమకట్టి సర్వజగద్రక్షకుఁడగు శంకరునిఁ గొలిచి సకలజలాధినాథుం డగువరుణదేవునిఁ గూర్చి భక్తిమై బూజించె. అంత సకలజలేశ్వరుం డమ్మునికిఁ బ్రసన్నుండై పొడసూపి యభీష్టంబుఁ జెప్పుమన మునిశిరోమణి వరుణదేవునకు సాగిలబడి మ్రొక్కి పూజించి నుతించి యిట్లు లర్థించె. భువనేశ్వరా! వరుణదేవా! ప్రస్తుతమం దనావృష్టిచే ఘోరక్షామం బేర్పడి సర్వభూతంబుల నాకలిదప్పులచే దహించుచున్నది. దేవా! నీవు దయాళుండవు. వృష్టిసమర్థుండవు. సర్వజలాధినాథుండవు. దయతో ధారావృష్టిన్ గురిసి యెల్లజనంబులను సర్వభూతంబులను

సంరక్షింపుము. పాత్రీరక్షణంబుకన్న మిన్న యేమున్నది? నీకు నేఁ జెప్పఁగలవాఁడనే! యనివేడిన జలేశ్వరుం డిట్టులనియె. మునివర్యా! నీ నుడులెల్ల నిక్కములే. ఐనను సర్వజగత్ప్రభుఁడగు శివునకు వర్షమునం దిష్టములేని యీకాలంబందు నేను వర్షించుటకు సమర్థుఁడను గాను. వినుము.

చ॥ ఎవనిభయంబు నెక్కొని స ♦ మీరుఁడు వీచు మహేనియుల్కఁ చే
రవి యుదయించు నేబిరుదు ♦ త్రాసముఁజేసి మహేంద్రుఁ డగ్గి మృ
త్యువును బనుల్ పొనర్తు రభ ♦ యుం డఖిలాబ్జభవాండనాథుఁ డా
శివుఁడు తదీయమా వశముఁ ♦ జెంది తనర్చు జగంబు సర్వమున్.
(శివపురాణము.)

కావున నేను సువృష్టిని గూర్పలేను. పరమేశ్వరాజ్ఞాబద్ధుఁడను. ఐనను, మునీంద్రా! నీ కోర్కి రిత్త సేయకుండుటకును నా రాక యేదో యించుకైనను హర్షం బొసంగుటకును నొకయుపాయంబుఁ జెప్పెద. వేగిరం బట్లు చేయుము. నీవు సంతసించెదవు. నీయాశ్రమంబు ప్రదేశం బున జానుదఘ్నంబుగ (మోకాళ్ళమునుఁగునట్లు) నొకకుంటఁ ద్రవ్వు కొనుము. దాని నేను నీళుల నింపెదను. అందుదకంబు ప్రమాణంబు నకుఁ దగ్గక వట్టిపోక యెల్లప్పు డూరుచుండును. నీ వం దిష్టజనులతో స్నానపానంబుల సల్పుకొనుము. నీగోగణంబు లందు నీరుత్రాగును. తీరములందు నల్గడలఁ గాల్వలఁ ద్రవ్వికొని సర్వధాన్యంబుల నానాపుష్ప ఫలలతావృక్షంబుల సర్వౌషధీశాకంబులఁ గూర్చుకొని యథేష్టంబుగ గార్హస్థ్యంబును నిర్వహింపుమని వరం బిచ్చి యంతర్హితుం డయ్యె. మునినాథుండును హర్షంబొంది తత్క్షణంబందు శిష్యులుఁ దానును గూడు కొని యొక పల్లపుస్థలమందు విశాలంబగు నొకగర్తంబు నిర్మించె. ఆ నిమిషంబందే వరుణుం డాస్థలంబున నుదకంబుల నింపె. గౌతమదంపతు లును శిష్యులును హర్షంబుతో నందు మజ్జనంబుల సల్పిరి. వరుణోక్త ప్రకారం బందనేకంబులగు కాల్వల నేర్పఱచి తీరములందు నానావిధ ధాన్యంబుల పంటచేనులను బుష్పఫలవృక్షంబుల దోటల సంతరించిరి. అపు డందు గౌతమముని తపశ్శక్తిచేతను శ్రీవరుణానుగ్రహముచేతను నానా విధ ధాన్యంబులు వడ్లారికెలు గోధుమలు కందులు పెసలు సెనగలు

మిన్ను లలచందలు మున్నగువానిపంటచేలు మెండుగఁబండి కొదువలేక యభీష్టంబునకన్న మిన్నగఁ బ్రత్యహంబు పంటల నొసఁగుచుండె. వంగ పొట్ల బెండ దొండ బుడమదోస పెద్దదోస కాకర బీర సొర గుమ్మడి చెమ్మ చిక్కుడు గోఁరుచిక్కుడు మున్నగుశలాటలును చేమ గోగు జీవంతిని చుక్రిక మున్నగుదళశాకంబులును బెచ్చుమీఱె. పుష్పజాతులు మల్లెలు మొల్లలు జాదులు విరజాదులు సంపెఁగలు చేమంతులు మొగలి తెగలు పద్మములు కలువలు రంగురంగుల గన్నేరులు నందివర్ధనములు గరుడవర్ధనములు పారిజాతములు కదంబపుష్పములు కాంచనాశోకములు సువర్ణపుష్పంబులు తుమ్మిపూవులు మంకెనపూలు మున్నగు పుష్పంబులు వెల్లివిరియఁ బూయుచుండె. సకలఫలవృక్షంబులు ఋతునియమంబులేక యేప్రొద్దు ఫలించుచుండుటఁజేసి మెండుగబండి రాలినపండుల తీయనిరసంబుల పానకంబులు దొరలుచుండుటఁ జూచి కడుపునిండ మెక్కుచు నిక్కుచు రామచిలుకలు గోరువంకలు కోయిలలు మయూరంబులు మున్నగునవి పాటల నాటల నొనర్పుచుండె. తుమ్మెద లనవరతనిష్యందమాకరందబిందుసందోహపానంబులఁ బొట్టలునిండ నానందంబున ఝంఝుమ్మని ఝుంకారగీతంబు లొనర్చుచుండె. రాయంచలగుంపులు సరోవరంబుఁ జేరి తామరతూండ్ల నారగించి మధురోదకంబులు ద్రావి సరసి కలఝ్కారంబుసేయుచుండె. లేళ్ళమందలు హెచ్చుగఁ బెరిగియున్న పచ్చనిగరికెలను దర్భలను మేసి తీయనినీళులఁ ద్రావి చెట్లనీడలందు రోమంథంబు సేయుచుండె. గోగణంబులు పెచ్చుపెరిగియున్న తృణరాశిఁ భక్షించి బలిసి యీని క్షీరంబులఁ గలశంబుల నిండించుచుండె. ఇట్లు సర్వాలంకారశోభితంబై సంపదల మీఱియున్న నవ్వనంబందు మున్ను వలసపోయినవా రందఱు వచ్చి యాశ్రమంబులందుఁ జేరిరి. గౌతమమునిచంద్రుఁ డానందంబునఁ దనపర్ణశాలను బెంచి వచ్చిన యతిథుల కభ్యాగతుల కశేషజనంబుల కన్నదానంబు చేయుచుండె. అపుడు దవ్వుల నున్నవారలు గూడ నాకట మాడుచుఁ దల్లడిలుచు డీలువడి యీమేలిమివార్త విని ప్రాణంబుల నిలుపుకొనుటకై యాలుబిడ్డలను శిష్యజనంబును దోడ్కొని గౌతమాశ్రమంబునకు వచ్చి మేము మీతల్లి వేపు చుట్టముల మనియు మఱికొందఱు తండ్రివైపు బంధువుల మనియు

నెఱింగింపుచు ననేకులు గుంపులుగుంపులుగా వచ్చి చేరిరి. సదయుఁడగు గౌతమమునియుఁ దత్సతియు వారల నందఱ గారవించి సత్రంబందుబెట్టి విహితాన్నపానంబు లొసంగి ప్రత్యేకంబు పర్ణశాలల నిర్మించి యిచ్చి గౌరవింపుచుండిరి. ఇట్లు చాలకాలంబు జరుగగా నొకనాఁటి ప్రథమ యామంబున గౌతమముని స్నాతుండై నిత్యవిధులకై శిష్యులను బిలిచి పుష్కరిణీనీరంబులఁ దెమ్మని పంప నవ్వారు కలశంబులఁగొని పుష్కరి ణిని జేరిరి. వారలవెంటనే పర్ణశాలలం దున్న మునులభార్య లచ్చోఁ జేరి తప్పుకొనుఁ డోసరిల్లుఁ డని యదలించి సరోవరంబుఁ జేరిరి. గౌతమ శిష్యులు కులపతి యగు గౌతమముని స్నాతుండై యుటజంబున నిరీక్షిం చుచున్నవాఁడనియు వారియాజ్ఞచేఁ దా ముదకంబుఁ గొనిపోవ వచ్చితి మనియు నొక్కనిముస మందు ఱొక్కప్రక్కఁ జేరి యెడమిచ్చినఁ దీర్థంబుఁ గొనిపోయెద మనియు నుడివిరి. అంత నమ్మదవతు లెడమీ యక తొలఁగక యలుకతో నదలించి బెదరించి యేమి యిట్లనుచున్నారు? ఏమనుకొన్నారు? మ మ్మెవరినిఁగాఁ దలఁచినారు? మేము జలకంబులాడి నీళులఁగొనిపోవలయును. మీ రిందుఁబాసి దూరం బేగుడు. అట్లుచేయ కున్న మిమ్ము శిక్షింపఁజేయుదు మనిరి. అపుడు గౌతమాంతేవాసులు చేయునదిలేక యుటజంబున కేగి యట గురునిరాణి కావిధముఁజెప్పిరి. ఆయమ యంతఁ దాఁగలశంబుఁ పుచ్చుకొని సరసిం జేరి వేగిరంబుగ నుదకంబుఁ గొనిపోయి విభున కిచ్చె. గౌతమముని నిత్యానుష్ఠానంబు లొనర్చుకొనుచుండె. సరస్సునందలి మునులయాండ్రు గౌతమదేవి వచ్చి సత్వరంబుగఁ దీర్థంబుఁ గొనిపోవుటఁ జూచి యీరసంపడి కినుకంజెంది యహల్య మనల నెవ్వరిని జూడక పలుకరించక సరకుసేయక నిక్కుతో ధిక్కరించి యుదకంబుఁ గొనిపోయినది. ఎవ్వ రనితలంచినదో? ఇంత యలక్ష్యమా? మంచిది. కొంచముననే యీ మెపొగ రడంచెదము. అట్లు సేయకుండిన నేము మునికుటుంబినులమే! యని శపథంబుచేసి యుదకంబుఁ గొని యేఁచుచుఁ బర్ణశాలలకేగి పతులతో గౌతమదేవి తమను దిరస్క రించి యవమానించినదనియు మఱియుఁ గొన్ని యసత్యంబులను మేళ గించి చెప్పి యందులకై యామెకుఁ బ్రాయశ్చిత్తం బొనరింపకున్నఁ దా మసువులఁ బాసెదమని ఘొల్లుననేడ్చిరి. మునులంత యుడిపి యోదార్చి

ప్రతీకార మాలోచించెద మనిచెప్పి సమాధానపఱచిరి. అనంతర మవ్వాపుగూడ "మన్న యీనిన దన్న పాల నెవ్వరికి పోయవల"దన్నట్లు వివేకము విచారము కృతజ్ఞత యనునవి లేక ఆకలిమంటతోఁ బ్రాణ రక్షకులై వచ్చి యిందు మృష్టాన్నంబుల భుజించి తెప్పరిలి బలిసి యాలు బిడ్డలతో సుఖంబుగఁ గాలముఁ గడుపుచుంటి మను మాట లేక అన్న దాత యగు యజమానునకే కీడుసేయఁ దొరకొని సులభానుగ్రహుఁడగు గణపతినిగూర్చి యుపాసించిరి. విద్యలఁ బ్రౌఢులైనను శమదమంబు లొప్పి యుండఁదగిన మునులైనను ప్రాణరక్షణంబు చేసిన దాతకు వెనుదీయక నిట్లు మహాద్రోహంబు గురుద్రోహంబుఁ జేయుట కుద్యమించిరి. ఘాతుకు లకుఁ గూడనిపని యుండదు గదా! అంత వారి యుపాసనలచే గణపతి పొడసూపి యేమికావలయునని యడిగె. వారును జంకులేక యధర్మము నక గౌతమముని నీ వనంబునుండి వెడలింపుమనిరి. గణపతిదేవుఁడును జరిగిన సమాచారం బంతనెఱింగి విస్మయపడి పశ్చాత్తాపము నొంది యాక్రోశించి వారల కిట్లనియె. అక్కటా! యెట్టిమోరకులైన నిట్లు ప్రాణరక్షకులకు నిట్టి యన్నదాతల కిట్టియుపకారుల కింతటియుపకారంబు సేయుదురే? మీ రసూయపరాయణులు క్రోధమూర్తులు కృతఘ్నులై యిట్లు సంకల్పించితిరి.

శ్లో॥ జరారూపం హరతి హి ధైర్యమాశా
మృత్యుః ప్రాణా న్ధర్మచర్యామసూయా
క్రోధశ్శ్రియం శీలమనార్యసేవా
హ్రియంకామ స్సర్వమేవాభిమానః.

తా॥ ముసలితన మందమును ఆశ ధైర్యమును మృత్యువు ప్రాణములను అసూయ ధర్మాచరణమును కోపము సిరిని నీచసేవ యాచారమును కామము సిగ్గును అభిమానము సర్వమును హరించును.

(మహాభారతము ప్రజాగరపర్వము.)

మి క్షేమమనవలయును? ఇట్టిపాపబుద్ధిని మానుఁడు. వేఱొక్కఁ డడుగుఁ వారలు పట్టుఁబట్టి వేఱొకఁ డవసరము లేదనియు నదియే కావల

యుననియు తమదరిసెనము వృధా కాక మాయిష్టంబుఁ దీర్పవలయున నియు నిర్బంధించిరి. శ్రీగణపతిదేవుఁడును గినిసి వారిని దూషించి చివరకు వారలకు ఋణపడిన ట్లెంచి యట్లే చేయుదు. మీరలే యిప్పాపంబుఁ గుడుతురు. దయాళుండును ఆపద్బాంధవుండును మహాత్ముండు నగు గౌతమ మునీంద్రుఁ డిక్కతన నీయిక్కట్టునఁజిక్కి యొక్కింత కాలంబు వందురినను పిమ్మట నాపదను బాసి సుఖం బొందు. ఈయది యీ మహనీయునకుఁ బరిణామసుఖకారి యగునని యదృశ్యుం డయ్యె. మునులును సంతో షించిరి. గౌతమమునియుఁ దత్సతియును శిష్యులు నిమ్మునులకాపట్యం బెఱుంగక సంతోషంబుగనే యుండిరి. అంత నొకనాటిప్రథమయామంబున గణపతిమాయావిశేషంబున నొక్క బక్కయావు పండిన వరిచేను నడుమఁ బ్రవేశించి మేయుచుఁ ద్రొక్కుచుఁ దిరుగుచుండుటను జూచి గౌతమముని యొక పూరిపోచను వేసి యదలించె. అంత నా మాయపు గిడ్డి యఱచి అమాంతముకూలి ప్రాణంబుల విడిచె. అద్దానిఁ జూచి గౌత ముఁడు హా! పరమేశ్వరా! యని పెద్దయెలుంగునఁ గూయిడి యేడ్చె. ఉటజంబున నున్న దత్పత్నియు శిష్యులును వేగిరముగ నడలుచు నటకు వచ్చి యచ్చొప్పుఁ దెలిసికొని భోరున నేడ్చిరి. ఆ ధ్వని విని మునులును దద్భార్యలును వచ్చి చూచి మదులందు సంతసించి గౌతమముని నాక్రో శించి తిట్టి యోరీ! గోహంతకా! మహాపాతకీ! నీముఖముచూడరాదు. ఎట్టి ఘోరపాపం బొనరించితివిరా! పొమ్ము. కదలుము. నీ విచ్చట నుండ రాదు. పెండ్లముతో శిష్యులతో వడిగ నాశ్రమంబు విడిచి దూరంబుఁ జేరుము. నీ విఁక హవ్యకవ్యములకు దూరమైతివి. చేసినపాప మనుభవిం పుము. పొమ్మనుచు నాండ్రును బురుషులును రాళ్ళువిసరి కసరి గౌతమ దంపతులఁ గొట్టుచుఁ దరిమిరి. గౌతమఋషియును దద్గేహినియు శిష్యు లును దుఃఖించుచుఁ దలవంచుకొని యట్లే పోయెదము. దయయుంచుఁ డని దవ్వులకేగి యొకక్రోశమాత్రప్రదేశంబుఁ జేరి యం దొకపర్ణశాల నొనర్చుకొని యందుండిరి. మునులును దద్భార్యలును గౌతమదంపతు లకుఁ జక్కఁగఁ బరాభవం బైనదని యానందించిరి. గౌతముఁ డిట్లొక మాసంబుఁ గడపి యొకనాఁడు మునిజనాశ్రమము చేరువకు వచ్చి యెడముగ నిలిచి వా రందఱి నొక్కెడఁ జేర్పించి దోసిలియొగ్గి మహా

త్ములారా! నా యొనర్చిన యీపాపంబుఁ బాసి యే నెట్లు పునీతుఁడ నగుదునో యారసి యనుగ్రహించి సెలవీయుం డని ప్రార్థించి నంత నమ్మునులిట్లనిరి. ఓయీ! చేసిన పాపంబునకు నిష్కృతి సేయకున్న నద్ది యెట్లుపాయఁగలదు? నీవు చేసినఘోరాఘము సాధారణము గాదు. అందుచేఁ దగిన ప్రాయశ్చిత్తంబు నొడివెదము. వినుము. గోహత్య నొనర్చితి నని బిగ్గరగా నుడువుచు నీ భూమియంత ముమ్మారులు ప్రదక్షిణం బొనర్చి రమ్ము. అటుపై నొక్క నెల చాంద్రాయణ వ్రతంబు సేయుము. పిమ్మట నూటయొక్కమారు బ్రహ్మగిరికిఁ బ్రదక్షిణంబుచేసి మృణ్మయ లింగసహస్రంబు నర్చింపుము. అట్లైన నీదోషంబు శమించు. ఇఁక మఱొకపద్ధతి వినుము. ప్రతిదినము శివలింగములకుఁ బూజచేసి తపస్సొనర్చి శివశిరోజటాగ్రమున నున్న దేవగంగ నిచ్చోటికిఁ దెచ్చి తత్సలిలంబుల నఘమర్షణస్నాన మొనరింపు మట్లైన నీదురితంబు డిందు. శుభాప్తికై యనంతరము శివలింగకోటిని బూజింపుము. ఈ రెండు తెఱంగులందు నీ యిష్టం బెట్లట్ల నొనర్పుము. శక్తుండవైనచో నీ రెండు వ్రతంబుల ననుసరించి యొనర్పు మనుటయు గౌతము డోంకారంబు నుడివి యంగీకరించి వెడలి మునిజనోక్తంబుల నెల్ల నవలీలగ నతిసులభంబుగ నెరవేర్చి దివ్యగంగానయనంబునకై మహేశ్వరునిఁ గూర్చి నిష్ఠచేసి ప్రతిదినం బహల్యయు శిష్యులును పార్థివలింగసహస్రంబుల నిర్మించి యిచ్చుచుండఁ బూజించుచుండె. అంతఁ గారుణికాంతరంగుండును భక్తజనావనబద్ధకంకణుండగు శివుండు సాక్షాత్కరించి వర మడుగు మనియె. గౌతమముని సంతసముతో భక్తితో సాష్టాంగముగ మ్రొక్కి ఆది దేవా! నన్ను నిష్పాపు నొనర్పుమనియడిగె. అపు డా బాలేందుచూడామణి మందహాసంబుచేసి ముని కిట్లనియె.

ఉ॥ ధన్యుఁడవీవు మానికుల ♦ తల్లజ! పుణ్యుఁడవీవు పాపులౌ
నన్యులు నిర్జరులు వెలార్చి రిటు ♦ లక్కట! యక్కసుతో ననన్యసా
మాన్య! త్వదీయదర్శనస ♦ మాగతపుణ్యకృతిన్ బవిత్రమై
మాన్యతనొందు నీజగము ♦ మద్వచనం బెద నమ్ము నెమ్మిమై.

ఉ॥ వారలె గోఘ్నపాతకులు ♦ వారె కృతఘ్నగురుఘ్నపాతకుల్
వారలె ధర్మబాహిరులు ♦ వారలె కుత్సితగర్వ్యకర్మరుల్
వారలె ఘాతుకాగ్రణులు ♦ వారె నృశంసులు వారె జాల్ములై
వ్వారలు నిన్ను బుద్ధ్యనిటు ♦ వంచన చేసి కలంచిరో మదిన్.

(శివపురాణము)

అవ్వారి సాంగత్యముచే నెట్టివారును దూషితు లౌదురు. వారి పాపంబున కంతము లేదు. ధీరాగ్రణీ! ఇట్లు నీమదిన్ దెలియుము. ఇది యంతయు నీయాశ్రమంబుఁ జేరి నీచేఁ బోషితులైన మునులు తమ భార్యలచేఁ బ్రేరింపఁబడి యొనర్చిన ఘాతుకవృత్తంబు గాని యన్యంబు గాదు. నే దివ్యదృష్టి నొసంగెదఁ జూడు మని పరమేశ్వరుఁ డవలోకింపఁ జేసిన మునివర్యుండు చూచి యక్కజంబొంది పరమేశ్వరునితో నిట్లనియె. కృపానిధీ! వారు కించనులై యెట్లుచేసినను నా కది యుపకారమె యయ్యె. వారికృతంబున గదా బ్రహ్మేంద్రాదులకు దుర్లభం బైన నీ దరిసెనము నిట్లు పడసితి నని యానందించి చొక్కి యున్నంత సర్వేశ్వరుఁడు నీకిష్టంబైన వరమిచ్చెద నడుగుమనుడు గౌతముఁడు మహాదేవా! నన్నింకను గృతార్థు నొనర్పఁ బూని యుంటివి. అట్లేని నీశిరస్స్థలవాసిని యగు గంగ నీయాశ్రమంబున కొక్కింత జార్చి నా కొక్కని కేగాక యీ భూలోకంబున కంత కుపకారమొనర్పుము. సకలజీవులకు సుఖం బిచ్చి యానందింపఁజేయుము. అని ప్రార్థించిన పరమశివుఁడు దయాళుండై తథాస్తని యానిముసంబున నిజజటాజూటాంతర్గత యగు గంగను నియమించి జార్చిన నామె యంతనె స్త్రీరూపంబున బొడసూపి జాలుగ దిగుచుండ గౌతమమునీంద్రుం డుప్పొంగి యనేకభంగుల గంగాదేవిని వినుతించె. గంగయు గౌతమమునినిఁ గాంచి ప్రభునియాజ్ఞచే నరుదెంచితిని. వేగిరముగ మిమ్ము స్నాతులఁజేసి మీయాశ్రమంబును దడిపి మరల శివ శిరస్సును జేరెద ననిన గౌతముడు తలవంచి యొక్కింత చింతనొందె. శంకరుఁడంత గంగనుజూచి యట్లుకాదు. గౌతమాభిలాష ననుసరించి నీ వీ మన్వంతరకాలం బీభూలోకంబు నంద యుండి ప్రవహింపుచుండు మనియె. గంగాదేవి నీవును నిఖిలనిలింపు లిం దుండిన నట్లు యుందు ననియె. పరమేశ్వరుఁ డంగీకరించి గౌతమార్చితపార్థివలింగంబందుఁ జేరి త్రియంబ

కేశ్వరుఁ డనిపిలువఁబడుదునని యానతిచ్చె. దేవతలందఱును తల్లీ! బృహస్పతి సింహరాశిం జెందినపుడు మే మందఱము నీ సాన్నిధ్యంబందు నుందుము. తక్కినయపుడు స్వర్గంబున నుందుమని యొప్పించిరి. గంగయు శివశాసనంబున ననుమతించి మహానదీరూపంబుతో బ్రహ్మగిరియందలి యౌదుంబరతరుశాఖానిర్గతయై గౌతమి యనుపేరునఁ బ్రవహించె. గౌతమముని మురిసి తానును బత్నియు శిష్యులును గంగయందవగాహనంబు లొనర్చిరి. వలసమును లీవార్తవిని సంబరంబుతో నటకుఁ గుటుంబముతో స్నానంబుసేయవచ్చుటఁ గనుఁగొని గంగాదేవి యీ కృతఘ్నులగు ద్రోహుల తాకు నే నోర్వ నని యదృశ్యయయ్యె. వచ్చినవారలు జుగుప్సతో వెనుకకుఁబోయిరి. అంత గౌతముఁడు మరలఁ జిన్నబోయి యామెను వినుతించిన దయాళువగు నాస్వర్గంగ కొంతదూరంబున నుదయించి మరల ప్రవహించె. గౌతమమునిచంద్రుఁడు దివ్యసూక్తుల నామెవైభవంబు గానంబుచేసె. అపుడు గౌతమశిష్యులు పట్టరాని కోపావేశంబుచే గౌతముఁడు వాదించుచున్నను నుడుగక వలసమునిబ్రువుల నీక్షించి మీకన్నఁ గృతఘ్నులు లోకంబం దెవ్వరుందురు ? మీరిఁక శివభక్తికి శివపూజనంబున కర్హులు గాక గర్భదరిద్రులై యాచకులై విభూతికి దూరంబై యామ్యదిశను జేరి పాపం బనుభవింతురుగాత! యని సెపించిరి. ఆమును లంతఁ గించనొంది తమ రొనర్చిన పాపకార్యంబునకు మనంబులందు నిందించుకొనుచుఁ దలలు వంచికొని వేగిరంబందుఁ బాసి దక్షిణదేశంబుఁ జేరిరి.

శ్లో॥ మిత్రఘ్నశ్చ కృతఘ్నశ్చ యతో విశ్వాసఘాతుకౌ
తా వుభౌ నరకావాసౌ యావత్సూర్యేందుతారకం. (కాళిదాసకవి)

తా॥ మిత్రున కపకారము చేయువాఁడును మేలుమఱచి యపకారము చేయువాఁడును విశ్వసఘాతుకులు గావున వా రిద్దఱును సూర్యచంద్రులును నక్షత్రము లుండువఱకు నరకమున నుందురు. గౌతమమహర్షియుఁ దత్సతియు శిష్యులును గౌతమీతరంగిణీనీరంబులందు స్నాతులగుచు శివలింగార్చనంబు సల్పుచు నవిరతశివానందంబు నొందుచు నవసానంబందుఁ బరమశివసాన్నిధ్యంబు నొంది మోక్షంబు నొందిరి.

# 7. దధీచి పిప్పలాదమునులు

శ్లో॥ విశ్వంభరాత్మక! బిభర్తి విభో౽త్ర విశ్వం
కో విశ్వనాథ! భవతో౽న్యతమ స్తమోఽరే!
తద్ త్వాం వినా నశమినాం హిమజాహిభూష
స్తవ్యోపరః తరపర! ప్రణుతి స్తతస్త్వాం.

తా॥ ఓభూస్వరూపుఁడా! ఓవిభూ! ఓవిశ్వనాథుఁడా! ఓతమోరీ! ఓపరాత్పరా! నిన్ను వినాచేసి శమముగలవారలకు యోగులకు స్తోతవ్యుఁ డెవఁడుగలఁడు? హైమవతీదేవిని సర్పములను భూషణములవలె ధరించినట్టి నీకుఁ బ్రణుతుఁడ నగుచున్నాను.

మున్ను మహేంద్రుండు వృత్రాసురున కోడి స్వర్గంబుఁ బాసి దేవతలతోఁ బద్మగర్భుని జేరఁబోయి దైన్యంబుతోఁ బ్రతీకారం బర్థించుటయు నావిధాత యోజించి శివభక్తాగ్రేసరుఁడగు దధీచిమహాముని శివానుగ్రహంబున వజ్రమయాస్థుల నొందెననియు మీ రాయనఘుని యొద్దకేగి యర్థించిన నమ్మహాత్ముఁ డాత్మదేహంబు సమర్పించుననియు నం దమ్మునినాథుని వీణాదండాస్థివజ్రంబును నాయుధంబు చేసికొనిన వృత్రాసురుఁ డొక్కఁడేకాక సర్వరాక్షససంహారసాధకంబగు నాయుధంబగు నని చెప్పె. అంత నిందుప్రముఖ నిలింపులనెల్లఁ దోడ్కొని దధీచ్యాశ్రమంబున కరిగి యవ్వారి తపస్సమాధిసన్నివేశంబుఁ జూచి యద్దానినుండి యవరోహణంబు సల్పెడువఱకచ్చట నిరీక్షించుచుండిరి. కొంతప్రొద్దు కామహర్షి తపోయోగంబునుండి మరల బహిఃప్రపంచంబు నిరీక్షించుటయు వేల్పులెల్లఁ జేరి సాగిలఁబడి యభయం బర్థించిరి. మునిచంద్రుండు వారలఁ బరికించి మహేంద్రుండు మున్నగు దివౌకసులగుట నెఱింగి సముచితార్ఘ్యపాద్యంబుల నొసంగి యేణాజినంబులందుఁ గూర్చుండ జేసి కుశలం బడిగి యిష్టం బేదియో చెప్పుమనియె. దేవరాట్టప్పు డంజలియొంది వృత్రాసురుం డేచి దివిషద్వర్యుల నెల్లఁ బీడించుటయుఁ బా మవ్వానిఁ జెనకుట కశక్తులగుటయు స్వర్గం బవ్వాని కధీనంబగుటయుఁ దెల్పి యీ విపత్తిని బాపుటకై తమ్ముఁజేరితి మనియు

దయాసముద్రులగుతా మట్లుపకారం బొనరించి యిందఱను గాపాడవల యుననియు వేడిరి. అంత నా మునిభాస్వంతుండు వారలమంతనం బెఱింగి తనయింటిని గొంతదవ్వులనున్న తనదుబంధుగుల నెలవునకుఁ బోయి రమ్మని పనిచి మరల వేల్పులఁ జూచి యిట్లనియె. ఐన నిపుడు తమకు నే నేమిసేయవలయుఁ జెప్పుఁ డనిన వార లిట్లనిరి. పాశుపతశిరోమణీ! ఈమూరక్షణంబునకై నీదుశరీరంబు నర్థించి వచ్చితిమి. దయాళుండవై యిట్లిమ్ము. నీ యస్థు లెల్ల వజ్రమయంబులు. వాని నాయుధంబులుగ గ్రంథించుకొని తత్ప్రయోగంబున దానవుల సమయించెదము. ఇది దైవచోదితము. నీ యనుగ్రహ మనిన మునీంద్రుఁ డంతరంగంబున సంతసించియు మందహాసంబుతో వారలఁ జూచి, తమమేలునకై గొరులఁ జంపుటఁ బాడియగునా? యని ప్రశ్నించెను. త్రిదశు లపుడు మునిజ నాగ్రణీ!

శ్లో॥ ఆతురస్య కుతో ధర్మః। అధనస్య కుతస్సుఖం.

తా॥ పీడింపఁబడుచున్నవానికి ధర్మ మెట్లు? ధనములేనివానికి సుఖంబెట్లు.

ఇఁక దాత యగువానికి నొకఁడీయకుండునట్టిది లేదు. మీఁద మీ చిత్తం బనుటయు మునివర్యుం డంతరంగంబున నెవనిజన్మము యాచకుని హృదయేప్సితమునకు పూరణముచేయుటకు (ఇచ్చుటకు) చాలదో వాని చేత భూమి చాలబరువుకలది యగును. అట్టిబరువు భూమికి కొండలచే మానులచే సముద్రములచేతను గాదని మనంబున నెఱింగి యుండుటను 'ఓ' మని యంగీకరించి యోగంబున బ్రహ్మరంధ్రమునుండి ప్రాణంబులఁ బాసి యాత్మంబును బరమాత్మానుసంధానం బొనరించె. మహేంద్రుండు మున్నగుదేవ లంత జేజేనినాదంబు లొనరించి తదక్షణంబునం దా దేహంబు నసిచే ఛేదించి యస్థులను వేఱుచేసి కామధేనువుం బిలిచి యామెదుగ్ధంబుల నవ్వాని నెల్లఁ గడిగి శుద్ధం బొనరించి శతారం బగు వెన్నెముకను సుతారముండును నల్లాస్థులఁ దక్కినవారలును నొందిరి. అంత మునివర్యునిదేవి యగు సువర్చల చనుదెంచి విభునిలేమియు రక్తంపుమడుగులను ఛిన్నభిన్నములైన నాథుని యవయవంబులను జూచి దివ్యుల యకార్యంబుఁ దెలిసికొని మిక్కిలి దుఃఖించి వారల నించుక మందలించుచు నిట్లనియె.

ఉ॥ తేరగవచ్చె వజ్రమయ ♦ దివ్యతరాయుధముల్ సుపర్వ లీ
తీరుగ నెవ్వరేని మునుఁ ♦ దెంపునఁజంపిరె ? హానివర్యులన్
మీర లెఱుంగరే ? వెరవు ♦ మీఱటి యొనర్చితి రిట్లు మీరు మీ
వారలు సౌఖ్యమొందఁ బెఱ ♦ వారలు సచ్చిన నేమగున్ జుడీ !

(శివపురాణము)

ఇట్లు వారలతో నని తానుగూడ మగనితోఁ జిచ్చుటికి బ్రహ్మ పదంబుఁ జేరఁ బూని వనకాష్ఠంబులఁ బేటిచి చిచ్చొనరించి యవశిష్ట శల్యంబుల నందుఁ జేర్చి తా నందుఁజేరందలంప నాకసంబునుండి దివ్య భారతి యిట్లనియె. సతీమణీ ! సాహసింపకుము. నీ యుదరంబున మహర్షి తేజంబు కుమారుం డున్నవాఁడు. మఱియు నాతండు శివావతారంబు. కావున నీ విపు డీమరణయత్నంబును మానుము. ప్రసవానంతరమున నెర వేర్ప మనుటయు నా యమ్మ యాలకించియు న ట్లిష్టపడక యొకశిలం దెచ్చి కడుపును మోదుకొన నంతనే ప్రభాకరతుల్యుండగు బాలకుఁ డుదయించె. అంత నా పరమపతివ్రత పుత్త్రుఁ జూచి యానందించి విభునియొక్కయుఁ దనయొక్కయుఁ బ్రయాణంబుల కించుక వనరి మనం బును గట్టిచేసి పిల్లవాని నొక రావిచెట్టునీడను జేర్చి యందు వసింపుమని పంచభూతములకు సూర్యచంద్రులకుఁ బరమేశ్వరునకు రక్షింపుఁడని చెప్పి బాలుని ముద్దాడి స్తన్యంబిచ్చి తాఁ జిచ్చుటికి దివ్యదేహయై పతితోఁ బారమేశ్వరధామంబుఁ జెందె. అంత విధాత దరిసి బాలునిఁ జూచి మురిసి పిప్పలదళఫలంబులఁ బాపని కాహారంబగున ట్లొనరించి పిప్ప లాదుండని నామకరణంబుచేసి యాశీర్వదించి చనియె. బాలుండట్లు పిప్పలకిసలయఫలంబుల భక్షించుచు వృద్ధిచెంది చిరకాలంబు తపింపు చుండె. బాల్యయౌవనదశలంతఁ దపంబుతోడనే కడచె. అనంతర మొకనాఁడు పుష్పభద్రానదీతీరంబందు నడచుచు నుషఃకాలంబున స్నానార్థమై నదినిజేరె. అప్పటికి దైవవశంబునఁ దత్తీరనగరి నేలు ననరణ్యమహారాజునకుఁ బుత్త్రి యైన పద్మ యను పదియాఱేడులకన్య దాసీశతంబుతోఁ జేరి జలకంబాడుచుండె. మునీంద్రుఁడు స్నాతుఁడై తడి వస్త్రంబులతో నున్న యామందంపురాచపడుచును జూచి చేతోజాత

బాణపాతంబులకు గురియై ధైర్యంబుఁగరగి యామెదాసి నొకదాని బిలిచి యాపెజన్మంబుచరిత్రం బడిగె. అపు డది జోతచేసి యిట్లుచెప్పె. మునికులతిలకా! ఈబాల ఈదేశంబేలుచున్న యనరణ్యామహారాజు కూతురు. పద్మయనుపేరిటిది. కన్య. సద్గుణనిధి. ఈమెకుఁ బెండ్లి చేయుటకై జనకుఁడు వరాన్వేషణంబు సేయుచున్నాఁడు. నేఁటిప్రభాతమున స్నానార్థమై మాతోడ నీపుష్పభద్రను జేరినదనియె. మునీంద్రుఁడు రాతనయకు బెండ్లి గాకుండుటకు గరంబుఁ బ్రమోదంబునొంది స్నానము సు ముగించి యవ్వారలవెనువెంట నగరిఁజేరి రాజాస్థానంబున కేగె. రాజవర్యుండు దవ్వులనుంచియే మునివర్యునిరాకఁ జూచి సింహాసనంబు డిగ్గి వినతుండై యెదుర్కొని సముచితార్చన నొనరించి బంగరుపీఠంబు నందుఁ గూర్చుండఁజేసి కుశలంబడిగె. పిప్పలాదమునియు రాజచంద్రుని సంభావించి దీవించి తత్సుతయగు పద్మాదేవిని దనకిచ్చి పెండ్లిసేయుమనియు నట్లీయకున్నఁ దనకోపాగ్నికిఁ బాత్రుఁడవగుదువనియె. వీనులకినుపసలాకలు గ్రుచ్చినట్లు మిక్కిలి తీక్ష్ణంబులైన మునివచనంబుల కదరి బెదరి బదులాడుటకు నోరాడక చింతాసాగరంబునంబడి పారమొందక కుందుచు మిన్నకున్న దొరను గాంచి మంత్రిహితసామంతపురోహితజనంబు లెల్లరును విచారంబున మునిగి నిశ్చేష్టులై యుండిరి. ఇవ్వార్త కంచుకులచే శుద్ధాంతంబునకుఁగూడఁ జేర్పఁబడుటయు నందు రాజపత్నులందఱును దత్పరిచారికలుగూడ దుఃఖంబున వగచుచుండిరి. ఇట్లు తెన్నుఁగానక వారందఱు విచారించుచుండ నచ్చోటి కపుడొక మేటియగు మునివర్యుండు దారసించి వారల పూజల నొంది యవ్వారి విచారకారణం బారసి యభ్భూమిపతికిట్లనియె. ధారుణీశ్వరా! ఏటి కిట్లరయక చింత చేసెదవు? "అర్థోహి కన్యా పరకీయ ఏవ" కన్య ఇతరులసొమ్ము. నేఁడేనియు మఱొకనాఁడేనియుఁ గన్య నన్యుల కీవలసినదియే. అట్లగుట నిమ్మహాముని పూజనీయుఁడు. కడుఁగడు తపోధనుఁడు. తృణమును మేరువుగను మేరువును దృణంబుగను జేయఁజాలిన బల్లిదుఁడు. భార్గవవంశపావనుఁడు. నీవిఁక సందియంబుఁ బాసి వేగిరమ నీ తనయ నీ యనఘున కిచ్చి యుద్వాహంబుచేసి నీకులంబు నుద్ధరించుకొనుము. నిన్నును నీవంశంబును నీరాష్ట్రంబును గాపాడుకొనుము. శ్రేయంబు లందికొనుము. అనుమానింపకు

మని వక్కాణించె. తత్కాలమందే ఆత్మపుత్త్రి యగు పద్మాదేవి యాయుదంతం బంత విని తన కా మహామునియే యభీష్టవరుఁ డనియు జాగుసేయక త న్మామహనీయున కిచ్చి వివాహముసేయుమని గట్టివాలు పొలఁతులతో జనకునకుఁ జెప్పియంపె. పుడమిఱేఁ డంత నడలుమాని యెడదను దృఢముచేసి పురంబును మితంబుగఁ గై సేసి యమ్మఱునాఁడే శుభముహూర్తంబునఁ బుత్రిని బిప్పలాదముని కిచ్చి పెండ్లిచేసె. పిప్పలాదముని పద్మను బెండ్లాడి రాజార్హంబులగు దుకూలాంబరభూషణంబులఁ దొలిచివైచి వల్కలాజినంబులఁ దాల్పఁజేసి నిజాశ్రమభూమికిఁ దోడ్కొనిపోయి యం దనతిలంపటుండై గృహస్థధర్మంబం దుండి యథాపూర్వంబుగఁ బరమశివుని బూజించుచుండె. అంత నొకనాఁ డామునిభామిని స్నానార్థమై భాగీరథి కేగి యందుఁ దీర్థం బాడుచుండ నామె శీలంబుఁ బరీక్షింపఁగోరి ధర్మదేవత యొక లేఁబ్రాయఁపు రాచకొమరుఁడై యుత్తమాశ్వయుక్తంబగు నొకపసిండిరథం బెక్కి యన్నదీతీరంబుఁ జేరి యం దమ్మునిరాజ్ఞిని జూచి సమీపించి యామె కిట్లనియె. సుందరీ! నేనెందఱనో యందంపుటిందుముఖులను జూచితిని గాని యెందును నీచందంబుగఁ బసందైన చందనగంధులఁ గనులనొంద లేదు. ఇందు సందియము లేదు. ఇందీవరాక్షి! ఇఁక మందెమేల? మేల ఇం దిందిరంబులకు విందుసేయుచున్న నీ వికసితకుందబృందలతామందిరంబందు నీదువిం దొసంగి నాదువందనంబు లందికొనుము.

చ॥ కడుముదుకై రుజఁబడలి ♦ కాటికిఁగాళ్ళను జాచి యున్నన
వ్వెడగుమునిఁ దగఁ గొలువ ♦ వేడుక లేమిటనబ్బు నీకు నేఁ
బుడమిదొరఁ రతిప్రియుఁడ ♦ భోగసమర్థుఁడ నర్థినైతి నీ
కెడపక నాకురాణి వయి ♦ యెల్లసుఖంబులఁగొన్మ కోమలీ!

మ॥ తనువత్యంతము భంగురం బలతి యీ ♦ తారుణ్య మద్దానిలో
ఘనపుణ్యోదయ మిట్టిచక్కదన మీ ♦ కాంతారభాగంబులో
ననుప్రేమించి మనోజభోగముల నా ♦ నందోన్నతుల్ మీఱఁగాఁ
దనివిం జెంది భవజ్జనిం గడిమిమై ♦ ధన్యంబుగాఁ జేయుమా!

మ. సొగసుల్ గుల్కెడు కల్కులెక్కుడుగ నా ♦ శుద్ధాంతమం దుండి రా
మకుకల్ నీ చరణంబులొత్తుచు నినున్ ♦ మన్నింతు రేప్రొద్దు లి
మ్ముగ నీయిష్టమువచ్చిన ట్లనిశముం ♦ భోగింపుమీ! యింపుమై
తగ దీ మానిని బాసి న న్ననయుమీ ♦ తస్వీశిరోరత్నమా!

శివపురాణము.

అని యిట్లుతండు మీఱుచున్న తమకంబుతో రథంబు డిగ్గి విరిం బోలి సొడసి పట్టుకొనుటకు డాయుచున్నం గాంచి యక్కాంచన కేతకీ కుసుమగాత్రి దవ్వులకుంజని నిలిచి యదలిచి నాగుంబాముపడుపున రోజుచుం జురచురంజూచుచుం గినుకతో నిట్లనియె.

శా. సారంబేగుము దూరమేగుము శఠా! ♦ దుష్టాత్మ! రాజాధమా!
చీరంజేసెద నిన్ను ముక్కలుగ నా ♦ శీలాసిచే నన్యకాం
తారక్తుండవు పాపసక్తుడవు నా ♦ నాథుం జగద్వంద్యు తే
జోరింఛోళిసనాథు నాడెవవె లో ♦ చ్చుల్ పిప్పలాదుం ఘనుం.

శివపురాణము.

ఓరీ! నే వాఙ్మనఃకాయంబులం బతివ్రతనాదునేని నీవీయావనంబును సౌందర్యంబును గోల్పోయి క్షయరోగంబును జెందుదువుగాక! సూర్యచంద్రులు వ్యతిరేకభావంబు నొందినను నాశాపవచనంబు సత్యంబగుంగాత! యని శపించుటయు విని ధర్ముండు వడలి యంతనే క్షత్రియ భావంబును బాసి నిజరూపం బొంది నిలిచి యమ్మునిరాణి కిట్లనియె,

ఉ. తల్లి! యనుగ్రహింపఁదగు ♦ ధర్ముఁడ నేను నృపుండ గాను నీ
యుల్లము నారయంగ నిటు ♦ లుద్యమమూని యెఱింగి మెచ్చితిం
జెల్లుబడౌ తెఱ నెప్డు పరదారలఁ ♦ గన్గొనువాఁడ నేఁడిటుల్
చెల్లని చెయ్విఁబూని యిటు ♦ శిక్షను జెందితి నర్హరీతిగాఁ.

శివపురాణము.

అమ్మా! చెడుదారినడచువారి కిట్టే ఈశ్వరుండు శిక్షను గూర్చుచుండును. సత్పథంబున నడచువారికి మేల్గూర్చుచుండును. ఎవండు కలిమిలేములను సుఖదుఃఖములను జనంబుల కొచితి నెఱింగి చెందించునో నీటియందు శైత్యంబును నగ్నియందు వేడిమిని బాలయందు మాధుర్యమును

నియతంబుగ నెవ్వండు చేర్చి యుంచెనో మహదాదిపదార్థకారణం బగు నవ్యక్తం బెవనికి లోఁగియుండునో మూఁగురుమూర్తుల కెవఁడు మూల కారణమో అట్టిపరమాత్మ యగు పరమశివుండు నా దురితంబుల హరింపుటకై యంజలిఁబట్టి మొ్రిక్కెదను. అని తన యనుచితకృత్యంబునకు మనంబం దనుతాపంబు నొంది యత్యంతంబు భయంబును సిగ్గును జెంది తలను వంచి వనరుచున్న ధర్మదేవుని జూచి యా తాపసేశ్వరి పశ్చాత్తప్తయై యిట్లనియె. మహాత్మా! నన్ను బరీక్షింప నెంచి నీ విట్లకృత్యంబు నవలంబించుటను నేను గుర్తింపనైతిని. స్త్రీజనస్వాభావికం బగు చాపలంబున నిన్నెఱుంగక బన్నంబు లాడితిని. శాపంబుబెట్టితిని. నీవు ధర్మంబును నాల్గుపాదంబులను నడిపించుపుణ్యమూర్తివి. ఇట్టి నిన్ను శపించి నేను ధర్మలోపంబుఁజెందితిని. నాదుశాపమ్ము వమ్ముగాదు. కోపావేశమ్మతో నట్లంటిని. ఇపుడేమిసేయుదును? నీ మనఃపారిశుద్ధ్యంబు నెఱింగితిని. ఐన నొకకట్టుబాటు చేయుదు నారయుము. ఎల్లజగంబులకుఁ జల్లినయొసఁగు చందురుం డెట్లు మాసమాసంబు క్షయం బొందియు మరల నద్దానిబాసి తేజంబుల నొందునో నీవు నట్టే వ్యవస్థతో క్షయంబుఁ జెంది పాయుచుండుము. శాశ్వతంబుగ నీకు క్షయంబగునేని జగంబునకే క్షయంబమరు. వృషభదేవా! ఆ వ్యవస్థను దెలిపెదను. వినుము. కృతయుగంబునందుఁ బాదచతుష్టయంబుతో నుండి త్రేతాయుగంబందుఁ ద్రిపదుండవై ద్వాపరయుగంబునఁ ద్విపదుండవై కలియుగంబున నేకపాదుండవు గమ్ము. తద్యుగాంతంబందు మరలఁ బదచతుష్టయంబు నొందుము. తపోజ్ఞాన ధర్మశౌచంబులందుఁ ద్రికంబు క్రమంబుగ బ్రజలకు క్షీణంబై మరల మహాయుగాదియందు సంపన్నంబగు. ఇది విధిచోదితమై నీయం దిట్లేర్పడినది. పొగలకు. ఓగిమినొందుము. ఇక నేఁ బతిదేవుని సేవింపఁబోయెదను. సెల విమ్మనుచుండ నా సాధ్వీలలామకు మరల ధర్మదేవుం డిట్లనియె. అమ్మా! సంతసంపడితి. శుభమస్తు. వరములిచ్చెదఁ గొనుము. నీవిభుఁడు ముదిమిఁబాసి శాశ్వతయౌవనంబును దివ్యసుందరరూపంబును దార్ఢ్యంబును భాగ్యంబును వాఙ్మాధుర్యంబును జిరాయుష్యంబును జెంది నిన్ననవరతంబుఁ బ్రేమించుచు నిష్టసుఖంబులఁ దనుపుఁగాత! నీవు నిచ్చలు యువతివై అనుపమభోగభాగ్యములఁదనిసి దశపుత్రులఁ బడసె

దప్పు. పతివ్రతాతిలకమా! సెలవు. అని వరములిచ్చినంతఁ బద్మాదేవి ముదిసి భక్తిభావంబుతో ధర్మదేవునకుఁ బ్రదక్షిణముచేసి మ్రొక్కి యాశ్రమమునకుఁ బోయి యత్తెరంగంత నాథునకుఁ దెల్పిన నతండు యోగదృష్టి నద్దియంత నారసి ప్రీతుండయ్యె. ధర్మదేవుండును బతివ్రతాచరిత్రంబు నభినందింపుచు యథేచ్ఛఁజనియె. ధర్మదేవునివర ప్రకారంబుగఁ బిప్పలాదుండు లేఁబ్రాయపురూపసిమై భాగ్యంబు లొంది పెక్కేండ్లు పద్మాదేవితో భోగసౌఖ్యంబు లొంది దశపుత్త్రులఁగని వారలఁ బెంపుచేసి యుద్వాహంబు లొనర్చి తిరుగఁ దపించుచుండె. విజ్ఞాననిధియగు నమ్మహాత్ముని సన్నిధానంబుఁ జేరి పలువురు మునితనయులు తత్త్వసంశయంబులఁ దీర్చుకొనుచుండిరి. కొందఱు మునిపుత్త్రులొకప్పుడు సమిత్పాణులై పిప్పలాదమునిని దారసించి మ్రొక్కి జిజ్ఞాసులై నిలిచిరి. అందు సత్యకాముఁడనువాఁ డిట్లు బిప్పలాదమునినడిగెను. ఓపూజ్యుఁడా! మనుష్యులలో నాయుఃపర్యంత మోఙ్కారధ్యానంబు సేయువాఁ డేలోకంబును జెందునో చెప్పు మని యడిగెను. పిప్పలాదుండు సత్యకామున కిట్లనియె. ఏకారణముచే ఓంకారము పరమాత్మ మగు సదాశివునిస్వరూపముగను ఆ సదాశివపరమాత్మము జీవాత్మస్వరూపముగ నున్నదో ఆకారణముచేత ఈ ప్రణవధ్యానము సేయువాఁడు పరాపరములలో నొక్కదాని నొందును. ఆప్రణవోపాసకుఁ డోఙ్కారమం దేకమాత్రగనున్న అకారమును ఋగ్వేదమును ధ్యానముచేసినఁ దక్కఁగ బోధింపఁబడినవాఁడై భూమియం దుత్తమమనుష్యుఁడై పుట్టుచున్నాఁడు. రెండవమాత్రమైన ఓఙ్కారస్థితమగు ఉకారమును (యజుర్వేదమును) ధ్యానించువాఁ డంతరిక్షమునందలి చంద్రలోకంబు నొందుచున్నాఁడు. ఎవఁడు ఓఙ్కారమును అకార ఉకార మకారములను మూఁడుమాత్రలతోఁగూడినట్టి ఓఙ్కారమును సామవేదమును సూర్యమండలాంతర్వర్తియగు పరమాత్మస్వరూపమును ధ్యానించునో వాఁడు సూర్యతేజస్సంపన్నుఁడై సర్పము కుబుసంబును విడిచినట్లు పాపవిముక్తుఁడై సామవేదసామర్థ్యంబుచేత బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు. ఇట్లు బ్రహ్మలోకము నొందినవాఁడు పరమాత్మమును జూచుచున్నాఁడు. ఓఙ్కారమందలి అకార ఉకార మకారంబులు మూఁడుమాత్రలును

మృత్యువుతోఁ గూడినవి. అట్టి మృత్యువుగల మాత్రలను ఏకము ఓఙ్కారమును గావించి పరమాత్మధ్యానమందు సంధానించినయెడల మృత్యురోగము లేని అమృతత్వ మగుచున్నది. ఎవఁడు మాత్రాత్రయంబును జక్కఁగ నెఱుంగునో అతఁడు జాగ్రత్స్వప్నసుషుప్తికాలములందుఁ జలింపక యుండును. ఋగ్వేదముచేత మనుష్యలోకంబును యజుర్వేదముచేతఁ జంద్రలోకమును సామవేదముచేత బ్రహ్మలోకమును బొందించునట్టి ప్రణవస్వరూపము నేవిద్వాంసుఁడు తెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడు జాగ్రదాద్యవస్థలను భయమును ముదిమిని మరణమును లేని శాశ్వతమును సత్యస్వరూపమును అమృతమయమునగు పరబ్రహ్మమును బొందుచున్నాఁడు. ఈ ప్రకారము ఋషిపుత్రులందఱును బ్రహ్మజ్ఞుఁడగు పిప్పలాదమునిని దమసంశయంబు లడిగి తెలిసికొని యానందించి గురుండగు పిప్పలాదఋషికి నమస్కరించి యజ్ఞానమునుండి తరించి పరమేశ్వర సాక్షాత్కారంబు నొందిరిది దధీచి పిప్పలాదమహర్షుల చరిత్రము.

# 8. మార్కండేయ మహాముని

శ్లో॥ ఆత్మస్వరూప! తవరూపపరంపరాభిః
రాభిస్తతం హర! చరాచరరూపమేతద్
సర్వాంతరాత్మనిలయ! ప్రతిరూపరూప!
నిత్యంనతోస్మి పరమాత్మజనోష్టమూర్తే॥ స్కాందకాశీఖండము

తా॥ ఓ ఆత్మస్వరూపుఁడా! ఓహరుఁడా! ఈనీరూపపరంపరలచేత నీచరాచరప్రపంచమంతయునిండినది. ఓసర్వాంతరాత్మనిలయా! ఓప్రతిరూపమునకురూపమైనవాఁడా! ఓపరమాత్మమూర్తీ! ఓయష్టమూర్తీ! నీకు శాశ్వతము నతుఁడనగుచున్నాను.

తొల్లి హిమాచలప్రాంతమందొకపుణ్యవనంబందు మృకండుఁడను మహామునియును దత్సతి యగు మరుద్వతీదేవియును నివసించి యుండిరి. వా రిద్దరు ధర్మనిరతులు సత్యతత్పరులు అతిథిగోదేవపూజాసక్తులు సర్వభూతహితులు. శిష్యులను గన్నబిడ్డలయట్లు గనికరముతోఁ జూచికొనుచుఁ దపోవ్రతంబు ననుష్ఠింపుచునుండిరి. వారి కేలాగో సంతతి గాకయుండె. ఐనను వార లేమియుఁ జింతసేయకయే పరమేశ్వరుని గొలుచుచుండిరి.

ఒకనాఁ డమ్మునివర్యుండు బంగరంపుకొండయందలి పై తామహానగరిని జేరి యందు బ్రహ్మసభకుఁ జేరఁబోవుచుండ నందు ద్వారంబుఁగాచుచున్న ద్వారికపలా మహాత్ముని దరిసి మహాత్మా! మీకుఁ బుత్రు లెందఱని యడిగిరి. ఆమహాముని యట్టిభాగ్యము తనకుఁ జేకురలేదనియె. అపు డవ్వారప మహాత్మా! బ్రహ్మసభ కీవు చేరుట కనర్హుఁడవు. ఈవిధాతృభవనమును సంతులేనివారు చేరఁదగరు. కావునఁ దా మిటనుండి మరలి పొండనిరి. మునిచూడామణి చిన్నవోయి మరలి తనయాశ్రమంబును జేర వచ్చుచుండె. ఇటనమ్మునియాశ్రమంబునకుఁ గొందఱు విదేశమునీశ్వర భార్యలు యోగినులు వచ్చి మృకండుపత్నియగు మరుద్వతిని సమీపించిరి. మరుద్వతియు సంతసంబున వారి నెదుర్కొని తోడ్కొని వచ్చి యుచితపీఠంబుల నిచ్చి కూర్చుండఁబెట్టి సత్కారంబులొనర్చి భోజనము కొఱకుఁ బంచభక్ష్యాన్నంబులఁ బాత్రలందు వడ్డించెను. వారలు మరుద్వతితో నీబిడ్డలను బిలువుము. వారును మేమును భుజించెద మనిరి. మరుద్వతి అమ్మలారా! నే నట్టినోము నోచలేదు. తాము దయతో నన్నంబు లారగింపుఁడు. తా మిటకువచ్చి నన్ను ధన్యనొనర్చితిరి. వందనంబు లొనర్చెదను. అనుగ్రహించి భుజింపుఁ డనుటయు వారందఱు పరస్పరం బరసికొని బాలురు లేనట్టి యింట మే మన్నంబుముట్టమని పీఠంబుల నవలికిఁ ద్రోచి వెడలి పోయిరి. మరుద్వతియు మదియందుఁ గడుఁ గడు నొచ్చి దుఃఖముతోఁ బొగలుచుండె. అంత మృకండుమౌని స్వాశ్రమమునకు వచ్చినంతఁ జింతతో మరుద్వతి యపుడు జరిగినయందంతంబంతఁ గాంతునకుఁ దెలిపి మిక్కిలిసంతాపంబు నొందుటయుఁజూచి మునివర్యుండు దనకు బ్రహ్మలోకంబందు జరిగినపరిభవం బంతయుఁ దనయింతికిఁ దెలిపె. అంత నామునిదంపతులు గొంతతడవు దుఃఖంబునఁబొగలిరి. మృకండుఁ డంతపైని నాత్మదేవిని జూచి కొండొకతేపువర్ణబడసి యూఁపెకిట్లనియె. దేవి! వనరకు మింక భగవానుఁడు శంకరుఁడు కలఁ డతఁడు దయాళుఁడు. భక్తాభీష్టప్రదుఁడు. ఆఘనుని గుఱించి నే గాటంబగు తపం బొనరించి సుపుత్త్రుని బడసెదను. నీ వింకఁ బ్రమోదంబు నొందుము. మున్నా రాజమూర్ధన్యుండు శిలాదమునికిఁ బుత్త్రుల నిచ్చె. పద్మాక్షుఁడైన శ్రీకృష్ణునకుఁ బ్రద్యుమ్నసాంబాదితనయుల నిచ్చె. మన మట్లే తపించి శివ

కృపతో నందను నొందుద మనియె. సతీమణియగు మరుద్వతి హృదయమం
దానంద మొంది నాథున కిట్లనియె. మహాత్మా! తమ కిట్టిభావము
తోఁచినందున నేను ధన్యనౌదును. తాము సర్వసమర్థులు. శంకరుఁడు
భక్తవత్సలుఁడు. మనకుఁ బుత్రభాగ్యమొనరుట కాటంక మేమియుండదు.
తడవుసేయకుఁడు. ఈక్షణమందే తాము మానసమందు మహేశ్వరు
నొంది తపంబుసేయుట కారంభింపుఁడు. నేనుగూడ నా దీనబాంధవుని
మానసంబునం దొడిసి కొలుచుచుందును. తా మీ శుభంబును నాకుఁ
జెప్పుటతోడనే వామనేత్రంబు స్పందించినది. దృఢంబుగ మన కిష్టసిద్ధి
యగునని వేగిరించిన మునీంద్రుండు తద్క్షణంబందుఁ దీర్థంబాడి విభూతి
రుద్రాక్షంబుల ధరించి గణపతిని బూజించి షట్ పాత్రాగ్నిని బ్రతిష్ఠించి
పంచాక్షరీమఖరూపం బగు తపంబుదీక్ష నొంది తపంబొనరించుచుండె.
క్రమముగ. దంపతు లిర్వురును ఫలమూలదళాహారంబులను విసర్జించి
వాయుభక్షణంబు సేయుచు రేఁబవ లేకాగ్రచిత్తులై శివధ్యానహోమా
ర్చనంబుల సల్పుచుండిరి. అట్లిరువురు నిరంతరభక్తితోఁ గోమలేందు
ధరుని హరుని గుఱించి తపించుచుండిరి. చిరకాలంబుజరిగె. అంత నొక
నాఁడు త్రిలోకసంచారియగు నారదముని కైలాసాద్రి కేగి యుమాశివుల
కెరగి ప్రస్తావనాపూర్వకంబుగ శివునితో నిట్లనియె. తండ్రీ! నీమనము
దయాపూరము. భక్తరక్షణైక పరము. నిన్నుగోరి మరుద్వతీమృకండు
లత్యంతము తపించుచున్నవారు. దయతో వారలయభీష్టం బిచ్చుట
కింకను దలఁపవా? మాతల్లి పార్వతీదేవి యేని దనచేతంబున. నెనరొకింతఁ
జెందక యున్నదేమి? అనినఁ ద్రిభువనజనని విని తనయాత్మము పుల్లవ
డఁగ దేవమునితో నిట్లనియె. నారదమునీ! నే నిమ్మహాత్ముని బ్రతిక్ష
ణము వేడుచుంటిని. వారలకుఁ బుత్రవరదానం బిమ్మని కోరుచుంటిని.
ఇమ్మహనీయుఁడు జాగొనరింపుచుండె. నే నేమిసేయుదునని యఖిలాండే
శ్వరి ప్రాణేశ్వరున కిట్లనియె. దయానిధీ! మృకండుమునివనికిఁ బోవుదము.
ఇఁక నొకక్షణం బేని నిట నేను గాల్నిలుపను. ఇపుడే పోవుదము రమ్ము.
నాపై నాదరముంపుము. ఎన్నఁడును భక్తజనులందు జాలముసేయకుం
దువే. నందిని బిలిచి ప్రయాణంబును బ్రకటింపుఁ డనుటయు నాదిదేవుండు
వారల కృపావచనంబు లాలకించి మందహాసముచేసి నేను నట్లే యోజిం

చుచుంటిని. వేగిరముగ నచ్చటికి బోవుద మని నందికేశ్వరుని బిలిచి ప్రయాణం బెఱింగించి వృషము నలంకరింపుమనియె. గిరిపుత్త్రియు గరువంబునొందె. నారదముని మేలుమేలని కిన్నెర మేళగించి పరమశివునికరుణను గానంబు సేయుచు యథేచ్ఛఁ జనియె. బాలేందుశేఖరుఁడు పార్వతీదేవితో సపుత్త్రింబుగ నందికేశాదిగణపాలయుతంబుగ యానంబునెక్కి ప్రయాణం బొనరించి మృకండుముని యున్న బిల్వవనంబుఁ జేరి వారలకు సాక్షాత్కరించె. వారలు పరమేశ్వరుని సపరివారంబుగఁ గనుంగొని మహానందంబుతో నమస్కృతంబు లొనరించి వినుతించి నిలువఁబడియుండ శివుఁ డమ్మునిని జూచి నీ తపంబునకు మెచ్చితిని. నీ భక్తి కానందించితి. ఇఁక విస్తార మాయువుగలట్టి వారల నయోగ్యులగు కొడుకులను గోరుదువా? పదియాఱేఁడులవయ స్సాయుస్సు గల నొకసుపుత్త్రుని గోరుదువా? యడుగు మనియె. మౌని యానుడిని విని మనమునఁ గడుసంకోచమొంది మఱిఁగి తఱిఁగి యంత నే సర్వము శివాధీనం బనికొని పదియాఱేఁడుల యాయువుగల యర్భకుని యోగ్యుని బ్రసాదింపుమని యర్థించె. శివుఁ డోమని యంగీకరించి యంతర్ధినొందె. సంయమివర్యుం డపుడు దీక్షాంతం బొనరించి ఆత్మసతియగు మరుద్వతితో నిట్టులనియె. ఇందుముఖి! ఎప్పటిమే లప్పుడే. శివుఁ డెప్పుడును మనకు సన్నిహితుఁడే. నీ వెప్పటిమాటనో తలంపకుము. అప్పుడును అఖిలేశ్వరుండు మనకుఁ దోడ్పడును. కులపావనులగు పలువురు కుమారులు దీర్ఘాయుష్కులు జనించిన మంచిదగునే? సత్పుత్త్రుఁడొకండు గల్గినను జంద్రునితో నాకసంబట్లు కులంబు విరాజిల్లును. అనిన నమ్మహాసాధ్వియును గాఁగలది యగును పరమేశ్వరుఁడు బాగే యొనర్చును. ప్రస్తుతమందు మనము గర్వపడకుండున ట్లెల్లగాఁ దలఁచి యిట్లులనియె నని యిరువు రకలంకమనస్కులై సుఖంబుగ నున్న గొన్నినాళ్ళకు మరుద్వతీదేవికి గర్భోదయంబైనంత మృకండుముని పుంసవనసీమంతంబు లొనరించి యుమామహేశ్వరులఁ గొలుచుచుండె. గర్భము క్రమంబుగఁ బరిపాకంబునొందఁగా నొకశుభసమయంబున సౌమ్యమైన నక్షత్రమందు గురుఁడు విశేషదృష్టిఁ జూచుచున్న శుభలగ్నంబందు షణ్ముఖునివలె మరుద్వతి గర్భంబందుఁ గుమారుఁడు జన్మించె. మృకండుముని స్నాతుండై దశదివసానంతరమందు

మునులకు ధేనుగణంబుల దానంబొనరించి పుత్త్రునకు జాతకర్మం బొన రించి మార్కండేయుఁడని యాహ్వాయం బొనర్చె. బాలుఁడు నెలబాలుని వలె దినదినము పెంపొందుచుఁ జారుతరకాంతులఁ జెందుచుఁ దల్లిదండ్రు లను బందుగులను నానందింపఁజేయుచుండె. పెన్నిధిని బడసిన పేద లట్లు మరుద్వతీమృకండు లేప్రొద్దు ముద్దుకొమరుని జూచికొనుచు హద్దులేని హరుసంబునఁ దనియుచుండిరి. అపుడపుడు శివునివరంబు చిత్తమునకుఁ దాకుచుండినఁ గొంకుచు నంతనే మానసంబును దిటం బొనరింపుచు శివుండే సాఁకఁగలఁడని నిశ్చయంబు నొందియుండిరి. అంత బాలుండును గ్రమంబుగ వర్ధిల్లుచు నడుచుటకు వచ్చినంతనే శివునిగుడి కేగి మ్రొక్కి వచ్చుచుండును. మాటలు వచ్చినయంతనే 'నమశ్శివాయ' యని పల్కు-చుండును. చదువుటకు వచ్చినయంతనే శివపురాణంబులఁ జదువుచుం డును. వ్రాయవచ్చినయంతనే శివకోటిని వ్రాయుచుండును. స్నానమాడి నంతనే దేహమందంత విభూతిని బూయుచుండును. గళమందు రుద్రాక్ష మాలికల ధరించుచుండును. శివలింగంబుపైని బుష్పంబులను బిల్వదళం బుల నుంచుచుండును. తాను భుజించు నన్నాదికంబులను శివలింగంబు నకుఁ జూపెట్టుచుండును. ఇఁక మృకండుముని పుత్త్రునకు గర్భాష్టకం బారసి యుపనయనంబును బాశుపతదీక్షయు నొనర్చి వేదాధ్యయనంబు నకై గురున కప్పగించె. బాలుం డనతికాలంబున వేదవేదాంగంబులను నేర్చి శివాగమంబులఁ జదివి షడ్దర్శనంబులందారితేఱి సర్వంబందు శివ తత్త్వంబు మేలిమి నెఱింగి శివుఁడే సర్వజగత్కారకుఁ డని తెలిసి ప్రతి దినము నియతంబుగఁ బార్థివలింగపూజ నొనర్పుచు ననవరతము శంక రుని గొలుచుచుండె. మృకండుమునియు మరుద్వతియుఁ దమకొమరుని దపోధనులగు మునులకు వృద్ధవిప్రులకు జోతలొనర్పఁజేయుచు వారిదీవె నల నొందఁజేయుచుండిరి. బాలునకుఁ బదియైదేఁడులు గడచినమీఁదఁ బదియాఱవయేఁడు వచ్చినయంతనే మరుద్వతీమృకండులు హృదయమందు భయమొందుచు నేమిసేయుదమని విచారించుచుండిరి. అంత నొకనాఁడు నారదముని వారినిజేరి కుమారుని జూచి సంతసించి మునిదంపతులతో నిట్లులనియె. పుణ్యులారా! మీకు మేలైన నందనుఁ డుదయించె. ఈ బాలుఁడు సద్గుణనిధి. ఇవ్వసుమతియందు విస్తారంబుగ శ్రేయంబు

లొందఁగలఁడు. కాని మీరు జాలముసేయక నావచనం బొకటివిని యట్లు చేయవలయును. ఈబాలున కచిరకాలంబునఁ జేటొకటి చేరవచ్చుచున్నది. మీ రప్రమత్తులై యద్దానిని హరింపజేసికొనవలయు ననియె. అంత వారలు వజ్రితాడితులట్లు భిన్నమనస్కులై విషాదంబొంది వాపోవుచు నారదమునియడుగులఁబడి ఆపదుద్ధారప్రయత్నం బడిగిరి. నారదముని కుందుటయేల? బాలేందుధరుఁడు భక్తులపాలిటి కల్పవృక్షంబు. మీరలు సందేహింపక సత్వరముగఁ బుత్రుని దపస్సున కనుపుఁడు. శుభంబగునని యంతర్ధినొందె. మునిదంపతులు నిట్టూర్పువిడిచి కొమరుని విడువఁజాలక వగచుచున్నంత మార్కండేయుఁడు దారసించి యిట్లనియె. అమ్మా! నాయన! ఏటికిట్లు వందురెదరు? హేతువేటి కెఱింగింపరు? ఇప్పుడేని దెల్పుఁడు. నే నావ్యాకులహేతువును బాపి మీమనంబుల కానందము చేయుదు ననుటయు నవ్వారలించుక విచారంబుమాని శివుఁడొసఁగిన వరంబుస్వరూపం బాత్మజునకు విశదముచేసి పదియాఱవయేఁడు దనకు వచ్చుటయును నారదముని వచ్చి యాపదను బ్రస్తావించి తత్పరిహారంబునకై తన్ను దపంబుసేయఁబంపుమని యుపదేశించి చనుటయును జెప్పిరి. మార్కండేయుం డదివిని ధైర్యముతోఁ దల్లిదండ్రుల కిట్లనియె. ఈమాత్రమునకే గొప్పచేసి యిట్లు దుఃఖించుచున్నారా! ఇఁక వందురక యానందంబున నుండుఁడు. భక్తవత్సలుఁడగు శంకరుండు మనకండయై యుండ మన కేలాటియారాటము లేలాటిచేటులు వాటిలవు. సెలవొసఁగుఁ డీక్షణమందే శంకరుని గుఱించి తపింపఁబోవుదు నని యడిగిన మృకండుముని మనంబును దృఢంబుచేసి యామోదించి పుత్రున కిట్లనియె. పుత్త్రా! నిన్ను గన్నఫలంబును మాకుఁ జేకూర్పుము. అసమానశక్తియుక్తుండును గరుణాకరుండు నగు శంకరుండు నిన్ను రక్షించి శుభంబిచ్చుఁగాత ననియె. మరుద్వతియుఁ గుమారుని నెమ్మొగంబును శిరంబును దనకరతలంబున నిమిరి ధీరయై యిట్లనియె.

చ॥ హిమకరశేఖరుండు నుమ ♦ యిందిర యల్ల రథాంగహస్తుఁడుం
గమలజుఁడుం దదీయసతి ♦ కంజహితుండు గువాలయాప్తుఁడుం
క్షమయును నాకసంబును ది ♦ శల్ సురభివ్రజముల్ గ్రహంబు లిం
పమరఁగ నిన్ను బ్రోచెద ర♦హర్నిశ లాత్మజ! పోయిరమ్మికన్.

(శివపురాణము)

ఇట్లు దీవించి వారలు సంతోషముతోఁ గుమారుని దపోవనయానం బునకు సెలవిచ్చిరి. మార్కండేయుఁడును తల్లిదండ్రుల పాదారవిందం బులకు వందనముచేసి హిమాచలంబునకుఁ జనియె. అందు గంగాతీరం బందలి యొకబిల్వవనంబందుఁ గుటీరం బొనర్చుకొని నికటప్రదేశంబందు శివలింగస్థాపనం బొనరించి ప్రతిదినము త్రిసంధ్యంబందు శతరుద్రీయజపం బును బదునొకమా అభిషేకంబును నర్చనంబు నొనర్చుచుఁ గందమూల ఫలాశనంబుల వర్జించి బిల్వైకదళభోజనుండై నియతితో శివుని గొలు చుచు నాఱుమాసంబులు గడపె.

అపుడు సంయమనీపురమందు యముఁడు మార్కండేయుని యాయువును లెక్కించి సమాప్తమగుట నెఱింగి దూతలతో మీరు హిమాచలంబునఁ దపించుచున్న మార్కండేయుని విగతజీవునిజేసి రండని పనిచిన నవ్వార లట్లేయని హుంకరించి మార్కండేయుని డాయసించిన నతఁడు వారలఁ జూచియుఁ జూడనియట్లు చలింపక శివలింగనిష్ఠుఁడై పూజసేయుచుండె. వారలు గోవెలలోనికిఁ బోవుటకుఁ దమ కధికారము లేక తద్ద్వారంబందు నిలిచి మార్కండేయుని నావలకుఁబిలుచుచుండిరి. మునితనయుఁడు వారివచనంబులను వినుచు సరకుసేయక శివలింగంబు నర్చించుచుండె. వార లాయనఘుని దివ్యతపస్తేజోగ్నిప్రభలకు బడలి తట్టుకొనలేక పట్టువిడి యముని జేరి తద్విధంబంతయుఁ జెప్పిరి. అంతకుఁడు బిట్టరచి కన్నులు నిప్పులుగుఱియ దూతలను జూచి పేతలని తెగడి మునిబాలుని వధింపుటకై తానే పోయెదనని సన్నాహంబునొనర్చుచుండ దివినుండి నారదమునివర్యుండు దఱియఁగాఁ బరేతనాథుం డమ్మునికి సత్కారమ్ములొనర్చి నిలిచె. దేవమునియు యమునకు మచ్చికతో నవియవి కొన్నిముచ్చటలు జెప్పి సుంతకాలహరణం బొనర్చి యనంతర మందు బిల్వవనమందుఁ దపించుచున్న మార్కండేయుని సచ్చరిత్రం బించుక ప్రస్తావించి చెప్పె. దండధరుం డదివిని పెదవివిఱిచి యిపుడే యే నమ్మునికడకుఁబోయి ప్రాణంబు లూడఁదీసికొని వచ్చెద. మీ యాగ మనంబుఁజూచి యాగితి నిఁక సెలవీయుఁ డనుటయు నారదుండు దండ ధరునకు వినయముతోఁ జల్లని మెల్లనినుడుల నిట్లనియె. ధర్మరాజా! నీవు దయాళుఁడవు, విజ్ఞానమూర్తియగు లోకబాంధవున కాత్మజుఁడవు.

నీ వెఱుంగనిధర్మం బున్నదే? మరుద్వతీమృకండులు సచ్చరిత్రులు. ధర్మమూర్తు లేకపుత్త్రులు. మార్కండేయుఁడును ధర్మాసక్తుఁ డనఘుఁడు శివపూజాపరతుఁడు. నీ వెల్లని గనికరించి మార్కండేయుని రక్షింపుము. ప్రభులు నిగ్రహానుగ్రహసమర్థులు గదా! యనిన నంతకుఁ డదివిని వినుము! మునీ! ఆబాలున కాయువునిండగా వేఱుదలంచు టెట్లు? నేను వేఱేమియుఁ జేయఁజాలను. ఇఁక నేమియనక మిన్నకుండుము. నే నిపుడే యవ్వానిజీవితంబుఁ గొనుటకై పోవుచున్నాననియె. నారదుఁడు కాలునితో నానుడి నరయవైతివి. మునిబాలుఁడు మహాకాలుని గొలుచుచున్నాఁ డతఁడు నీకసాధ్యుఁడు. వాని నీవు చంపలేవు. చూడుమనియె. అంత నంతకుఁ డాగ్రహంబున నౌడుగఱచి నారదా! నారద! ఏమంటివేమంటివి. వినుము వినుము. భానుండాకసంబుఁ బాసి భూతలం బొందినను బంగరుకొండ గడిమిదెప్పి కంప మొందినను ద్రిమూర్తు లడ్డమైవచ్చి పోరాడినను మునిబాలుని ప్రాణంబులఁ బెల్లగించి తెచ్చెదను. చూచుచుండుమని రయంబునఁ బాశంబులఁ గొని దున్ననెక్కి గర్జింపుచుఁ దపించుచున్న మార్కండేయుని జేరి తద్వర్తనం బంతయుఁజూచి తామసంబున నాతనికిట్లనియె. చాలుచాలు. నీపూజనంబును నీతపంబును శివుఁడు మెచ్చె. నీకుఁ గాలము సమీపించెను. మృతినొందెదవు. రమ్ము. వెల్పులి కేగుదెమ్ము. నేఁ గాలుఁడ. నీప్రాణంబులఁ గొనిపోవుటకై యిటకు వచ్చితిని. నీకు మోక్షము లభింపఁగల దిందు సందియము లేదనిన మార్కండేయుఁడు యమునిజూచి భయంబొంద కిట్లనియె. ధర్మరాజా! నేను మహేశ్వరుని బూజించుచున్నాను. ఆ సర్వలోకాధినాథుండు సర్వదేవేశ్వరుండు నన్ను రక్షింపఁగలఁడు. దృఢము. నన్ను వధింపుటకుఁ దలఁపకుము. పొమ్మన నంతకుఁ డాగ్రహించి తెలియదు పిల్లకాయవు. తెంపుతో నోటికివచ్చినట్లు వదరుచుంటివి. నీబైసికఁ జెల్లదు. లేచిరమ్ము. వేల్పులు నిన్ను సాకువారలా? ఇపుడే నిన్ను గడముట్టించెద. నాయలవును బాశపుబలమును జూడుము. ఆయువు చెల్లిన వెనుక శివుఁడు గివుఁ డడ్డమై వచ్చెదరా! నీవు యోగ్యుఁడవని యిట్లవబోధము చేసితివన విని మార్కండేయుఁడు మరల నిట్లనియె. ఏటికీప్రగల్భములు? గర్వోక్తు లాడుట గొప్పయగునా? సర్వజగత్కారణుండగు

శంకరుఁడుగూడ మిన్నగఁ గన్పడకుండెనా ? ఇఁక వేయిమాటలేల! నన్ను శివుఁడు గాపాడఁగలఁడు. నీ విఁక వచ్చిన త్రోవను బొమ్ము. మందమతులైన వారలు ముక్కుసూటిగఁ బోయి యనుచితముల నొనర్చి ముప్పుఁ జెందెదరు. మోమాటపడక చెప్పుచుంటిని. మదిని దలపోయు మనియె. అంతకుఁడంతఁ గాలసర్పమువోలె రోజుచుఁ బెనుకినుకతో ఘోరధ్వని నొనర్చి బాలకా! చూడుము చూడుము. ఇదే నీప్రాణంబులు సురుగుచున్న వనుచు గడప కావలినుండియే భయఙ్కరపాశంబును బాలుని కంఠమందు వైచి లాగుచుండె. మార్కండేయుఁడు కాలపాశంబు కంఠగతంబగుట నెఱింగి తనకు శంకరుండే శరణం బనుకొని శివలింగంబు నాలింగనం బొనర్చికొని స్థిరబుద్ధితో శివుని బ్రస్తుతించుచుండె.

శ్లో॥ రత్నసానుశరాసనం । రజతాద్రిశృంగనికేతనం
శింజినీకృతపన్నగేశ్వర । మచ్యుతానలసాయకం
క్షిప్రదగ్ధపురత్రయం । త్రిదశాలయై రభివందితం
చంద్రశేఖర మాశ్రయే । మమ కింకరిష్యతి వై యమః.

తా॥ వెండికొండయం దుండునట్టియు బంగరుకొండను విల్లుగాధరించినట్టియు నాగేంద్రుని నారిగాను విష్ణుమూర్తిని నగ్నిని బాణములుగాను ధరించినట్టియు త్రిపురములను వేగిరంబుగఁ గాల్చినట్టియు దేవతలచే స్తుతింపబడినట్టియు చంద్రశేఖరుని ఆశ్రయించుచున్నాను. ఈయముఁడేమి చేయఁగలఁడు ?

శ్లో॥ భక్తవత్సల మర్చిసాంనిధి । మక్షయం హరిదంబరం
సర్వభూతపతిం పరాత్పర । మప్రమేయ మనూపమం
సోమవారిసభూహుతాశన । సోమపాద్యఖిలాకృతిం
చంద్రశేఖర మాశ్రయే మమ । కింకరిష్యతి వై యమః.

పద్మపురాణము.

తా॥ భక్తులందు దయగలట్టియుఁ గాంతులకునిధియైనట్టియు నాశనము లేనట్టియుఁ బచ్చనివస్త్రములఁగట్టినట్టియు సర్వప్రాణులకధిపతియైనట్టియు పరాత్పరుఁడైనట్టియు పరిమితిలేనట్టియుఁ బోల్చుటకు వీలులేనట్టియు అష్టమూర్తి స్వరూపుఁడైనట్టియు చంద్రశేఖరు నాశ్రయింపుచున్నాను. ఈ యముఁడేమి సేయఁగలఁడు ?

శంభుప్రియ వృత్తము
శఙ్కర! పోషింపుము ♦ చంద్రకలాధర!
సఙ్కటభంజన! ♦ సన్మునిరంజన!
పఙ్కజలోచన ♦ బాణ! సనాతన!
కిఙ్కరుఁగావుము ♦ కీర్తనఁజేయుదు.

ప్రార్థనా వృత్తము
మాతండ్రి! నీవు రావె ♦ మారసంహార! హర!
చేతోముదంబుతోడ ♦ సేవజేయుదు శివ!
మాతల్లి గౌరితోడ ♦ మమ్ముఁ గావఁగ మది
నాతప్పులోప్పిరమ్ము ♦ నందివాహన! ఘన!

శివపురాణము.

ఇట్లు చిరతరతపసి మదిని గట్టిచేసి గట్టువిలుతుదొరను బ్రార్థించు చున్నంతలో నారదముని యముని ననాదరించి రజతశైలంబుఁజేరి పార్వతీపరమేశ్వరులకు మ్రొక్కి మార్కండేయుని రక్షింపుమని యిట్లు ప్రార్థింపుచుండె.

శంకరప్రియ వృత్తము.
కావఁగరావే ♦ గణపతిలోలా!
ప్రోవఁగలేవే ♦ మునిజనపాలా!
ఈవె శరణ్యాం ♦ బిదిగనుపుణ్యాం
బోవరమూర్తీ! ♦ యురుతరకీర్తీ!

శివపురాణము.

అని మహతీగానంబుసేయుచు మార్కండేయుని తపఃప్రకారం బును దజ్జననీజనకుల దుఃఖంబుచందంబును దండధరుని పట్టుదలయును దెలిపి బాలుని రక్షింపుమనుచు జగదీశ్వరుని జగదంబికను బ్రార్థించు చుండు నాజగన్మాత మహాదేవునితో మార్కండేయునిరక్షకై వేగిరిం పఁగా నపుడు హరుండు మునికొమరునియురుత వేసిన కాలపాశం బాత్మ కంఠగతంబగుట నెఱింగి యాగ్రహంబున నద్భుతమహాధ్వని యొదవ లింగమధ్యంబునఁదోఁచి కరతలశూలంబునఁ గాలునికంఠంబుఁబొడిచిన శమనుండు రక్తముఁగ్రక్కి భువిఁబడియె. శివుండు బాలకు ననుగ్ర హించి వెఱవకుమని స్వహస్తంబాతని శిరంబందుంచి వరంబుగోరుమనియె.

మార్కండేయుఁడు వెఱపుమాని శివునియడుగులఁబడి మ్రొక్కి యముని బ్రతికింపుమనియె. అమృతమయుం డంతనే యంతకు జీవింపఁజేసి యాతని కిట్లనియె. ఓయీ! నాదుభక్తులశక్తి నెఱుంగవా! మనమం దహంకారం బొంది మఱచితివా? ఇఁక నేని గరువముతో నిట్టిచేష్టల కొడిగట్టకుము. దుడుకు లొనర్పకు మనిన శమనుండు నుదుట నంజలిఁజేర్చి మ్రొక్కి యిట్లనియె. దేవర యే యీ వటువున కాదియందుఁ బదియాఱేడు లాయు స్సని చెప్పుట నారసి యేను మునిపుత్రునిపైఁ బాశంబు వేసితిని. మంద మతినగు నాకు నా తప్పిదంబు స్ఫురింపలే దనిన శివుండు మందహాసంబు చేసి యిట్లనియె. ఓయీ! ఎప్పటికిఁ బదియాఱేఁడుల యెలవయస్సుతో నుండునాయు స్సీతని కిచ్చితి. దాని నీ వెఱుంగక యిట్లారడిఁబఱచితివి. ఐన నిఁకఁజను మనుచుండ నారదబోధితులై మరుద్వతీమృకండులు కుమారుని జాడ లరయుచు నచ్చటికి వచ్చి యవ్విధం బంతయుఁ జూచి యఖిలేశ్వరుని దయామయ హృదయంబును బెక్కుభంగులఁ బ్రశంసించి నుతించుచుండిరి. నారదుఁడును నచ్చోటికి వచ్చి మహేశ్వరునకు మ్రొక్కి యముని గుశలం బడిగినమీఁద యముఁడు విన్నఁబోయి బింకం బడంచుకొని శివుని సెలవడిగి నిజపురంబున కరిగె. శివుండును మార్కండేయుని జూచి యెపుడు బ్రహ్మకల్పంబగునో యెప్పుడు పద్మాక్షుండు వటపత్రశాయి యగునో అప్పటివఱకీవు దీర్ఘాయుష్మంతుఁడవై పుడమిపైని జెలువొంది యుండుము. మఱియు నీవొనరించిన స్తవంబు నెవ్వరేని శివలింగసన్నిధిఁ జేరి పఠించిరేని యవ్వార లకాలమృత్యుభయంబుఁ జెందరని మార్కండేయునకు వరంబిచ్చి మృకండుమునిని జూచి మునీంద్రా! నీవేమేని గోరుము వేని నట్లు వరంబిచ్చెద ననిన నతండు మ్రొక్కి యిట్లనియె. దేవా! ఇంతకన్న నాకేమివరంబు గావలయును? నాదైన్యంబు బాపి యసాధారణదయకుఁ బాత్రుని జేసి తనియించితివి. నిన్నేమని కొనియాడుదు నని మునిదంపతులును మార్కండేయుఁడును మహేశ్వరునకు మ్రొక్కినయంత మహేశ్వరుఁ డంతర్ధానంబునొందె. నారదుండును ఖరహరప్రియరాగంబునఁ బరివాదినియందు శివుని గానంబు సేయుచు యథేచ్ఛఁ జనియె. మరుద్వతీమృకండు లానందపారవశ్యంబునొంది కొమరుని దోడ్కొని స్వాశ్రమంబున కేగి సుఖంబుండి రిది మార్కండేయ

చరిత్రింబు. దీనినెవ్వారేని జదివిన వినినఁ జిరాయుష్కులై సౌఖ్యంబు లొందుదురు.

# 9. ఘుశ్మ మహారాష్ట్ర బ్రాహ్మణి

శ్లో॥ మహోక్షః ఖట్వాంగం పరశు మజినం చర్మ ఫణినః
కపాలం చేతీయ త్తవ వరద! తంత్రోపకరణం
సురా స్తాంతామృద్ధిం దధతితు భవద్భ్రూప్రణిహితాం
నహి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి.

పుష్పదంతాచార్య మహిమ్న స్తవము.

తా॥ ఓ వరదాతా! ఇంద్రాదిదేవతలు నీకటాక్షమాత్రమున ఆ యా స్వర్గాధిపత్యము మున్నగుసంపదలను జెందుచున్నారు. నీకు సాధన సంపత్తి ముసలియెద్దు మంచముకోడు గండ్రగొడ్డలి పెద్దపులి చర్మము బూదియు పాములు పుఱ్ఱెలు అనునవియే. ఆత్మానందుఁడగు మహాత్మునకు విషయము లనెడునెండమావులు భ్రమింపఁ జేయవుగదా.

మహారాష్ట్రదేశమందు దేవగిరి యనునగరంబు సమీపంబం దొక బ్రాహ్మణుఁడు సుధర్ముఁడను పేరుగలవాఁడు భరద్వాజగోత్రుఁడు శివ దీక్షావంతుఁడు, బ్రహ్మవేది, పవిత్రచరిత్రుండు కలఁడు. ఆయనకు సుదేహ యను సతి గుణవతి చాతుర్యవతి గృహకార్యనిర్వాహణవిశారద పతివ్రత సుచరిత్రి యుండెను. ఆ దంపతు లిరువురు సంతతము శివార్చనాపరులై ధర్మాసక్తులై దేవతాతిథిసపర్యలఁ బేరిమితో నొనర్చుచుండిరి. అవ్వారికి సంతానము గాక పెక్కువత్సరంబులు గడచె. సుధర్మునిసతి సుదేహ తనకు సంతానము లేమికి హృదయమందుఁ గుందుచుఁ గలిమి యున్నను సంతసము లేదని విచారించుచుండెను. సుధర్ముఁడు ధీరుఁడును జ్ఞానియును నగుట తా నెట్టివిచారమును జెందక యానందముగ నే యుండుచు నప్పుడప్పుడు సంతుకై వందురుచున్న తనసతినిజూచి విచార మేల? ఎవ్వరి కెవ్వారమురు? అస్థిరం బగు నీప్రపంచంబందు బందుగు లెవ్వరు? తల్లిదండ్రు లెవ్వరు? పుత్రు లెవ్వారు? జగ మంతయు స్వార్థంబునకై యత్నించు

చుండును. కావున నీవు వగపుడిగి సంతతంబు శివుని గొలుచుచుండుము. అదియే కడతేర్పుమార్గ మని చెప్పుచుండును. సుదేహామాత్ర మట్లు మానక స్త్రీస్వాభావికంబుగ సంతోషము మాని మనమున వనరుచుండును. ఇట్లుండ నొకనాఁడు పొరుగింటి కేదియోపనికై పోయి ఆ యింటి యామెతో మాటపట్టుదలకు జగడంబొనర్చుచుండె. అపుడామె సుదేహను నిందింపుచు సుదేహామనంబు మిక్కిలినొచ్చి వగచునట్లుగ నిట్లనె. మేడలున్నవనుచును గొప్పనగలున్నవనుచును గొప్పదానవనుచుఁ ద్రుళ్లకు. నాకు బంగరుకుప్పలట్టి కొడుకులును గూతురులును గలరు

గీ॥ దుడ్డు గలుగనేమె ♦ గొడ్డుదానవు నీవు, తినుట కెవ్వరేని ♦ దిక్కు లేరు
బిడ్డలున్నదాన ♦ జేర్మినాకెనవౌదె, తల్లక్రిందులగుచు ♦ దపసుగొనిన
శివపురాణము.

అని తెగడిన సుదేహ దుఃఖించుచుఁ దనగృహంబునకువచ్చి విభున కంతయును వినిచె. అతండు వినియు విజ్ఞుండగుట విననియట్లు లుండె. సుదేహ యంతకంతకు సంతానకాంక్ష హెచ్చలంబగుటఁ దనకాంతుని గదిసి యీజన్మమందు నాకు సంతానభాగ్యము కలదా? లేదా? అనుగ్రహించి చెప్పుడని పదంబులవ్రాలె. అతఁడును రెండుపుష్పముల శివలింగము చెంత నునిచి యం దొకటి గ్రహింపుమని తనసతికిఁజెప్పఁగా నామె యాతురమై అభీష్టపుష్పంబును బాసి యానలిపూవును గొనియె. సుధర్ముఁ డారసి పెదవివిరిచె. కుశలయైన సుదేహ యదియెఱిగి మరల మగనితో నిట్లనియె. మహాత్మా! నాకిఁకను సంతానము గాదు. తెలిసినది. తాము దయతో వేఱొక బాలికను బెండ్లాడుఁడు. దానికి దృఢముగ పుత్రుండు జన్మించును. మనకందఱ కానందం బగును. అని ప్రార్థించిన లోకజ్ఞుఁడైన నతండు నీ విపుడిట్లే యనెదవు. వేఱొకనాతుకను బెండ్లియాడిన సవతిని గోరి బాధించెదవు. అనుమానములేదు. నేను మరలఁబెండ్లాడను. అని స్పష్టముగఁ జెప్పుటయు విని యాయమ పట్టువిడక నా చెలియలు పది రెండేండ్లప్రాయముగల కన్యక యొకర్తు గలదు. నా తండ్రిని బ్రార్థించి దానిని దమ కిప్పించెదను. దయతోఁ దాము దానిని బెండ్లాడుఁడు. నేను సవతియని చెల్లెలిని గూడ బాధించెదనా? అట్లెన్నఁడును జరుగదు. నా కోర్కె దీర్పుఁడు. అని యర్థించి యంతతో విసుగక అహర్నిశంబులు

ప్రేతిపాలి యుడుగుచు పెనిమిటిమనసును గఱగించి యెట్లో సెలవొంది స్వగ్రామమునకేఁ బోయి తనతల్లిదండ్రులకుఁ దనదైన్యం బెఱింగించి వారలను గూడ నొప్పించి విభునకుఁ దనచెల్లెలి నిప్పించి వివాహము జేయించెను. కొన్ని దినంబులకు సుదేహాసోదరి యౌవనవతియై పతిగృహంబునకు వచ్చిన యంత సుధర్ముఁడు సుదేహతో నిట్లనియె. గుణవతీ! నీప్రార్థనఁ ద్రోసి వేయలేక యిట్లు నీచెలియలిఁ బెండ్లాడితిని. ఈ పడుచును బ్రియముతో నీవు గాపాడుకొనుచుండు మని ఘుశ్మ యనుపేరుగలచిన్నియాలను యాపెయప్పచేత బెట్టి తాను నిత్యసంతుష్టుండై యుండె. బుద్ధిమంతురాలగు ఘుశ్మ యక్క సెలవును బట్టి నడచుచు పూర్వజన్మపుణ్యావశంబున శివప్రూజయం దిచ్ఛనొంది తనయక్క సెలవొంది దినదినము నూటయొక్క పార్థివలింగంబులను నిర్మించి విధిప్రకారము శివపూజను సలిపి యనంతరమందు వాని గొనిపోయి సమీపతటాకంబందు వైచుచుండెను. ఇట్లు కొన్నేండ్లు జరిగినంత లింగములన్నియు నొకలక్షకు మించెను. అంత శివానుగ్రహంబున ఘుశ్మ గర్భంబుధరించి సుముహూర్తంబున నొకసుతునిగనియె. ఆ బిడ్డఁ డందముగ సులక్షణశోభితుఁడై జన్మించుటనుగాంచి సుధర్ముఁడు తా నెందును ననాసక్తుండైనను బుత్రోదయంబున నానందించెను. పదకొండవనాఁడు బందుగులందరును వచ్చి బాలునిజూచి యానందించి ఘుశ్మను మిగులఁగొనియాడిరి. సుదేహ మాత్ర మొకస్త్రక హర్షింపక యుదాసీనబుద్ధితో నుండె. బాలుఁడు దినదినము వృద్ధిఁబొందుచు నందంపురూపముచేతను ముద్దుచేష్టలచేతను తెలివితేటలచేతను చిఱునగవులచేతను వచ్చిరానిమాటలచేతను తలిదండ్రులకును బంధువులకును నందఱకు మిక్కిలిహర్ష మొసంగుచుండెను. ఐదవయేటనే విద్యారంభ మొనర్చిరి. బుడుతఁడు సంతసముతోఁ దెలివితో వేగిరంబుగాఁ జదువులనేర్చుచుండె. గర్భాష్టకవయస్సు వచ్చినంతనే సుధర్ముఁడు చుట్టములనెల్లబిలిచి సుముహూర్తమం దుపనయనంబుచేసి వేదాధ్యయనంబునకై పుత్త్రుని గురునకప్పగించె. బాలకుఁడు కుశాగ్రబుద్ధితో వేదంబును వేదాంగంబులను ననతికాలములో నేర్చి విద్యాలం దారితేరె. అప్పుడు రూపరేఖావిలాసలీలవిరాజమానుండును షోడశవర్షవయస్కుండును నగునీ వటుని జూచి హర్షించి యొకధనికబ్రాహ్మణుండు సౌందర్యవతియు

విద్యావతియు బుద్ధిమతియు గుణవతియు సర్వసులక్షణవతియు ద్వాదశ వర్ష వయోవతియు నగు తనతనయ నిచ్చి హారణఁబులనిచ్చి వైభవంబుగ వివాహంబుజేసె. ఆ వివాహంబందు సుధర్ముని బంధువు లందరును వచ్చి నూత్నదంపతుల యీడుజోడును అందచందములు విద్యావినయంబులు చూచి మిక్కిలియానందించిరి. వియ్యపువారలును వారలవియ్యంబులును ఘుశ్మను మిక్కిలిగారవించి ప్రేమించిరి. సుధర్మునిచుట్టంబులును ఘుశ్మను మిగుల నభినందించిరి. ఇట్టిమహోత్సవంబును సుధర్ముని జ్యేష్ఠపత్ని సుదేహ చూచి యోర్వక సంతసింపక మెండుగ సంతాపమొందెను. అనంతరము కొలఁదికాలముననే కోడ లత్త వారింటికిఁ గాపురంబుసేయ వచ్చెను. సుదేహకు దినముదినము మనమందు విచారంబు హెచ్చె. చెల్లెలి యందును కొడుకు కోడలియందును ద్వేషంబువృద్ధియయ్యె. ఘుశ్మ యది యెఱింగి అప్పతో అక్కా! ఈకొడుకును కోడలును మననాథుఁడును ఈయైశ్వర్యంబంతయు నీయదియే నాదికాదు. నమ్ముము. నేను నీకుదాసిని యనిహితంబుజెప్పె. కొడుకు తనతల్లికంటె యెక్కువగాను కోడలు దన యత్తకంటెమిన్నగాను దలచి వర్తించుచుండిరి. సుధర్ముఁడును ఘుశ్మకన్నఁ బెద్దభార్యనే ప్రియమగునిల్లాలిగఁదలచి యామెకే సర్వం బధీనంబుగ జేసి మోదముతోనుండె. ఇట్లు వార లందఱు తన్ను గారవించుచు మెలంగుచుండినను సుదేహ యట్లోర్వక హృదయంబునఁ బాపంబునొంది నిందిత మతియై యందఱియందు నేరంబులవెదకికొనుచు నిరంతరంబు విచారముతో నందురుచు దినదినము వృద్ధియగుచున్న ద్వేషముతో నీ ఘుశ్మ భోరున నేడ్చినగాని నా మనస్తాపాగ్ని చల్లారదు. కావున నట్లుచేయక తీరదు. పాపమురాని మరేమిగాని దీనికొమరుని జంపెదను. దానితో నంతయును దీరునని యిట్లు సంకల్పించి జంకుగొంకులేక యొక నాఁటి చీఁకటి రాతిరి గోడలితోఁ బాన్పున నిదురింపుచున్నకొడుకు నొకకత్తితోఁ బొడిచి చంపెను. అంతఁ దనకుఁగల కసియును బగయును దీరినదని కుసి యొందఁది యా నిశియందే శవమును దీసికొని పోయి సమీపమందుఁ గల చెఱువున వేసి దనయింటికి వచ్చెను. తెల్లవారినంత కోడలు లేచి నెత్తుటఁదడసిన పడకయందుఁ బెనిమిటి లేకుండుటఁజూచి యిల్లంతయు వెదకి యెందును గానక యార్తయై పెద్దయెలుంగున విలపించె. అపుడు

పాపస్వాంతనైనను దేహ దహించి యొఱుకలేనియట్లును దుఃఖితయైనయట్లు రోదనంబు నేయుచుండె. వాడలోనివారలును యూరివారును వచ్చి మిగుల విచారపడుచుండిరి. అంతకు మున్నె ఘుశ్మ స్నాతయై విధిప్రకారంబుగఁ బార్థివలింగార్చనంబు సల్పుచుండె. సుధర్ముండును సరసనుండి వేదమంత్రంబులఁ జదువుచుండె. అట్టితతి కోడలు గోడుగోడున నేడ్చుచు వచ్చి తనవిభునిలేమిని దెలిపె. అపుడు ఘుశ్మ విలపింపక ధీరయై ఈకొడుకు నెవ్వఁడు ప్రసాదించె నతఁడే సదయహృదయుం డర్భకుని సాఁకును. భక్తరక్షాపరుఁడు మహాకాలుఁ డాశివుఁడే శరణ్యుఁడు. అట్లుగాక శివుఁడు కాపాడకున్న నిజగంబున నెవరడ్డమగుదురు. అని పగవక శివునియందలి నమ్మికమునఁ శివలింగార్చనావసానంబున నా లింగంబుల నన్నియును బుట్టలంబునఁ బెట్టుకొని పోయి కాసారంబున నునిచి మరలి వచ్చుచుండె. అంతలో వెనుకనుంచి అమ్మా! నేనును వచ్చుచున్నాను. నన్నుగూడ నింటికి దోడ్కొనిపొమ్ము. మాయుదల్లి చేఁ జచ్చియు నీదుశివలింగార్చనా సచ్చరితప్రభావంబునను శివునియసమానప్రసాదభాగ్యంబునను మరల బుట్టి తిని వచ్చుచున్నా నని తల్లిపజ్జకుఁ దారసించె. ఘుశ్మ కొమరునిజూచి మిక్కుటపైసంతసించి గినుకఁగొనక కొమరునిపైఁజేయుంచి వచ్చుచుండె. అపుడు భక్తవత్సలుఁ డభవుండు దర్శనమిచ్చి అమ్మా! నీదుపూజనము నకు నీయోర్పునకు నీదు మనస్థైర్యమునకు నీదుభక్తికి హెచ్చుగ మెచ్చితి. ఇదిగో వరము నిచ్చెదఁ గొనుము. నీ సవతిని ముక్కముక్కలుగ నీత్రిశూలంబుచేఁ జెండెదననియె. అపుడు ఘుశ్మ శివునిపదంబులఁబడి మహేశ్వరా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. అపరాధముచేసిన నాయక్కను క్షమించి రక్షింపుము. ఆమె కేమియుశిక్షయొనర్పకు మని ప్రార్థించెను. అపుడు బాలేందుశేఖరుఁడు ఘుశ్మను జూచి.

క: ఏమింటి కోమగఁజూచెదు. ఏమెను నీపట్టిఁబట్టి హింసించెను బో
రామిం దలఁపఁగఁ జనునే, పామునకుం బాలుపోయ భావ్యంబగునే.

అనినంత ఘుశ్మ మరల శివున కిట్లు విన్నవించె.

క: కీడొనరించినవారికిఁ, గూడఁ బ్రభూ! మేలుసేయఁగూడున్ గాదే
యీడదె నీ దరిసెనమునఁ, గూడనితలఁపది సుదేహాకున్ సుచరిత్రా!

శివపురాణము.

అనిన నా మహేశ్వరుం డట్లే యగుఁగాత. ఇఁక నీ యభిమతవరం బులఁ గోరు మిచ్చెద ననియె. ఘుశ్మ యానందముతో మహేశ్వరా ! లోకరక్షణంబు గోరి నీ వీ కాసారప్రదేశమందు లింగరూపంబున నా యాహ్వాయంబు ధరించి వసింపుమని కోరె. పరమేశ్వరుఁ డట్లే యిందు ఘుశ్మేశ్వరుఁ డనుపేరితో వసించెదను. నన్ను బూజించినవారికెల్ల రకు భోగమోక్షంబుల నొసంగెదను. ఇఁక నకలంకమైననీవంశమం దొకనూటికి దాఁక సుపుత్త్రిరు లుద్భవించి వంశవృద్ధిని జేయుదు రనియె. ఇంతలో సుధర్ముఁడును సుదేహయు నచటికిఁ జేరి శివపాదారవిందంబులందుఁబడి మొ్రిక్కెరి. సుదేహకు శివదర్శనమాత్రంబునఁ బాపబుద్ధి నురిగె. జీవితుఁడై నపుత్త్రుని జూచి మురిసి తనదు ద్రోహబుద్ధికి ఘాతుకకృత్యంబునకుఁ బశ్చాత్తాపమొంది లజ్జించి యేడ్చె. శివుఁ డా సరసియందు లింగరూపుండై ఘుశ్మేశ్వరుఁడనుపేరఁ దన్ను గొలిచినవారల కభీష్టంబు లిచ్చుచుండె. ఘుశ్మ కొమరుని దోడ్కొని యక్కతోఁ బెనిమిటితో నిలుజేరె. కొడుకును జూచి కోడ లొందినయానందమునకు మేర లేదు. అంతట వారంద అన్యోన్యప్రేమలతో సంతోషంబుగనుండిరి. ఘుశ్మయు విభుండును సుదేహ యజ్ఞానబుద్ధితో నొనర్చినపాపకార్యమునకు దోషహరంబులగు ప్రాయశ్చిత్తంబుల నొనర్చి రదిమొదలు తటాకంబు శివాలయంబై యొప్పె నిట్లు శివభక్త ఘుశ్మచరిత్రంబు నొడివితి నిఁక భక్త బుషికచరిత్రంబుఁజెప్పెద వినుండనియె.

## 10. నందికేశ్వరలింగము - భక్త బుషిక

శ్లో॥ ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోహం తేషామపి కిముత బంధుత్వ మనయోః
త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధాశ్చ సకలం
ప్రయత్నాత్ కర్తవ్యం మదవనమియం బంధుసరణిః.

శివానందలహరి.

తా॥ ఓపశుపతీ! నీవు నిగ్రహానుగ్రహసమర్థుఁడవగు ప్రభుఁడవు కావున నే దీనజనులకు బరమబంధుఁడవు. నే నా దీనజనులలో మొదటివాఁడను,

ఇంక మనలమ్ము ... కమును గుఱించి యేమి చెప్పవలయును? నా యప రాధములన్నియు నీచే క్షమింపఁ బడగినవి. నాదుసంరక్షణము ప్రయ త్నము వలనఁ జేయఁదగినది. ఇది బంధువుల మార్గము.

... నొకపుణ్యావనంబందు సౌందర్యనిధియగు ... నొక బ్రాహ్మణకుమారి గలదు. ఆమెకుఁ బూర్వకర్మవశం ... బాల్యంబందే నాథుఁడు మరణించుటఁ జేసి బాల్యంబందే వైధవ్యంబు ... ఐనను నాయమ దీరయు నుచితజ్ఞయు నౌటఁ బరి ... శివదీక్షనొంది ప్రత్యహమును ద్రికాలంబులందు శివలింగం ... భక్తితోఁ బూజించుచుండె. యౌవనదశ యొదవినను గూడఁ ... శివైకనిష్ఠతోనుండి శివార్చనంబు సల్పుచుండె. ఇట్లుండఁ ... నొకనాఁడు నర్మదయందుఁ దీర్థమాడి యుదకంబుఁ ... చున్న నా బ్రాహ్మణయువతిని నొకరక్కసుఁడు చూచి రూపలావ ... మన్మథబాణంబుల నొచ్చి మోహాపరవశుండై ... యను సమీపించి తనమనోభీష్టంబుఁ దెలిపె. అయయ భీతయై తొలఁగి ... తాను నాముకయువతినిగాననియు వితంతువుననియును శివ ... ననియును దెలిపి యనుచిత పదంబునుండి హృదయం ... మరల్చికొనిపొమ్మని చెప్పె. మదోన్మత్తుఁడగు నాకరివ్యాదుఁ డుడు ... యామెతో నీ వంగీకరించిన సరియే లేకున్న బలా త్కరించి నిను గొనిపోయి యిష్టంబుఁ దీర్చికొనెద నని సమీపించుచుండె. ... యుత్తలంబొంది యద్దురాత్మునిబారినుండి తన్ను ... మవారి నెవ్వారిని గానక సర్వదుఃఖభయపరిహారకుఁ డగు మహేశ్వరుండె దిక్కని తలఁచి మదిలో నిట్లు శివుని గూర్చి ప్రార్థించు చుండె.

... దరగడ.

శివశివశివశివ ♦ శివశివశంకర, శివశివశివశివ ♦ శివమునికింకర
... ♦ కంజముజ్వల, రవిశశినయన హే ♦ రణ్య తనూజ్వల
... ♦ ... ము, నాపయి వీఁకనసురఁ దేగ ♦ వేయు ము ప్రాపయి
... ♦ దివ్యచిత్తమున, నీకెవరెదురు త్రి ♦ నేత్ర మొత్తమున
... ంబులకు ♦ నెవ్వని మొఱ్ఱిక్కడ, నాపదఁ బాపిన ♦ నభవా! దక్కడ

పాదమేల పెర ♦ వానికిఁజిక్కఁడు, మీఁదటఁ గనుఁగొన ♦ మిత్తికిఁదక్కఁడు
తలఁకొనఁజాలన ♦ ధర్మము దేవర, యలవునఁ జేరితి ♦ పాకరం! ప్రోవర!
శంకర! శంభో! ♦ శరణుచేసెదను, బంకజారిధర ♦ పదము డాసెదను
పంకిలకర్మముఁ ♦ బాయఁగఁజేయుము, వంకలఁబోవక ♦ వశ్యముడాయుము
కావఁగ రావే ♦ కరుణామూర్తీ, ప్రోవఁగ నీవే ♦ పూరితకీర్తీ!
నా నేరమిని గ ♦ నందగ దిత్తఱి, నీనెఱివప్పిన ♦ నీల్గును బిత్తరి
తల్లివి నీవే ♦ తండ్రివి నీవే, యెల్లలోకముల ♦ కేలికవీవే
భక్తురాల నీ ♦ పాలఁబడితి నిఁక, శక్తిపతీ! వే ♦ సాఁకుము గొంకక
ఒప్పరికించిన ♦ నొప్పానె నీకది, తప్పదు నీకిఁకఁ ♦ దారసింప కిది
రమ్మిఁకరమ్మిఁక ♦ రాజభూషణుఁడ, నమ్మితి నిన్నా ♦ మ్నాయభాషణుఁడ
గౌరీకాంతుఁడ ♦ కలుషవిదూరుఁడ, శ్రీరమణాదిక ♦ చిత్తవిహారుఁడ.

— శివపురాణము.

ఇట్లార్తితో నాయమ ప్రార్థించుచున్నంతనే హరుండు బిరబిర వచ్చి యసురుని వీక్షించినంతనే యవ్వాఁడు భస్మరాశియై కూలె. అంత బాలేందుధరుండు ఋషికను గాంచి భయంబువలదు. నీపరిశుద్ధచారిత్రంబునకు మెచ్చితి. వరంబులిచ్చెద నభీష్టంబులఁగోరుమనియె. అప్పుడప్పావనమతి యెంతయేని సంతసించి తండ్రీ! బ్రతికించితివి. సదయహృదయా! ధన్యనొనర్చి దరిసెనముగూడనిచ్చితి వని మ్రొక్కి యిట్లనియె.

సీ॥ ఆమెఁగా తెఱపి మే ♦ లామెఁగా సుఖముపెం
పామెఁగా పోమెఁగా ♦ డాయువనట
ఊడెఁగా మదము వె ♦ న్నాడెఁగా దృశము పో
నాడెఁగా యసురుఁడై ♦ త్యాధముండు
పాసెఁగా బాధ లోఁ ♦ డాసెఁగా బోధ వే
మాసెఁగా వెఱపు వి ♦ శ్వాసమెసఁగ
మించెఁగా కోర్కి రు ♦ చించెఁగా భక్తి ప్రే
మించెఁగా హృదయము ♦ దంచితముగ.
గీ॥ నిండెఁగా కీర్తి యెల్లెడఁ ♦ బండెఁగా మదీయపూజనమిడి పార్వ ♦ తీసహాయ
పొదలెఁగా యదరఖిలదు ♦ ర్హృదులకెంతొ సకలలోకైకరక్షణ ♦ చతుర!
యిప్పుడు. (శివపురాణము)

దేవదేవా! ఇంకను వరంబులేటికి? నీ విచ్చెద ననుట కిట్లడిగెద. నిరతము నీదుచరణసేవాసక్తి నాకొసంగుము. మఱియు జగంబుల నన పాయంబుగ సాఁకుట కివ్వనంబందు వసింపుమనియె. దయామయాత్మకుఁ డగుపరమేశ్వరుఁ డాయమ కట్లు వరంబిచ్చి యావనస్థలి లింగరూపంబు చెంది యుండె. ఆ లింగం బఖిలజనానందకరంబై యిప్పటి నందికేశ లింగం బని పేరొందె. అంతఁ బరమేశ్వరపత్నియగు గంగాదేవియుఁ దఱిసి వచ్చి ఋషికను జూచి అమ్మా! నీ సుచరితమ్మున కెంతయేని బొంగితి. నీ వనుదినము తీర్థమాడుచున్న నీ నర్మదాఘట్టంబందు వత్సరంబున కొక్క దినంబందు మార్గశీర్ష శుద్ధసప్తమీతిథియందు నేను ప్రవేశించి యుందు నమ్మునాఁడు మరలఁబోవుదు నని యంతర్ధాన మొందె. ఋషిక యానం దించి మొక్కె. పదపడి యాసుశీల ప్రత్యహము త్రివార మట్లే శివలిం గంబు నర్చించుచు శివానుగ్రహంబునొందె నిది భక్తఋషికాచరిత్రంబు.

## 11. కళావతిరాణి

శ్లో॥ త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా మ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో!
వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యై శ్చిరం ప్రార్థితాం
శంభో! లోకగురో! మదీయమనస స్సౌఖ్యోపదేశం కురు.

తా॥ ఓవిభూ! ప్రతిదినము నీపాదపద్మమును బూజించుచు నిన్ను దలఁచుచు నిన్ను దిక్కుగానొందెదను. వాక్కుచేత నిన్నర్థించెదను. దేవ తలచేఁ జిరకాలము ప్రార్థింపఁబడిన నీనేత్రసంబంధమగు కరుణా కటాక్షప్రసారమును నాకిమ్ము. ఓలోకగురుఁడా! ఓశంభూ! నా మన స్సునకు సుఖమగు నుపదేశమిమ్ము. —శివానందలహరి

శ్రీకాశీపట్టణమందు హరిస్వామి యనెఁడు నొకబ్రాహ్మణుండు కలఁడు. అతఁడు వేదంబులను వేదాంగంబులను జైమినీయ న్యాయవైయా సికంబులను జదివినపండితుఁడు వేదార్థంబుల నెఱింగినబుధుఁడు ఉపదేశ కుశలుఁడు స్వధర్మాచరణపరాయణుఁడు మితవాది శాంతుఁడు జితేంద్రి యుఁడు శివపూజానిరతుఁడు శివభక్తుఁడు. ఇట్టి ఘనున కొకకన్యారత్నము గలదు. ఆమె పేరు సుశీల. ఆ కన్నియను జూచినవా రెల్లరు సుందరరేఖా

విలాసంబుల నామె కీడగువారు ముల్లోకంబులందు లేరని దృఢంబుగఁ జెప్పుచుందురు. ఆ బాలిక యైదేండ్ల ప్రాయమునుండి తనతోడిబాలలతోఁ గూడుకొని యుషఃకాలంబుననే జ్ఞానవాపికయందుఁ దీర్థమాడి యాపైని భాగీరథిఁజేరి యందును స్నానమాడి మడిపుట్టంబుఁగట్టికొని తిలకంబు ధరించి వరిపిండిని బసపుకుంకుములను మఱియుఁ గొన్నిరంగుపొడులను గంగాతీర్థంబును భస్మచందనాక్షతంబులను దుమ్మిపూలను మాఱేడుదళములను మధురఫలములను గొని శ్రీవిశ్వనాథునిబజారంబున కేగి శ్రీవిశ్వనాథలింగంబునకు గంగాతీర్థమున నభిషేకముచేసి పూజావస్తువుల నర్పించి పూజించి యన్నపూర్ణాంబికను డుంఠివిఘ్నేశుని మాధవుని దండపాణిని గాలరాజును లోలార్కుని సేవించి ముక్తిమంటపంబుఁజేరి యందు బంచవర్ణంబులతోఁజిత్రవిచిత్రంబులగుపద్మంబులను బుష్పితలతలను హంసంబులను మయూరంబులను వనంబులను బ్రాసాదంబులను రచనయొనర్చి యాపైఁదనగేహంబున కేగుచుండును. ఆమె తమమందిరంబునుండి శ్రీవిశ్వేశ్వరాలయమునకుఁబోవునపుడును మరల వచ్చునపుడును మార్గంబున నామెను గనుగొన్నవార లీయమ యిందిరయో లేక రోహిణియో కందర్పునిసుందరియో యిట్లు బాలయై పుడమికి వచ్చి యిందుశేఖరుని గొల్చుచున్నదని మనంబులం దువ్విళులూరుచుందురు. ముక్తిమంటపమునందామె రచించిన పంచవర్ణచిత్రంబులఁ జూచి ముల్లోకంబులవారు మురియుచుందురు. ఇట్లు ప్రత్యహ మాభూమిసురకుమారి విశ్వనాథుని బూజించుచుండ నామెకు బాల్యంబు దరిగి యౌవనాంకురంబొదవె. అంత సౌందర్యంబును లావణ్యంబును శృంగారవిలాసంబులు మఱియు నినుమడించి ప్రకాశించె. తండ్రియగుహరిస్వామియు నామెకు శీఘ్రంబుగఁ బాణిగ్రహణంబుఁ గావింపటకై తగినవరుని వెదకుచుండె. అంతకు మున్నామెను జూచి కామించి యున్నయొకవిద్యాధరరాజకుమారుండు మలయకేతుం డనువాఁడు పుష్పకం బెక్కి యొకనాటినిశీథంబున వేసవిపండువెన్నెలలో మేడపైని దల్లిదండ్రులకడ నొకమంచముపై నిద్రించుచున్న సుశీలను డగ్గఱి నెత్తమ్మిరేకులకన్న మెత్తదనంబు కల్గిన తనసుకుమారహస్తపల్లవంబులతో నామె నెత్తుకొని పుష్పకంబుఁజేర్చుకొని యంతనే వైహాయసమార్గంబున మహావేగంబుతోఁ బ్రయాణంబుచేసె. గాఢనిద్ర నొందు

చున్నకతన హరిస్వామియు నాయనసతియుఁ దమకూతు రి ట్లపహరింప బడుట నెఱుంగకైరి. సుశీలయు గాఢముగ నిద్రించుచున్నకతన నే మేల్కాంచదయ్యె. ఇట్లు విద్యాధరుండు సుశీలనుదోడ్కొని కడుంగడు వేగంబుతోఁ జరమయామంబువఱకు మలయాచలంబుఁ జేరి యందలి విశాలోన్నతశిఖరంబున బుష్పకంబును బుడమిదింపె. అంతనే నొకనిశా టుండు రాత్రియంతియు గిరికాననంబునఁ జరించి చతుర్థయామంబువఱకు దననెలవుకుఁ జేరఁబోవుచు శైలాగ్రశిఖరంబును జేరియున్న విమానం బును విద్యాధరకుమారుని మఱియు మెఱుపుతీగయో లేక పసిండి కేసంగి విరిదళమో కాక మేలిమిబంగరుబొమ్మయో యనదగు కన్యారత్నమును జూచి బ్రిమసి మురిసి మన్మథశరతాడితుండై యా త్రిలోకసుందరిని హరింపఁబూని యామె కేసి రయంబున డాయుటయుఁ జూచి సత్వరంబున మలయకేతుండు వాని కెదురేగి యాగి యవ్వానితోడ యుద్ధంబునకుఁ గడంగె. అపుడు సుశీల ప్రభాతమందమారుతస్పర్శణంబున మేల్కాంచి తమ యింటియందలిశయనంబునఁ గాక యొకపర్వతోన్నతశిఖరంబునఁ బుష్పకంబున నున్నతన్ను జూచి తనదండ కసురను జేరనీక యడ్డుపడి యవ్వాని మార్కొని పోరుసల్పెడు విద్యాధరరాజకుమారుని బలాత్క రించి తనకై పుష్పకంబును లంఘింపఁ బ్రయత్నించురక్కసునిఁ జూచి యిరువురును దన్ను గామించి యున్నట్లును నందు విద్యాధరుండు మొదటఁ దన్నపహరించి పుష్పకంబునఁదెచ్చినవాఁడనియు గురుతించె. అంత బల శాలులగువా రిద్దఱు ఢీకొని ముష్టియుద్ధంబునఁ బెనఁగుచుఁ బరస్పరము బాహులప్పలించుచుఁ బట్టుకొనుచు విడుచుచు నొడుగఱచుచు కంఠంబు లొత్తుకొనుచు కచగ్రహణంబులొనర్చుచు ముష్టీముష్టిఁ బోరిరి. కొంత తడ విట్లు పోరి సమానబలశాలులగు వా రిద్దఱు పరస్పరముష్టిఘాతంబుల హృదయంబులవిసి ప్రాణాంతదశ నొంది పుడమిఁ గూలిరి. ముందుగ రాకసుం డుసురుబాసె. అనంతరంబు విద్యాధరుండు సుశీలను జూచి కన్నీళ్లువిడుచుచు "కటకటా! నిన్నుగామించి తెచ్చి యిట్లు నడికాన కప్పగించి" యనుచు నసువులవిడిచె.

శ్లో॥ అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్.
(తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును)

సుశీల యంత దురంతచింతాకాంతమై తనకు దాపరించినయవస్థకు శోకంబును మోహంబును నచ్చెరువును రిచ్చపాటును జెంది యా యరణ్యంబునఁ దనరోదనం బరణ్యరోదనం బగుట నెఱింగి యందుఁ బ్రయోజనంబు లేదనుకొని తన్ను గామించి తెచ్చినవిద్యాధరరాజకుమారుని జూచి యితండు నన్ను వరించి సెజ్జనుండి యెత్తుకొని బాగుగ దేహస్పర్శసౌఖ్యంబు నొందె. నాదుముఖారవిందంబు సుగంధంబుల నాఘ్రాణించె. నన్నెత్తికొనిబిగ్గ కౌగిలించె. నా కిఁక మగఁ డెవ్వఁడు? ఇతఁడే నాథుఁడు. నేనాలను. నా దౌర్భాగ్యంబున నీతండిట్లు కాలధర్మంబు నొందె. ఇట్లీతనిచేతఁబడి మరల వేఱొకని కాసపడుట సతీధర్మంబు కాదు. విధవనై యీజన్మంబు నంత గడుపఁజాలను. కావునఁ జితింబేర్చి యీతని ననుగమించెదను. పుణ్యలోకంబునఁ గలిసికొనెదను. కొన్నినిముసంబులు మాత్రము తాపంబొనరించు హుతాశనజ్వాలలు నన్నేమిసేయును. ఓర్చుకొని విభునితో స్వర్గంబుఁ జేరెద నని మనంబు దృఢంబు చేసుకొని జాగుచేసినచో వేఱొకఁడెవ్వఁడేని చేరి చూచినఁ దన ప్రయత్నమున కడ్డువచ్చుననియు దా నవ్వానికి గైవసంబు గావలసివచ్చుననియుఁ గాక క్రూరమృగంబులవాతఁబడుదునోయనియుఁ దలఁచి వేవేగఁ జందనకాష్ఠముల నేరి తెచ్చి విద్యాధరతనువుపై సెదంబేర్చి జ్వలితకాష్ఠంబులఁ జిచ్చుదరికొల్పె. అప్పుడాను నొకపద్మసరస్సునఁ దీర్థంబాడి నిండారవిరసినబొండుమల్లియల కమ్మగుత్తులఁ గైశ్యంబందుఁ దురిమి చితిజ్వాలలకభిముఖంబుగనిలిచి మంతనంబున నిట్లుదలపోసె.

క॥ ఏమిటఁదప్పితినొకో నా, స్వామికి విశ్వేశ్వరునకు ♦ వారాణసిలో
నేమమున నెల్లరునుదమ, ధామంబులనుండ నిట్టి ♦ దశ నాకొదవెన్.

సీ॥ జ్ఞానవాపీపయః ♦ స్నానక్రియావేళఁ, జెలికత్తియలునన్ను ♦ దలఁతురొక్కొ
మదిలోన నెభ్భంగి ♦ మఱఁగుచుండుదురొక్కొ తల్లిదండ్రులుసత ♦ తంబునాకు
హరితాంకురంబులే ♦ నందీక మేయని, హరిణశాబము నెవ్వ ♦ రరయువారు
సేవచేయించుకోఁ ♦ జిత్తగింపఁడుగదా, నాచేతశ్రీవిశ్వ ♦ నాయకుండు

గీ॥ కాశిలోలార్క కేశవ కాలనాథ, దండనాయక డుంఠి వేదండవదన
సంభ్రమోద్భ్రములార యో ♦ జహ్నుకన్య, గానవచ్చెద మిమ్ము ముం ♦
గలిభవమున.
(శ్రీనాథకవి కాశీఖండము)

గీ॥ కాశీపురి యేడ మలయపవనంబి దేడ, విశ్వపతిమందిరంబేడ విపిన మేడ
మునిబోర్చుపమేడ యీ చచ్చుటేడ, కటకటా కూర్చెనెదో
పూర్వ కర్మమిట్లు.

అనియిట్లు దుఃఖాతురయై కొంతసేపు వసంతకాలంబుం దెలమా
విన్నాయుకోయిలమెలుంగున నా బాలకురంగనయన వెక్కి వెక్కి
యేడ్చి తనపుండాన నిరోధించికొని చేతులుమోడ్చి తనకుజన్మస్థాన
మగు బురమేశ్వరప్రియనివాసంబు నగు కాశీపట్టణంబును విశ్వనాథుని
అన్నపూర్ణను డుంఠి మాధవ కాలరాజప్రముఖాఖిలదైవంబులను దలం
చికొని కొలిచి కాశీపురంబందు బ్రాహ్మణాగ్రహారంబందు ముక్తాగ్ర
హారంబగు నాపుట్టినయిల్లు సంపత్సమృద్ధంబై యభివృద్ధినొందుగాక.
నానాదిగ్దేశవాసినీజనాగ్రిగణ్యయగు నాతల్లి నిత్యసువాసిని యగుం
గాక. సకలవిద్యాస్థానవిద్వన్మూర్ధన్యపట్టభద్రుండును కాశీనగరపండితా
ఖండలుండును నగునా జనకుండు హరిస్వామి సాటివారిలోం బూజితుం
డగుంగాక. నాచుట్టంబు లెల్ల సట్టులేనిసంపదలతోం బొదలుచుం దామర
తంపరగ వేలొంది మనుదురుగాంత. ఎల్ల జనంబులు సుఖంబుల రంజిల్లు
చుందురుగాంత యని దీవించె. మఱియును దాను బ్రత్యహం బుషస్సులందు
స్నానమాచరించి భాగీరథిని దీర్ఘమాడినఫలంబును విశ్వనాథు నన్నపూర్ణను
డుంఠి ప్రముఖులంబూజించినఫలంబును ముక్తిమంటపంబున మృగ్గులు
రచించినఫలంబును కాశీక్షేత్రంబందు జన్మించినట్టిఫలంబును సర్వంబును
గూడి తన్ను గామించి తెచ్చి తనకై మృతినొందిన విద్యాధరరాజకుమారు
నకే తన్ను భార్యను జేయుగాంతయని యర్థించి గభాలున నగ్నిజ్వాల
యందు దుమికె. ఒకటిరెండని మేషములలోం బ్రాణంబులం బాసె. ఆహా!
పతివ్రతాశీల యగునామె కెట్టి వైపరీత్యము పొసంగినది. పూర్వజన్మ
కర్మంబెట్టిదియో యిట్లుపరిణమించినది.

శ్లో॥ యస్మాచ్చ యేనచ యదాచ యథాచ యచ్చ। యావచ్చ యత్రచ
శుభాశుభమాత్మకర్మ। తస్మాచ్చ తేనచ తదాచ తథాచ తచ్చ
తావచ్చ తత్రచ కృతాంతవశా దుపైతి॥ పంచతంత్రము—

తా॥ ఏందువలన ఎవనిచే ఎప్పుడు ఏప్రకారముగాను ఏది ఎంతవఱకు
ఎచ్చట పుణ్యపాపరూపమైన కర్మము చేయంబడుచున్నదో అందు

వలన వానిచే అప్పుడు ఆప్రకారముగాను అది అంతవఱకు అచ్చట యమునిచే ఆ సుఖదుఃఖరూపమైన ఫలమును బొందింపఁబడుచున్నది.

ఇట్లాసుశీలయొక్క యత్కించిత్సంగతిచే నిధనంబొందిన విద్యాధరకుమారుఁడును ఆమెసాన్నిధ్యంబున మృతినొందినరాత్రించరుఁడును స్వర్గంబుఁజెందిరి.

శ్లో॥ సత్సంగజాని నిధనాన్యపి తారయంతి. (ఉత్తరరామచరిత్ర)

(సత్సంగమునఁ జేకూరిన మరణంబులు గూడఁ దరింపఁజేయును.)

విద్యాధరుఁ డంత్యకాలంబునఁ బ్రియాస్మరణం బొనర్చి తద్గతభావుఁడై సురిగెనుఁ గావున నాపైఁగొంతకాలంబునఁ బృధ్వీతలంబున మలయకేతుఁడనునామమున నొకరాజనందనుఁడై జన్మించె. సుశీలయుఁ దాఁ బూర్వజన్మసంకల్పప్రకారంబునఁ గళావతియనుపేరున రాకొమరితయై పొడమి మలయకేతుని బెండ్లియాడె.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం
తంత మేవేతి కౌంతేయ సదా తద్భావభావితః. భగవద్గీత—

తా॥ మరణకాలమందు దేహి యెట్టిభావంబును స్మరించునో ఆభావముచేఁ జుట్టఁబడి యద్దాని నొందును.

ఆ రాజదంపతు లన్యోన్యము పూర్వజన్మవాసనావశంబున అసమానప్రేమానుబంధహృదయులై పరిజనంబులపట్ల సదయులై సకలధర్మాభిమర్శనంబునఁ బ్రబుద్ధులై శివారాధనంబున బద్ధులై యుండిరి. మఱియు నారాజపత్ని యాదిగర్భేశ్వరి యైనను పూర్వపుణ్యానుసారంబున దేహంబందు చందనాగరు కస్తూరీసుగంధసారంబుల నొల్లక భస్మంబును బూసుకొనుచుండు. అట్లే యురంబందు రవలపేరులు ముత్యాలహారంబులు బంగరుచంద్రహారంబులు విసర్జించి రుద్రాక్షహారంబులను గారవించి ధరించును. ఎల్లకళలందుఁ జతురయైనను గీతవాద్యనటనంబుల హాస్యాలాపచమత్కారంబుల నిచ్చగింపక నిచ్చలు పరమేశ్వరలీలా కథామృతంబుల నాస్వాదించి యానందించుచుండు. అట్టి సుచరిత్ర మలయ

శేతు మహీపాలచంద్రునకు సకలసద్గుణపాత్రులగు మూగురు పుత్త్రికలను గనియె. అంతఁ గొంతకాలంబున కొకచిత్రకారుం డొకచిత్రపటంబునఁ గాశీపురీస్థానంబు నెల్ల లిఖించి తెచ్చి రాజమందిరంబుఁజొచ్చి కళావతీ మలయకేతులసముఖంబున నద్దానినుంచె. రాణి కళావతి యాపటంబును జూచి పూర్వజన్మవాసనావశంబునఁ దన్ను దామరచి సమాధిస్థితవోలె నేత్రంబులను మూసికొని క్షణమాత్రంబూరకుండి మరల కన్నులు దెఱచి చూచి యాచిత్రపటంబునందలివిశేషంబు లశేషంబుగ పూసగ్రుచ్చినట్లు నాథున కిట్లుచెప్పఁదొడంగె. మహారాజా! ఇదిగో గంగయనెడునారితో లోలార్కమాధవులను నగ్రద్వయితో గాశీనగరంబను ధనుస్సునుబట్టి సందియనెడుబాణంబున విశ్వనాథుండను మహాయోధుండు పాపరాశి యను లక్ష్యంబును వేటాడి యంతమొందింపుచున్నాఁడు చూడుము.

సీ॥ అదె వియద్వాహిని ♦ యదె మణికర్ణిక
యదె కాశి నిఖిలక ♦ ల్యాణరాశి
అదె విధాత్రుకపాల ♦ మవని వ్రాలినచోటు
వాఁడెశ్రీమత్కాళ ♦ వటుకరాజు
పంచతీర్థంబదె ♦ ప్రణవమంత్రాకృతి
మత్స్యోదరీస్థాన ♦ మండలమదె
కామేశ్వరుఁడువాఁడె ♦ స్కందేశ్వరుఁడువాఁడె
వాఁడె వినాయకే ♦ శ్వరుఁడుహరుఁడు.

గీ॥ శశికిరీటుండు పార్వతీ ♦ శ్వరుఁడువాఁడె
వాడె భృంగీశుఁ డద్వరే ♦ శ్వరుఁడు వాఁడె
వాఁడెయష్టాదశాంగులే ♦ శ్వరుఁడు శివుఁడు
ధర్మశాస్త్రీశ్వరుఁడువాఁడె ♦ ధరణినాథ!

గీ॥ ఇతఁడు సారస్వతేశ్వరుఁ ♦ డిందుమౌళి
యితఁడు రత్నజాతీశ్వరు ♦ డిభవిరోధి
యతఁడు శైలేశ్వరుఁడు భుజం ♦ గాభరణుఁడు
సప్తజలధీశ్వరుఁడు వాఁడె ♦ శంకరుండు.

సీ॥ సప్తకోటిమహార్హ ♦ సన్మంత్రములకు న
దీశ్వరుం డితఁడు మం ♦ త్రేశ్వరుండు
త్రిపురేశ్వరుఁడు వీఁడె ♦ త్రిపురదానవులకు
సాన్నిధ్యమైపూజఁ ♦ గొన్న వేల్పు
బాణేశ్వరుడు వీడె ♦ బాణాసురునకు వే
భుజములిచ్చినచంద్ర ♦ భూషణుండు
వైరోచనేశుండు ♦ వాఁడె ప్రహ్లాదేశ
నారదేశ్వరు లల్ల ♦ వారు చూఁడు

గీ॥ ధరణినాయక! యాదిగ ♦ దా ధరేశ
భీష్మకేశభృగ్వీశగో ♦ పీముకుంద
నారసింహేశ్వరాత్రేయ ♦ నాధశేష
విఘ్నరాజేశ్వరులఁజూఁడు ♦ వేయువేయు. (శ్రీనాధకాశీఖండము)

ఇట్లు పెక్కులింగంబులను బెక్కుపుష్కరిణులు మున్నగువాని జూపి యాపై జ్ఞానవాపిని జూచి స్తంభము రోమాంచము మున్నగు సాత్వికవికారంబు లొంది మూర్ఛిల్లి విభుండును దాసీశతంబు లంతనే శిశిరోపచారముల నొనర్పఁగ నామె తిరుగ గన్నులు తెఱచి కాశీపటంబు నక్కున శిరంబుపై నిడికొని మ్రొక్కి ఇది జ్ఞానవాపి ఇది జ్ఞానోదకము ఇది శివతీర్థమని ముమ్మారుపలికె. వాడినవరిచేను వానచేఁ బొదలినట్లు తిరుగఁబ్రకృతిఁజెందె. అంతఁగళావతీకాంత యత్యంతంబు నిజకాంతుని గాశీయాత్రకై ప్రేరింపుటయు నతండును బుత్రులకు రాజ్యపట్టాభిషేకం బొనర్చి నిత్యశివార్చనాదానాతిథ్యభోజనంబులకు వలసినధనంబును గొని పరిచారకులను దోడ్కొని శుభముహూర్తంబునఁ దానును రాణిగళావతియు నిష్టదేవార్చనలఁ బొనరించి కాశీప్రయాణంబు నొనరించి కొన్ని దినముల కచ్చటికిఁజేరి మణికర్ణికనుదీర్థమాడి శ్రీవిశ్వేశ్వరాన్నపూర్ణా డుంఠిగణపతులను మాధవదండపాణులను గాలభైరవలోలార్కులను బూజించి తక్కుగలదైవంబుల నారాధించి జ్ఞానవాపీసమీపంబునఁ గాపురంబునొంది తపంబుచేసి భార్యాసహాయుండై నిరపాయం బగు మోక్షంబు నొందె. శ్రోతలారా! ఇది కలావతీచరిత్రంబు జ్ఞానవాపీ

శ్రీ మాహాత్మ్యసంశోభితంబు. ఇకఁ బుణ్యవతియగుమలయగంధి చరిత్రంబుఁ జెప్పెద వినుండు.

## 12. మలయగంధి - విద్యాధరి

శ్లో॥ అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభం
ప్రాప్నోతీహ యధాతధం పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే.

శంకరాచార్య శివానందలహరి.

టీ॥ ఊడుగుగింజలు పండి నేలరాలి మరల వానికవియే ఆచెట్లనంటుకొనును. సూది సూదంటిరాయియొద్దకు బరుగిడి యద్దాని నంటుకొనును. పతివ్రత దనవిభుని నెడఁబాయక వెంటనుండు. తీగ చెట్టును బ్రాకి యల్లుకొనియుండును. నది సముద్రమును జేరియుండును. అట్లు మనోవృత్తి శివపాదకమలంబులందుఁ జెందియుండుటయే భక్తి యని చెప్పఁబడును.

తొల్లి కాశీనగరప్రాంతంబం దొకపట్టణమున మిత్రజిత్తనుపేరు గలయొకక్షత్రియుఁడు కలఁడు. అతఁడు మిక్కిలి బలవిక్రమములు గల వాఁడు ధార్మికుఁడు ప్రజలకు హితమొనర్చుటయే ప్రధాన మని తలఁచు వాఁడు విష్ణుభక్తుఁడు దాత గోబ్రాహ్మణహితకార్యాసక్తుఁడు నీతిసంపన్నుఁడు యుద్ధసమర్థుఁడు విద్వాంసుఁడు కృతజ్ఞుఁడు బొంకనివాఁడు పాపపరాఙ్ముఖుఁడు జితేంద్రియుఁడు మృదువుగ మధురముగ మాటలాడుజాణ సుందరరూపంబునఁ జందురుఁడు ధనముల నిధిపతి లేఁబ్రాయఁపువాఁడు చతురుఁడు మేధావంతుఁడు పరదూషణముసేయనివాఁడు ఎల్లపుడు శ్రీనారాయణచరణారవిందంబులందుఁ జిత్తంబుహత్తించి యలరువాఁడు నిరతము హరినామజాపకుఁడు సాలగ్రామపూజా పరాయణుఁడు తన రాష్ట్రప్రజలనెల్ల విష్ణుభక్తులఁ గావించి యేమఱక వారలభక్తిని బరీక్షించుచుండెను. ఇట్టి సుగుణనిధియగునమ్మహారాజేలునట్టిదేశంబున నందఱు వైష్ణవులై శ్రీనారాయణార్చన నొనర్చుచు నిచ్చలు శ్రీహరినామస్మరణామృతంబుఁ గ్రోలుచుఁ దన్మయులై భగవదానందపరవశులై

యుందురు. ఎవ్వరిమేడలందుఁ జూచిన శ్రీహరిలీలాపటంబు లమరియుండు. ఎవరియింటిమగసాలలందును హరికథాకాలక్షేపంబు లమరియుండు. ఎవని ముఖంబునను శ్రీరామ నారాయణ పురుషోత్తమ హరీ గోవింద గోపాల కృష్ణా విష్ణు హృషీకేశ దామోదర వనమాలి అచ్యుత శ్రీనాథ చక్రపాణి త్రివిక్రమ పుండరీకనయన యని భగవానునిదివ్యనామంబులు వాకొనఁబడుచుండును. హరివాసరములందుఁ బిన్నలు పెద్ద లననేల తల్లుల చను పాల్గుడుచుశిశువులు గూడఁ బాల్గుడువక నిరశనంబుగ నుందురు. పశువులు తృణభక్షణంబుమాని యుపవసించును. బాపలుమొదల్కొని పంచముల వఱకు స్త్రీలుఁ బురుషులు నెల్లవారు విష్ణుభక్తిసేయుచు నానందంబున నుందురు. అట్లుగాక యెవఁడేని భక్తిమాలియున్న నవ్వాని నెఱింగి వేగంబున ఱేఁడు శిక్షించుచుండును. ఇట్లుసుఖంబుగ నమ్మహీపాలుండు రాజ్యమేలుచుండ నొకనాఁడు నారదముని యా రాజాస్థానంబున కేగఁగ నా రాజవర్యుఁడు నారదముని నెదుర్కొని అర్ఘ్యపాద్యాదులఁ బూజించి యొకబంగరుగద్దెపై నెక్కించి మ్రొక్కి కుశలంబడిగె. నారదమునియు సంతసించి మహారాజా! నీయట్టిపరమభాగవతోత్తముని జూచినకతమున నేను ధన్యుఁడనైతిని. సర్వభూతంబులందు జగన్నాథుండగునారాయణుని నీవు చూచుచున్నావు. ఏవేదపురుషుండగు యజ్ఞపురుషుండు జగం బంత నిండి వెలుంగుచున్నాఁడో అట్టివిష్ణుదేవుని నీవు గురుతించి హృదయంబున నిల్పి చూచుచున్నావు. నీవు దేవతలకుఁగూడ గణనీయుఁడవు. రాజ చూడామణీ! క్షణభంగురం బగు నీ సంసారం బందు సారంబైనది శ్రేయస్సాధకంబైనది కమలారమణచరణసమాశ్రయణం బొకఁడే. జగంబున నేఱొకదానింగోరి ఫలాపేక్షనొందక ఫలంబు సర్వంబు పురుషోత్తమున కర్పించి సేవించుటయే కదా పరమధర్మము. ఆ హృషీకేశునియం దెవని హృషీకంబు లన్నియుఁజేరి నిలిచి యుండునో అట్టివాఁడే కద యీచపలం బగుప్రపంచమునుండి నిత్యంబగు పరమపదంబు నొందుచున్నాఁడు. తామరాకునందలి నీటిబిందువు వలె నీయావనం బీయాయువు చపలం బని యెఱింగి యచ్యుతుని సమాశ్రయించినజనుండే పూజనీయుండు. ఎవనివాఙ్మనసంబులం దెల్లపుడు జనార్దనుండు సేవింపఁబడుచుండునో అట్టివాఁడు మనుష్యరూపుఁడగునారాయణుండు. అవ్యాజంబుగ నెవఁడు

నిష్ఠలు శ్రీయఃపతిని బూజించుచుండునో అట్టివాఁడు శ్రీమన్నారాయణు తేజంబునొందుటయందు సందియంబు లేదు. భూపాలచంద్రా! నీ విష్ణుభక్తికి నామానసమం దెక్కుడుగ నానందమొందితిని. ఐన శూరాగ్రణీ! ప్రస్తుతమొక్కదానికి నీచే నుపకారంబు చేయింపఁగోరి యిందు వచ్చితిని. వ్యర్థము లేక నీవు చేయుదునందువేని దెలిపెద ననుచు సారవంతంబులగు నారదమునీంద్రునివచనంబుల కలరి శత్రుజిత్తుం డద్దియేదియో సెలవీయుఁడనె. అంత నారదర్షి యిట్లు వాక్రుచ్చె. రాజేంద్రా! ఒకవిద్యాధరతనయ మలయగంధి యనునొకకన్యక యొకనాఁటి సాయమందు తమ యుద్యానవనమున గౌరీదేవిం బూజించుచునుండగాఁ గంకాళకేతుం డను నొక్కప్రబలరాక్షసుం డెత్తుకొని పోయి పాతాళలోకంబునఁ జంపకావతియనునగరంబున వానియింట బందిచేసి యుంచుకొనియె. నేఁటికి మూఁడవరోజున నామెను బలాత్కారంబునఁ బెండ్లియాడఁ బూనియున్నాఁడు. నేను హాటకేశ్వరుని సేవించుట కందుఁబోయి యటకు వచ్చిన యాకన్నియను జూచితిని. ఆమెయు నన్ను జూచి కన్నీరుగార్చుచు జనాంతికంబునఁ దనయవస్థనంతఁ జెప్పికొని దుఃఖించి కంకాళకేతుండు దుర్జయుఁడనియు నవ్వాఁడు దనత్రిశూలంబునఁ గాక యన్యసాధనంబుల నిహతుండు గాఁడనియు సాధారణంబుగఁ బవలంత నిదురించుచుండుననియు ఆపదెఱింగి దయాళుం డగుహరుఁ డొకఁడందుఁజేరినఁ దానా త్రిశూలంబు బాతని కిచ్చెద ననియు దానిచే నశ్రమంబుగ నసుర నంత మొందింప వచ్చుననియు భగవతియగు శ్రీపార్వతీదేవి తనకు స్వప్నమం దగుపడి విష్ణుభక్తుండగు నొకలేఁబ్రాయపుక్షత్రియశూరుండు దర్శనీయుండు దయాళుండు దాయవచ్చి యసురం జంపి తన్నుఁగాచుననియు అతఁడే తనకుఁ బెనిమిటి కాఁగలఁడనియు నుడివెనఁట. తాను గొంతకాలం బా రక్కసుని వంచించి గడువుఁ గైకొని యున్నదఁట. అయ్యది ఇఁక మూఁడుదినములకు ముగియునఁట. ఆ వెంటనే తన్ను మానవాశనుండు వివాహమాడునఁట. అట్టివానినుండి తప్పింపుమని యాయమ నాశరణంబుఁ గోరినది. అచట నుండియే యిటకు వచ్చితిని. నేను యోగజ్ఞానంబున భగవతి పార్వతీ మహాదేవి చేఁ జెప్పఁబడిన పురుషుండు నీవ యౌట నెఱింగి నిశ్చయించి నీ చెంతకు వచ్చితిని. నీవు నామాటను ద్రోసివేయక వేగంబుగ ప్రయా

ణంబుసల్పుము. దుర్వృత్తుని రక్కసుని బరిమార్పుము. కన్యయును రూపవతియును గుణవతియు నగు మలయగంధిని బ్రతికించి పెండ్లాడుము. నీచే నీ కార్యము కాఁగలదు. ఆలసింపకుము. అని నారదుండు బోధింప ననుకంపయు నింపు జనింప లంపటుండై యా భూపాలచంద్రుండి ట్లనియె. మునీంద్రా! పాతాళంబున నున్న నామెయొద్దకు నేఁజేరు టెట్లు? నన్నామె గుర్తించుట యెట్లు? సర్వంబు సంఘటనం బగునట్లు తెల్పుఁడు. మీసెలవొందె యొనర్చెద నన నమ్ముని యిట్లనియె. మహారాజా! యెల్లుండి పూర్ణిమాతిథి. అం దుషఃకాలమున గంగాసాగరసంగమంబుఁ జేరుము. అం దొకనౌక నీ కగుపడును. అందు వీణాపాణి యగు నొక పదియాఱేడులబాల జగదంబను గుఱించి సుస్వరంబుగ గానంబుసేయుచుండు. ఆపెయే మలయగంధి. నీ వొకపడవ నెక్కి యాయోడయొద్దకుఁ బోయి యోడఁజేరుము. పరమేశ్వరీవరప్రకార మటకు వచ్చితి ననిన నామె నిన్ను గురుతించి యభినందించు. ఆపెతోఁ బాతాళంబుఁ జేరుము. అం దామె నీ కందించిన త్రిశూలంబున నారాత్రించరుని బంచత్వమొందింపుము. అటుపిమ్మట ఆమెసర్వస్వమునకు నాథుఁడవై యామెను గాంధర్వంబునఁ బెండ్లాడుము.

శ్లో॥ యత్కర్మ విహితం యేన శుభం వాపి శుభేతరం
సఏవ భుఙ్క్తే తత్తథ్యం విధిసూత్రనియంత్రితం.

తా॥ శుభంబైన నశుభంబైన నెట్టికర్మం బెవనిచేతఁ జేయఁబడునో బ్రహ్మసూత్రముచే నియోజితంబైన సద్దానినవ్వాఁడనుభవించును. ధృడంబు.

అని చదివి నారదుండు యథేచ్ఛఁజనియె. భూనాథుం డువ్విళులూరుచు నమ్మఱునాఁడు పయనంబుచేసి గంగాసాగరసంగమంబుఁ జేరి పూర్ణిమాతిథియం దుషఃకాలంబునఁ గాల్యంబులఁగడపి యొక పడవ నెక్కి కడలియందు నలుగెలఁకులఁ బరికింపుచుండె. అంతలో నొకయోడ గన్పట్టి సమీపించె. అం దపూర్వసుస్వరయుతంబగు నొకజగదంబికా ధ్యానపద్యం బిట్లు రాగమితంబు వినఁబడియె.

శ్లో॥ మహితతపోజ్వలితాంతాం। మహాగ్నివర్ణాం మహేశ్వరాత్మసతీం
... సత్కర్మశ్రీజుష్టాంబాం। దుర్గామహం భజామ్యనిశం...

గా॥ కొప్పతపస్సుచేఁ బ్రకాశింపునట్టిదియును గొప్పయగ్నివంటి వర్ణము గలదియు మహేశ్వరునిపట్టపురాణియు సత్కర్మంబులభాగ్యమందుపా స్యమానయును నగుదుర్గాంబను నేనెల్లపుడు సేవించుచున్నాను.

అంతనా గౌరీధ్యానగానంబు నాలకించి సంతసించి యా శూరగ్రా మణి దోహదముగ విహరింపుచు జంత్రిగాత్రము లేకము చేసి గాయనంబు సేయుచున్న వికిలోచని మలయగంధిని జూచి విస్మితుండై యిట్లు విత ర్కించె. త్రిభువనసౌందర్యలక్ష్మి యిట్లు రూపంబు సెందివచ్చినదా! లేక మహాభయంబున స్వపదంబు బాసి పుడమిఁ జెందిన చంద్రునిమూ ర్తియా! కాక నాయిష్టదైవంబగు పురుషోత్తముఁడు నాకొరకై వేలోక స్త్రీ చే నీ స్త్రీరత్నమును నిర్మించి యిట్లు నాయొద్దకుఁబంపెనా! యని పెక్కుతెఱఁగులఁ దర్కింపుచు మందమందముగ నచ్చేలువయున్న యోడను డాసెను. మలయగంధి యర్ధనిమీలితాక్షియై జగదంబికను ధ్యానంబున నిలిపించి మ్రొక్కి కన్నులు దెఱచి మున్నిటిదెసఁజూచినంతనే పడవ డెక్కి విహరించినసుందరమూర్తిని బరమభాగవతోత్తముని విశాల వక్షస్కుని దులసీహారవక్షుని గోపీచందనాంచితవదనుని హరినామా మృతసుధాపానపరితృప్తుని శూరాగ్రగణ్యుని సదయహృదయుని దరుణ కౌశికుని గాంచి యితఁడే గౌరీవరప్రాప్తుండని తలఁచి సంతసించి పీఠం బునుండి లేచి సిగ్గున నించుకతలవంచుకొని నిలిచి కార్యార్థినియగుట నారాజనందనునుద్దేశించి తానే యిట్లు పలికె. ఓకరుణామూర్తీ! నీవెవ్వ రివైనిట కేలవచ్చితివి! మందభాగ్యనగు నన్నుద్ధరింపవచ్చితివా? పాపి యగు నొకరక్కసుఁడు గడుంగడు బలవంతుఁడు. వాని నెట్లుఁ జెనకి యోర్చె దవు? నాకు నుమావరంబు కలదు. శ్రీయఃపతిభక్తుఁడొకఁ డీనాఁడు నీచోటికి వచ్చి నిన్ను జేరుననియు నతఁడు సమర్థుఁడు గావున రాక్షసుని సంహరించి నిన్ను జేపట్టు నని పార్వతి స్వప్నమునతోఁ బూర్ణిమనాఁడు గంగాసాగరసంగమంబుఁ జేరు మని నాకు నుపదేశించె. ఇపుడు నీ వతఁడవే యని యూహించితిని. ఓడ యందు నన్ను గాచుటకుఁ బరిజనులు గొందఱు కలరు. వారలకు నాడు మన్నించుటవని చెప్పితిని. నా యీవచనంబులు నీ కిష్టంబులేని నోడనెక్కి నాతోడ నా తాళంబునకు రమ్మనియె. అతండును మందహాసంబు చే

సంగీకారంబుఁదెలిపి నౌక నెక్కి యామెతో బాతాళంబున కేగి యాదా నవునిమందిరంబుఁ జేరి యామెచేఁ జూపఁబడినశస్త్రాగారంబున గూఢం బుగ నుండె. అప్పటికి దినం బందొక యామార్ధంబగుటఁ గంకాళకేతుండు నిద్దురవిడుచుచు యావలింపుచు గంగాసాగరంబునుండి మరలివచ్చిన మలయగంధిని జూచి హరుసించి యిట్లనియె. సుందరీ! రేపే నిన్ను బెండ్లా డెదను. ఈజాము లెట్లో గడుపుము. నాహర్మ్యంబునందు గలయీజీవ రత్నంబుల కీధనపూర్ణభాండాగారంబునకు వందలకొలఁదిగఁ బలుజాతుల నుండి యేరుకొని తెచ్చిన యీయచ్చరలుమున్నగుగట్టువాలుగంటులకు అదియిది యననేల నాసర్వస్వమునకు రాణివౌదువు. నీకొరకై దేవలో కంబుల నెల్లనారసి యింకను వింతవింతవస్తువులు తెచ్చి నీ కిచ్చెద. నిన్ను నాప్రాణేశ్వరిని జేసికొని యేప్రొద్దు నీతోడ భోగంబే బ్రహ్మానందంబని విశ్వసించి యట్లు సల్పెదను. నీతనుస్పర్శసుఖం బెట్టి శుభసమయంబున వాటిలునో యని దినంబుల యుగంబులట్లు గడుపుచున్నాఁడ. మిటారీ! నీవు కోరికొనినకాలపరిమితి రేపు భానూదయంబువఱ కంతమగును. ఆయుత్తరక్షణంబున నే నిన్ను బెండ్లాడి కోర్కులఁ దీర్చుకొందును. త్రిలోక రాజ్యలక్ష్మికి నిన్ను దొరసానిజేసెదను. చెలువా! యిఁకసెలవిమ్ము నిద్రిం చెద నని త్రిశూలంబుఁ బ్రక్కనుంచుకొని పర్యంకమునందుఁ బరుండి నిద్రించె. అటుపైని మలయగంధిచేఁ బ్రేరితుఁడై శత్రుజిత్తు డాసి త్రిశూలంబుఁగొని నిద్రించుచున్నవాని బాధించుటయుఁ జంపుటయుఁ బౌరుషంబు పాడియుఁగాదని మెటెంగి పాదఘట్టనంబున వానికిఁ బ్రబో ధంబుగల్గించి యిట్లనియె. ఘాతుకా! పరులకన్నియను దొంగలించి తెచ్చి బలాత్కరించి పెండ్లాడఁబూనిన పాతకీ! నిన్నంత మొందింప వచ్చి తిని. రమ్ము. యుద్ధమ్ముఁజేయు మనుటయు దైత్యుండు నిక్కి నీల్గి కన్నులు తెఱచి శత్రుజిత్తుని జూచి విస్మయించి యాపాదమస్తంబుఁ బరికించి యుత్తమశూరుఁడగుట నిశ్చయించి చలంబుఁబాయక యెదురించి ఓరీ! నీ వెవ్వఁడవు? నాయిమ్ము నేటికిఁజేరితివి? ఇది నీకు మృత్యుసదనం బని యెఱుఁగవా? ఇదిగో ఇపుడే చూడు మనుచు రాజనందనుని విశాలవక్షం బందుఁ బిడుగువడుపునఁ గడుబిట్టుగఁ బిడికిటఁ బ్రహారంబుచేసె. క్షత్రి యతరుణుండు దైత్యాంతకునియనుగ్రహంబున నద్దాని లెక్కసేయక రక్ష

సునిచెంపపై మిక్కిలికఠినంబుగ మోదె. దాన నవ్వాఁడు నెత్తురు గ్రక్కుచుఁ గ్రిందఁబడి త్రిశూలంబును వెదకె. అయ్యది ప్రత్యర్థిహస్తంబున నుండుటఁ గనుగొని విహ్వలుఁడై తనకు మృత్యు రాఁగలదని విశ్వసించియు ధైర్యంబుఁగోలుపోక యిట్లనియె. ఓయీ! తెలుసుకొంటి. నీవు మనుష్యుఁడవుగావు. మానుషరూపంబు ధరించి వచ్చినదానవాంతకుఁడవు. నా త్రిశూలం బేటికి చేకొంటివి? మగఁటిమి గల్గిన నా యది నా కిచ్చి నీయాయుధంబులతోఁ బోరుము. కడ తేర్చెదను. కాపట్యంబున నిట్లే మున్ను మాదాయాదులను మధుకైటభులను భ్రమందించితివి. కపటవటువువై బిచ్చమడిగి బలిని నిగ్రహించితివి. నరహరివై హిరణ్యకశిపుని బట్టి పలార్చితివి. జడలుదాల్చిన యడవిమానిసివై లంకానాథు నింకించితివి యని మలయగంధిని దవ్వులఁజూచి మఱియు నిట్లనియె. ఈ చక్కనిచుక్క నీయందంపుబడుచును యీమిటారిని యీలక్ష్మిని దెచ్చితిని. ఆమె యనుమతితో తేపు పెండ్లాడఁదలచి యిప్పటివఱ కామెను నాఘ్రాణనమైన సల్పినవాఁడగాను. అని మరల ఎడమచేపిడికిట మిక్కిలి నిష్ఠురంబుగ నొక ప్రహారంబుచేసె. దాన నృపుండు కొంచెమునొచ్చియుఁ గూడ సరకు సేయక త్రిశూలంబున నవ్వానివక్షంబందు బలంబుగఁ గొట్టె. ఆదెబ్బచే దానవుండు మూల్గుచుఁ బ్రాణంబులఁబాసె. వసుధాకాంతుం డంత మలయగంధిని దారసించి సుందరీ! నారదముని యాదేశించిన చొప్పున నీదుబందిని బాపితిని. ఇఁక నీ వెందేగఁదలఁచితివో నీ ఇష్టంబేదియో పరిస్తుత మిఁక నే నేమియొనర్పవలయునో చెప్పు మనిన నా వనరుహనయన యానందించి నునుసిగ్గుతోఁ దలవంచి ఇట్లనియె. వీరపురుషాగ్రణీ! ప్రాణంబులను బణముచేసికొన్నయీకన్య నిఁక నేమియడిగెదవు.. ఈబాల దూషిత కాలేదు. ఇట్లనుచుండ నంతలో నచ్చటికి నారదముని వచ్చు ము వా రిరువురు సాగిలబడి వందనము చేసిరి. నారదముని యుభయులకు వివాహంబుగావించి యాశీర్వదించి చనియె. శత్రుజిన్నృపాలుండు బందీకృత లగునచ్చరలు మున్నగువారలను వారియిండ్ల కనిపి కంకాళకేతునిమందిరంబు మున్నగునవి యందలి పరివారజనంబుల కిచ్చి తనకు బహుమానంబు లొసంగిన కొన్ని జీవరత్నంబులను మాత్రము గొని మలయగంధిని దోడ్కొని సర్వోదకసంచారక్షమం బగు నౌకారాజంబు

నెక్కి యటనుండి యాత్మనగరిని జేరె. అచ్చటిమంత్రిహితసామంత పురోహితాదు లెదుర్కొని యుత్సవపురస్సరంబుగ వారిని రాజమందిరంబుఁ జేర్చిరి. మలయగంధియు శత్రుజిన్నృపుండును నన్యోన్యానురాగంబున ధర్మం బతిక్రమింపక కామసుఖంబులొందుచుండిరి. అంత కొంత కాలంబు జరిగినంత మలయగంధి యొకనాఁ డంతఃపురంబున నున్న నాథుని నిట్లు గోరె. జీవితేశ్వరా! అభీష్టతృతీయవ్రతం బను నొక్కసువ్రతంబు గలదు. అద్ది యభీష్టపుత్రప్రదము. తాము సెలవిచ్చిన నద్దాని జేసెద ననియె. నృపాలుం డావ్రతంబును ము న్నెవరు చేసిరి? అందు దైవం బెవ్వరు? విధానం బె ట్లనిన నామె యిట్లు చెప్పె. ఆ వ్రతంబును దొల్లి కుబేరపత్ని యొనరించి నలకూబరుని బుత్త్రుని బడసె. మఱియు పెక్కు రొనర్చి సుపుత్త్రులఁ గనిరి. అందు దైవంబు జగన్మాత యగు భవాని పార్వతి. ఆ వ్రతంబు మార్గశీర్ష శుద్ధతృతీయయందు సవిధానంబుగ సమంత్రకంబుగ నొనర్పవలయును. అమ్మఱునాఁడు హోమంబు బ్రాహ్మణ భోజనంబులు సల్పి వ్రతాంతం బొనర్పవలయును. ఈ సువ్రతంబును దమతోఁగూడ నే నాచరించి యభీష్టపుత్రలాభంబు నొందుట కిచ్చగింతు నని యర్థించుటయు మహారాజు తాను వీరవైష్ణవుఁడై నను విద్వాంసుఁ డగుట నసూయ చెందక ప్రియసతీవాంఛితంబును నెరవేర్పఁదలచి యంగీకరించె. మహావైభవంబుతో వ్రతంబు సల్పిరి. వ్రతాంతంబున రాణి యిట్లు జగదంబికను గోరుకొనె. తల్లీ! పార్వతీ! నాకు సుపుత్రుని శ్రీనారాయణాంశసంభవుని బ్రసాదింపుము. అట్టిపుత్త్రుఁడు నీయందును శివునియందును భక్తిగలవాఁడు గావలయు. మఱియు స్తన్యపానము చేయక యే పుట్టినతోడనే పదియాఱేఁడులప్రాయమువాఁడు కావలయును. అని కోరికొనిన జగదంబిక తథాస్తని నట్లుధ్వనించె. తోడనే రాణి గర్భవతియై పరిపాకసమయంబున మూలానక్షత్రమందుఁ బ్రసవమై మగశిశువును గనియె. ప్రధానమంత్రి రాణింజూచి అమ్మా! చెడ్డనక్షత్రంబునఁ బుట్టిన యీశిశువును రాజరక్షకై నీవు విడువుమనియె. పతివ్రత యగునామె యట్లే యనుమతించి పుత్త్రుని నొకదాసి కిచ్చి వీని కాశీపురియందు వికటాదేవీసముఖంబున నుంపు మనియె. గౌరీదేవి యొసఁగినపుత్త్రుని నా పెయే కాచుకొను ననునూహతో నట్లుచెప్పె. దాసియు నట్లొనర్చె. వికటా

దేవియు బాలుని జూచి యోగినీగణంబులను బిలిచి వీని స్వర్గంబున సప్తమాతృకలయొద్ద డించి పెంచునట్లు చెప్పుఁడనిన వార లట్లు చేసిరి.

శ్లో॥ అరక్షితం తిష్ఠతి దైవరక్షితం సురక్షితం దైవహతం వినశ్యతి
జీవ త్యనాథోపి వనేపి రక్షితః కృతప్రయత్నోపి గృహే వినశ్యతి.

తా॥ ఎవరిచేతఁగూడఁగాపాడఁబడనివాఁడును దైవముచే రక్షింపఁబడిన సజీవుఁడై వెలయును. ఎక్కువగా రక్షింపఁబడుచున్నవాఁడుగూడ దైవము రక్షింపకున్న నశించును. అడవిలో నొకఁడు దిక్కులేక యున్నను రక్షింపఁబడును. గృహమందు నుపచారములొనర్చుచున్నను వేఱొకఁడు నశించును.

సప్తమాతృకలా బాలునికి స్తన్యపానంబు లేకయే సద్యస్కాలంబునఁ బదియాఱేండ్ల బాలుం డగున ట్లనుగ్రహించి మరల వికటాదేవి సన్నిధి కన్పిరి. బాలుఁ డంత విజ్ఞానంబునొంది వికటాదేవీప్రేరితుఁడై కాశియందు వాసంబుచేసి వీరేశ్వరలింగసమక్షంబున గరిష్ఠంబగుతపంబు చేసె. శివుఁడును సంతసించి ప్రత్యక్షమైవచ్చి వరంబుఁ గోరుమనియె. రాచపట్టి యంజలిఁ బట్టి చాంచల్యములేనట్టి నీపదభక్తినొసఁగుమనియు శ్రీ వీరేశ్వరలింగంబును బూజించినవారికెల్ల భోగమోక్షంబులను సర్వాభీష్టంబులను నొసగుమనియుఁగోరెను. శివుండు సంతసించి "తథా" స్తని మఱియు నిట్లనియె. ఈవీరేశ్వరలింగంబు నర్చించినకతంబున వీరుఁడవని ఖ్యాతి నొందెదవు. నారదమునిని నీతల్లిదండ్రులయొద్దకుఁబంపి ని న్నెఱింగింపఁజేసెద. వారలు వచ్చి నిన్ను దోడ్కొని పోయి పట్టంబుఁగట్టెదరు. ధర్మంబుగ రాజ్యంబేలి వంశవృద్ధినొనర్చి యంత్యంబునఁ గాశిఁజేరి మోక్షంబునొందుదువని యంతర్హితుఁడయ్యె. నారదముని శత్రుజిత్సభకేగి కాశియందువిడిచిపెట్టినట్టి తనకొమరునియభ్యుదయంబునంతఁ దెల్పి సత్వరంబుగఁ బుత్త్రుని దెచ్చికొని యువరాజ్యపట్టాభిషేకంబు నొనర్పుమనియు నిది శుభావహంబనియు శివప్రేరితంబనియుఁ జెప్పుటయు రాజేంద్రుఁడును రాణియు నానందించి పరిజనముతోఁ గాశిఁ బ్రవేశించి వీరేశ్వరలింగసముఖంబందుఁ బుత్త్రుని గన్గొని గ్రుచ్చి యెత్తికొని ముద్దుచేసి విశ్వనాథున కన్నపూర్ణాంబకు మాధవఢుంఢివినాయకభైరవప్రముఖులకు

వికటాదేవికి వీరేశ్వరలింగమునకు బూజలుచేసి ప్రసాదంబుబొంది కొమరుని స్వకీయరాజధానికిగొనిపోయి సుముహూర్తంబున యువరాజ్యపట్టాభిషిక్తునిజేసిరి. అంతనతండు తల్లిదండ్రిలను గురులను సేవింపుచు వివాహమాడి ధర్మంబుతో రాజ్యపాలనంబు సేయుచుండె. కులదైవంబగు నారాయణమూర్తిని స్వాభీష్టదైవంబగుపరమశివుని నంతరంబుసేయక సేవించుచుండె. ఇది మలయగంధిచారిత్రము. ఇంక గంధర్విరత్నావళి చరిత్రింబుఁజెప్పెద వినుండు.

## 13. రత్నావళి - గంధర్వి

శ్లో॥ త్వమేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహంతి త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖాః
కియద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణా పూరితదృశా.

(శివానందలహరి)

తా॥ ఓశివా! లోకములకు పరమఫలమునిచ్చువాఁడవు నీవొక్కఁడవే. విష్ణువుమొదలగువారు నీవే కారణముగాఁగలిగిన వైకుంఠము మున్నగుదివ్యపదవులను జెందుచున్నవారలై గూడ మరల ఉత్తమ ఫలప్రాప్తికై నిన్నే సేవించుచున్నారు. నీదుదాక్షిణ్య మెంతపరిమాణముకలది! (పరిమాణములేనిది) నాయొక్కఆశయు నెంతటిది? (ఇంతదనియెఱుఁగలేను) సంపూర్ణకరుణావీక్షణముతో నెపుడు నారక్షణమును వహించెదవు.

వారణాసియందలి లింగంబులలో నొక ప్రసిద్ధ శివలింగంబగు రత్నేశ్వరలింగంబును నొక వేశ్యాయువతి కర్పూరతిలక యనుపేరుకలది ప్రతిదినంబును జేరి పూజించి రాగాలాపంబుచేసి గీతికల గానంబుచేసియు బలువిధంబులగునృత్తంబులుసలిపియు సేవించిపోవుచుండును. చాలకాలం బిట్లు రత్నేశలింగంబు నుపాసించి విధివశంబున నొకప్పు డొకయూరికిఁ బోయి యందుఁగాలధర్మంబు నొందె. ఆ పిదప వసుభూతి యనునొక గంధర్వరాజవర్యునకుఁ గూతురై పొడమె. ఆ బాలకు రత్నావళి యని

పేరుబెట్టి పిలుచుచుండిరి. పూర్వపుణ్యంబున నాబాలిక క్రమంబుగ వృద్ధినొంది మధురముగ మాటలాడునదియై సంగీతసాహిత్యంబులం దారితేరి చతురయై జాణయై మిక్కిలిసౌందర్యవతియు గుణవతియునై బాల్యంబునువీడి యౌవనాంకురదశ నొందె. మరియు నామె పూర్వజన్మవాసనను బట్టి శివలింగపూజయందు మిక్కుటం బగుమక్కువ గల్గి తండ్రితోడఁ బుష్పకంబునెక్కి ప్రత్యహము కాశికేగి రత్నేశశివాలయంబుఁ జేరి పూజయొనర్చి యందు వీణానాదంబును గానంబును నృత్తంబును బొనర్చి శివభక్తిఁజేయుచు దన్మయతనొంది తిరుగ గంధర్వలోకంబుఁ జేరుచుండు. ఈమె కెల్లభంగుల నీడగువారు ముగ్వురు చెలిమికత్తియలు శశిశేఖ అనంగరేఖ చిత్రరేఖ యనెడువారలు కలరు. ఈనల్గురు చాల చెలిమితో హెచ్చైనమచ్చికతోఁ గూడుకొని యేప్రొద్దు జంత్రగాత్రంబుల మేళగించి శివకీర్తనంబుల గానంబుసేయుచును నృత్యంబొనరించుచుఁ గవనంబులల్లుచు వనకేళి జలకేళి చతురంగఖేలనము మున్నగుకళలయందు దొడరి యానందించుచుందురు. ఈ నల్వురందు రత్నావళి యగ్రగణ్యయై యుండు. ఇట్టు లీనల్వురు శివభక్తులై శివుని సేవించుచునుండ నొకనాఁడు రత్నావళి రత్నేశలింగసన్నిధి కేగిపూజించి రాగాలాపనంబు చేసి గీతంబు గానంబుసేయుచున్నతటి రత్నేశలింగంబునుండి యొకనాదం బామెశ్రుతిపథంబునఁ బడియె. సుందరాంగీ! నీ సంగీతకౌశలంబునకును నీ భక్తికిని నే నానందించితిని. నేఁటిరాత్రి నీ స్వప్నంబున నా భక్తుఁ డొకండు డగ్గఱి నీతో రమించి నిన్నానందింపజేయు నీతడే ముందు నీకు విభుండు కాఁగలఁడని వినఁబడియె. లింగమధ్యంబునుండి ఇట్లు వెలువడిన యావచనంబులు విని యా వనితారత్నంబు సంతసంబును సిగ్గును జెంది యానందంబుతో విమానంబు నెక్కి నిజస్థానంబున కేగె. అం దామె చెలులు మూగురు చేరి నిత్యంబువలెఁగాక నాఁ డామెముఖారవిందంబునందు క్రొత్తచందం బగునానందము చెందియుండుటనుగని పెట్టి యక్కారణం బడిగిరి. ఆత్మసఖులగుటఁ గొంతవడి కామె శివలింగనాదప్రకారమును దెలిపె. వార లాయుదంతంబు విని యత్యంతంబు సంతుష్టలై యీయది శివోక్తం బనియు శివపూజాఫలం బనియు నేఁడు నీభాగ్యోదయం బిట్లు ప్రకటితం బయ్యెననియు నేఁటి రాత్రి తారసించినయాతరుణ

చోరుని మరలఁ బోనీక బాహులతాపాశంబులఁ గట్టిపట్టవలెననియు ని ట్లిష్టంబులుపలికిరి. మఱియు నీ చెలులమై నీతో నపుడపుడు శ్రీరత్నేశ్వర లింగ సముఖముఁజేరి సేవించుచున్నమాకు గూఁడ రత్నేశ్వరానుగ్రహం బునను నీదు చెలికారంబునను నిష్టసిద్ధి కలుగుననియు నుడివిరి. చాలసేపు వలువురు శివకీర్తనంబుల గానంబుచేసిరి. అంత దినాంతంబగుటయు నాముగ్వురు వారిఇండ్లకుబోయిరి. రత్నావళియు భుజించి శివునిదలచుచుఁ బుష్పశయ్యం బరుండె. నిశీథంబందు శివోక్తప్రకారం బొకలేఁబ్రాయఁపు సుందరపురుషుండు దర్శనీయుండు స్వప్నంబున నాసుందరిం డాసి సౌఖ్యం బులం దనిపి యదేచ్ఛఁజనియె. అంత నాయింతి తెలివొంది నల్గడలఁ గలయఁజూచి యెందునుగానక మోసపోయితి నని యించుక విచారంబు నొందె. ప్రభాతం బైనంత సఖులుదారసించి యా పద్మసుగంధి మొగ మును దనువును జూచి యనుభూతభోగయగుటఁ దెలిసికొని మురిసిరి. ఆపైని నిత్యంబట్లు పుష్పకంబునెక్కి రత్నేశలింగంబును జేరిసేవించి వచ్చుచుఁ దక్కినముగ్వు రాచపలనేత్రను గాంచి రాత్రివృత్తం బడిగిరి. రత్నావళియు యథార్థంబుఁజెప్పి చింతాపరవశయై యెవఁడో కులగోత్రంబు లెరుంగబడనట్టివాఁడు మున్నుచూడనివాఁడు లేఁబ్రాయఁపుచూపరి డాసి కన్యాత్వంబుఁ జూరఁగొని మరల నేడకో పోయెననియు వాని మరల నెట్లు బడయుదుననియు నవ్వాఁడు లభింపకున్న మరణంబునొందెద సిద్ధం బనియుఁ జెప్పె. ఆ ముగ్వురలో యోగినియైన చిత్రరేఖ యనునది బాలా! ఏల యీలీల జాలినొందెదవు. ముల్లోకంబుల నున్నవారల రూపంబులను బఠంబుల వ్రాసెద నందు నీవిందుఁ గొనినవాఁడెవ్వఁడో తెల్పిన వాని నారయుదమని చిత్రరేఖ చెప్పినయట్లు త్రిలోకంబు లందలి సుందరతరుణపురుషుల నందఱను పఠంబున వ్రాసి వేఱువేఱుగఁజూపె. అందుఁ పాతాళలోకంబందలి నాగరాజకుమారులలో రత్నచూడుఁడను నాగయువకుని జూచి సిగ్గుచెంది తలవంచి మురిసి పరవశయై యానంద బాష్పావృతనయనయై చిత్తరువునందలి ప్రతిమ వలె నిశ్చేష్ట యయ్యె. అట్లు చూచి చిత్రరేఖమున్నగువారుగూడ నాపురుషశ్రేష్ఠుని దిలకించి మెచ్చి రోమాంచము మున్నగుసాత్వికభావంబులనొంది రత్నావళి భాగ్యంబును బ్రశంసించిరి. రత్నావళి యాపురుషోత్తముఁ డెవఁడని

యనుచుఁ జిత్రరేఖ యాతండు నాగరాజకుమారుండు శంఖచూడవంశ్యుండు రత్నచూడుఁడనియు మిక్కిలి శౌర్యధైర్యములు గల యుదార యువకుఁడనియు శివభక్తుఁడనియుఁ దనకర్హ్వవరుం డనియుఁ జెప్పె. రత్నావళి యాతండు తనకుఁ జేకురుటెట్లనిన నిష్టదైవంబగు రత్నేశ్వరుఁడే యట్లు సమకూర్చుననియుఁ జిత్తంబున నుత్తలమునొందకుమనియు వక్కాణించె. అప్పుడు నలువురు రత్నేశ్వరాలయంబుఁ జేరి పూజించి చాలదనుక పరమేశ్వరు నర్చించి గానముసేయుచుండ వారలందఱకు కుడికన్నును గుడిభుజంబులదరె. ఆస్పందనంబుఁ జూచి వారందఱు బెదరి విచారపడుచుండ నంతలో నెడమకన్నుఁ జేతులదరె. దాననించుక యూరడిలి యేదియో యిక్కట్టు దాపరించు ననియుఁ జివర కందుగడి విడుదలయును శుభంబును జేకూరుననియు గ్రహించిరి. ఆపై రత్నేశ్వరునకు మ్రొక్కి పుష్పకం బెక్కుచుండఁ బాతాళలోకవాసియగు సుబాహుఁడను రాక్షసుఁడు బంగారుతీవెలఁబోలిన యాయందంపుపడుచులఁ జూచి కామించి పుష్పకంబునులంఘించి యానలువురుకన్నియల బలాత్కరించి యెత్తుకొని పాతాళంబునకుఁ గొనిపోయి తనయింటఁ జేర్చె. గంధర్వకన్యలు వికటాననుండును భయఙ్కరదర్శనుండును నగు రక్కసుని జూచినయంతనే భయాతురలై వడకుచు ఓతల్లీ! ఓతండ్రీ! ఓరత్నేశ్వరా! రక్షింపుఁడు రక్షింపుఁడనుచు వాపోవుచుండ నమ్మోసరకుండు బాధించి వారలఁబట్టి తనదువాసంబం దుంచె. అంత నక్కాంతలత్యంతంబు దుఃఖితలై యేడ్చుచుఁ దమ్ము నెవ్వరు రక్షించువారలు లేక దిక్కులేనివారలై చెఱఁబడుట కెంతయు నిందించుకొనుచు శంకరుఁడు రత్నేశ్వరుఁడే దిక్కు గావలయునని వాఙ్మనఃకాయంబు లేకముచేసి రత్నేశ్వరుని నుచ్చైస్స్వరంబునఁ బ్రార్థించిరి. ఓకాశీవిహారా! రత్నేశ్వరా! నీదు భక్తులమై రక్కసునకుఁ జిక్కితిమి తండ్రీ! యుద్ధరించి రక్షింపు మనాథలమైయున్నాము పేక్షచేసినఁ జచ్చెద మోర్వలేము రక్షింపుము రక్షింపుము రత్నేశ్వరా! యని కెవ్వున నేడ్చుచుండిరి. చేరువవీథిలో యదృచ్ఛనడచుచున్న రత్నేశ్వరప్రియభక్తుఁడు నాగరాజకుమారుఁడు రత్నచూడుడను శూరతరుణుఁ డాయార్తధ్వని విని యెవరో యనాథస్త్రీలు రత్నేశ్వరభక్తులు నాస్వామి యగురత్నేశ్వరుని సంబోధించి యార్తధ్వనిసేయు

చున్నారు. వాఁడెట్టివాఁడైన శిక్షించి యా యబలల విడిపించెద నను కొని యాధ్వనిఁబట్టి వార లున్నగిరిముఁజేరి ఎవఁడురా! నా స్వామియగు రత్నేశ్వరభక్తులను బాధించువాఁడని గంభీరనాదం బొనరించె. గంధర్వ కన్యలు వెఱపుతోఁ గదలక మెదలక యొకచో నొదిగియుండిరి. మను ష్యాదుం డా రత్నచూడుని భీషణవాఙ్నాదంబును విని కినిసి వచ్చి యెదుర్కొని ఓరీ! నీ వెవ్వఁడవురా! నాయిమ్మేలచొచ్చితివి? యని యదలించె. అవుడు రత్నచూడుఁడు దురాత్మా! ఈ పడుచుల నెచ్చటి నుంచి తెచ్చితివి? వీరలు నీకనుకూలలు గారు. పైపెచ్చు నాదైవంబగు రత్నేశ్వరునిభక్తలు. నీవు వీరలను బలాత్కరించి తెచ్చినట్లు వీరల యాప న్నోక్తులు దెలుపుచున్నవి. ఇపుడేని వీరలను విడువుము. నే నవ్వారి వారినివాసంబులకుఁజేర్చెదను.

శ్లో॥ అకామాం కామయతి యః కామయిత్వాం పరిత్యజేత్
బలవంతం చ యో ద్వేష్టి తమాహుర్మూఢచేతసం(మహాభారతము)

తా॥ ఎవఁడు కామములేనివారలను గామించునో కామించినవారలను బరిత్యజించునో మఱియు నెవ్వడు బలవంతుని ద్వేషించునో అట్టి వాని మూఢునిగ జెప్పుచున్నారు.

కావున నిన్ను నిగ్రహించి వీరలయలజడిఁ బాపెదననియె. కంత మువఱకు సురాపానముచేసి మదమత్తుఁడగు నాయసురుఁడు నాగరాజ కుమారునిహితోక్తు లారయక పొడిచెద నడచెద నాయిలువిడువుము వెడలు మనుచు నాతనిపైఁజెయివేసి త్రోచె. రత్నచూడుఁ డాగ్రహించి "ముమూర్షో రివ భేషజం" (చావనున్నవానికి యౌషధమట్లు) తనహి తోక్తు లవ్వానియందు వ్యర్థములౌటఁ జూచి విల్లులాగి యొక్కశరంబు వానిపై వేసె. దానవుఁ డాయమ్మున నొచ్చియు బలమ్మున నురుఁగక దెబ్బఁదినినత్రాచుపామట్లు రోజుచు గవిసి తనయురవైనపరిఘుచే నాగ కుమారుని గొట్టె. రత్నేశ్వరానుగ్రహమున రత్నచూడుం డద్ది సరకు సేయక తీక్ష్ణంబగు శిలీముఖంబును దైత్యునిపై వేయ నద్ది వజ్రాయుధ తుల్యంబుగ నవ్వానివక్షంబుఁ జీల్చి యసువులఁబాపె. వానిపరిజను లిలు విడిచి యెందేని బాఱిపోయిరి. అంత నా నాగరాజనందనుఁ డాసుందర

యువతులం దలిసి కనుగొని యిట్లడిగె. ఇందుముఖులారా! వీఁడు మిమ్మెందునుండి యిటకుఁ దోడ్కొనివచ్చె మీ రెవ్వరు మీ తలిదండ్రు లెవ్వరు వాసం బెచ్చట నేఁడెందుబోవఁదలంచెదరు? భయమును విడనాడి సర్వంబును జెప్పుఁడు. మీ యిష్టంబు నెఱవేర్చెద ననియె. వా రంత సంతుష్టులై ముప్పు బాసి తెప్పరిల్లి గొప్పయుప్పరిగ నెక్కినయ ట్లుప్పొంగి ప్రాణదానం బొనర్చిన యా సుందరతరుణపురుషునకు జోహారులొనరించిరందు రత్నావళి స్వప్నంబునఁ దన్ను సౌఖ్యంబులఁ దేల్చిన సుందరుఁడౌట గురితించె. చిత్రరేఖయుఁ దాను యోగబలంబునఁ జిత్రింబందు వ్రాసి చూపినయట్టిభోగిరాజకుమారుం డితండే యని విశ్వసించె. తక్కిన యిర్వురును జిత్రంబునఁ బ్రతిబింబంబుఁ గాంచినవా రగుట దృష్టపూర్వునిలాగు దలఁచిరి. అంత రత్నావళీప్రేరితయై చిత్రలేఖ యా యువకపురుషున కిట్లు చెప్పె. వీరపురుషాగ్రణీ! మేము భూలోకంబున గంధమాదన పర్వతంబున నుండెదము. గంధర్వకన్యలము. ఈ రత్నావళి గంధర్వరాజగువసుభూతికిఁ బుత్రి. సద్గుణరత్నావళి. మేము మువ్వురమును దత్ప్రధాన మంత్రితనయలము. బాల్యంబునుండియు నీమెయు మేము మువ్వురమును జెలికారంబుఁ బడసి ఎల్లవేళల సహచారిణులమై యుందుము. ఆమె నిత్యంబు కాశీస్థశివలింగంబగు రత్నేశ్వరలింగంబును బూజించి నిజావాసంబునకుఁ బోవుచుండును, ఎడపదడప మేము గూడ నీయమతో రత్నేశ్వరాలయమునకుఁ బోయి పూజించి వచ్చుచుందుము. నేఁ డట్లే రత్నేశ్వరార్చనం బొనరించి పుష్పకం బెక్కుచుండ నీ బండరక్కసుం డెమరుపడి చూచి మమ్ము బలాత్కరించి యెత్తికొనివచ్చి యీ పాతాళంబుఁ జేర్చి యుందుంచె. మేము దిక్కుమాలి దుఃఖంబునఁ బొక్కుచు దైవంబగు రత్నేశ్వరుని దలఁచి విలపించుచుంటిమి. మాదు మొఱ విని రత్నేశ్వరుండే యిట్లువచ్చి యీ పాపిష్టుని గడపి మమ్ముఁ గాపాడినట్లు భావించుచున్నవారము. రత్నేశ్వరుఁడవు గాకున్న నవ్వారి ప్రేరణచేఁ జేరవచ్చిన యొకయుదారశూరవరునిగఁ దలంతుము. కరుణానిధీ! నీ వొనర్చిన యుపకారమునకేము నిష్కృతి ఏమియొనర్పఁగలము? శ్లో॥ సాధు మంజలికర్మణా—(సత్పురుషుని దోసిలొగ్గి సంతుష్టుని జేయవలయును) ప్రస్తుత మిపుడు

మా తలిదండ్రులు మారాకకై చింతతో నెదురుచూచుచుండు రక్క-
తన నిపుడు సత్వరము మాయావాసములఁ జేరవలయును. తదుపరి యను
చుండ నాగరాజకుమారుఁడు దయాళుండై యవ్వారు రత్నేశ్వరారాధ
నాపరు లౌటకు మిక్కిలి పొంగి భయము లేదు సంతసింపుడు మి మ్మిపుడే
మీయుత్పత్తిస్థలికిఁ గాశికిం జేర్చెద నని తనగేహంబునకుఁ గొనిపోయి
యవ్వారిసేదఁదీర్చి తనయుద్యానవనం బందలిసరోవరంబునకుఁ గొని
పోయి యందు మజ్జనంబుసేయుఁడు. కాశికిఁ బోవుద మని చెప్పెను.
వా రట్లే యందు స్నానమాడి మునిగి పైనిజేరిరి. అపుడు తాము
మున్నున్నపాతాళంబుఁగాక శ్రీకాశి యందలి రత్నేశ్వరాలయసమీపం
బున నున్నశంఖచూడతీర్థంబు నుండి వచ్చిన ట్లగుపడియె. అచ్చెరు
వొంది యచ్చట గలయజూడఁ దాము నిచ్చలుసేవించుచున్నకాశీక్షేత్రం
బగుట బాగుగఁ దెలిసికొనిరి. అటుపై రత్నేశ్వరాలయమును జేరి
మ్రొక్కి యీవలికి వచ్చుచుండ దమరా కయాలస్యంబగుట కడలి
కారణం బరయక వసుభూతి తాఁ బుష్పకంబెక్కి కాశికిఁజేరి యటకు
వచ్చినంతఁ గుమారియు నామెచెలులు గలిసికొని తమయుదంతం బంతఁ
జెప్పిరి. వసుభూతి చాలననుతాపపడి య ట్లుపకారంబుసల్పిననాగరాజ
కుమారుని జూచుట యెట్లనుఁడు రత్నచూడుండు గూడ వారలతోడనే
కాశింజేరి యందుండుట నక్కన్యలు పరికించి ఈశూరాగ్రణి ఈదయాళుం
డీపురుషశ్రేష్ఠుం డే మమ్ము రక్షించి తెచ్చెనని చూపిరి. అంత శివాజ్ఞచే
నారదముని వారలఁదారసించి వసుభూతిం గాంచి యిట్లు వచియించె.
గంధర్వరాజా! ఈనాగరాజకుమారుండు శంఖచూడవంశ్యుండు రత్నే
శ్వరప్రియభక్తుండు నీపుత్రిని జెలులతో రక్కసునిబారినుండి రక్షించి
యిటకుఁజేర్చిన దయాళుండు వీరపురుషుండు. ఇఁక నీ కూతురు రత్నా
వళియు నీ రత్నచూడుండు నిర్వురు రత్నేశ్వరభక్తులగుట రత్నేశ్వరుఁడు
నీ కూతునకు వరంబనుగ్రహించి వీరియుభయులకు స్వప్నసమావేశం
బును బొసగించి యన్యోన్యానురాగంబును సంధానించినాఁడు. ప్రస్తుత
సంఘటనంబును దత్ప్రేరితమే. ఇఁకనీ కొమరిత నీ రత్నచూడున కిచ్చి
వివాహంబు గావింపు మని నీకు బోధింపుటకై మహేశ్వరుండు న న్నిందుల
కంపినాఁడు. కావున సత్వరంబు వివాహం బొనరింపు మని నుడివి రత్న

మూడునకుఁగూడ రత్నావళిని వివాహం బాడుమని యిది శివేష్టంబని చెప్పి ముని యంతర్ధానమయ్యె. వసుభూతియు రత్నచూడుని గారవించి ప్రేమించి వరణంబర్థించి యాత్మనగరికిఁ దోడ్కొనిపోయి విధివిహితం బుగఁ గన్యాదానమొనర్చి వివాహంబుసలిపె. ఆపైని దక్కిన శశిరేఖ అనంగరేఖ చిత్రరేఖలు వరునియౌచిత్యంబారసియు రత్నావళీప్రేర ణంబుఁబట్టియుఁ దాము నలుగు రన్యోన్యవిశ్లేషంబునోర్వలేకుండుటయుఁ గారణంబుగ రత్నచూడునం దనురాగిణులై శివేచ్ఛాప్రకార మా రత్న చూడుని వరించి జననీజనకులఁబ్రోత్సహించి శుభలగ్నంబున రత్నచూ డుని పెండ్లియాడిరి. రత్నచూడుఁడు మహావైభవంబున నిట్లానల్వురు గంధర్వకన్యలఁ బెండ్లియాడి వారణంబులఁగొని పాతాళంబున నిజమంది రంబుఁజేరి భార్యాచతుష్టయంబుతో సేవింపఁబడుచు భోగంబులొందు చుండె. మరియు భార్యలు దానును పూర్వప్రకారంబుగఁ బ్రతిదినము పాతాళం బంటియున్న శంఖచూడతీర్థంబు నుండి కాశికివచ్చి రత్నేశ్వరు నర్చించి పోవుచుందురు. చిరకాలం బిట్లు భోగంబులొంది పుత్రులఁగని వృద్ధిచేసి అవసానంబునఁ గాశిఁజేరి శివసాన్నిధ్యంబునొందిరిది రత్నావళీ చరిత్రంబు.

# 13. సీమంతినీమహారాజ్ఞి - చంద్రాంగదసమ్రాట్టు

శ్లో॥ ఆద్యాయామితతేజసే శ్రుతిపదైర్వేద్యాయ సాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే
ధ్యేయాయాఖిలయోగిభి స్సురగణైర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతి శ్శాంభవే.

శివానందలహరి

తా॥ మొదటివాఁడును మితిలేనితేజస్సుగలవాఁడును వేదవాక్యములచేత దెలియఁదగినవాఁడును భక్తికి సాధ్యమైనవాఁడును జిదానందమయు మైనయాత్మస్వరూపుఁడును ముల్లోకంబులసంరక్షణమందుఁ బ్రవృత్తి గలవాఁడును ధ్యానమునకుఁదగినవాఁడును సర్వదేవతాగణంబుల

చేతను యోగులచేతను గానముచేయఁదగినవాఁడును చిచ్ఛక్తి మాయతోఁగూడినవాఁడును దాండవమందు మిక్కిలితొందఱగల వాఁడును జడలుదాల్చినవాఁడును నగు శివునికొరకై యీనమస్కృతి యగుఁగాత.

భూలోకంబందు మహాపావనయగు యమునానదితీరంబందొక నగరీరాజంబు కలదు. చిత్రవర్మ యనుమహారాజొకఁ డాపురిని తద్దేశంబు నేలుచుండెను. అతఁ డతిధార్మికుఁడు దయాళుఁడు సర్వభూతహితుఁడు ప్రజారంజకుఁడు సజ్జనులపాలిటికల్పవృక్షము దుర్జనులకు యముఁడు కరుణారసంబునకు సముద్రుండు విక్రమంబున హరి తపోయోగంబులందు మహాదేవుండు రూపంబునఁ జందురుఁడు ప్రతాపంబున సూర్యుండు ధననిధులఁ గుబేరుండు వైభవంబున నింద్రుండు దానంబున బలి వేదాధ్యయనంబున విరించి నీతియందు బృహస్పతి అర్థశాస్త్రంబందు శుక్రుఁడు సంగరంబందు శ్రీరాముఁ డని జనంబు లేప్రొద్దు కీర్తింపుచుందురు. అట్టి రాజమౌళికి సధర్మిణియగుగృహిణియం దష్టపుత్త్రులు జన్మించిరి. అటుమీఁద మరల గర్భోత్పత్తియై నవమాసంబులు నిండినంత నొక శుభదినంబున శుభసమయమం దొకకుమారీరత్నం బుదయించె. ఆబాల పుట్టిన తోడనే పురుటింటిదీపములకాంతిని డిందుపఱచి ధగద్ధగాయమానంబులగు స్వకీయదేహకాంతుల దశదిక్కులఁబ్రకాశింపఁజేయుచుండె. పరిచారికాబృందంబు ప్రసవకార్యంబులన్నియు సల్పి బాలికకు మజ్జనంబొనర్చి మహారాజునకుఁ బుత్రీజన్మోదంతంబును దెలిపిరి. భూపతి యంతఁ బ్రీతుండై బ్రాహ్మణులకుఁ బరిజనులకు భిక్షుకుల కందఱకు విస్తారధనంబులఁబంచిపెట్టి యాస్థానమునఁజేరి సింహాసనాసీనుండై జ్యోతిష్కులఁ బిలిపించి సుఖాసీనులఁగావించి సంతోషంబునఁ గుమారీజన్మసమయం బెఱింగించి యామెశుభాదర్కంబునుగూర్చి విశదంబుగ నెఱింగింపుఁడని కోరెను. అప్పు డవ్వారలు హర్షించి సూర్యోదయాది జన్మకాలఘటికలను లెక్కించి లగ్నస్ఫుటంబును గ్రహస్ఫుటంబును నొనర్చి లగ్నాంశారూఢాదిచక్రంబులను లిఖించి ద్వాదశభావంబులనారసి మహాదశాభుక్తశేషంబుల ననుసరించి యంతర్దశావిదశాసూక్ష్మదశల విభజించి యొకజ్యోతిష్పండిత మూర్ధన్యునిముఖంబున నిట్లనిరి. రాజచూడామణీ! ఈబాల సుగు

గొాలవాల సత్కులాజాల శివభక్తిలోల శిష్టవ్రతాచారశీల భవద్వంశ ముక్తారత్నంబు దీర్ఘాయుష్మతి దీర్ఘసుమంగలి. మఱియు నీమె సరస్వతీ దేవిఁబోలిన విద్యావతియు శ్రీదేవినిఁబోలిన భాగ్యవతియు పార్వతీదేవిని బోలిన సౌభాగ్యవతియును అరుంధతీదేవిఁబోలిన అనపాయపత్యనుచారిణియు ఇంద్రాణిఁ బోలిన సామ్రాజ్యభోగశాలినియును స్వాహాదేవినిబోలిన యోగినియును రోహిణినిబోలిన కాంతిమతియు రతీదేవివంటిసౌందర్యవతియును అదితినిబోలిన సుపుత్రవతియును వరుణానిఁ బోలిన యనర్ఘమణి రత్నాకరయును కుబేరపత్నినిబోలిన ధననిధినిధానయు మైత్రేయినిబోలిన విజ్ఞానవతియును జానకీదేవినిబోలిన యసమాన పవిత్రచరిత్రయునునగును. వేయియేల? ఈకన్య సర్వశుభ లక్షణ లక్షితయని చెప్పిరి. రాజవర్యుండు మురిసి ఆనందాశ్రుపూరిత ముఖుండయ్యె. సామంతామాత్యహిత పురోహిత పౌరజనులెల్ల రత్యంత సంతోషభరితులైరి. ఇట్టిసంతోషసమయంబున నొకధూర్తవిప్రుండు లేచి నిలిచి రాజునకభిముఖుండై సంకోచింపక నిర్భయంబుగ నిట్లు వ్రాకృచ్చె. రాజేంద్రా! ఈ బ్రాహ్మణులనుడు లెల్ల వేడవంబు లసత్యంబులు. వీరలు ధనాశాపిశాచగ్రస్తులై యాతురులై సత్యంబును డాచి యొకమాట మూతో నిట్లు చెప్పిరి. నే నట్లు బూటకములాడను. తథ్యమునే చెప్పెదను వినుము. ఈ నీ కూతునకు శుభగ్రహానుకూల్య మొకకొంతయున్నను ప్రబలమగు దుర్దశాయోగం బొకటికలదు. దాన నీపె పదునాల్గవయేట వైధవ్యంబుఁజెందును. తప్పదిది యని తత్క్షణంబున నచటినుండి వెడలి పోయె. అంత భూపతి యదరి బెదరి దుఃఖంబుతో నిశ్చేష్టుఁడై సింహాసనంబున వ్రాలె. జ్యోతిష్కులెల్లరును భీతితో విస్మయంబును గోపంబును దాపంబును నేవంబును జెంది తలలువంచిరి. మంత్రులు సామంతులు మున్నగువా రెక్కుడు దుఃఖంబుజెంది పరితపించిరి. ఒక్కింతసేపు సభయంతయు దైన్యంబుతో వ్యసనంబుతో నిశ్శబ్దంబుగ నుండె. భూనాథుండెంతయుసంతాపంబున వగచి ధీరుండుకావున నొక్కింతధైర్యంబొంది

శ్లో॥ భవితవ్యం భవత్యేవ నాభావ్యం భవతి క్వచిత్॥

(కానున్నదియగును కానిది యెందునుగాదు)

అనుసూక్తినిదలంచి సర్వమీశ్వరాధీనమని మనంబును స్తిమితంబొనర్చి జ్యోతిష్కులను మరల నేమియడుగక యసంతుష్టమనస్కుండై సాధారణంబుగ నందఱను సత్కరించి యనిపి గోష్ఠినిముగించి యభ్యంతరగృహంబున కేగె. పదియొకండవదినంబున సామాన్యసంపత్తితోఁ బుత్త్రికి జాతకర్మంబుసల్పి సీమంతిని యని నామకరణంబొనరించె. బాలయు శుక్లపక్షచంద్రరేఖవలె దినదినప్రవర్ధమానయై పెంపొందుచు రూపంబునఁ దేజంబున చేష్టలఁ దల్లిదండ్రులకును బంధువులకఖిలజనంబులకు సంతోసం బొనర్చుచుండె. భూనాథుం డైదవయేటఁ బుత్త్రికి విద్యారంభముచేయించి విద్యాబోధకై గురుల నియోగించె. బాలయగుసీమంతినియు బుద్ధివైశద్యంబున నచిరకాలంబుననే యెల్లవిద్యలందు సులభంబుగ నుత్తీర్ణయై గురులకుఁ దల్లిదండ్రుల కానందమొనంగె. అంతనొకనాఁడు సీమంతినీకన్య సామంతామాత్యకన్యలతో దాసీనివహంబుతో నుద్యానవనంబున కేగి యందుఁ జెలులతో నాటలాడుకొనుచుఁ గొంతసేపును బువ్వులుగోసికొనుచుఁగొంతసేపును బొమ్మలుబుచ్చుచుండె. ఇప్పటివఱ కామెజన్మదినంబున ధూర్తవిప్రుఁ డాడినవిపాదవచనంబులెందును దలచూపకయుండె. దుఃఖకరవచనముగావున మహారాజును దదితరసభ్యులును నాఁటిమాటను మరలఁ బ్రస్తావమునకు రానీక యణంచిరి. కాని "పెదవిదాఁటినఁబృథివిదాటు" ననెడుసామితచొప్పున నది యట్లణగక ఎవరినోటనో వెలికిజారి కొందఱి కెఱుకయ్యె. సీమంతిని యానాఁడుద్యానవనంబునఁ బూలుగోయుచున్నసమయంబున నేదియో కొండొకప్రస్తావంబున అనభిజ్ఞయగు నొకపాలతుకముఖంబునఁ దొల్లి విప్రోక్తంబగువిపాదవచనం బారాజపుత్త్రిచెవిఁబడియె. అంతనే వజ్రతాడిత మైన ట్లాకన్నియ నేలఁగూలి విలపించె. నెయ్యంపుచెలులు దాసీలు మున్నగువారు తగినయుపచారములొనర్చి ధైర్యంబుఁజెప్పి బుజ్జగించి కటూక్తిఁదెలిపినట్టిపాలఁతుకను గినిసి మందలించి బుద్ధిచెప్పి రాజకుమారిని రాజాంతఃపురంబును జేర్చిరి. సీమంతినీకన్యకపుడు పదకొండవయేడు నడుచుచుండెను. అంత సీమంతిని దుఃఖంబు నణచుకొని యానాటిప్రదోషసమయమందే భూషణంబులనెల్లఁ బరిత్యజించి పరిమితవేషయై యొకప్రముఖదాసిని దోడ్కొని రాచనగరునుండి వెడలి యచటి

కనతిదూరంబున నున్నయొక మున్యాశ్రమంబుఁజేరి యప్పటికి సాయంతన కృత్యంబు లన్నియుఁదీర్చి కూర్చుండియున్నట్టి మహాతపస్విని మహాసాధ్విని యాజ్ఞవల్క్యమునీంద్రపత్నిని మైత్రేయీదేవిని గూర్చి వేగంబుగఁ బరుగెత్తి చేరి యామెపాదంబులఁబడి పదంబులవిడువక లేవక దుఃఖితయై వనరుచున్నమహారాజతనయను గాంచి కరుణించి శిరంబుపైఁజేయుంచి వత్సా! లెమ్ము! లెమ్ము! ఏలయిట్లు భీతవై వచ్చితివి. మనకందరకు సర్వభయహరుండు హరుండుసన్నిహితుండుండై యున్నాడు. లెమ్మనియె. పుత్రి యట్లులేవక తల్లీ! క్షమింపుము! రక్షింపుము! అభయంబొసఁగుము.

శ్లో॥ మాత స్త్వచ్చరణాంభోజం । ప్రపన్నాస్మి భయాకులా
సౌభాగ్యవర్ధనంకర్మ । మమ శాసితు మర్హసి.

బ్రహ్మోత్తరఖండం.

తా॥ తల్లీ! భయాకులనై నీచరణపద్మంబులను జెందితిని. నాకు సౌభాగ్యవర్ధన మగు వ్రతంబు ననుశాసింపుము. నీవ యర్హావు.

మైత్రేయియును బాలా! మనకందరకు సర్వాభయకరుఁడు హరుఁడు సన్నిహితుండిఁక లెమ్మనియెను. రాజపుత్రి యంతతో లేచి యామెపదంబులపైఁ జెయియునిచి కూర్చుండి తల్లీ! యుపదేశింపు మనుఁడు దయాశీల యగు నాసాధ్వీమతల్లి ఇట్లు చెప్పె.

శ్లో॥ శరణం వ్రజ తన్వంగి పార్వతీం శివసంయుతాం
సోమవారే శివంగౌరీం పూజయస్వ సమాహితా
ఉపోషితావా సుస్నాతా విరజాంబరధారిణీ
యతవా క్నిశ్చలమనాః పూజాంకృత్వా యథోచితాం
బ్రాహ్మణాన్ భోజయిత్వాథ శివంసాంబం ప్రసాదయ

బ్రహ్మోత్తరఖండము.

తా॥ ఓబాలా! శివసహితయగుపార్వతీమహాదేవిని శరణమొందుము. సావధానవై సోమవారమందు శివుని శివనుబూజింపుము. ఉపోషితవై నియతవచనవై నిశ్చలచిత్తవై సాయమందు స్నానమొనర్చి మడివలువలగట్టికొని ఉచితరీతితో నుమామహేశ్వరులను బూజింపుము. పూజావసానంబున ఉత్తములైనబ్రాహ్మణులను భుజింపజేయుము. అంబామహేశ్వరులప్రసాదంబుఁ బడయుము,

ఈపూజయందు అభిషేకంబునఁ బాపక్షయంబును బీరపూజచేత సామ్రాజ్యంబును గంధాక్షతమాల్యసమర్పణంబున సౌభాగ్యసౌఖ్యంబులును ధూపముచేత సౌగంధ్యంబును దీపదానముచే దేహకాంతియును నైవేద్యముచేత మహాభోగంబును తాంబూలదానముచేత లక్ష్మియు నమస్కారంబుచేత ధర్మార్థకామమోక్షములును జపముచేత అష్టైశ్వర్యసిద్ధియు హోమముచే సర్వకామవృద్ధియు శమదమములుగల బ్రాహ్మణులభోజనంబున సర్వదేవతాతుష్టియు నగుననియు ఇట్లువ్రతంబుఁబూని సోమవారమందుఁ బార్వతీపరమేశ్వరుల్లను నియతితోఁ బూజింపుమనియు ఎంతయాపదవచ్చినను మానక వ్రతంబు ననుష్ఠింపుమనియు మిక్కిలి ఘోరమైనట్టియు భయంకరమైనట్టియు కష్టంబును జెందినను విడువక యిట్లు వ్రతంబు నాచరించితివేని ఆపత్సముద్రంబును దాటుదువనియు నిట్లుపదేశించి రాజపుత్రిని గృహంబునకుఁబోవుట కనుజ్ఞనిచ్చె. సీమంతిని యామెపదంబులకు మ్రొక్కి గృహంబునకేగి మైత్రేయీమహాదేవి చెప్పినచొప్పున నక్షరముదప్పక వ్రతం బొనర్చుచుండె. త్రిలోకసుందరి యగుసీమంతిని కంత యౌవనం బంకురించి సర్వాంగంబులందు యసదృశంబైనకాంతి యినుమడించె. నెన్నడుము సన్నంబయ్యె. వక్షోజనితంబమండలంబులు బలిసి విస్తరించె. వేణీభరంబు శ్రోణీస్థలిన్ దాటె. మందహాససుందరముఖారవిందంబందు దేటు లట్లు ముంగురు లొకింత వ్రాలుచు లోకోత్తర రామణీయకంబుఁ దలపించుచుండె. ఆయమ సోమవారమందే కాక ప్రత్యహంబు నుమామహేశ్వరుల భక్తితోఁ బూజింపుచు సంతతము శివధ్యానగానంబులతోఁ బ్రొద్దులుపుచ్చుచుండె. సకలరాజనందనులీసుందరీలలామరూపరేఖాదులవిని పరవశులై యెట్టిపుణ్యున కట్టికాంతారత్నంబు పత్నియైలభించునో యట్టిపురుషుండే ఈశ్వరుఁడని తలచుచుండిరి. చిత్రవర్మమహారాజపుడు పార్థివనందనుల నెల్లరఁ బరీక్షించి సుందరరూపవిద్యావినయవిక్రమబలైశ్వర్యధైర్యస్థైర్యగాంభీర్య మహాదార్యాదిసద్గుణసమున్మేషప్రకాశుండును త్రిలోకవినుతకీర్తులైన నలదమయంతుల పౌత్రుండును శమదమగరిష్ఠుండగు నింద్రసేనమహారాజునకుఁ బుత్రుండును అఖండమహీమండలయౌవరాజ్యాభిషిక్తుండును నవయౌవన

లక్ష్మీవిలాసభాసురుఁడును అశ్రాంతశివలింగసమారాధనాతత్పరుండును శివతత్త్వభావనాభావితాంతరంగుండును నగు చంద్రాంగదమహారాజును వరించి తజ్జననీజనకుల కెఱింగించి తదనుమతితో నవ్వారలపురస్సరంబుగ సకలసామంత మంత్రిహిత బంధుపురోహిత పరిజన సేనాసమన్వితంబుగఁ జంద్రాంగదు నాత్మపురంబునకు రప్పించి దైవజ్ఞనిర్ణీతశుభలగ్నంబున సీమంతినీకన్యను సాలంకారంబుగ సమంత్రకంబుగ సబహుమానంబుగ సహిరణ్యజలధారంబుగఁ జంద్రాంగదునకు కన్యాదానంబుచేసి యనేక ధనరాసులను మణిభూషణంబులను ముక్తాహారంబులను రథగజాశ్వపదాతి దాసదాసీవర్గంబుల సమర్పించి వివాహోత్సవం బొనరించె. సకలపౌరజాన పదజనంబులకు వర్ణానుకూలంబుగ మృష్టాన్నంబు లొసంగి యీప్సిత ధనంబులిచ్చె. పట్టణమం దొకమాసమువరకును ననేకవిధంబుల పౌర జనంబు లానందంబున వివాహోత్సవంబుల నొనర్చిరి. చంద్రాంగద జననీజనకులును సామంతమంత్రిహితబంధుపరిజనంబులును స్వపురంబున కరిగిరి. చంద్రాంగదుఁడు మాత్రము శ్వశురప్రార్థనచేఁ గతిపయపరి వారంబుతోఁ గొన్ని దినంబులు శ్వశురపురమందుండె. అపుడొకనాఁడు చంద్రాంగదుండు సఖులతో యమునాజలకేళీవిహారంబుసేయ నభిలషించి స్యాలకునకుఁజెప్పిననతండభిమతించి మిక్కిలిసమర్థులగునావికులను రప్పించి మేలైననౌకను దెప్పించి చిత్రధ్వజపతాకంబులచేతను బుష్పవ్రజంబుల చేతను ముక్తాహారంబులచేతను నలంకరించి తానును బ్రధానమంత్రి పుత్రుండును సేనానియు గానవిద్యావిశారదులును వందిమాగధపరి జనంబు లనుసరింపఁ జంద్రాంగదునితో నందఱోడ నెక్కి యమునానదిపై విహారార్థమై వెడలిరి. హర్షంబుతో నవ్వలితీరంబువఱకుఁ బ్రయాణంబు చేసి యచటినుండి మరలి నగరంబుఁజేరవచ్చుచుండిరి.

శ్లో॥ అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్.

తా॥ తానొకటితలఁచిన దైవమొకటితలచును.

అంతట పడవ యొకసుడిగుండంబునఁ బ్రవేశించి నావికులెక్కుడు ప్రయత్నముతో మరలించుచున్నను మఱలక గిరగిరదిరిగి యగాధయము నాజలంబుల మునింగె. నౌకయందలివారందఱు హా హా యనియఱచుచుఁ బ్రవాహంబున మునిఁగిరి. తీరంబున జూచుచున్నవారందఱు హాహాధ్వ

నులఁజేయుచు నేలఁగూలిరి. నలుదెసల భూరివిషాదధ్వను లాకసంబుముట్టె. ఓడలోనివారు గొందఱు నక్రాదిజలసత్వంబుల నోటఁబడిరి. కొందఱు మృతినొందిరి. ఓడనడుపువారును జిత్రవర్మపుత్రుండు నమాత్యపుత్త్రుండు మున్నగువారు గొందఱు నీరంబుల నీదుకొనుచు వచ్చి తీరంబుఁజేరిరి. చంద్రాంగదుఁ డేరికి నెందును గన్పట్టకుండె. నిముసములో నవ్వార్త నగరిని జేరఁ జిత్రవర్మమహారాజు విని జగంబుమునిఁగినట్లు దుఃఖసముద్రమునఁబడి యొడలెఱుంగక యమునాతీరంబుఁజేరె. అంతఃపురం బందలి రాణు లెల్లరు విని భోరున నేడ్చుచుండిరి. సీమంతిని యివ్వార్త విని మూర్ఛనొంది వృక్షంబుఁబాసి భువిని బడినతీవియ వోలె పుడమిఁబడియె. గ్రామంబులోని జను లంద ఱా ఘోరంబుఁ దెలిసికొని శోకంబొంది దుఃఖధ్వనులు మిన్నుముట్ట నేడ్చుచుండిరి. చిత్రవర్మధాత్రీశుం డెట్టకేలకుఁ దెలివినొంది మేటులైనయీతగాండ్రను జలస్తంభవిద్యాప్రవీణులను నియోగించి నదీజలంబు లెల్ల నల్లకల్లోలముగావించి వెతకించె. ఎందునను జంద్రాంగదుఁ డగుపట్టలేదు. అపుడు మంత్రిహితపురోహితాదులు వచ్చి చిత్రవర్మకు ధైర్యంబుసెప్పి యనునయించి నగరంబుఁజేర్చిరి. తేఁడంత నంతఃపురంబుఁజేరి ప్రాణమాత్రావశిష్టయై హతాశయై విలపించుచున్నకూతును జూచి తాను నెక్కుడుగ నేడ్చె. సీమంతిని భర్త ధరించు నట్టివస్త్రంబులను భూషణంబులను జిమివేసి తా నాచితిని జేరి దేహత్యాగంబుజేయ నెంచుచుండఁ జిత్రవర్మ యధ్యాత్మబోధంబును ధర్మబోధంబు నొనర్చి దేహత్యాగంబును మానుమని కోరె. ఆమెయుఁ దండ్రిచిత్తంబింకను నొచ్చునోయని యట్లు సమ్మతించె. ఇవ్వార్త ఇంద్రసేనమహారాజనగరంబుఁ జేరఁగా ఇంద్రసేనుఁ డా ఘోరవార్త విని దుఃఖగ్రస్తుఁడై భువింబడియె. శుద్ధాంతంబున రాణియుఁ దత్పరిజనంబులును విని ఘోరదుఃఖంబొంది శిరస్తాడనంబులు చేసికొనుచు విలపించిరి. ఆ యూరివారంద ఱారసి ఘొల్లుననేడ్చుచుఁ బుడమిఁబడిపొరలుచు నిద్రాహారంబులఁబాసి దుఃఖించుచుండిరి. ప్రభువగు నింద్రసేనుండు వివశుఁడై మతిఁదప్పి వెఱ్ఱివానివలె వాపోవుచు రాజ్యచింతనంబును ప్రజారక్షణంబును మాని మానువలెనుండె. అట్టిసమయం బెఱింగి దాయాదు లిదియే యదని సైన్యంబులతో వచ్చి పట్టణంబు ముట్టడించి ఇంద్రసేనుని దత్సతిని

కారాగృహంబందుఁ జేర్చి చెరబెట్టి సింహాసనంబు స్వాధీనంబుచేసికొని రాజ్యంబేలుచుండిరి. చిత్రవర్మయు నల్లునికిఁ బారలౌకికక్రియలొనరించె. సీమంతిని వైధవ్యంబునొందియుఁ జిన్ననాఁ డారంభించిన వ్రతంబును మానక సోమవారమందు పార్వతీపరమేశ్వరుల భక్తితో బూజించు చుండె. పదియాఱవయేట సంప్రాప్తమైనవైధవ్యము మూఁడేండ్లుగడచె.

అంత యమునానదిని మునిఁగిన చంద్రాంగదుఁడు ధల క్రిందుగా నధోలోకంబులఁ జాలవఱకు దాటి పాతాళలోకమందలి భోగవతీ నిర్ఝరిణిని జేరుచుండఁ బాతాళవాసినులగు నాగకన్యలిరువురు స్నానార్థంబై యటకు వచ్చి నదిలోఁ గొట్టుకొనిపోవుచున్న నా సుందరరాజకుమార మూర్తిని గాంచి విస్మయంబు నాకస్మికసంతోషంబు నొంది పరివాహంబీదుచు నది కెదురేగి యారాజకుమారుని బట్టికొని తీరంబుఁజేర్చి తమ గేహమునకుఁజెందించి తడిసినవస్త్రంబులఁదొలఁగించి నూత్నవస్త్రములఁ గట్టి సేదఁదీర్చి రసాయనసేవనాదులఁ దేజంబు బలంబు సమకూర్చి సుగంధచందనలేపనభోజనతాంబూలసురభిళపుష్పహారంబుల నిచ్చి యాలోకం బేలునట్టి తక్షకనాగేంద్రుని సభాభవనంబునకుఁ గొనిపోయిరి. చంద్రాంగదుఁ డారాజధానిని జూచి విస్మితుఁ డయ్యె. ఆ నగరం బంతయు భోగవతీనదీవేష్టితంబుజభ్రప్రాకారగోపురవిస్తృతంబు నవరత్నమయానేక కాంచనద్వారకవాటఘటితంబు సుదీర్ఘవిశాలరథ్యావిఫణిమణిశోభితంబు ముక్తామాలికాజాలతోరణాలంకృతంబు స్ఫాటికమణిసౌధవీధివిరాజితంబు మణిదీపానేక సహస్ర సంశోభితంబు ఏక త్రి పంచ దశ శత ఫణాధర నిరీక్షాపాలితంబు. స్వర్గంబునకన్న మిన్న యేమో యని తోచుచుండె. అతఁడు వారలతోఁగూడ తక్షకసాన్నిధ్యంబుఁజేరె. ఆ యాస్థానం బంతయు ననేకమణిగణప్రభాకరఫణాధరసేవితంబై బహురత్నస్థగితకాంచనవిష్టరానేకభూయిష్ఠంబై మణిదీపసహస్రశోభితంబై యుండె. అందు మధ్యం బందు నవరత్నాలంకృతభర్మపాంచాలికాజాలవిరాజితంబును ముక్తామణీవితానప్రోతసితచ్ఛత్రియుతంబును కేవలగోమేధికరత్నవినిర్మిత సింహచతుష్టయశిరోదేశప్రతిష్ఠితంబును నుత్తుంగంబు నుత్తమంబు నగు మహాపీఠంబుమధ్యంబం దాసీనుండును దివ్యమణిమయకిరీటాలంకృతసహస్ర ఫణావళీజ్వాలాభీలశిరస్కుండును సువర్ణమణికుండలవిభూషితుండును

గ్రైవేయముక్తావళీశతవిరాజితుండును కాంచనపరిధానోత్తరీయధరుండును కస్తూరీపంకసంకలితదివ్యాగరులేపసుగంధబంధురుండును నిజతనుప్రభారింఛోళీధగద్ధగితభూరిప్రకాశుండును కాలాగ్నివిధంబుగ దుర్నిరీక్షుండును ప్రభాకరునిచందంబున దుస్సహతేజోవిరాజితుండునునగు తక్షకమహానాగేంద్రుని గాంచి చంద్రాంగదుండు ధీరుం డగుట జంకకసమీపించి సాష్టాంగపడి మ్రొక్కి వినతుండై దోసిలొగ్గి నిలుచుండె. దర్వీకరేంద్రుం డక్కుమారుని బరికించి యట్టిసుందరతరుణనరుని తోడి తెచ్చిన నాగకన్యలం జూచి ఈ మనుజుం డెవ్వం డిట కేటికిం దెచ్చితి రని యడిగె. వారలు చేమోడ్చి దేవా! నేఁటియుషస్సున తీర్థమాడుటకై భోగవతి కేగి యందు స్నానంబు లొనర్చుచుండగా ఈ నరుండు నదీప్రవాహంబునం గొట్టుకొనిపోవుచుండె. అపుడు మే మీదుచు నది కెదురేగి యీతనిం బట్టికొని వచ్చి యలతం దీర్చి తమసముఖమునకుం గొనివచ్చితిమి. ఈయనకులగోత్రంబుల నేమెఱుంగము. ఆ యుదంతంబంత దేవరయే తెలియవలె ననిరి. అంత తక్షకమహారాజానరవరుని జూచి యిట్లడిగె. ఓయీ! నీ వెవ్వరు ఏదేశము ఎవ్వనికొమరుడవు? ఏల ఇట్లు నదిలోం బడితివి? యనిన జంద్రాంగదుం డి ట్లనియె. నాగేంద్రచూడామణీ! భూమండలంబందలి మగధదేశంబందు పుణ్యకీర్తి నలచక్రవర్తి యనుసార్వభౌముం డుండెను. ఆయనకు ధర్మశీల దమయంతి యను పత్నియం దింద్రసేనుం డనుపుత్రుండు గలండు. నే నాయనఘునకుం దనయుండను. చంద్రాంగదుం డని పిలుతురు. నేను నవోఢుండనై శ్వశురగృహంబుం దుండి యొకనాఁడు యమునానదియందు నౌకావిహారంబు సేయుచుండఁగా దైవవశంబున నావ మునిగె. నే నుదకంబునఁబడి యీ లోకంబు జేరితి. దయాళురును ధన్యలు నగు నీ నాగకన్యలచే నుద్ధరింపఁబడి తమసన్నిధికిం జేర్పఁబడితిని. ఇవ్వారలు నన్ను సేదదీర్చి ఇచ్చటికి దెచ్చిరి. తొల్లి నే ననేకజన్మంబులం దొనర్చిన సుకృతశతంబుచేత నీపాదపద్మంబులం జూచితిని. ధన్యుండనైతిని. నా తల్లిదండ్రులు ధన్యులైరి. చూచుటయేకాక కరుణతోం దమచేత సల్లాపభాగ్యంబు నొందితిని. అనినం దక్షకుండు విని యా కుమారుని మృదుమధురవచనంబుల కలరి మరల నిట్లని యడిగె. ఓరాజేంద్రకుమారా! భయపడకు ధైర్యంబునొందుము. నామాటల కుత్తరంబుం

దెవ్వఁము. మీరు దేవతలలో నే దేవుని పూజింతు రెఱింగింపు మనియె.
రాజపుత్రుం డంత సంతోషంబుతో నిట్లులనియె.

శ్లో॥ యో దేవ స్సర్వదేవేషు మహాదేవ ఇతి స్మృతః
పూజ్యతే సహి విశ్వాత్మా శివోస్మాభి రుపాసితః
స్కాంద బ్రహ్మోత్తరఖండం.

తా॥ ఏ దేవుఁడు సర్వదేవులలో మహాదేవుఁడని కీర్తింపఁబడునో ఆ దేవుని శివుని మేము పూజించెదము.

శ్లో॥ యస్యప్రసాదం ప్రతిలభ్య సంతో వాంఛంతి నేంద్రం పదముజ్వలంవా
నిస్తీర్ణకర్మార్గళకాలచక్రాః చరం త్యభీతాః సశివో గతిర్నః
స్కాంద బ్రహ్మోత్తరఖండం.

తా॥ ఎవని యనుగ్రహమునొందినవార లుజ్వలంబగు దేవేంద్రపదంబునైనఁ దృణీకరించి యొల్లకుందురో ఎవనిగొలుచువారు కర్మార్గళము గలకాలచక్రంబును దాటి నిర్భీతులై చరింతురో యట్టి శివుని మే మనుసరించెదము.

శ్లో॥ యస్య స్మృతి స్సకలపాపరుజాం విఘాతం
సద్యః కరో త్యఖిలపుల్కసజన్మ భాజాం
యస్యస్వరూప మఖిలశ్రుతిభి ర్విమృశ్యం
తస్మై శివాయ సతతం కరవామపూజాం. (బ్రహ్మోత్తరఖండం)

తా॥ ఎవనిస్మరణము సకలపాపరోగములకు జండాలురకుఁగూడ దత్కాలమందే నివర్తకంబగుచున్నదో ఎవనిస్వరూపంబఖిలవేదములచే వెదకఁదగినదో యట్టిశివుని సతము పూజింతుము.

శ్లో॥ యన్మూర్ధ్ని లబ్ధనిలయా సురలోకసింధుః
య స్యాంకగా భగవతీ జగదంబికాచ
యత్కుండలేత్వహహ వాసుకితక్షకౌ ద్వౌ
సో స్మాక మేవ గతి రర్ధశశాంకమౌళిః. (బ్రహ్మోత్తరఖండము)

తా॥ ఎవనిశిరంబందు దేవగంగ వాసంబుచేసెనో ఎవనిడాతొడయందు భగవతి జగదంబిక రాణియై యుండునో ఎవనికి తక్షకవాసుకులు కుండలంబులో యట్టిచంద్రార్ధకిరీటుఁడు మాకు దిక్కు.

శ్లో॥ జయతి నిగమచూడాగ్రేషు యస్యాంఘ్రి పద్మం
జయతిచ హృది నిత్యం యోగినాం యస్య మూర్తిః
జయతి సకలలోకాతూర్ధ్వగా యస్య కీర్తిః
సవిజితగుణసర్గః పూజ్యతేఽస్మాభి రీశః॥        (బ్రహ్మోత్తరఖండము)

తా॥ ఎవనిపాదపద్మము నిగమశిరంబులందుఁ బ్రకాశించునో ఎవని మూర్తి యోగీశ్వరులహృదయమందు నిత్యంబు జాగరూకమై యుండునో ఎవనికీర్తి దశదిగంతరంబులందు నిండి ధృవమండలంబున కూర్ధ్వంబు నధిరోహించి యుండునో అట్టి నిర్జితగుణసన్నివేశుండీశుండు మాచేఁ బూజింపఁబడుచుండును.

ఇట్లు చంద్రాంగదుండు శివతత్త్వము నుపన్యసింపఁగాఁ దక్షకనాగేంద్రుండు హర్షించి శిరఃకంపంబొనర్చి చంద్రాంగదుని జూచి యిట్లనియె. రాజకుమారా! నీవు వయస్సునఁ జిన్నవైనను బరాత్పరుఁడగు శివుని తత్త్వంబుఁ దెలిసికొంటివి. నీవచనంబులు నాదు గర్ణరసాయనంబులయ్యె. వత్సా! ఈలోకంబంతయు రత్నమయము. ఇచటివృక్షంబులెల్లఁ గల్పవృక్షంబులు. బావు లన్నియు నమృతపుబావులు. ఇందలిస్త్రీలందఱు శాశ్వతనవయౌవనవతులు సౌందర్యవతులు. ఇందు జరారోగమృత్యుభయంబులు లేవు. ఇఁక నీ విందు వసించి యథేచ్ఛముగ సుఖముల ననుభవింపుము. ఇష్టంబుగ విహరింపుము. అనిచెప్పినఁ జంద్రాంగదుఁడు దోసిలొగ్గి యుదారబుద్ధితో నిట్లనియె. భోగీశ్వరా! నే నింతకు మున్నె పెండ్లాడితిని. నా సతియు సువ్రత శివపూజాపరాయణ. నా తల్లిదండ్రులకు నే నొకఁడనే సుతుఁడను. వారలు నన్ను మృతునిగాఁ దలంచి యిప్పటికి దుఃఖంబుతోఁ జచ్చియుందురో లేక దైవవశంబునఁ బ్రాణములతో నుండి యుందురో తెలియదు. అందుచే నే నిందుఁ బెక్కుదినంబు లుండుటకుఁ దగను. దయతో నన్ను నాలోకమునకుఁ జేర్చుటకుఁ దాము తగియున్నారు. ఇట్లనినంతఁ దక్షకుఁడు రాజపుత్త్రుని న్యాయబుద్ధికి ధర్మవచనంబులకు సంతసిల్లి తథాస్తు అట్లే యొనర్చెదనని వేగిరంబుగఁ బరిజనులచే దివ్యాంబరంబుల దివ్యగంధతిలకంబుల దివ్యసుగంధపుష్పస్రజంబుల దివ్యమణిభూషణంబులఁ దెప్పించి రాజాత్మజునకిచ్చె. మఱియు ననేకదివ్యరత్నమణిపరికరంబుల నేవళంబుల నొకచంద్ర

[illegible] దివ్యభూషణస్వరంబులను నొసంగి కామయానంబగు నొకయశ్వం [illegible] [illegible]గావహనంబున కై యొక్కరక్కసుని సహాయార్థ మొకనాగ [illegible] [illegible]చ్చి యొసంగియు నిట్లనియె. రాజనందనా! ఈ హయంబు [illegible]. దీని నెక్కి ఈరక్షో నాగకుమారసహితుండవై మీలోకం [illegible]ము. అందు నీ వెపుడేని నన్ను దలంచితివేని తత్క్షణంబున నే [illegible] వచ్చి [illegible]యిష్టంబు నెఱవేర్చెదను. ఇట్లు సెలవిచ్చి చంద్రాంగదుని [illegible] [illegible]ందురునకుం బునఃపునర్వందనంబు లొనరించి తన్నుంగా [illegible] [illegible]వతినుండి తోడ్కొనివచ్చిననాగకన్యల కిర్వురకు మొక్కి [illegible] [illegible] నెక్కి తలంచినతోడనే యశ్వంబుతో వారు [illegible] మున్నొడ మునింగినయమునాతీరంబునకు వచ్చిరి.

శ్లో॥ వనే రణే [illegible] ఘోరజలాగ్నిమధ్యే మహార్ణవే పర్వతమస్తకే వా
[illegible] ప్రమత్తం విషమస్థితంవా రక్షంతి పుణ్యాని పురా కృతాని.

స్కాంద బ్రహ్మోత్తరఖండము.

తా॥ వనమందుంగాని యుద్ధమందుంగాని భయంకరమైనయుదకమధ్యమం దుంగాని అట్టియగ్నిమధ్యమందుంగాని సముద్రమందుగాని పర్వతశిఖ రంబందుంగాని సంచరించుచున్నవానిని నిద్రించుచున్నవానిని మద్య పానంబుచే మత్తెక్కినవానిని విషమప్రదేశమందున్నవానిని పూర్వ కృతపుణ్యంబులు రక్షింపంగలవు.

ఇట్లు యమునాతీరంబుం జేరి అందు మురిపంబుదీరం జంద్రాంగ దుండు విహారంబు సేయుచుండె. ఆ నాండు సోమవారంబగుట సీమంతిని [illegible]తో స్నానార్థమై యచ్చటికి వచ్చి ఆ నదీతీరంబం దశ్వంబెక్కి విహరించుచున్నవాని నరరూపంబున మున్న నాగకుమారునితోడను [illegible]లభారంబును మోయుచున్న రక్కసునితోడను సంచరించు [illegible]వాని దివ్యాంబరభూషణంబుల ధరించినవాని దివ్యగంధానులేపం [illegible] దివ్యప్రసూనహారంబులను దాల్చుటచేత నొకయోజనంబువఱకు [illegible]పరిమళంబుల గుప్పుచున్నవాని మరునిం జందురుని నిరసించు [illegible] దేహంబువాని మందహాసముఖారవిందంబువాని తేం బ్రియంబు [illegible] [illegible]గదుని జూచి తత్తరపడి సిగ్గువడి పిచ్చెత్తినదానివలెనై [illegible] [illegible]రపుచూపులం జూచుచు నెడనెడదృష్టిమఱల్చుచుం గ్రిందం

జూచుచు మరల మొగమెత్తి యత్తరుణరాజముఖచంద్రికలఁ బరామర్శించుచుండె. రాజపుత్త్రుఁడు గూడ నా రాజకుమారిని జూచెను. అపుడామె మిగుల దీనముఖయై పసపు కుంకుమ మట్టెలు మాంగల్యము గాజులు కజ్జలము వేణీ మండన మితరభూషణములెవ్వియు లేనిదిగాను దుఃఖితచిత్తయై యున్నట్టుగాను గన్పట్టెను. ఇట్టి యా రాజపుత్రిని జూచి రాజనందనుఁడు విస్మితుఁడై ముందుఁ జూడఁబడినదానిగాఁ దలపోసి యశ్వంబును డిగ్గి యా లతాంగిని బిలిచి సమీపంబందుఁగూర్చుండనియోగించి యామెతో నిట్లనియె. పద్మనయనా! నీ వెవ్వతెవు? ఎవనికూతువు? ఎవ్వని గేహినివి? లేతప్రాయమందిట్టి దుఃఖదశ నెట్టులొందితివని సప్రేమంబుగ నడుగ నామె కన్నీరుగార్చుచు సిగ్గుతో దుఃఖముతోఁ దలవంచికొని యూరకుండెను. అపుడామెచెలులలోఁ బ్రగల్భయగునొకర్తుక రాజనందనుని జూచి యిట్లనియె. కరుణామూర్తీ! ఈమె యీ దేశం బేలునట్టి చిత్రవర్మమహారాజునకు గూతురు. మగధదేశంబేలుమహారాజునకుఁ గోడలు చంద్రాంగదమహారాజునకుఁ బత్ని సీమంతిని. ఈమెవిభుఁడు దైవయోగంబున నిందు జలంబుల మునిఁగిపోయె. మామదేడులయ్యె. ఈమె మామయు శత్రులచే రాజ్యంబుఁగోల్పడి కారాగృహంబున సకళత్రుండై బంధింపఁ బడియుండె. ఈయమ బాల్యంబునుండియు సోమవారమం దుమామహేశ్వరులఁ బూజించుచుండును. ఇపు డిట్టికష్టంపు పాటొందినను గూడ నీ గుణవతి వ్రతంబును విడువక యట్లే గౌరీశంకరుల నారాధించుచున్నది. నేఁడు సోమవార మగుట స్నానార్థమై యిటకు వచ్చినదని చెప్పెను. అటుమీఁద నా యిందువదన తెప్పవాల్చక యా రాజనందనుని మరలఁబరికించి దృష్టపూర్వుం డని మనంబున నిశ్చయించి యాతనితో నిట్టులనియె. ఓకారుణికోత్తమా! నీ వెవరు? నీ పక్కలం దున్న నీయిర్వు రెవ్వరు? నీవు దేవుఁడవో లేకసిద్ధుఁడవో గంధర్వుఁడవో నాగరాజకుమారుఁడవో యట్లు కాక నరరాజపుత్త్రుండవో తెల్పుము. మందభాగ్యురాల నగునా యుందంతం బేటికి దెలిసికొంటివి. మున్ను నన్నెపుడేని జూచియుంటివే? నాకు నీవు దృష్టపూర్వునియట్లు తోచుచున్నావు. స్వజనుం డట్టు లగుపడుచున్నావు. నీ యథార్థము నెఱింగింపుము. సజ్జనులెప్పుడును సత్యమునే యవలంబింతు రని దుఃఖవేగముతోడను కన్నీటి

తోడను నిరుస్తకంఠముతోడను విలపించి మూర్ఛితయై పుడమిఁబడియె.
చెలులామెను బట్టుకొని యోదార్చి మరలఁ గూర్చుండఁజేసి రిఁక
నామె నేమియుఁ బలుకలేకయుండె. చంద్రాంగదుఁడు తనసతి దుఃఖ
కారణంబంతయుఁ దెలిసికొని తానును దుఃఖితుఁడై క్షణకాలమూరక
యుండి యటుపిమ్మట సముచితహితవచనంబులచే నామె నూరడించి
దుఃఖముతోడను వెఱపుతోడను సంకుచితగాత్రియై యున్నదాని సీమంతి
నిని దన సరసకు లాఁగి పాణిగ్రహణంబందు శంకించుచున్నయమ్మానిని
పాణిగ్రహణంబుచేసి చెవియం దిట్లు మధురంబుగ నుడివె. ఓసతీమణీ!
దేవతలలో సిద్ధులనెఁడు నొకతెగవారము కామగమనులము. త్రిలోకం
బులఁ దిరుగుచుందుము. ఓయుత్తమా! ఒకలోకంబున నీ నాధుని జూచితిని.
అతఁడును నేనును స్నేహంబుతో నొకరే యనునట్లుంటిమి. నీ దువ్రతం
బున నాతఁడు సంతుష్టుండై యున్నాఁడు. త్వరలో నీ యొద్దకురాఁగలఁడు.
దుస్సహం బగునీ దుఃఖంబును బాపఁగలఁడు ఆలస్యము లేదు. రెండు
మూఁడురోజులలో నీ సకాశంబుఁ జేరఁగలఁడు. నీకు మే మాతని క్షేమంబుఁ
దెల్పుటకై యిటకు వచ్చితిమి. నామాటలను విశ్వసింపుము. సందేహిం
పకు శివచరణంబులందు శపథం బొనర్చి చెప్పుచున్నాఁడను. నీ వీ
వార్తను వెలిఁబుచ్చక హృదయంబందే యుంపు మనియెను. సీమంతినీసతి
సుధాధారాస్వాదశతంబుల మించునట్టియీవచనంబు లాకర్ణించి సంతోష
వేగముతోఁ జపలంబులగు నేత్రంబులతో మరల నా రాజపుత్రుం
జూచెను. ప్రేమబంధంబుచే గరిష్ఠంబైనవియు మధురరసాయనం
బైనవియును నగు వచనంబులు బలికినవాని సవిలాససుందరుఁ డగువాని
మధురములైన చూపులుగలవాని తనపాణిగ్రహణముచేత నేర్పడిన
రోమాంచముగల దేహమువాని పూర్వదృష్టశ్రుతంబులైనట్టి వయస్సు
ఎత్తు పొడవు ప్రమాణము చూపు మేనిరంగు పలుకులందలిఎలుగు
స్వరము గలట్టివానిగ నెఱింగి హృదయంబునం దిట్లు తలఁచెను. నా
విభుండగు చంద్రాంగదుండే యితండు మఱొకఁడు కాఁడు. పవిత్ర మైన
హృదయం బీతనియెడఁ బ్రేమగల దగుచున్నది. అని నిశ్చయింపుచు మరల
నిట్లనుకొనియె. మూఁడేండ్లక్రిందఁ బరలోకముఁ జేరిన నా పెనిమిటి
స్వరూపంబుధరించి మరల వచ్చునా? దౌర్భాగ్యురాల నగునాకు మృతుం

డైనభర్త మరలవచ్చునా? ఇది స్వప్నమా యది కాదు. భ్రమయా అది యును గా దీతఁడు ధూర్తుఁడో లేక యొకయక్షుడో గంధర్వుఁడో అగును. అనిచింతించి మరల విజ్ఞానంబునొంది ఇట్లు తలచెను. మహాత్మ యగుమైత్రేయి మహామునీశ్వరపత్ని యుపదేశించినవ్రతంబు ఫలంబో! ఇది నేను పుట్టిననాఁడు. దైవజ్ఞులంద ఱేకగ్రీవముతో నీకన్యక పదివేలేండ్లు పతితో భోగంబు లొంది సుపుత్రులఁ బుత్రికలఁ గనునని చెప్పిరఁట. ఆ వాక్యంబులు సత్యంబులగునేమో! పరమేశ్వరుఁడు దక్క నది యెవరె ఱుంగుదురు.

శ్లో॥ ప్రసన్నే పార్వతీనాథే కి మసాధ్యం శరీరిణాం.

తా॥ పార్వతీనాథుండు ప్రసన్నుఁడైనచో నీ దేహుల కసాధ్యమేది!

అని విచారించుచుండ మరల జంద్రాంగదుం డామెతో నిట్లులనియె. ఓగుణవతీ! నే నీశుభవార్త మీ యత్తమామలకెఱిఁగించుటకై వారి యొద్ద కేగెదను. వేగిరముగ నీపతి నొందెదవు. నీకు శుభమగుఁ గాత! యని రాజపుత్రిం డశ్వంబెక్కి యనుచరులతోఁ బ్రయాణంబుచేసి తద్ క్షణంబున నిషధరాజధానిని జేరి యం దుపవనంబున నిలిచి నాగకుమా రుని రాజాస్థానికిఁ బంపి వారలకుఁ దనవచ్చుటనుదెలిపి ఇంద్రసేనమహా రాజును దత్సతిని సత్వరంబుగ బంధంబులు బాపి సింహాసనంబు నెక్కించుఁ డనియు నట్లు చేయరేని జంద్రాంగదుండు తారసించి బాణంబులచేఁ బ్రాణంబులఁ బాపు ననియుఁ జెప్పి యంపెను. అతఁడట్లు వారలఁ జేరి చంద్రాంగదమహారాజు పాతాళలోకంబందుఁ దక్షకభోగీంద్రునిచే సన్మానితుఁడై యిటకువచ్చె ననియు మీరు వేగిరంబుగ నింద్రసేనుని దత్సతిని బంధంబులఁ బాపి నృపాసనంబుఁ జేర్పుఁడనియు లేకున్నఁ జత్తు రనియును జెప్పెను. అంత నా రాజజ్ఞాతు లానాగకుమారుని జూచి విస్మయించి నిక్కంబని విశ్వసించి భీతులై ఇంద్రసేననృపతిని దత్సతిని బంధనంబులనూడదీసి సింహాసనంబుఁ జేర్చి పాఱిపోయిరి. మంత్రిహిత పురోహితాదులు నాగసులంద ఱీవార్తఁ దెలిసి యాశ్చర్యపడి మహానం దంబున మురిసి పట్టఁపుటేనుఁగు నలంకరించి మేళతాళంబులు మ్రోయఁగా నుపవనంబుఁ జేరి చంద్రాంగదుని జూచి మహాసంతోషంబునఁ బొంగి మొ్రక్కి యాలింగనముచేసికొని యేనుఁగునెక్కించి రాజసభకుఁ జేర్చి

తమపుత్రుఁడు పాతాళలోకమునుండి జీవితుండై వచ్చె నని ఇంద్రసేన దంపతులకెఱింగించిరి. వా రెల్లట్లని యడిగి తెలిసికొని సంతోషంబుతో నోడలెరుంగకుండిరి. అపుడు చంద్రాంగదుండు తల్లిదండ్రులఁ దఱిసి యవ్వారి పదంబులఁ బడిమ్రొక్కె. అంతనవ్వారు చెప్పుటకు శక్యముగాని యానందముతోఁ బుత్రుని గాఢాలింగన మొనర్చికొని శిరమాఘ్రాణించి దేహం బంతయుఁ దడివి యెనలేని హర్షంబునొంది ఇది యంతయు సువ్రతయగు కోడలి పూజాఫలం బని నమ్మిరి. చంద్రాంగదుఁ డపుడు దలిదండ్రులకు మంత్రిహితపురోహితపౌరప్రముఖులకుఁ దాను తక్షకునిచే గౌరవింపఁబడి యనేకంబులగుమణిగణంబులతో నవరత్నసంచయంబుతో ననేకదివ్యవస్తువులతోఁ గామయానంబైనతురంగంబుతో నచ్చటికివచ్చిన యుదంతంబంతఁజెప్పి తక్షకనాగేంద్రుఁడిచ్చిన సువర్ణమణిరత్న భూషణంబులను సుగంధద్రవ్యంబులను సురభిళామ్లానపుష్పస్రజంబులను నెల్ల రకుఁ జూపించి జననీజనకులపాదసమక్షమందర్పించి యుంచె. పౌరజనులందఱు మేరలేనియానందపారవశ్యంబునఁ బొరలి యాక్షణంబునం దనేకోత్సవంబులు దేవాలయంబులం దర్చనలు విప్రభోజనంబులు దీనాంధబధిరమూకజనంబుల కన్నదానంబులొనర్చివస్త్రంబుల నొసఁగిరి. అమ్మఱునాఁ డుదయంబునఁ జిత్రవర్మమహారాజునకుఁ జంద్రాంగదుఁడు పాతాళలోకంబందుఁ దక్షకునిచే సత్కరింపఁబడి తిరుగ నిషధరాజధానికి విచ్చేసెననియు రాజ్యం బాక్రమించిన శత్రుజనులు సింహాసనంబుఁ బాసి యెందో పాఱిపోయిరనియు సీమంతిని నలఙ్కరింపుఁడనియు శుభలేఖను వ్రాసి పరిజనములతో నంపిరి. ఆ కాలరు లతిత్వరితంబునఁ జిత్రవర్మనగరికేతెంచి చిత్రవర్మమహారాజున కాపత్రిక నిచ్చిరి. అతండది చూచి మితిలేనిసంతోషంబున మిన్నంది యా కాలరుల కెదుటనున్న యమూల్యవస్తువులను బహుమానంబిచ్చె. తత్క్షణం బంతిపురిఁజేరి కూతునకు శుభసమాచారంబుఁ జెప్పి యానందబాష్పములతో నామెను దడపె. సీమంతినియుఁ జిత్రవర్మభూపాలునిరాణులెల్లరును నానందసముద్రంబున నోలలాడిరి. ఆపురవాసు లెల్ల రెఱింగి సంతోషంబునఁ బొంగి నృత్తంబుచేసిరి. చిత్రవర్మ యంతఁ బుత్త్రికి స్వయముగ మంగళాలఙ్కారంబొనర్చె. మఱునాఁడు మంత్రిహితపురోహితులతో యోజించి సీమంతినీచంద్రాంగదులకు మరల

వివాహంబుసేయ నెంచి వియ్యంకునకుఁ జంద్రాంగదుని దోడ్కొని సకల సామంతమంత్రిహితపురోహితజనంబులతో విచ్చేయుఁడని శుభపత్రికనంపె. వారలెల్లే యమితోత్సాహమెసంగఁ దఱలివచ్చిరి. చిత్రవర్మ యెదు ర్కొని వారలకు సకల పరిజనంబులకుఁ దగినవిడుదుల నొసఁగి గారవించి చంద్రాంగదుని దృఢాలింగనంబొసర్చికొని "ధన్యోస్మి"యని శుభము హూర్తమున మంగళాలంకృతమైన సీమంతిని నొసఁగి బహువిధపారి బర్హంబుల నిచ్చి వివాహముచేసె. సీమంతినియుఁ జంద్రాంగదుని జూచి దినత్రయముక్రింద యమునాతీరంబునఁ దనకుఁ గన్పడి పాణిగ్రహణ మొనర్చి కర్ణాంతికమందు శుభవచనంబుఁ జెప్పిన ధీరుండే తనవిభుండని గుఱుతించి శివపూజావ్రతంబు నభినందించి యానందించె. చంద్రాంగ దుండు పాతాళంబునుండి తెచ్చిన సువర్ణాంబరంబులను మణిభూషణంబుల ముక్తాహారంబుల సువర్ణ రాగద్రవ్యంబుల దివ్యచందనలేపనంబుల ఆమ్లాన సురభిగంధపుష్పస్రజంబుల సీమంతిని నలంకరించె. అట్టిదివ్యాలంకారంబుల నొంది యాసీమంతిని సకలజగదీశ్వరియైనగౌరీదేవివలె మహాలక్ష్మివలెఁ బ్రకాశంబుల మెరసె. వేదవిదులయాశీర్వాదధ్వనులు మిగులవెలసె. నృత్తగీత చతురులయాటపాటలును శోభిల్లె. సర్వజనంబులకు రాచ నగరున నొకవారమువఱకు సతతంబు మృష్టాన్నదానంబులొనర్చిరి. చంద్రాంగదుం డొకశుభరాత్రియందు శుభలగ్నంబందు సీమంతినిఁ గలసి కామభోగంబుల నాయిందుముఖిని సుఖంబులఁ దనిపెను. అట్లు గొన్ని దినంబులు మాత్రము శ్వశురపురమందుండి తరువాత సీమంతినిఁదో డ్కొని స్వజనముతోఁ దననగరికిఁ జేరి సతియును దానును నిత్యంబు నియతితో శివపూజచేయుచు సోమవారమందు మహారుద్రార్చనావిధితో నభిషేకంబును సహస్రకమలార్చనంబును సహస్రద్రోణపుష్పార్చనంబును లక్షబిల్వార్చనంబును ననేకసాహస్రబ్రాహ్మణభోజనంబును గౌరీశంకర ప్రీతిగ బ్రాహ్మణదంపతీపూజనంబును నొనర్చుచు రాష్ట్రంబం దీతిబాధ లెందును బొడసూపకుండఁగ అసత్యం బన్యాయంబు లేమిడియునునవి స్వరూపంబులేక శబ్దమాత్రమందే యుండునట్లుగ అఖిలప్రజాసుఖకరం బుగ జగంబునంత నేలుచుఁ దల్లిదండ్రులను సేవింపుచు సీమంతినియందుఁ బుత్రాష్టకంబును నొకపుత్రికను గని గురువృద్ధజనానుమోదంబుగ

సుఖంబుగ నుండెననిన నక్కథకునకు శ్రోతలామోదముతో ఆచార్య వర్యా! పుణ్యచరిత్రంబువిని యానందించితిమి. అనంతరము సీమంతినీ దేవి నెఱపిన సోమవారవ్రతంబు ప్రభావంబు నొక్కింతఁ దెలుపుమని యడిగిన నా దేశికుఁ డిట్లనియె. పాశుపతులారా! సోమవారవ్రతమహిమాశోభితంబైన సీమంతినీమాహాత్మ్యంబొకించుకఁ జెప్పెదను వినుండు.

## 15. సుమేధసోమవతులు బ్రాహ్మణదంపతులు

శ్లో॥ నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీ శ్రేయసే
సత్యా యాదికుటుంబినే మునిమనః ప్రత్యక్షచిన్మూర్తయే
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయం తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే.

శివానందలహరి

తా॥ నిత్యుఁడును గుణత్రయస్వరూపుఁడును బ్రహ్మవిష్ణురుద్రరూపుఁడును త్రిపురాసురులను జయించినవాఁడును పార్వతీదేవికిఁదపఃఫలమైన వాఁడును త్రైకాలికాబాధ్యుఁడును తొలిసంసారియైనవాఁడును మునులమనంబులకు గోచరించునట్టి జ్ఞానమే స్వరూపము గలవాఁనుడు మాయాశక్తిచే సృజింపఁబడిన ముల్లోకములు గలవాఁడును సర్వవేదాంతములచే బోధింపఁబడువాఁడును సాయఙ్కాలమందు నృత్తమును గావింపుటకై తొందఱకలవాఁడును జడలుదాల్చిన వాఁడునునగు శివునికొఱకు నమస్కారము.

విదర్భదేశమందలి యొకయగ్రహారమందు సుమిత్రుండనియును సారస్వతుండనియును నిరువురు బ్రాహ్మణులు కలరు. ఆ యిరువురు విప్రులు సతీసహితులు సంపూర్ణవేదకోవిదులు కాణాదపాణినీయవైయాసిక విద్యాధీతలు పరస్పరంబుమిత్రులు.వారల కిద్దఱలో సుమిత్రునకు సుమేధుండనుపుత్త్రుఁడును సారస్వతునకు సోమవంతుం డనుపుత్త్రుఁడును గలరు. ఆ విప్రకుమారు లొండొరులు సమానప్రాయులు సమానరూపమేధాయుతులు. విరచితోపనయనులై గురునొద్ద వేదశాస్త్రంబులఁ జదివికొని ధీరులై శైవాచారపరులై సూర్యచంద్రులట్లు భాసురతేజస్సంపన్నులై

యుండిరి. తండ్రులగుసుమిత్రసారస్వతులు వయస్సునను విద్యలను సమానంబుగఁ బెరిగి వివాహసమయోచితులగుకుమారులం గనుంగొని యిట్లనిరి. తనయులారా! మీరు వేదశాస్త్రంబులఁ జదివితిరి. పెండ్లికిఁ దగినవయస్సును బొందితిరి. ఇఁక మీ కిద్దఱకు వివాహములు కావలయును. అందులకు ధనం బవసరము. అర్థవిహీనుల కేదియు దుర్లభము. కావున మీ రిరువు రీదేశం బేలుమహారాజు నొద్దకుఁ బోయి సభయందు మీ నేర్చినవిద్యలఁ జూపి రాజుచే వివాహమునకై ధనంబడిగి తెచ్చుకొనుఁడు. మీకు వివాహముచేసెద మని చెప్పినంత బ్రాహ్మణపుత్రు లిరువురును సమ్మతించి ప్రయాణంబుచేసి విదర్భరాజసభకుఁ బోయి యా నరేంద్రునకుఁ దమ నేర్చినవిద్యావైభవంబుఁ జూపిరి. రాజశ్రేష్ఠుఁ డప్పుడు వారి విద్యాగరిమ కెంతయు సంతసించి మీ వచ్చినకార్యంబుఁ జెప్పుఁ డనియె. వారలంత ప్రభూ! మేము బ్రహ్మచారులము. మా తండ్రులు వృద్ధులు పేదవారు. మాకు వివాహంబునకుఁ దగినవయస్సు వచ్చినది. ధనమున్నఁగాని వివాహంబు గాదు. అందునకై ధనంబుఁ గోరి మీసన్నిధానంబునకు వచ్చితి మని నుడివిరి. ఆ నృపతి యా బ్రాహ్మణకుమారులఁ జూచి యిట్లనియె. భూసురపుత్రులారా! మీ యిరువురిపెండ్లిండ్లకు ధనము హెచ్చుగావలయును. అంతటిధనంబు మీకు సులభంబుగా లభించు నుపాయంబుఁ జెప్పెదను. అట్లు జేయుఁడు. నే నొసగెడుద్రవ్యము మీకు వివాహములకుఁ జాలదు. మీరు నామాటతీరొనర్చి ధనంబుఁ బడయుఁడు. అనిచెప్పగా వార లాయుపాయంబుఁ జెప్పుమనిరి. ఱేఁడపుడు ఇచ్చటికనతిదూరంబున మగధదేశంబందుఁ జంద్రాంగదమహారాజపత్ని సీమంతినీదేవి ప్రతిసోమవారంబం దుమామహేశ్వరులఁ బూజించి బ్రాహ్మణదంపతుల కనేకంబులగుధనంబు లొసంగి పూజించును. అట్లుగావున మీయిద్దఱిలో నొకడు స్త్రీవేషముధరించి ఆ రాజమందిరంబుఁ జేరితిరేని ఆ సీమంతినీదేవి మిమ్ముఁ బూజించి విస్తారంబుగ ధనంబులిచ్చును. అటుమీఁద మీర లూరుఁజేరి యా ధనంబుతో సుఖంబుగఁ బెండ్లిండ్లుచేసుకొందురు. ఇది రహస్య మని చెప్పిన విని యా విప్రకుమారు లిట్లనిరి. మహారాజా! మేము బ్రాహ్మణపుత్రులము. చదివినది వేదశాస్త్రములు తండ్రులును గురువులును సత్యమూర్తులు. మే మిట్టియధర్మంబును బూని కుటిలబుద్ధులమై రాజా

స్థానికిఁ జేపట తగవగునా? ఇందుఁ బాపంబును నిందయు నొదవును. మోసం బొనరింపఁబడిన రాజదండనంబును బ్రాణసంకటంబును గలుగును గావున యిట్టికార్యం బనర్హ మని చెప్పిరి. భూవరుఁ డంత నుడుగక తలిదండ్రుల యాజ్ఞవలెనట్లు గురునాజ్ఞయట్లు రాజశాసనంబు గూడ మీఱుట నేరం బగును. శుభమైన నశుభమైన రాజులు చెప్పినట్లు ప్రజలు నడువవల యును. అట్లు నడువరేని వారికి శ్రేయంబు గాదు ముప్పొనగూడును. కావున మీరలు నాయాజ్ఞాప్రకారం బొనర్చుట హితమనియెను. అంత వారలు చేయునదిలేక సమ్మతిఁ జూపిరి. భూపతి పరితోషంబొంది ఆ ద్విజులలో పొడువునఁ బ్రాయంబునఁ గొండొక మిన్నయైన సుమేధునికి వన్నిటఁ నించుక తక్కియున్న సోమవంతుని భార్యయగునట్లు సోమవంతు నకు స్త్రీవేష మొనగూర్చి పట్టుపుట్టంబును నట్టికంచుకంబును ధరింపఁజేసి హరిద్రకుంకుమలఁదీర్చి నేత్రంబులందుఁ గాటుకదిద్ది గాజు లొడ్డాణంబు మట్టెలు మాంగల్యంబు ధరింపఁ జేసి చూపరుల కుత్తమస్త్రీ యని తోఁచున ట్లొనరించి నిషధపురంబుపోవుజనంబులతోడఁ గూర్చి యంపెను. వారలు ప్రయాణంబు సలిపి నిషధపురిని జేరి సోమవారమునాఁడు జాము పొద్దువఱకు రాజప్రాసాదభూమిని జేరిరి. అచ్చటికి వచ్చిన పెక్కురు బ్రాహ్మణదంపతులతోఁ గూడికొని సీమంతినీపూజాస్థానంబు నొంది యందుపీఠంబులందు గూర్చుండియుండిరి. ఆసమయమందే రాజదంప తులు నిత్యానుష్ఠానంబుల నెరవేర్చికొని త్రిశతపరిమితబుత్విగ్జనంబుతో శివపూజాప్రారంభ మొనర్పఁ గడఁగిరి. గోక్షీరములు గోదధిఘృతములు తేనె చక్కెరపానకము నారికేళోదకము కదళీఫలోదకము దాడిమద్రా క్షాఫలోదకములు తియ్యమామిడిపండ్లరసము గంగాతీర్థము యమునోద కము నర్మదాసలిలము గోదాకృష్ణానీరంబులు పన్నీరు సువర్ణకలశంబు లందు నిండియుండె. మరియు విభూతియు శ్రీచందనగంధసారములు ధవ ళాక్షతలును హరిద్రకుంకుమంబులు కస్తూరి పునుగు జవ్వాజులు బంగరు గిండ్లయం దమరియుండె. పద్మంబులు తుమ్మిపూలు కొండగోగుపూవులు తెల్లగన్నేరుపూవులు నందివర్ధనప్రసూనంబులు పారిజాతపుష్పంబులు మల్లెపూవులు జాజివిరులు విరజాదులు హేమసుమంబులు కాంచనాశోక పుష్పంబులు గోరెంటవిరులు మందారకుసుమంబులు అష్టోత్తరలక్షబిల్వ

దళంబులు బంగారుతట్టలందు వెలసియుండె. కొంగ్రొత్తయందుగుమహిషాక్షియు నగరువత్తులు అష్టోత్తరశతంబుతోఁ గూడిన సహస్రదీపార్తులు అఖండదీప మపరంజిపాత్రంబులఁ జేర్పఁబడియుండె. ఇఁక యజమాన దంపతులు ఋత్విగ్జనముతో సంకల్పముచేసి యారంభమొనర్చి శ్రీగణేశ్వరుని బూజించి మహారుద్రార్చనానియతితోఁ బసిడికలశంబుల నున్న క్షీరాదులతో నభిషేకంబొనర్చి విభూతి గంధాక్షతంబుల నర్పించి యుమాదేవికి హారిద్రకుంకుమంబులఁ దిలకంబుదిద్ది ఆసీతపుష్పంబుల బిల్వదళంబుల లక్షపూజావిధితోఁ బూజించి ధూపం బొసఁగి సహస్రదీపంబుల వెలిగించి పట్టి యనంతరము బంగరుబళ్ళెరంబులందు సన్నబియ్యంపుటన్నమును సూపంబును శాకంబులును దప్పళంబు లప్పడంబులు వడియాలును బాలును బానకంబులు లడ్డుకంబులు జిలేబీలు వడ లరిసెలు మణుగుపూవులు చిత్రాన్నము శర్కరాన్నము కరు చేరులు హైయంగవీనము దధియు మున్నగువానిఁ దెప్పించి గౌరీశంకరులకుఁ బరివారదేవతలకు మహానైవేద్యము మధురోదకపానీయ మొసంగి హస్తప్రక్షాళనాద్యాచమనాంతంబు నొసగి కస్తూర్యాదుల ముఖవాసన లొసఁగి పచ్చకపురంపుతాంబూలం బిచ్చి కర్పూరనీరాజనమిచ్చి మంత్రపుష్పముఁబెట్టి నమస్కారములతోఁ బునర్నీరాజ నార్ఘ్యంబులొసఁగి విజ్ఞప్తిచేసి ప్రార్థనతోఁ బూజావసానమొనర్చిరి. అపుడు సీమంతినీదేవి బ్రాహ్మణదంపతులయొద్దకు వచ్చి వరుసగాఁ గూర్చుండి యున్నవారలయందు గౌరీశంకరుల నావాహనంబుచేసి గంధాక్షతపుష్పంబుల సమర్పించి బంగారుజలతరీపట్టుచీరను రైకను బంగరుపట్టుధోవతిని నుత్తరీయముల నిచ్చి బంగరు నగలనిచ్చి యొక్కొక్కరికి సహస్రనిష్కంబు లిచ్చుచు నీ కృత్రిమదంపతులయొద్దకు వచ్చి వర్ణంబు మాటి మాటికి వడఁకుచున్న స్త్రీవేషధారిణిని జూచి మందహాసంబొనర్చి యవ్వారల నేమియనక విహితంబుగ నట్లే వారిముందు గౌరీశంకరుల నావహించి పూజించి వస్త్రభూషణంబుల నిచ్చి యందఱికన్న నెక్కుడుగ వారలకు నిష్కంబు లిచ్చె. ఇట్లు దంపతిపూజల యనంతర మరంటియాకు లందు నన్నంబులు సూపశాకంబులు బక్వాన్నంబులు వడ్డించిరి. సుష్టుగ నందఱు భుజించి వీడ్యంబుల బొందిరి. రాత్రి యంతయు శివపురాణగాథాప్రవచనంబుల శివకథాశ్రవ

ణంబుల శివభజనంబుల గడపిరి. నాల్గవజామునఁ బౌరుగూరివార లందఱు ప్రయాణముచేయుచుండ నీకృత్రిమదంపతులు గూడఁ బయనముచేసి తోోవ నడుచుచుండిరి. పలువురు పలుతోోవలఁ బోవుచుండిరి. మార్గ మధ్యమునఁ దొకచోట నడుచుచున్నసుమేధుని జూచి ఆ స్త్రీవేషధారిణి పిలిచి యిట్లనియె. నాథా! ఏల ఇట్లు గమనవేగము నొందెదవు. నిలువుము. మనతో నడుచువా రందఱు వారివారి యూరిత్రోోవల కేగిరి. ఈవనప్రదేశము మిగుల రమణీయము జనరహితము సురతయోగ్యము చూడుము యిందువికసితవనమల్లికాపుష్పగుచ్ఛంబులందలి మరందంబునొంది యిందిందిరంబు లమందానందంబునఁ బాటలు పాడుచున్నవి. అదిగో పుంస్కోకిలంబు రసాలపుష్పమంజరిని మెక్కి మదమెక్కి కూయుచున్నది. పద్మసరోవరంబు లరవిందగంధంబులఁ గుప్పుగుప్పునఁ గుప్పుచున్నవి. పచ్చికలయాస్తరణంబులు శయ్యాస్థలంబులట్లు మదుల నూరింపుచున్నవి. శుకశారికలు మేళతాళంబులై మంగళధ్వనులు సేయుచు సుముహూర్త మిదేయని బోధించుచున్నవి. నీ విఁక నిలిచి యిందు నన్ను సురతక్రీడలఁ దనిపి భోగసామ్రాజ్యసుఖానందంబుఁజూరఁగొనుమనె. సుమేధుండు విని పరిహాసవాక్యములుగాఁ దలఁచి మందహాసంబుసేయుచుఁ బోవుచుండె నదిచూచి మరల నామె యిట్లనియె. నా నుడులను వినుచునే నడుచు చుంటివేమి? నేనిఁకనడువఁజాలను. కామోద్రేకంబు మీఱుచున్నకతంబున నడుగులు దడఁబడుచున్నవి. నిలుము నిలుము. నిలిచి నీ గాఢాలింగనంబిమ్ము నీ యధరామృతంబు నొసంగుము. నన్నుమన్మథభోగంబులఁ దేల్చి రక్షింపుము. నీ విఁక మీఱిఁ నడచిన ఆనవెట్టెద ననియె. సుమేధుఁడు విని తిరిగిచూచి మందహాసముచేసి సోమవంతుఁడా! ఏల యిట్లు వదరెదవు. పెరలు విన్ననవ్వరే? వేషధారణఫలంబు నొందితిమి. మన గ్రామంబున కేగి యీవేషంబులఁబరిత్యజింతము. ఇఁక బరిహాసంబులు మాని ముందు నడువుము. చదివినవేదశాస్త్రము లేమయ్యెననిన నామె మరల నిట్లనియె. కాంతుఁడా! ఇఁకను నింతసందియమా! నన్నుబురుషునిగాఁ దలఁచుచుంటివి. నేను పురుషుఁడనుగాను స్త్రీని సోమవతిని నీభార్యను. సీమంతినీదేవిచే న ట్లనుగ్రహింపఁబడితిమి. జాగుసేయక యీ వనాంతసరస్తీరంబందు నన్ను రమించి యానందింపుము. నన్నానందింపఁ

జేయుము. వేదశాస్త్రంబు లన్నియు గృహస్థునకు భార్యాసన్నివేశంబును నిషేధింపవు రమ్ము రమ్మనియెను. సుమేధుండు విని కార్యార్థంబు వేషంబు ధరించి రాజమందిరంబున కేగితిమి. ధనంబుఁబడసితిమి. ఊరి కేగి యిరువురము కన్యకలఁ బెండ్లియాడుదము. పరిహాసంబులుచాలించి నడువుమనె. సోమవతి (విసుగుతో) పరిహాసంబులు గావు. మొఱ్ఱో యనిన వినవేమి? నీసందియంబిపుడేతీర్చెదను. ఇటుచూడు మనుచుఁ గంచుకంబుఁముడివిడిచి చూపెను. అంత నుసుగక కట్టినపుట్టంబుఁగూడఁ దొలఁగింపఁబూనిన సుమేధుఁ డదరి చాలు నూరకుండమని గదిమి నివారించి యాపె నాపె ఉత్తుంగపీన స్తనద్వయంబును గృశోదరంబును పృథులశ్రోణీభరంబును వేణీదైర్ఘ్యంబును జూచి విస్మయంబును భయంబునుజెంది విచారించుచుండె. అంత నాయువతి నవ్వుచు సందియము తీఱెనదిగదా. ఇఁక నాలస్యముచేయక నన్ను భోగంబులఁ దనిపి బ్రతికింపుము.

శ్లో॥ చేతోభువశ్చాపలతాప్రసంగే। కావాకథామానుషలోక భాజాం॥

తా॥ మన్మథునిసంబంధమగుచాపల్యమందు మనుష్యులకుఁజెప్పఁదగిన దేమి?

ఇట్లని వేగిరపెట్టుచున్న నాయువతినిజూచి అపుడు గూడ నాసుమేధుఁడు భయపడి మనయూరుఁజేరి యిద్దానికిఁ బ్రతిక్రియ నాలోచింతము. యోజించి మరల స్వరూపంబు లభించున ట్లొనరింతము. అట్లు లభింపకున్నఁ దలిదండ్రులయనుమతితో వివాహం బాడుద మనుచు వేగిరంబుగఁ ద్రోవనడుచుచుండె. అంత నా యువతి కంతుబారి కోరువలేక విసిగి పఱుగుతో విభునకడ్డముపోయి యాతనివిశాలవక్షంబందుఁ దన స్తనద్వయంబుఁ గ్రుచ్చి బిగ్గఱకౌగలించి తననాల్కతోఁ బ్రియునియధరంబుఁ జుంబించి యాస్వాదించె. సుమేధుండు ధీరుండు గావున నా యువతిదృఢబాహుపాశబంధనంబును వదల్చుకొని ప్రియోక్తుల లాలనంబొనర్చి యూరికేగినయంతనే నీ యిష్టంబుఁ దీర్చెదనని యెట్టకేలకు నాత్మపురిని జేర్చి యిర్వురితలిదండ్రుల కుదంతంబు సర్వం బెఱింగించె. సారస్వతుండు పుత్త్రుండు పుత్త్రియగుటను జూచి "హా"యని యఱచిదుఃఖంబున నేడ్చుచుండె. సుమిత్రుఁడు హితోక్తుల నూరార్చి యిట్టికపటకృత్యంబొనరించి యాపదనుగూర్చినయా రాజును జేరి యడుగుదమని సారస్వతు సుమేధ సోమవతులఁ దోడ్కొని యానగరంబున కేగి రాజసభను బ్రవేశించిరి.

అంత సారస్వతుఁడేడ్చుచు వక్షస్థాడనం బొనరించుచుఁ దలఁ బగులగొట్టు కొనుచు రాజును జూచి కోపించుచు నిందించుచు నాక్రందన మొనర్చు చుండుటను జూచి ఱేఁ డదరిపడి ఏమి యిట్లు విలపించెదవు? న న్నేటికి దూషించెద వని యడిగెను. సారస్వతుఁ డపుడు మరల బిగ్గరగా నేడ్చి యిట్లనియె. రాజులు ప్రజాహితకరు లనియు సత్యశాసను లనియు ధర్మ నిష్ఠులనియు నెఱింగి మా ఇద్దఱకు నేకైకపుత్రులైనవీరలను సమగ్ర వేద శాస్త్రసంపన్నులను లేమితో వివాహార్థంబై యర్థంబును గోరి మా యగ్రహారంబున కొడయండవగుట నీయాస్థానంబున విద్యావైశద్యంబులఁ జూపి నీచే ధనంబులఁ బడసి రమ్మని పంపితిమి. నీ వట్లు ధనం బీక లోభం బునఁ బాపంబున కొడిగట్టి మాపుత్రులకుఁ గైతవరీతిఁ గఱపి కృత్రిమ వేషం బమర్చి మహారాజసన్నిధానంబున కంపితివి.

శ్లో॥ దేవతాసు గురౌ పిత్రోః అథ రాజకులేష్వపి
కౌటిల్య మాచరన్మోహాత్ సద్యో నశ్యతి సాన్వయః

తా॥ దేవతలందును గురునందును దల్లిదండ్రులయందు రాజకులంబు లందు మోహంబున గౌటిల్య మాచరించినవాఁడు సాన్వయం బుగ నశించును. (బ్రహ్మోత్తరఖండము)

అందు రాజకులంబు మాత్రమే కాక శివభక్తశిరోమణు లగు సీమంతినీచంద్రాంగదుల యెడఁ బాపరూపంబుఁ బన్నినవానికి మేలగునే? నీ వొనర్చినవేసంబుతో నున్ననీ యిరువురియందు సీమంతినీదేవి గారి శంకరుల నావహించి పూజించిన విశేషంబున ఈ నా పుత్రుండు స్త్రీ యయ్యె. ఇఁక నేను పితౄణంబు నెట్టుబాయుదు? "నిరాశాః పితరో మమ" నాపితృదేవతలకు నైరాశ్యంబు చేకూరె. వంశమునకు విచ్ఛిన్నత దాపరించె. "అపుత్రస్య గతి ర్నాస్తి" యనువచనంబునకు లక్ష్యంబైతిని. నీ మూలంబున నిట్టి యనర్థం బొనగూడె. ఇఁక నేను చేయునదియేమి? నీదు సౌధద్వారంబుముందఱ శిలలతో నెత్తిఁబగులగొట్టుకొనియో ఉరి బోసికొనియో చచ్చెదను. నీకు బ్రహ్మహత్యాపాపంబుతోఁ గూడ బ్రాహ్మణవంశచ్ఛేదనాఘంబును చేకూరు ననిచెప్పె. అపుడు భూపతి విస్మితుండై సర్వంబారసి సారస్వతునివచనంబు లన్నియు సత్యంబు లగుట

నెఱింగి సీమంతినీపూజాపరిభావంబున కక్కజమొంది తాఁ జేసినయది ద్రోహంబనియుఁ బాపకార్యంబని యూహించి భీతుండై తనగురుం డగు భరద్వాజమునిని బిలిపించి మ్రొక్కి తనయకృత్యంబంత నాయనఘున కెఱింగించి స్త్రీత్వము నొందిన బ్రాహ్మణకుమారునకు మరలఁ బురుష భావం బొనఁగూడునట్లుచేయుట కమ్మునిని బ్రార్థించెను. మునియును నట్లొనర్చుట సామాన్యంబు గాదనియు దుర్లభం బనియు శివభక్తులకార్యం బులను మార్చుటకు బ్రహ్మకుఁ గూడ సాధ్యంబు గాదనియును జెప్పి యెట్టులైన నంబికనుగూర్చి వరపడుదమని స్నాతులై యర్చనావస్తు సంచయంబుఁ గొని సుమేధసోమవతులను వారిజనకులతోడఁ దోడ్కొని చేనితో నంబికాలయంబున కేగి సాష్టాంగపడి మ్రొక్కి యర్చనాపద్ధ తితో నవావరణపూజ నొనర్చుచు నందఱు దినత్రయం బుపవాసంబుచేసి గౌరీదేవిని గొలుచుచుండిరి. మూడవదినంబు నిశాంతంబందు ధరాపా లుండు మిగుల భయంబొందుచు నుమాపాదారవిందంబులందు జిత్తంబు నేకాగ్రంబుగ నిలిపి తదేకశరణ్యుఁడై యిట్లు ప్రార్థించె.

శ్లో॥ జయగౌరి మహాదేవి । జయత్రిభువనేశ్వరి
జయసూర్యేందునయనే । జయకోటిరవిప్రభే
జయశైలేంద్రతనయే । జయశంకరవల్లభే
జయచంద్రికళామాళే । జయపద్మాక్షసోదరి
జయహేరంబజనని । జయనిర్జరపూజితే
జయభక్తాపదుద్ధారే । జయశక్తిధరప్రసూః
జయపంచాననారూఢే । జయశుంభాదిమర్దనే
జయదేవీకల్పలతే । జయవేదచయప్రియే
జయసంగీతచతురే । జయభక్తార్తిభంజని! బ్రహ్మోత్తరఖండము.

తల్లీ! యనుగ్రహింపు మనుగ్రహింపు మని ప్రార్థించుచుండ భక్త వత్సల యగునంబికాదేవి మందహాసముఖారవిందంబుతో బాలేందుకిరీటం బుతో సానుగ్రహనయనేందీవరంబులతో సాయుధాభయవరదహస్తంబు లతోఁ బ్రత్యక్షంబొంది రాజుంజూచి భయపడకు వరంబిచ్చెద అభీష్టం బడుగు మనియె. భూవరుఁ డానందించి యడుగులఁబడి మ్రొక్కి సాంజ లియై సోమవతిం జూపి యీమెకు మరలఁ బుంస్త్వం బిమ్మనె. పరమేశ్వరి

మందహాసముచేసి యిదియొకటిగాక వేఱొక్కటి యడుగు మిచ్చెద ననియె. రాజు త్రిభువనజననీ! నీకు దుష్కరంబు గలదా! నా యొనర్చిన యవివేకకృత్యంబున నీ సారస్వతునకు ముప్పొదవె. ఈత డేకపుత్త్రుఁడు. నీ వనుగ్రహింపకున్న నీతఁడు పిత్రూణంబునఁ బడు యీతనివంశం బంత రించును గావున నీ వెట్లని నా కభీష్టవరంబీవలయుననిన నా మహాదేవి ఇ ట్లనియె. రాజవర్యా! సీమంతిని నాదు భక్తాగ్రగణ్య. ఆమె యీ మిథునంబందు నా స్వామియగుశంకరుని నన్ను నావాహనంబు చేసి పూజించినది. ఆమె సంకల్ప మమోఘము. ఎవరును మార్పజాలరు. మీరీ దంపతులకుఁ బెండ్లి చేయుఁడు. సారస్వతునకు వంశవృద్ధికై మఱొక సుతుండు వేదశాస్త్రాదిసత్కళావిశారదుం డుదయించు న ట్లనుగ్రహించితి నని యంతర్ధానం బొందె. రాజును బ్రాహ్మణులును భరద్వాజముని యు సంతసించి రంత సుమిత్రసారస్వతులు భూమీశు నాశీర్వదించి స్వాగ్రహారంబున కేగిరి. విధర్భేశ్వరుండు బ్రదికితి ననుకొని తెప్పరిల్లి భరద్వాజమునీంద్రునకుఁ బునఃపునర్వందనంబు బొనర్చి తదీయాశ్రమంబున కనిపి తానును రాచనగరుఁ జేరె. సుమిత్రసారస్వతులు శుభముహూర్తంబందు సుమేధసోమవతులకు వివాహంబొనర్చిరి. నూతనదంపతులత్యంతసంతుష్టులై భోగంబు లొందుచుండిరి. సారస్వతునకు శుభలగ్నంబందు సద్గుణభూషితుండు కులోద్ధారకుఁడగు పుత్త్రుండు జన్మించెను. వాఱందరు శివభక్తితో నిత్యంబు నియత శివార్చనం బొనర్చుచుండిరి. పాశుపతులారా! సోమవారవ్రతమాహాత్మ్యంబును సుచరిత్ర సీమంతినీదేవి మహిమంబును జెప్పితి. ఈ సీమంతినీచరిత్రంబును జదివినను వినినను వారలకుఁ బాపక్షయం బగును. శివానుగ్రహంబును చేకూరును.

## 15. చండక శబరుఁడు

శ్లో॥ క్రోధ స్తోయహృతః శ్రమేణ పథిక శ్ఛాయాం తరో ర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిథి ర్దీనః ప్రభుం ధార్మికం
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వంతథా
చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహం

తా॥ ఓచిత్తమా! నీటితోఁగొట్టుకొనిపోవువాఁడు తీరమును అలసినట్టి బాటసారి చెట్టునీడను వానకుఁదడిసిజడిసినవాఁడు గట్టియిల్లును భోజనవేళఁ బొఱుగూరునుండి వచ్చినవాఁడు గృహస్థును దరిద్రుఁడు ధార్మికుఁడగు రాజును చీఁకటిలోనున్నవాఁడు దీపమును చలితో బాధపడువాఁడు అగ్నిని ఎట్లుచేరఁదలఁతురో అట్లు నీవు సర్వభయములను బాపునట్టి శివునిపాదకమలమును జేరుము సుఖమొందుము.

శివానందలహరి

పూర్వమందు పాంచాలదేశమున సింహకేతుఁ డనునొకరాజశ్రేష్ఠుఁడు కలఁడు. అతఁ డతిధార్మికుఁడు శివభక్తుఁడు ప్రజాభీష్టకరుఁడు సత్యవాది జితేంద్రియుఁడు సకలసద్గుణసంపన్నుఁడు. అతఁడొకనాఁడు పల్లెలయందలిప్రజలచేఁ బ్రార్థింపఁబడి దుష్టమృగంబులను జంపుటకై వేటాడఁబూని పరిజనులకట్టులానతియొసంగె. నౌకరులలో చండకుండను నొకయెఱుకవాఁడు సైనికబృందంబులోనిమానిసి మిక్కిలిబలిష్ఠుఁ డమాయికుఁడు బొంకనివాఁడు ధర్మమందాసక్తిగలవాఁడు వేటయందు నిపుణుఁడు. అతఁడు రాజాజ్ఞచే దక్కినవేటగాండ్రతోఁ గలిసి ప్రభాతపూర్వమందు రాజును వెంబడించి వేటకై యడవికేగెను. అందొకచో నొకహ్రదంబుప్రక్కఁ బటకుటీరము వేసి యందు రాజునకు స్నానభోజనానులేపనముల నొనరింపఁ జేయుటకును దక్కినవారలకశనంబొసంగుటకును వంటవారలు మున్నగువారల నునిచి వేటగాండ్రు వేటకుక్కలు ముందు నడువఁగ నొకయశ్వంబునెక్కి సింహకేతుఁడు మృగముల ననుసరించి వేటాడ వెడలెను. తక్కినవేటగాండ్రు గూడ తేని ననుసరించి బయలువెడలియు సత్వంబుల మృగంబుల ననుసరించి వేఱువేఱుత్రోవలఁ బడిపోయిరి. మధ్యాహ్నము వఱకు తేఁడును వేటగాండ్రందఱును బెక్కుసత్వంబులను నాటవికమృగంబులను వధించి శకటంబులకుఁజేర్చి పటకుటీరంబుఁ జేరిరి. నరనాథుండు మజ్జనం బొనర్చి భోజనముచేసి తాంబూలమును వేసికొని వేటగాండ్రనందఱను బరామర్శించి వారువారు చంపితెచ్చినసత్వమృగంబులను జూచుచుండె. చండకుఁడు మాత్రము వారలందగపడకుండుడు రాజు వానిగూర్చి వారల నడిగె. వార లవ్వానిగూర్చి ప్రశంసించి వాఁ డందఱికన్న నెక్కుడుగ గొప్పసత్వంబులను సింగ

ములను [illegible]లను నెలుగుబంట్లను తోడేళ్ళ నడవిపందులను జంపెననియు వానిన్నిటను బండ్ల కెక్కించి నగరి కంపె ననియుఁ జెప్పి వాఁడింకను [illegible] యుండుననియును జెప్పిరి. అంతలో శబరుఁడు దనపీపుమీఁది దుప్పటి[illegible] విప్పి యందలియొక దివ్యలింగమును [illegible]జూపి యిట్లనియె. ప్రభూ! ఈ దివ్యలింగమును జూడుము. మధ్యాహ్నంబున నేను వేటముగించి పటకుటీరంబునకు వచ్చుచుండ త్రోవలో నొక్కెడ పైకప్పు గూలినట్టి యొకశివాలయంబుఁ జూచితిని. అందులోపల నేమిగలదో యని తొంగిచేసికొని గర్భాలయంబు లోపలి [illegible]. అందు భిన్నంబై నపానవట్టంబు నుండి వదలి క్రిందఁ బడియున్న [illegible]ను జూచితిని. చూచినంతనే నా కానందబాష్పంబులును [illegible]మీఁదిభక్తియును దోడ్తోఁ గలిగినవి. అపు డేను లింగంబును [illegible] కన్నులకద్దుకొని యీ నా దుప్పటియందు గట్టికొని తమ [illegible] దెచ్చితిని. ఒడయఁడా! దీని నే నింటికిఁ గొనిపోయి పూజించు కొనియెదను. నేను మూఢుండ నగుట పూజాక్రమం బెఱుఁగను. నీవ నాకు [illegible] ఒడయఁడవు నాపాలి కీశ్వరుండవు. భక్తులు లింగంబును [illegible]క్రమంబు నా కెఱింగింపుము. తండ్రీ! నీపాదంబులఁ బడెదను. అని [illegible]లిబడి యున్ననా యెఱుకును జూచి యతఁడు ఓరీ! లెమ్ము లెమ్మని తనమనంబున మధుమాంసంబుల నాహారంబుగొనునట్టి వీఁడు [illegible]ను బూజించుటెట్లని గొంకియు వానిపట్టుదలను జూచి వీఁడు నే[illegible] నిషేధించినమాత్రమున వదలునట్లు లే డనుకొని యిట్లు చెప్పెను.

ఆ॥ [illegible]బోయవేడ! విమలలింగంబేడ! సీధుపానమేడ! బోధయేడ!
వేటసేయు[illegible]! వేదపద్ధతియేడ! వలవ దుడుగు దీన వాసిలేదు.

హరదత్తవిజయము

ఓరీ! అడవియందు పాడుబడినగుడిలో నున్న ఈ లింగంబునందు [illegible]బులు పిశాచంబులు దాపరించి యుండు. నీ వే మెఱుగవివాడవు [illegible] దీనిని నాగుడియందే విడిచి రమ్మనియెను. వాఁడు రాజు నుడుల నాలకించియు మాత్సర్యంబున నట్లు వినక దొరా! ఏమైన నగుఁగాక నే నీ లింగమును విడువను. ఎన్నాళ్లనుండియో స్నానము నైవేద్యము లేక

యుండెను. నన్ను మన్నించి పూజాక్రమంబుఁ జెప్పుము. నీవు చెప్పినట్టి యొక్కయక్కరంబు నైన దాటను కరుణింపు మని మరల పదంబులఁ బట్టికొనెను. భూపతి యపుడు ఓరీ! నీ విట్లు లింగంబును గొనిపోయిన నింటిలో నీ యాఁడుది యీ లింగంబును జూచి మన్నించునా? నీ వింట లేనియపుడు దీసికొనిపోయి యొకనూతిలోనో యేటిలోనో పడవేయును. అపుడు నీ వేమిచేసెదవు. నీ యత్నము వృథా యగును. అని చెప్పఁగా వాఁడు ప్రభూ! నా పెండ్ల మట్లు చేసిన దాని నింటినుండి త్రోసి వెడలఁ గొట్టెదను. నేనొకఁడనే పూజచేసికొందును. నా కేమిబరువు కాదు. పూజ చెప్పుము. నేటినుండి మద్యమాంసంబులను వర్జించెదను. అని మాటిమాటికి దోసిలొగ్గి యడుగుచుండుటను జూచి ఱేఁడు నేఁ బూజనుజెప్పకున్న వీఁడు విడువఁడు మూర్ఖుఁ డేమగునో యని హాస్యముతో నిట్లు పూజచెప్పఁ దొడఁగెను. ఓరీ! ఈలింగంబును నీగృహంబు సమీపంబున నొకచో నాలుగుస్తంభంబులుగల పైఁగప్పుతో నొకగదిగా నేర్పఱచి యందు మధ్యమందు నొకశిలాపీఠంబు నేర్పరచి యందీ లింగంబును బ్రతిష్ఠించి ఉషఃకాలంబున పడుకనుండి లేచి స్నాతుడవై శుద్ధవస్త్రంబుఁగట్టికొని లింగంబుముందఱ పిండితో ముగ్గునుదీర్చి అనంతరము వీభూతియు చందన గంధంబును తెల్లబియ్యపుటక్షతలును తుమ్మిపూలు గన్నేరుపూలు జేల పూవులు కొండగోగుపూవులు జిల్లేడుపూవులు మారేడుపత్రియును అందుగుచెట్ల మహిసాక్షియును తెచ్చికొని నేతితో నొకదీపంబమర్చికొని యొకఁమట్టికుండతో పరిశుద్ధోదకంబును దెచ్చి యుంచుకొని క్రమంబుగ దీపంబును వెలిగించి సంకల్పముచేసి హర హరా యని లింగంబుపై శుద్ధోదకంబుతో నభిషేకంబుచేయవలయును. అటుమీద విభూతియును గంధంబును బూసి గంధముతో తిలకముదిద్ది అం దక్షతలుంచి తెచ్చినపుష్పంబులను మారేడుదళంబులను లింగంబుశిరంబం దుంచి పూజించవలయును. ఆపై అందుగుమహిసాక్షిని ధూపంబువేసి నేతితోఁదడపినవత్తులను వెలిగింపవలయును. ఈపూజయం దన్నిటికన్న ముఖ్యమగు నుపచార మొకటి యున్నది. ఒకకడవయందు శ్మశానంబునందలి పీనుంగు బూదిని నింపుకొని తెచ్చి యొకచోఁ బదిలంబుగ నుంచుకొని దీపంబులు వెలిగించినమీఁద నొక్కింతకాటిబూదిని లింగమునకు నైవేద్యంబు చేయ.

వలయును. అటుమీఁద మీరువండుకొనినయన్నంబును సూపంబు నెంద లగువానిని నేతిని పెరుగును జేర్చి లింగంబునకు నైవేద్యముపెట్టవల యును. తరువాత తాంబూలమును కప్పురఁపునివాడియు నిచ్చి పూవులఁ బత్రిని లింగంబుపై మంత్రపుష్పంబును సమర్పింపవలయును. ఆమీఁద ప్రదక్షిణముచేసి మ్రొక్కి పాటలుపాడి యాటయాడి పూజను ముగింప వలయును. నైవేద్యముచేసినట్టి ఆ కాటిబూడిదెను నీవును నీ పెండ్లమును నారగించి తరువాత భోజనముచేయవలయును. ఇందలి యుపచారము లలో నేది తప్పినను కాటిభస్మంబు నైవేద్యము మాత్రము మానగూ డదు. దానిచే నీశ్వరుఁడు సంతోషించును. అని హాస్యముగాఁజెప్పెను. వాఁడు పరమానందముతో విని తాము చెప్పినదంతయు శిరస్సునందు జేర్చికొంటిని. పొల్లుహల్లు గూడ వ్యతిరేకముచేయను. అతిక్రమింపను అని మ్రొక్కి వారలు భోజనముచేయుమని చెప్పినను నేనట్లు చేయను. నాలింగమునకు నైవేద్యముచేయక నేను భుజింప నని చెప్పి రాజు సెల వొంది వెడలి త్రోవలో నరణ్యంబందు స్తంభంబులకు దగినవియును పైఁగప్పునకు దగినవియును మంచి టేకుశాఖలను గొట్టి తీసుకొని త్రోవలోనే చందనంపుతుంటను మారేడుపత్రిని పూవులను దీసికొని నాల్గవజామువఱకే యిలుజేరి భార్యకా లింగంబును జూపి ఓసీ! మన యందలిప్రేమముచే మన యదృష్టవశముచే నరణ్యంబం దొకచోట నీలింగంబును నిక్షేపంబునట్టు చూచితిని. మన యొడయనికిఁ జూపి పూజాప్రకారంబు దెలిసికొని వచ్చితిని. మనయింటిగుమ్మముముందఱ నొకచిన్నగదిగట్టి యం దీ లింగంబును బ్రతిష్ఠించి పూజింపుదము. ఈలింగంబే మనపాలిభాగ్యము. అని చెప్పిన ఆమెయును సంతసించి అట్లే చేయుదము. మనయందు దేవున కనుగ్రహము కలిగిన~దనియెను. అపుడు శబరుండు తత్కాలంబున ఆ లింగంబును యొకశిలయం దుంచి నదికేగి తీర్థంబుగొని తెచ్చి భూమీశ్వరుండు చెప్పినయట్లు కాటిభస్మం బును కలశంబునఁగొనివచ్చి తక్కినవస్తువుల నెల్ల దెచ్చి ప్రదోషంబు నందు లింగంబు నభిషేకించి పూజించి కాటిబూదినైవేద్యమిచ్చి తాము తినెడు నన్నాదికంబును నైవేద్యమొసగి పూజను ముగించి కాటిబూది ప్రసాదంబును తక్కినఅన్నాదికప్రసాదంబులను తా మిరువు రారగించిరి.

ఆ మరునాడు శబరుఁడు గొన్నియిటుకలను రేగడిమట్టిగలిపి నలుదిక్కులఁ జదురముగ గోడలను గట్టి నాల్గుస్తంభంబుల నలుదెసలస్థాపించి పైఁ గప్పును గొన్నికఱ్ఱలతోడను చెట్లకొమ్మలతోడను దృణముతోడను నిర్మించి యొకగది నేర్పఱచి యందు నడుమనొక శిలాఫలకంబున లింగంబునకుఁదగిన బెజ్జంబును గాసెవానితోఁ గూర్పించి యం దా లింగంబును బ్రతిష్టించి ప్రతిదినమును బ్రభూక్తప్రకారంబుగ నక్షరంబు దప్పకుండఁగ లింగంబును బూజించు చుండె. వానిభార్యగూడ శివలింగంబుని చినగదియందు గోమయంబుతో నలికి వరిపిండితో గోపురంబులను బుష్పలతలను బద్మంబులను నిర్మింపుచుఁ బూజావస్తువుల నెల్ల సమకూర్చి పూజ కందించును. పూజావసానంబునఁ బతితోఁగూడఁ బాటలుపాడుచు నాటలాడుచు భజనముసేయుచు శివలింగమునకు మగనికిని బ్రీతిసేయుచుండును. శబరుఁడు రాజునకు నవుకరి యైనను సైనికులలోనివాఁ డగుట రాజునకు యుద్ధంబు ఘటిల్లునపుడే ప్రాణమున కాసపడక యనికి నడిచి యుద్ధంబుసేయుటయే కాని వట్టియపు డేపనియు నుండదు. మాసంబు మొదట దివాణంబున కేగి జీతంబురూకలఁ దెచ్చుకొని సుఖంబుగ నుండుటయే. కావున నెఱుకకు నిర్విఘ్నంబుగ శివలింగార్చనంబు జరుగుచుండె. బహుకాలం బిట్లు జరిగె. ఆ దంపతులకు సంతానము లేనందున నహర్నిశము శివలింగార్చనాచింతనంబు దక్క వేఱొకపని లేదు. సతతంబు శివపూజావస్తుప్రకరంబులను దెచ్చుకొనుటయు శివలింగంబును బూజించి తత్ప్రసాదంబు నొందుటయుఁ బాడుటయు నాడుటయు భజనసేయుటయుఁ గనురెప్పలార్పక శివలింగంబును నిరీక్షించుటయుఁ దక్క వేఱుపనిలేదు. ఇట్లు పూజించుచుండఁ బదిరెండేండ్లు గడచినవి. శబరునకపుడు నలువదియైదేండ్ల ప్రాయమును శబరికి ముప్పదియాఱేండ్లప్రాయమును వచ్చినవి. అంతనొకనాఁడు శబరుఁడు తీర్థమాడి శుద్ధవస్త్రంబులఁ గట్టి శివలింగంబునెదుటఁ గూర్చుండి యర్చనకై పూజాపరికరంబులఁ జూచుకొనుచుండె. అన్నియు నుండెనుగాని కాటిబూదిమాత్ర మగుపట్టకుండె. అపుడతఁడు పెండ్లమును బిలిచి మఱచితివేమి? కాటిబూది యేది? యని యడిగినంత నామె కలశంబందుకొని బూదికై చూచుచుండ నందది లుప్తంబగుట నగుపట్టకుండె. అపు డామె భయపడుచు వచ్చి

[illegible] వెనఁటిని నీమరాలను కాటిబూది ఉప్తంబయ్యె. మందమతినై [illegible] లేము. నీకుఁదెలుప లేదు క్షమించి యిపుడు కాటికేగి తెమ్మని [illegible]. అతఁడప్పు డదరి లేచి కలశంబుఁజేకొని శ్మశానంబున కేగి శివ [illegible] న్వేషించె. ఆ నాఁడది యందుఁ గన్పట్టకుండె. చింతిల్లి యతం [illegible] మాత్రవూరంబున నున్న వేఱొక గ్రామమునకుఁబోయి యందలి [illegible] బూదిని వెదకెను. గాని యందును గన్పట్టదయ్యె. [illegible] యష్టదిక్కులందుఁ గ్రోశద్వయపరిమితదూరస్థంబులగు [illegible] లందలి ప్రేతవనంబులబూదికై గాలించెను. కాని ఈశ్వరపరీక్షఁ [illegible] యవగింజంత భస్మంబు లభింపదయ్యె. తిరిగితిరిగి దుఃఖి [illegible] నిరాశతో ఘట్టకుటీరన్యాయంబుగఁ బ్రిదోషకాలంబువఱకు [illegible] జేసె. ఇందు గృహంబందు శబరునిపెండ్లము తనయవివే [illegible] తాభస్మంబు శూన్యంబగుటనారయమికి మిక్కిలిమదిలోఁబొగ [illegible] తననాథుండు సాధించుకొని వచ్చుననియాసతో నింటి [illegible] నిలిచి శబరునియాగమనంబును నిరీక్షించుచుండె. [illegible] దుఃఖమునఁ దూలుచు వడఁబడి రిక్తహస్తములతో వచ్చి యింటివాకిటఁ గూలఁబడియె. శబరి దూరమునుండియే శబరునిముఖమం [illegible] స్యంబును జూచి చితాభూతి దొరుకలేదని గ్రహించిశబరుని దార [illegible]. అతఁడు.

శ్లో॥ నలబ్ధం మే చితాభస్మ కింకరోమి వద ప్రియే
శివపూజాంతరాయో మే జాతో హి గతపాప్మనః
బ్రహ్మోత్తరఖండము.

తా॥ ప్రియా! చితాభస్మము నాకు లభింప లేదు. పాపమొనర్చిననాకు శివపూజావిఘ్నము చేకురినది.

ఇపు డేమిచేయుదు చెప్పుమనియెను. అపుడు శబరి విభూ! ఈదో [illegible] నాది. సర్వపదార్థములను జూచుకొనుచు ఉప్తంబైనదాని నెఱింగి [illegible] నీకెఱింగింపవలసినపని నాయది. తెలిపినమీఁదఁ దెచ్చునట్టి [illegible] నీయది. పాపాత్మునగునేను మందమతినై యట్లు చూడకుంటిని. [illegible] ? నేఁటి కొకనాఁటికి చితాభస్మంబునకు మాఱుగ కొబ్బెర [illegible] గాని మామిడిపండు గాని తెచ్చి నైవేద్యమిచ్చుదము. లేదా

పాయసమును వండెదను. దాని నైవేద్యమిమ్ము. ఱేఁపు వేకువనే లేచి దవ్వులకుఁబోయి భస్మంబును దెచ్చికొనెదవు అనిన శబరుండిట్టులనియె. ఓసీ! గురూపదేశం బట్లుగాదు. ఉపచారంబులలో నిదియే శ్రేష్ఠం బనియు దీనిచేతనే శివుండు మెచ్చుననియు గురుఁడు శాసించెను. అట్టి గురునియుపదేశమ్మును వమ్ముఁజేయఁజాలను. ఇపుడు శివపూజను మాని నేను ప్రాణంబుల నిలుపను శివలింగంబుముందఱ నిపుడే యురిఁబోసికొని చచ్చెదను. అని ఖండితంబుగాఁజెప్పెను. అపు డా భిల్లపల్లవాధరి మగనియార్తికిమిగులవగచి తెగువతో మరలనిట్లనియె. నాధుడా! భయఁపడకు ముపాయము తోఁచినది.

శ్లో॥ ఇదమేవ గృహం దగ్ధ్వా బహుకాష్ఠోపబృంహితం
అహమగ్నింప్రవేక్ష్యామి చితాభస్మభవేత్తతః. (బ్రహ్మోత్తరఖండం)

తా॥ పెక్కుకట్టెలు దూలములు తల్పులు గలయీగృహమందుఁ జిచ్చు దరికొల్పి నే నందుఁ బడెదను. నీకు సమృద్ధిగ భస్మంబు లభించును. శివపూజ యవిఘ్నంబుగ జరుగును.

భార్య యిట్లనిన భిల్లుఁడు లోన సంతసించియు నాపె హృదయంబు నారయుటకై మరల నిట్లనియె.

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం దేహః పరమసాధనం
భోగయోగ్య మిదం దేహం కథం త్యక్తు మిహేచ్ఛసి
అధునా ప్యనపత్యా త్వం అభుక్తవిషయా తథా.

బ్రహ్మోత్తరఖండము.

తా॥ ధర్మార్థకామమోక్షముల కీదేహమే ముఖ్యసాధనము. ఇప్పటి వఱకు నీకు సంతానమేని కాలేదు. భోగములందు తృప్తినొంద లేదు. కౌమరుప్రాయఁపుదానవు నేను మరణించినను మఱొక లేఁత ప్రాయపువాని జేకొని సుఖింపవచ్చు.

మనకులములో మాఱుమనువున్నది కదా ఏటికిట్లు మరణింపఁదలఁచితివనియెను. ఆగుణవతి మగనినుడులవినుచునే యడలి శివశివశివాయని చెవులు మూసుకొని విషణ్ణయై పతినిజూచి ఏటికిట్లనుచితంబు లాడెదవు? మనకులంబువా రొప్పనెడల స్త్రీలందరు మాఱుమనువునకు సమ్మతింతురా? పుణ్యంబును పాపంబును దలపరా? అట్లొప్పువారు వారియిష్టంబు

ఉ॥ జన్మము లెన్నివందలును ♦ సంతనచేసిన సంతసంబె యా
జన్మము నందు నజ్ఞతకు ♦ సాధకమూ నలమాయ నీకు న
స్మన్మనమందు సామునిము ♦ సంబయినట్ల భవదంఘ్రిపద్మసే
వన్మరువంగ నీయకు శి ♦ వా! కరుణాకర! నీకు మ్రొక్కెదన్.
(హరదత్తవిజయము)

అని మ్రొక్కి నిషాదిని గుభాలున నగ్నిజ్వాలయందు దూకె. అగ్ని జ్వాలలతో నామె దేహంబును గాల్చె. బూది కుప్పలుగఁ బడుచుండె. భిల్లుఁడంత భస్మంబును జూచి చాలదినములవఱకు భస్మమునకుఁ గొదువ లే దనికొని సంతసించెఁ గాని తనకలత్రంబుమృతి కై యొక్కింతయు వగపునొందకుండె. అటుమీఁద జలకమాడి శుద్ధపటంబుఁ గట్టి విభూతిఁ బూసికొని శివలింగంబున కెదుటఁగూర్చుండి విధివిధానంబుగఁ బూజచేసి ప్రసాదంబు నారగించుతఱి శివపూజాపరితోషంబునఁ దనపెండ్లా మగ్ని దాహంబునొందుట మఱచి ప్రసాదంబు నాపె కిచ్చుటకై యెడమదిక్కుఁ జూచె. అప్పు డామె వచ్చి ప్రసాదంబుఁ గొనుటకై దోసిలి పట్టియుండె. శబరుఁడు జ్ఞప్తినొంది యామెను బరామర్శించి చూచెను.

సీ॥ అగ్గిలోఁబడి బూది ♦ యైనను దిరుగఁబూ
ర్ణావయవములతో ♦ నమరుదాని
సెకపుటంబేసి తీ ♦ సినపైడితీగనా
ధగధగద్ధగలతోఁ ♦ దనరుదాని
అలఁత నిట్టూర్పు సుం ♦ తైననుజెందక
చిఱునవ్వుమొగముతోఁ ♦ జెలఁగుదాని
తనసతిఁ జూచి త ♦ త్తనువు నాపాదమ
స్తంబుఁ బరీక్షించి ♦ చాలవిస్మి

గీ॥ తుండయి గృహంబుదెసఁ గన్న ♦ తోడ నద్ది
యును యథాపూర్వముగ నట ♦ నుంట జూచి
మఱియు నక్కజపడి తన ♦ మగువను గని
యడిగె నివ్విధముగ సంశ ♦ యాళుఁడగుచు. (హరదత్తవిజయము)

శ్లో॥ అయి ప్రియే కథంప్రాప్తా భస్మీభూతాసి పావకే
అగ్నిదగ్ధమిదం గేహం యథాపూర్వమవస్థితం. (బ్రహ్మోత్తరఖండము)

తా! ఓప్రియా! అగ్నియందుఁబడి బూది యైననీ వెట్లు మరల వచ్చితివి?
అగ్నిచేఁగాలిన యీగృహమును బూర్వమందు వలె నున్న దెట్లు?
నీవు పిశాచివై వచ్చితివా? లేక మాయాభామినివా? అట్లుగాక నాకుఁగలయా? పైత్యదోషమా? ఏదియో నీవు కౌటిల్యంబుఁ బాసి నిజం బెఱింగింపుము. శబరుఁ డి ట్లడిగిన శబరియుఁ గాలినయిల్లు మరలఁ బొంటిలాగుండుట కచ్చెరువొంది మగనికి మ్రొక్కి యిట్లనియె. విభూ! నేను పిశాచినిగాను మఱోకమాయలాడిని గాను. నీసతిని. నేను నీ పెల వొంది యగ్గిం బడితిని గాని అనలము నన్ను గాల్పకయుండె. అందు నా దేహమునకుఁ జల్లనగా నుండుట నించుకతడవు నిద్రించితిని. ఇపుడు శివపూజావసానమందలి ఘంటాధ్వని విని ప్రసాదంబునకై వచ్చితిని. ఇటకు వచ్చునపుడు మనయిల్లు తొల్లిటివలె నుండుటను గాంచి యబ్బు మొందితిని. హేతువును నారయలేకుంటి. ఇట్లు బొంకక నిక్కంబెఱింగించితిని. దయతో శివప్రసాదంబు నాకొసఁగి యనుగ్రహింపుమనియె. భిల్లుఁడదివిని సత్య మిది యని యరసి మురిసి యిది యంత శివుని యనుగ్రహంబని విశ్వసించి సతికిఁ బ్రసాద మొసఁగి యాపైని నన్నాదికంబులను సాపడి సాంబశివుని భజనంబుసేయుచుండిరి. అంతలో నాకసంబునుండి శతచంద్ర ప్రకాశంబును మణిగణశోభితంబును సువర్ణ దివ్యపుష్పమాలికాలఙ్కృతంబును శివపరిచరచతుష్టయయుతంబును నగుదివ్యవిమానంబు తమనికటంబున వాలెె. భిల్లదంపతు లాశ్చర్యచకితులై చూచుచుండిరి. విమానము నుండి వేగిరముగ శివానుచరులు దిగి నిషాదదంపతులను జేరి పుణ్యదంపతులారా! సర్వజగన్నాథుండగుశివుఁడు శివతోఁ గొలువుదీర్చియుండి మిమ్మిద్దఱను గడువేగిరంబుగఁ దమయొద్దకుఁ దోడ్కొనిరమ్మని ఈవిమానంబుతో మమ్మిందుఁబంపెను. పార్వతీపరమేశ్వరులు మిమ్ము రయమ్మున నాలింగనమ్ముచేసికొందురఁట. జాగుసేయక యే తెంచుఁడని దృష్టిమాత్రంబున నవ్వారిని దివ్యదేహులుగను దివ్యాంబరచందనపుష్పాలంకృతులుగను దివ్యభూషణభూషితులుగను నొనర్చి విమానంబు నెక్కఁడనిరి. వారలానందముతో శివునికరుణ కేమిచేసితిమని మురియుచు విమాన మెక్కిరి. కనుఱెప్పపాటులో వెండికొండకుఁజేర్చి యవ్వారిని శివదూతలు శివునిసన్నిధానమునకుఁగొనిపోయి భిల్లదంపతులను జూపిరి.

జగత్కారకు లాయిర్వురిని జూచి శివుఁడు భిల్లునితో భక్తశిరోమణీ! దగ్గ అకువచ్చి నన్ను బిగ్గరఁగౌఁగలింపుము. ప్రియమైనభార్యకన్న నాపూజ నెక్కుడుగ భావించితివి. లోకమందు నీభక్తి మార్గదర్శని యగుననియె. శివయును శజరినిజూచి సతీమణీ! నీవు శివభక్తిని బతిభక్తిని జెంది ధన్యవైతివి. నీదుభక్తి జగమున కనుగ్రాహక మగును. రమ్మి, దృఢమ్ముగ నన్ను గౌఁగలింపుమనె. అట్లు వారిద్దఱును శివానుగ్రహంబునొంది శివసామీప్యమందుండిరని కథకాగ్రణి శ్రోతలనుజూచి చూచితిరా! భక్తి వైభవము. శబరుఁడు నీచకులుండైనను భక్తినొంది యోగులకుఁగూడ దుర్లభంబైన శివపదంబు నొందెను.

శ్లో॥ కింజన్మనా సకలలోకజనోత్తమేన
కింవిద్యయా శ్రుతిపురాణవిచారవత్యా
యస్యాస్తిచేతసి సదా పరమేశభక్తిః
కోన్య స్తతస్త్రిభువనే పురుషోస్తి ధన్యః॥ బ్రహ్మోత్తరఖండము.

తా॥ సర్వజనంబులలో నుత్తమంబైనజన్మంబుచే నేమియు లేదు. శృతిపురాణవిచారచతురంబైనవిద్యచే నేమియు లేదు. ఎవనిచిత్తమందు పరమేశ్వరభక్తి పాయక యుండునో యట్టివాఁడు ముజ్జగములందు ధన్యుఁడు. వాని నొరులు పోలలేరు. అని చెప్పినంత శ్రోతలుమఱి కొన్ని యిలాటిభక్తులచరిత్రంబులు చెప్పుఁడని యడిగిరి. కథకుఁ డిట్లనియె.

## 17. మహానంద - దేవదాసి

శ్లో॥ హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ! భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదం.
శివానందలహరి

తా॥ ఓ పశుపతీ! ఓ విభూ! ఓగౌరీనాథా హంసము పద్మవనమును చాతకపక్షి నీలజలధరమును ప్రతిదినమందుఁ జక్రవాకపక్షి సూర్యుని

చకోరపక్షి చంద్రుని నెట్లు గోరుచున్నవో నాచిత్తము జ్ఞానమార్గముచేత వెదకఁదగినదియును మోక్షసుఖము నిచ్చునదియును నగు నీదు పాదారవిందయుగళంబును గోరుచున్నది.

వసుంధరామండలంబందు నందిగ్రామం బనునొకనగరంబు కలదు. అం దొకవారతరుణి గలదు. ఆ చెలువ లేతప్రాయంబుతో సుందర దేహముతో హావభావవిలాసహాసశృంగారములతో సంగీతసాహిత్యవిద్యావైశారద్యంబుతోఁ గాముకజనమనంబుల నువ్విళ్ళూరింపుచు నింపగునిందిరానందనుని తొలిబాణంబగు నరవిందంబో యనునట్లుండెను. ఆ యన్నుమిన్నతల్లి తనప్రాయంబున మిక్కిలిరొక్కంబులును బంగారునగలును ముత్యాలహారంబులు రవలకమ్మలు కెంపులవంకీలు మణికిఙ్కిణీనూపురంబులు బంగరుగజ్జలొడ్డాణంబులు మున్నగుభూషణంబులు మేడలు పాడియావులు పాడిగేదెలు వృషభంబులు శకటంబులు నవధాన్యంబులుపండెడు భూములు మామిడితోటలు కొబ్బరితోటలు నిమ్మతోట లుద్యానవనములు దాసదాసీజనము మున్నగువాని సంపాదించి యిచ్చినకతమున మహానంద యష్టైశ్వర్యములతో నొకటి దక్కువలేక యున్నది. ఇఁకఁ బూర్వజన్మపుణ్యములతో నాగణికాతరుణి శివభక్తయై యేప్రొద్దు శివధ్యానంబుతో వర్తిల్లుచు శివపురాణగాథలను వినుచుఁ బ్రతిదినము శివాలయమున కేగి పంచామృతములతో నారికేళోదకముతో ఫలోదకముతోఁ బన్నీటితో శివలింగమున కభిషేకముచేయించి తుమ్మిపూలతో మారేడుదళములతోఁ బూజింపఁజేసి మధురఫలముల నైవేద్యము చేయించి తత్ప్రసాదమును జెంది వచ్చుచుండును. జారపురుషులు యువకులగుధనికు లనేకులు వచ్చి ప్రేమించి వేలకొలది ధనంబు లిచ్చెదమని యర్థించినను రసజ్ఞుఁడైన శైవయువకుని దక్క తక్కినవారల నిరాకరించి యనుపును. తనతనువు శివభక్తులదని శివభక్తులతోడనే సుఖించుచుండును. ఇట్లు గొంతకాలంబు జరిగినమీఁద నొకనాఁడు తరుణేందుచూడామణి యాగణికాతరుణిని బరీక్షింపనెంచి యొకవైశ్యయువకరూపంబు ధరించి వక్షంబందు బంగరుబిల్వదళంబుల నమరినబంగరులింగంబులు గలకుప్పెలనొప్పు రుద్రాక్షకంఠహారంబును ధరించి ముంజేత వజ్రములు మున్నగునవరత్నంబులమర్చిన యొకపసిఁడినాగకఙ్కణంబును

ధాల్చి వేశ్యవాటిలోని మహానందహర్మ్యంబుఁజేరెను. ఆ ధనికయువకుని యాగమనంబు దాసీజనంబులు మహానంద కెఱింగించిరి. ఆమె యజ్కణం బునకు వచ్చి విభూతిగంధాక్షతనిర్మాల్యశోభితాననుండును రుద్రాక్షహార విలసితవక్షుండును శివలింగధరుండును నగు సుందరవైశ్యయువకుని జూచి నమస్కరించి సప్రేమంబుగ అభ్యంతరగృహంబునకుఁ దోడ్కొనిపోయి యందొకపీఠంబందుఁ గూర్చుండఁజేసి సురభిళచందనాగరులఁబూసి సుగంధ పుష్పహారంబు వేసి మధురోపహారఫలంబులొసఁగి సురటిఁ బట్టి విన రుచు ముంజేతనున్న నవరత్నంబులుపొదిగిన రంగారుబంగారునాగకజ్క ణంబును జూచి హర్షించెను. అటుమీఁద వారిర్వుర కిట్లుసంభాషణంబు జరిగెను.

మహానంద:-ధనికశిరోమణీ! ఈ నవరత్నస్వర్ణనాగకజ్కణంబు కరంబు మనోహరంబై యున్నది.

వై:- సుందరీ! ఇది నవరత్నమయహేమకజ్కణం బని నీవెఱింగినదే. మిక్కిలివెలగలది. నిన్ననే శిల్పి తెచ్చియిచ్చి బహుమానమొంది నాఁడు. నీ వీ కజ్కణంబు నభిలషించెదవా యేమి?

మహానంద:-ప్రాప్తంబైన నభిలషించెదను.

వై:- దీనికి ప్రతిఫలంబేమి?

మహానంద:-(మందహాసముతో) మీ రేమికాంక్షించెదరు?

వై:- (సంతోషముతో) వేఱేమికోరెదను. నిన్నేకాంక్షింతును.

మహానంద:- ఎంతపర్యంతము?

వై:- నీవే చెప్పుము.

మహానంద:-దినత్రయపర్యంతము మీకుఁగైవసంబౌదును. మీయిష్టంబు బొందవచ్చును.

వై:-అపరాధీనవై యుందువా?

మహానంద:-అపరాధీన నేమి? మూఁడహోరాత్రంబులు మీకు భార్య నవుదును.

వై:-అట్లైన నీకజ్కణంబును బరిగ్రహింపుము (అనియిచ్చును)

మహానంద:- ప్రసాదము. (అనిపుచ్చుకొని హస్తమున ధరించి మ్రొక్కును)

సైన:- కఙ్కణము తగినస్థానము నొందినది. నీ పాణిచేఁగఙ్కణంబును
కఙ్కణంబుచే నీ పాణియు సమానంబుగ మెఱయుచున్నవి.

మహానంద:-(సంతుష్టయై మందహాసముతో) అన్నియుఁదమయనుగ్రహమే!

ఆమె తనదాసీలను బిలిచి శయ్యామందిరం బలఙ్కరించి సిద్ధము చేయుఁడనియు భోజనశాలయందు మధురపదార్థంబులతో రసాయనంబులతో నన్నంబులను సమకూర్పుఁడనియును సెలవిచ్చి యా యువకమూర్తిని స్నానగృహంబునకుఁ గొనిపోయి స్వయముగ జలకమార్చి దుకూలంబుల గట్టనిచ్చి భోజనశాలకుఁ గొనిపోయె. అందతఁడు పీఠంబునఁ గూర్చుండి శివపూజకై పరికరంబులఁగూర్పుమనియె. ఆమెయుఁ బరితోషంబున నందు స్వయముగ ముగ్గువేర్చి పంచామృతంబులను నారికడంబును శుద్ధోదకంబును విభూతిచందనగంధాక్షతలను తుమ్మిపూవులను మల్లెపూలను బిల్వదళములను అగరువత్తులను నేతిదీపంబులను కదళీఫలంబులను మామిడిపండ్లను తాంబూలంబును గప్పురంబును స్వయముగఁదెచ్చియిచ్చె. యువకుఁ డపుడు శివలింగపూజను విధివిహితముగ సల్పి కదళీపత్రింబందు వడ్డించినయన్నాదికమును లింగనైవేద్యంబుచేసి యుపచారంబులతో నర్చనముగించి లింగమును వక్షస్స్వర్ణపేటికను జేర్చియా గణికారమణితో భోజనముచేసెను. అంత నామెలపడుచు వల్లభుని పడుకగదికిఁగొనిపోయె. అందు తెల్లనిగాసెన దొడిగినపట్టుపరుపును దిండ్లును సేలువయు పచ్చడంబును దోమతెరయు గలట్టిబంగరుమంచంబును పరుపులతో నమర్పఁబడిన కొన్ని పీఠంబులును ఒకగద్దియయందు పండాకులు కపటాకులు బాగాలును ఏలాలవంగములు జాతీఫలంబును తత్పత్రింబును ఖాదిరంబును పచ్చకప్రింబుబరణియును కస్తూరిబరిణంబును చూర్ణంబును గలట్టి వెండిపళ్ళెరంబును వేఱొకపళ్ళెరంబందు అత్తరువు పన్నీరును పునుగు జవాది చందనగంధంబును జేర్పఁబడియుండె. ఇఁకను ప్రక్కలందు మేలైనచందనపుబొమ్మలు రంగురంగులబొమ్మలు దంతపుబలగంబుతోఁ గూడిన చతురంగఫలకంబును దీర్చియుండె. కుడ్యంబులందు నిలువుటద్దంబులు నిలువఁబడియుండె. ఉపరితలంబందు బంగరుఝంచలములుగల పట్టు

వస్త్రంబుతోఁ దగినవితానంబు భాసించుచుండె. గృహమందంతట చిత్ర
మైనతివాసీ పరువఁబడియుండె. అట్టిపడుకగదియందుఁ గైతవయువకుం
డొకపీఠంబందుఁ గూర్చుండియుండె. ఆ యువతీమణియు వేణీమండనంబు
చేసికొని మల్లెపూలదండలఁ జొళ్ళియంబునఁజుట్టి పునుగు గందంబుఁ బూసి
కొని కస్తూరితిలకంబు దిద్ది బంగరుసరిగపట్టుచీరను గట్టికొని యట్టికం
చెలఁదొడిగి పచ్చకప్పురంపువిడెంపుసుగంధంబులు మేనికలపంబు తావులు
మేళగించి గుప్పుగుప్పునఁగుప్పుచుండ మురిపంబు గరువంబు సింగారంపు
టొయారంబు సంబరంబు వెంబడింప మన్మథరాజ్యలక్ష్మివలె పూబంతిని
దెచ్చి యాసుందరునకిచ్చి సురటితో వీచుచు సరసనుండె. అపుడతఁడు
యువతీరత్నమా! మన మిపు డన్యోన్యము భోగమొందుసమయము.
ఇపుడు నాదువక్షంబందు దివ్యంబైన శివలింగంబు గలదు. ఇది పవిత్రం
బుగ నుండవలయుఁ గావున నీ వీ లింగము నీరాత్రియంతయు వివిక్తం
బగు పవిత్రస్థలంబున నుంపుము. ఇది నా ప్రాణలింగము. దీని కపాయము
వాటిల్లిన నేను ప్రాణంబుల విడిచెదను. సత్యమిది. ఎందేని నపాయంబు
లేకుండ నుంపుము. నే నుదయంబునఁదీర్థమాడి మరలఁదీసికొని ధరిం
తును. అని తనదుస్ఫాటికశివలింగంబును గణికాహస్తమం దునిచె.
ఆమెయును లింగంబును గనులకద్దుకొని యొకదంతపుబరిణెను దెచ్చి
యందుంచి యద్దాని నొకదారుపేటియందుఁ జేర్చి యద్దాని నాగదికి
సుంత యెడముగ నున్ననాట్యశాలయం దుంచి కవాటంబు బంధించి బీగ
ము వేసి మరల వచ్చెను. అపుడామోదంబున వా రిర్వురు పర్యంకం
బెక్కిరి. అపుడు మహానంద మహానందంబుతోఁ కస్తూరితమ్మలంబును
పచ్చకప్రంపువిడెంబును చేసి యా యువకునకిచ్చె. మఱియుఁ బునుగు
గందంబును జవ్వాజియు నతనివక్షంబందుఁబూసె. అపుఁ డాతండు సంతో
షంబున నాసుందరాంగి నాలింగనంబుచేసికొని కామకలాయోగబంధం
బుల నొకయామంబు వఱ కాసుందరితో భోగంబులొందె. ఆ యువతియు
నపూర్వం బగునా చతురునిభోగసుఖంబున కానందపరవశయై కొంత సే
పా పురుషునకుఁ బాదసంవాహనంబు చేసి యడుగులకు మ్రొక్కి ప్రక్కఁ
బరుండె. ఇరువురు నిదురించిరి. ఒకకొంతవడికి వేశ్యాయువతి గాఢనిద్ర
నొందె. యువకుఁడు మాత్రము మేల్కొనియుండె. అంతలో ఆకృత్రిమ

యువకుని (శివుని) సంకల్పంబున నాకస్మికంబుగ నృత్తశాలయం దగ్ని పొడమి రగిలి జ్వాలారూపంబొంది నృత్తభవనంబును దహించుచుండె. కిటికీలనుండి పొగలు మంటలమెరుపులు శయ్యాగృహంబునందు బ్రవేశించుచుండె. అపు డతండు భీతుండు వోలె యా గణికపైఁజేయుంచి లెమ్ము లెమ్మని ప్రబోధించె. సొమ్మసిలి పరుండి యున్న యా భామిని ఆతురతతో లేచి ఏమి యని యడిగెను. ఆతండు అగ్నిజ్వాలఁజూపి నృత్తభవనంబు దగ్ధం బగుచున్న దని చెప్పెను. ఆమె చూచి భయంబును దుఃఖంబును జెంది సమీపంబున కేగి చూచెను. అపుడు భవనంబు నలుగడల జ్వాలలు చెలఁగి మండుచుండ నచటికిఁ బోవుటకు శక్యంబు గాక యుండె. ఇంతలో దాసీలు జీతగాండ్రు నిద్రలేచి చూచి నీరంబులం దెచ్చి ఆయగ్ని జ్వాలల నార్పిరి. ఆ లోపల నృత్తభవనంబును దానిలోని సర్వవస్తువులును దగ్ధంబు లయ్యె. అందలి దారుపేటియు దగ్ధంబయ్యె. అందులోని దంతపుబరిణయు దగ్ధంబై యుండ స్ఫాటికలింగంబు దునుకలై మిగిలె. అప్పు డా బోగముపడుచు మిక్కిలి పెద్దయెలుగున నేడ్చుచు వక్షస్తాడనంబు జేసికొనుచు యిగురులఁ దెగడెడు తనపాణుల చే శిరంబు మోదుకొనుచుండె. వైశ్యుండును నదురుచు నటకువచ్చి సర్వంబు వీక్షించి భువిం గూలె. కొంతవడి కిరువురును లేచి విలపించుచుండిరి. అపుడు తూర్పుదిక్కున నరుణరాగచ్ఛటలు విస్తరించె. నలుదిశలందు ధావళ్యంబు చేకూరె. శకుంతసంతానంబులు కలకలధ్వనుల కోలాహలంబు జేయుచుండె. భాస్కరుండు గణికావృత్తం బారయుగోరియో యన్నట్లు వేగిరంబుగ జగంబులకుఁ బొడసూపె. అంత వైశ్యుండు వేశ్యాయువతిని జూచి యిట్లనియె. పూబోణీ! పూర్వమందే నేను నీకుఁ జెప్పియుంటిని. ఈప్రాణలింగంబున కపాయంబు వాటిల్లె నేని నేను మరణింతు నంటిని కదా. ఇఁక విలంబముసేయక కాష్టంబులఁదెప్పించి చితిని గూర్పుము. నేను లింగంబుతో పాటు నీపుడమి విడి శివలోకంబున కేగుదు ననియెను. అపు డా పడఁతి పాపంబునఁ బడితి. ఏమిసేయుదు? అపరాధంబుచేసితి హాని గల్గె నని దుఃఖంబున నేడ్చె. నౌకరులును దాసీజనంబులును ఓదార్చుచుండిరి. ఈ వృత్తంబంతయు నగరంతఁబ్రాకె. అపు డా వణిజుండు ధైర్యముతో వైవకృతికై ఏల పలవించెదవు?

శ్లో॥ నహి భవతి య న్న భావ్యం భవతి హి భావ్యం వినాపి యత్నేన
భర్తృహరి సుభాషితము.

తా॥ కాకపోవునది కాదు. యత్నము లేకున్నను కావలసినది యగును.

ఎన్నేళ్లకైన తప్పదనిచెప్పి దుఃఖంబుమాని రయంబుగ కాష్ఠంబుఁ బేర్పింపు మని తొందరచేసె. వారయువతియు చేయునది లేక దుఃఖంబుతో నుస్సురని కాష్ఠంబులఁ దెప్పించి చితిబేర్చి యగ్నిని దరికొల్పె. వైశ్యయువకుండు స్నాతుండై పట్టువస్త్రంబుగట్టికొని అగ్నిజ్వాలయందు దుమికె. క్షణంబులో దేహం బంటుకొని కాలి కపాలవిమోచనం బయ్యె. అంత నా యువతి భోరున నేడ్చుచు నేలఁబడి దుఃఖించుచుండె. దాసీలు వారించి వలదు వల దనుచుఁ బ్రతిమాలుచుండిరి. అంత నా లతాంగి మనసుగట్టిచేసి లేచి నే నిఁక జీవింపను. నా యజమానునితో దహింపఁబడి నేను గూడ లోకాంతరంబున కేగెద నని చెప్పి అడ్డంబులాడుచున్న దాసీలను నొకర్ల నదలించి యా నిమేషంబున తనచుట్టములగుసానుల నెల్లఁ బిలిపించి కాలుచున్నచితిం జూపి వైశ్యవిటునితోఁ దా నగ్నింజేరి మరణింతు నని చెప్పె. వా రంద అక్కజంబొంది యిదేమే? వెఱ్ఱి యెత్తినదా ఏమి? యని యడిగిరి. ఆ మానిని రోదనంబు చేయుచు నిట్లు చెప్పె. నిన్నఁ బగటమూడవజామున నొకధనిక వైశ్యయువకుండు నా భవనంబునకు వచ్చె. ఆతనిముంజేత నొక నవరత్నఘటితం బగు నాగకంకణం బుండె. నేను దానిని జూచి సంబరపడితిని. అతండు నా హృదయం బెఱింగి దీనికి ప్రతిఫలంబుగా నన్నుగోరె. నే నపుడు మూడహోరాత్రంబులు నీకు భార్యనై యుందు నంటిని. అట్లు సమ్మతించి యతం డీకంకణంబు నా కిచ్చె. రాత్రి సెజ్జ చేరుటకు ముందఱ తన నెద నున్ననొకస్ఫాటికశివలింగంబుఁ దీసి నా దోసిటనునిచి ఇది నా ప్రాణలింగం బనియు దీనికి భంగం బొదవిన నేను లింగైక్యం బొందుదు ననియు భోగసమయం బగుట నిది పవిత్రస్థలమున నుండుట కర్జంబు గావున నెందేని ప్రమాదంబు లేకుండగ నుంపు మని చెప్పె. నేనును నా లింగంబు నొకదంతపుబరిణె యందుంచి అద్దాని నొక దారుపేటిక యందుంచి నృత్తమందిరమున నునిచి కవాటంబులకు బీగంబు వేసితి. అనంతర మా పురుషునితో ఒకయామంబువఱకు భోగంబుల

నొంది యంత నిద్రించితిని. కొంతవడి కీశ్వరవశంబున నృత్తగృహంబు నం దెట్లో యగ్ని చేరి గృహంబును దగ్ధంబుచేసె. వణిక్తరుణుం డది చూచి నాకు ప్రబోధంబుచేసె. నేను హుతాశనునై యందుఁజేరి చూచితిని. అశక్యంబైన జ్వాలలతో ననలంబు చేరరాక యుండె. నౌకరులు లేచి నీటికడవలు దెచ్చి అగ్నిజ్వాలల నార్పునవఱకు భవనం బంతయు నిశ్శేషంబుగ కాల్పబడియె. లింగపేటికయు భస్మంబయ్యె. లింగంబు శతధాఖండంబు లయ్యె. వైశ్యయువకుం డదిచూచి దుఃఖించి నీతో జెప్పిన ప్రకారంబు నే నసువులఁబాసి శివలోకంబున కేగెద నని పట్టుబట్టి చితిని బేర్పింపుమనియెను. అట్లు చితిని సిద్ధంబొనర్పఁగా నందాతఁడు దూకి భస్మం బయ్యె. ఇఁక నేను కంకణంబునకై యాతనికి మూడుదినంబు లిల్లాలి నౌదు నని చెప్పియుంటిని. ఒకరాత్రింబుననే ఇట్లు ము ప్పొదవె. కావున నే నాతనికి సతి నైతిని. నా కతడు పతియై మృతుఁడయ్యె. సతులకు పతులతో సహగమనంబు యుక్తంబు. అందులకై ఈ చితింజేరి ప్రాణంబులను విడిచెదనని చెప్పెను. వార లందఱు పరిహసించి ఓసీ! ఘొట్టిపతివ్రతవే! మనకులంబునకు పడుపువృత్తియే కదా జీవనంబు. ఎల్లేని మాయ లుచూపి వలపించి విటులధనం బపహరించుటయే కదా మనపని. అద్ది నెరవేరె. ఇఁక నీ కీ వేదు రేటికి? సుఖంబుగ నెప్పటివలె నుండుము. వేరుపోకలఁబోకు మని మందలించిరి. అపుడు మహానంద వారలాడిననుడులఁ దిరస్కరించి నేను సత్యంబునకుఁ గట్టుబడుదును. నాడు సత్యవచనంబునే నేను మీఱిన ఇఁకధర్మం బెట్లు? సత్యమునగదా ఈ సమస్తప్రపంచం బవిచ్ఛిన్నముగ శాశ్వతంబుగ రూపొంది యుండుట పంచభూతంబులును సూర్యచంద్రులు నక్షత్రంబులు మున్నగునవి మేర మీఱక ప్రకాశమానంబులై తేజరిల్లుచుండుట. సత్యం బొకటి లేకున్న జగంబులెల్ల కారణంబు లేకయే లయంబునొందును.

శ్లో॥ సత్యేనప్రీతిమాయాంతి । దేవాస్త్రిభువనేశ్వరాః
సత్యాసక్తిఃపరోధర్మః । సత్యే సర్వం ప్రతిష్ఠితం
సత్యేనస్వర్గమోక్షేచ । నాసత్యేనపరాగతిః
తస్మాత్సత్యం సమాలంబ్య । ప్రవిశామి హుతాశనం.

(బ్రహ్మోత్తర ఖండము)

తా॥ సత్యముచేత త్రిలోకమందలి దేవతలు సంతోషింతురు. సత్యా
సక్తియే ఎక్కుడగుధర్మము. సత్యమందే సర్వమున్నది. సత్యము
చేతనే స్వర్గమోక్షములు లభించును. అసత్యముచే నధికమగునాధా
రములేదు. అందుచే సత్యమునవలంబించి యగ్నిదూకెదననియె.

ఎందరెన్ని చెప్పినను జెవియొగ్గక తద్క్షణంబందు నగరియున్నట్టి శైవబ్రాహ్మణులను సంపూర్ణవేదాధ్యయన మొనర్చిన మనీషులను దీనానాథజనంబులను బిలిపించి తన గృహారామక్షేత్రంబులను పశుబృందంబును నవరత్న భూషణంబులను ధనంబులను ధాన్యంబులను చిత్రవిచిత్ర సువర్ణ రాజిత పాత్రంబులను శకటంబులను సర్వవస్తుబృందంబును వారలకు జుట్టములకు దాసీలకు నౌకరులకుఁ గ్రమంబెఱింగి పంచిపెట్టి ఆయుచున్నచితియం దింధనములు వేసి మరల రగిలించి మజ్జన మొనర్చి పట్టుపుట్టముఁగట్టి సిగయందు మల్లె విరిదండఁజుట్టి కుంకుమబొట్టుబెట్టి ప్రదక్షిణంబొనర్చి జ్వాలకెదురేగి హృదయమందు సదాశివుని యోజించి యిట్లు ధ్యానించె.

శ్లో॥ పరిస్ఫుతాఖిలభూతలసంవరణ । ప్రణవధ్వని సౌధ సుధాంశుధర
ధర రాజకుమారికయాపరయా । పరితఃపరితుష్ట నతోస్మిశివ ॥
స్కాందకాశీఖండము.

తా॥ ప్రసారింపఁబడిన భూసన్నివేశముగలవాఁడా! ప్రణవధ్వనియను మేడ
యందలి చంద్రధరా! ఉత్తమమైన పార్వతీదేవితో సంతుష్టుఁడవగు
శివా! నతనగుచున్నాను.

అనంతరం బందలి పూజ్యుల కందఱకు వందనముచేసి యానందముతో హుతాశనార్చియందు దూక నుద్యమించు చున్నంతనే దివినుండి శంకరుఁడు జ్వాలకడ్డుపడివచ్చి మందహాసముతో నాభాసురాంగికిట్లనియె. గుణవతీ! నీ సచ్చరిత్రమునకు ధర్మ నిబద్ధ బుద్ధికి మెచ్చితిని. నిన్ను బరీక్షించుటకే వణిక్తరుణ రూపం బొంది రాత్రియం దగ్నిచే నృత్తశాలను గాల్పించితిని. అటుపైని నీదు భక్తికి సత్యనిష్ఠ కానంద మొందితిని. నీకిష్టంబగు వరంబడుగు మిచ్చెద ననియె. వారసుందరి యానందించి యడుగుల వ్రాలి మ్రొక్కి యంజలిఁబట్టి యిట్లర్థించె.

శ్లో॥ న మే వాంఛాస్తి భోగేషు । భూవహా స్వర్గే రసాతలే
తవ పాదాంబుజస్పర్శా । దన్యత్కించి న్నవై వృణే
ఏతే భృత్యాశ్చ దాస్యశ్చ । యేచాన్యే మమ బాంధవాః
సర్వానేతాన్ మయా సార్ధం । నీత్వా తవ పరంపదం
పునర్జన్మభయం ఘోరం । విమోచయ నమోస్తుతే ॥

బ్రహ్మోత్తరఖండము

తా॥ భూమియందుగాని స్వర్గమందుఁగాని పాతాళమందుఁగాని నాకు భోగములందుఁగోరిక లేదు. ఇఁక నీదు పాదపద్మస్పర్శంబుకన్న నుంతయేని వేఱు గోరను. నాతోఁగూడ ఈ నా నౌకరులను దాసీలను బందుగులను నీ పరమపదముఁజేర్పుము. ఘోరమైన పునర్జన్మ భయమును బాయఁజేయుము. నీకుజోత అని కోరఁగ శివుఁడట్లేయని యనుగ్రహించి మహానందను వారలందఱతో స్వపదంబుఁజేర్చె. స్వజనంబుతో నామె పార్వతీ పరమేశులఁ గొల్చుచు నిత్యానందంబున నుండె. ఇది మహానంద చరిత్రము.

## 18. గౌరి - వైష్ణవ గృహిణి

శ్లో॥ త్రియీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్య మితిచ
రుచీనాం వైచిత్ర్యాత్ బుజుకుటిల నానాపధజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ ॥

మహిమ్న స్తవము

తా॥ వేదత్రయ నిరూపిత కర్మమతము కపిల ఋషిప్రోక్త సాంఖ్యమతము పాతంజిలమగు యోగమతము వేద శైవాగమోపదిష్టమగు పాశుపత మతము పాంచరాత్రాగమానుసృతమగు వైష్ణవమతము వేఱు వేఱు విధములుగా నొప్పుచున్న తత్త్వపథమందు ఇదియెక్కుఁడనియు ఇది హితమనియుఁ దలఁచుచున్నారు గాని అభిరుచుల భేదమువలన చక్కఁగను వంకరగ నున్న పలుతోవల నడచుచున్న మనుష్యులకు సర్వోదకంబులకు సముద్రమువలె ఓ పరమేశ్వరా!

నీవే గమ్యుఁడ (శరణ్యుఁడ) వగుచున్నావు. పరమేశ్వరుఁ డొకఁడే. పలువురు లేరు.

శివులకావాసంబును ద్రావిడ దేశంబందు సుప్రసిద్ధంబును నగు మధురానగరమం దొకవీధియందు విరూపాక్షుం డను నొక వసుధామరుండు వేదవేదాంగ వేది శివపూజాసక్తుఁడు ధర్మానుషక్తుఁడు కలఁడు. ఆతనిసతి సువ్రత యననొప్పు స్త్రీరత్నము సుందరీవతంసము పతివ్రత నిరత ప్రియ భాషిణి. ఇట్టివీరిర్వురిదాంపత్యము సర్వజనులచేబ్రశంసింపఁబడుచుండెను. వారలు సంతతము శివపూజాపరాయణులై గృహస్థ ధర్మంబులైన ఆతిథ్యము మున్నగువానిని బ్రపత్తితో నెరవేర్చుచుండిరి. ప్రతిదినంబు హేమపద్మినీ పుష్కరంబం దుషస్సునఁ దీర్థమాడి మీనాక్షీసుందరేశ్వరులఁ బూజించి గౌరీశివపంచాక్షరుల జపించి గేహమున కేగుదురు. ఇట్లు చాలకాలము జరిగినంతమీఁద మీనాక్షీపతియగు సుందరేశ్వర శివుండు కృపతో నాదంపతులకు సంతానఁ బొసఁగ నెంచియు విరూపాక్షుని పూర్వజన్మ కర్మంబు విరుద్ధంబైయుండుట పుత్త్రుని నొసఁగక సర్వలక్షణ సంపన్నయగు నొకదుహిత నిచ్చుట కనుగ్రహించె. అంతనే విరూపాక్షునిసతి సువ్రత చూలొంది శుభసమయమున నొక కుమారిని గనియె. ఆ బాల చంద్రకళవలె దినదినాభివృద్ధినై పెరుగుచుండె. తల్లి దండ్రు లాబాలకు గౌరి యని పేరు పెట్టి యానందంబునఁ బెంచు చుండిరి. గౌరీ కన్యకుఁ బంచమాబ్దంబు ప్రాప్తించినంత గురునొద్ద విద్యారంభము చేయించిరి. అచిరకాలంబున నామె విద్యలఁబరిపూర్ణయయ్యె. అప్పుడా గౌరికిఁ బదేండ్లు వచ్చెను. ఒకనాఁడాకన్య జనకుని యొద్దకువచ్చి నమస్కరించి జనకా! మీరు సర్వ ధర్మజ్ఞులు. సర్వ వేదశాస్త్రంబులను బరిశీలించినవారు. ఎద్దాని సేవనంబున సంసార దుఃఖంబులెల్ల నశించునో యట్టి విద్యను నాకొసఁగుఁడు. దాని నే నుపాసించెద నని పలుమాఱు వేఁడుటను విరూపాక్షుండును సంతసించి పుణ్యనిధివగు పుత్త్రి! నీవు జగత్కారకులగు మీనాక్షీశివుల యనుగ్రహంబున జన్మించితివి. వారల ననుసరించు సద్గుణంబులే నీ యందమరియున్నవి. తల్లీ! నీవు కోరిన ట్లుపదేశించెదను. బ్రహ్మాండ జననియు మహామాయయు సర్వవిద్యానిధియును సచ్చిదానంద రూపిణియును పరమశివుని యనపాయశక్తియు నగు గౌరీ

దేవి యనుగ్రహంబునఁ జతుర్వర్గములును సిద్ధించును. సర్వపాపంబులు సర్వాపదలును హరించును. సర్వసిద్ధు లమరును. అట్టి మహాగౌరీబీజ యుక్తం బైన గౌరీపంచాక్షరీ మంత్రంబును జెప్పెదను. బిందునాద యుక్తంబులైన హకార రేఫై కారంబులే గౌరీబీజంబు. తద్విశిష్టంబు లైన పంచాక్షరంబులే గౌరీ పంచాక్షరంబు. ఇద్దానికి బీజంబు గౌరీమహాదేవి దక్షిణామూర్తి ఋషి గాయత్రి ఛందస్సు దేవత సచ్చిదానందరూపిణి యగు గౌరీ మహాదేవి. ప్రసాదవర్ణములతో షడంగన్యాసమును చేయ వలయును ఇఁక ధ్యానము.

శ్లో॥ కాంచనాభస్య కామారేః । అంకే దేవీం నివాసినీం
పాశాంకుశాభయవర । పాణిపద్మ విరాజితాం
తరుణారుణకోట్యాభాం । కరుణామృతసాగరాం
చతుర్భుజాం త్రినయనాం । పీనోరుజ ఘన స్తనాం
భుజాభ్యాం దక్షవామాభ్యాం । దధతీ మరుణాంబుజం
హేమకుంభం సుధాసిక్తం । చింతామణి సుపూజితం
కుమారౌ దక్షవామస్థౌ । గజానన షడాననౌ
ఆలోక్యాత్యంత ముదితాం । అరుణాంబర ధారిణీం
గౌరీం శంభో ర్మూర్తిమతీం । కరుణా మితి చింతయే ॥

హాలాస్య ఖండము

తా॥ బంగారు దేహముగలట్టి కామహరుని (శివుని) తొడయందుఁ గూర్చుండి యుండినట్టిదియు బద్మములవంటి హస్తములందు బాణ మును అంకుశమును అభయవరముద్రలను ధరించినదియు కోటి తరుణసూర్యులకాంతి గలదియును కరుణామృతంబునకు సముద్రం బైనదియు నాల్గుచేతులు గలదియు మూడు కనులు గలదియు బలి సినట్టి స్తనములు కటిప్రదేశము గలదియు కుడి యెడమ చేతులచే కెందమ్మిని అమృతముతో నిండిన బంగరు కుండను బూజింపఁదగిన చింతామణిని ధరించినదియును కుడియెడమ ప్రక్కలందుఁగల గణే శుని షణ్ముఖుని జూచి సంతసించునదియును ఎఱ్ఱని వలువను గట్టు కొన్నదియును శివునియొక్క కరుణామూర్తి యైనట్టి గౌరీ దేవిని హృదయమందుఁ దలఁచుచున్నాను.

ఇట్లు ధ్యానముచేసి మంత్రమును అక్షర లక్షంబుగ జపంబు చేయవల యును. జపదశాంశంబు క్షీరతర్పణంబును తర్పణదశాంశంబు హోమం బును బ్రాహ్మణ భోజనంబును బొనర్పవలయును. ఇట్లొనర్చినఁ బరమే శ్వరి సంతుష్టయై యనుగ్రహించును. అని యిట్లు విరూపాక్షుండు మంత్రముపదేశించి నంత గౌరి సంతోషించి సమాధి యోగంబుతోఁ బాషాణమువలె నిశ్చలయై చిత్తశుద్ధినొంది గౌరీదేవిని మనమందు యోజించి జనకుఁ డుపదేశించినట్లు గౌరీమంత్రంబును నుపాసన నొన ర్చెను. విరూపాక్షునకు వయస్సుడిగి వార్ధకదశ వచ్చుటఁజేసి వివాహము నకుఁ దగినయీడువచ్చిన కుమారిని జూచి యర్హుఁడగు వరునకిచ్చి యుద్వాహంబు సేయవలె నని సంకల్పించి నంత నొకనాఁ డొక బ్రహ్మ చారి వేదమును సుస్వరంబుగ రమ్యంబుగఁ జదువుచు భిక్షార్థమై తన గృహంబున కరుదెంచిన వాని జూచి రూపలావణ్యములకు మెచ్చి తన పుత్త్రి నాతని కిచ్చెదనని మాటయిచ్చె. అంత విరూపాక్షునిసతి యగు సువ్రత యును విరూపాక్షుని చుట్టంబులును కులగోత్రంబుల నెఱుంగక ఆగంతుకునకుఁ గూతునొసంగఁ బూనిన విరూపాక్షుని గినిసి అజ్ఞాతకుల గోత్రుఁడగు వానికిఁ గన్య నెట్లీఁదలంచితివి ? మూఁర్ఖుడవు మందమతివి యని దూఱి తదనుమతితో నా బ్రహ్మచారి కులగోత్రంబుల నడిగిరి. అతం డుచితంబుగ నల్లెఱింగించిన వారలు సమానకులగోత్రసూత్రం బులకు సంతసించిరి కాని యతఁడూర్ధ్వపుండ్రుండు వైష్ణవుఁడగుట కించుక కించపడిరి.

శ్లో॥ ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః.

గుణసముదాయమం దొక దోషము చంద్రుని కిరణంబులందు కళంకము వలె నణఁగునని విరూపాక్షునివచనం బన్యథాకరింపక యామోదించిరి. విరూపాక్షుండు కులజనులయొక్కయుఁ దనపత్ని యొక్కయు నంగీ కారంబుతో సుముహూర్తమందు వైష్ణవవటునకుఁ గుమారిని సోదకం బుగ సహిరణ్యంబుగఁ గన్యాదానంబుచేసి వివాహంబొనర్చె. తోడనే యనంతధనంబును బుత్రికిచ్చి యల్లునితోఁ దత్పురంబున కనిపెను. అతఁ డును స్వగేహంబునకు పత్నితో ధనంబులతో నేగినంతఁ దల్లిదండ్రులును బందుగులు దేశాటనం బొనర్చి కృతోద్వాహుండై కలత్రంబుతో బహు

ధనంబులతో వచ్చిన కుమారుని జూచి యానందించిరి. కాని వధువు శైవపుత్రిక యగుటచేఁగి యత్తగారు మాత్రము గోడలిని మెచ్చక యుండె. అంతియే గాక కుమారుని వాఙ్మనఃకాయంబులతోఁ గోడలికి సంబంధము కలుగకుండునట్లు నిరోధింపుచుండె. తత్పుత్రుండు మాతృ శాసనంబు మీఱక భార్యయందు విముఖుండై యుండె. ఇట్లుండ నొకనాడు పొరుగూరియందు జరుగనున్న బాంధవవివాహంబునకై వారందఱు గమిష్ణులై గౌరిని మాత్రము గృహాభ్యంతరమందుంచి గ్రామాంతరంబునఁ కేగిరి. గౌరి హృదయమందు మీనాక్షీ సుందరేశుల సేవించుచు గౌరీమంత్రంబు నిరంతరంబు జిహ్వాగ్రంబందు స్మరింపుచు మనంబం దిట్లు తలంచెను. అక్కటా! నాజనకుండు విచారింపక వైష్ణవునకు నన్నుఁ గట్టెఁ. బంధువు లెల్లో యనుమతించిరి. నాథుండు పాణిగ్రహణంబు చేసి స్వగృహంబునకుఁ దోడ్కొనివచ్చె. ఇంద త్తగారు శైవపుత్రినని యసూయనొంది నన్నొక దాసిగాఁ జూచుచున్నది. నాథుండును మాతృశాసనబద్ధుండై నన్ను విస్మరించియుండె. ఇఁక నే నేమి సేయుదును? సుందరేశానుగ్రహంబున మీనాక్షీ వాత్సల్యంబునను జింతనొందక యుంటిని గాని యొకనాఁడేని శైవబ్రాహ్మణుండిటకు దాపరింపఁడు. ఎన్నండేని యొక భిక్షుంబును శివభక్తున కొసఁగ నోచను. గార్యానుగ్రహం బెట్లోయని విచారించుచుండ భస్మత్రిపుండ్ర ధారియు పరిశుద్ధ వస్త్రిండును రుద్రాక్ష కంఠహార ధరుండును ఉజ్వలద్బ్రహ్మ తేజస్కుండును అశీతి వత్సర వృద్ధుండును నగు నొక బ్రాహ్మణుండు తన వాకిటకు వచ్చుచుండుటను జూచి సంతుష్టయై యెదురేగి నమస్కరించెను. విప్రుండును కల్యాణీ! భిక్షనిమ్మని యడిగెను. గౌరి వ్యాకులచిత్తయై మనమందు నొచ్చికొని దైన్యంబునొందె. అపుడు వారికువుర కిట్లు సంభాషణంబు జరిగె.

గౌరి:- భూసురేంద్రా! నన్ను కరుణింపుము.

విప్రుఁడు:- అందులకే గదా వచ్చితిని భోజనంబిమ్ము.

గౌరి:- స్వామీ! తమకు భోజనమిచ్చుట కంతటి పుణ్యము చేసిన దానఁ గాను క్షమింపుఁడు.

వి:- అన్నాతురుఁడు క్షమించునది యేమి?

గౌరి:- మహాత్మా! అన్నమొకటిదక్క మీ రేమి చెప్పినను చేసెదను. మీపాదంబు లొత్తుదునా? సురటితో విసరుదునా? సెలవిమ్ము.

వి:- మానినీ! చమత్కారము చూపెదవా? ఆకొన్నవాని కన్నము బెట్టక ఏమో ఉపచారములఁ జేసెద నందువు. అన్నముఁ బెట్టకున్న నీవెన్ని చేసినను పున్నములేదు, శుష్క ప్రియోక్తులతో శూన్య హస్తములతో నేమియుఁగాదు.

గౌరి:- దేవా! మాయత్తగారు మామగారు పెనిమిటియు నందఱు గృహమున కంతకు బీగంబులు వేసి పొరుగూరికి పెండ్లికై పోయిరి. నే నేమి చేయుదును? అన్నంబెట్లు వచ్చును? తండ్రీ! నీవే యాలోచింపుము.

వి:- నీవి యన్నియు బూటకములు. నాకన్నం బీఁజాలక ఇట్లనుచుంటివి.

గౌరి:- గురూ! నీ విందు వచ్చి చూడుము. ద్వారంబులన్నియు బంధించి యున్నవో లేక నేను కల్లలాడుచుంటినో!

వి:- నీవే చూడుము కవాటంబులు తెరచియే యున్నట్లగుపడుచున్నవి. యనియెను.

అంత నామె రయమున లోపలికేగి చూచినంత కవాటంబులన్నియుఁ దెరచియుండె. అపు డామె విస్మితయై సంతసంబున త్వరితంబుగ తండులాన్నంబును పెసరపప్పును శాకంబులను వండి పాలును పెరుగును సద్యోఘృతంబును జక్కెరను గూర్చి యొక పీఠంబువేసి అరఁటి యాకు నందు వడ్డించి బ్రాహ్మణుని భుజింపుమనియె. ఆతఁడు సత్వరంబునఁ గూర్చుండి భోజనంబును యథేచ్ఛంబుగఁ జేసి ధౌతహస్తుండయ్యె. గౌరి మేరలేని యానందంబు నొందె. అంతనే విప్రుండు వృద్ధాకారంబును బాసి పదియాఱేఁడుల నూత్న యువకుండై కనుపట్టె. గౌరి యాతనిఁజూచి భయ కంపితయై గౌరీమంత్రంబును స్మరించుచుండె. అట్టి యవసరంబందు పొరుగూరికిఁ బెండ్లికి పోయిన యత్తగారు వచ్చి లోపల బంధించియున్న కవాటంబును దట్టి కోడలిని బిలిచెను. గౌరి యత్తగారి పిలుపును విని తరుణ వయస్కుఁడైన సుందర బ్రాహ్మణుని జూచి హా చచ్చితినని చాల భయంబొంది చలనములేక నిలిచెను. జాగుసేయుటఁ జూచి యాపెయత్త పెద్దగా నరచుచు తలుపును బిడికిటిదెబ్బచేఁ గొట్టి బంధమ్ము వదలించి

యభ్యంతర గృహంబునకు వచ్చి చూచెను. అపుడు బ్రాహ్మణుఁడు యౌవన వయస్సును బాసి యొక వత్సరంపు శిశువై యొక చిన్ని పాను పునఁ బరుండి పాదాంగుష్ఠమును పాణియుగ్మంబున నోటియందు జేర్చు కొని గౌరీముఖంబును మందహాసంబుతోఁ జూచుచుండెను. అత్తగా రది యంతయుఁ జూచి ఓసీ! ఎవడీపిల్లఁడు? అని యడిగెను. గౌరి నమ్రయై ఇతఁడు దేవదత్తుఁడఁట. శ్రీదేవి యనునామె యొకర్తుక వచ్చి ఈ బిడ్డను చూచుచుండు మిపుడే వచ్చెదనని ఈ పానుపునఁ బరుండ బెట్టి మగనితో నెటకో పోయె. ఇపుడె రాఁగల దని చెప్పెను. అపుడామె యత్తగారు మూఢురాలా! నీ వేమి చూచెదవు యెందుల కిందు చోటిచ్చితివి? వీని దోడ్కొని యావలికిఁ బొమ్మని కోడలి చెంపపై నొక ప్రహారంబు చేసి పొత్తిలిలో బాలకుని గోడలిని వెలపలకు నెట్టి తలుపును బంధించుకొని యెను. అపుడు గౌరి బాలునితో నాచిన్న పానుపును జూచుకొనుచు మనంబున ఖేదంబు నొందుచు గౌరీ మంత్రంబును జపించుచుండె. శంకరుం డపుడు గౌరి పూజనంబునకు భక్తికి న్యాయమతికి ధర్మాచరణంబునకు శివనిష్ఠకు మురిసి వృషవాహనుండై యామె కగుపడి ఆమెను తనపత్ని యగు గౌరిరూపంబును ధరించిన దానిగ నొనరించి వృషభంబు నెక్కిం చుకొని జనంబు లెల్లరు చూచుచుండ ఆకాశంబున కెగిరి కైలాసంబుఁ బ్రవేశించె. జనంబు లెల్ల రద్దిచూచి విస్మితులై గౌరిని గొనియాడుచు జయజయధ్వానంబులఁ జేసిరి. ఇది గౌరివైష్ణవి చరితంబు.

## 19. ద్రావిడ మాణిక్య వాచక సచివులు

శ్లో॥ తవైశ్వర్యం య త్తజ్జగదుదయ రక్షావిలయకృ
త్త్రయీవస్తువ్యస్తం తిసృషు గుణ భిన్నాసు తనుషు
అభవ్యానా మస్మిన్ వరద రమణీయా మరమణీం
విహంతుం వ్యాక్రోశీం వివిధత ఇహైకే జడధియః॥

మహిమ్నస్తవము

తా॥ ఓవరదాతా! ఓశివా! నీయొక్క యే యైశ్వర్యము జగదుత్పత్తి రక్షానాశములను జేయునదియై సత్వరజస్తమోగుణములచే భిన్న

ములగు మూడైన బ్రహ్మవిష్ణు రుద్రాత్మక తనువులందు వేఱు వేఱుగా నుంపఁబడినది. వేద తాత్పర్య మిట్లుండ ఈ నీ మైశ్వర్య మును ఖండింపుటకుఁ గొందఱు మందబుద్ధు లిందపవిత్రులకు రమణీ యముగ రమణీయముగాని ధ్వనిని జేయుచున్నారు. మున్ను పాండ్య దేశ రాజధానియగుమధురానగరంబు ప్రాంతంబున వాతపురంబునం దుత్తమ బ్రాహ్మణుఁ డొకఁ డుండె. ఆయనకొక సుగుణనిధి యగు పుత్రుండు జన్మించి మిగుల తేజోవంతుఁడై పూర్వపుణ్యవాసనా బలంబున శివభక్తుఁడై నిరంతరము శివదర్శనమందు శివపూజయం దభిరుచి కలిగియుండెను. జనకుఁ డా బాలున కైదవ వత్సరమందే యుపనయన మొనర్చి వేదవిద్యాభ్యాసము చేయించె. బాలకుఁ డచిరకాలంబందు వేదవేదాంగంబులను షడ్దర్శనంబులను సంగీత సాహిత్య సరసకవితారచనల యందును రాజనీతియందు సర్వదేశ భాషా లిపులయందును ఆయుర్వేద ధనుర్వేదార్థశాస్త్రకళామంత్రి శాస్త్రంబులయందుఁ గుశలుఁడై సమయోచిత మృదుమధుర వాక్చ తురుఁడై సర్వజనానందకరుఁడై సర్వజనహితచింతనుండై షోడశ వర్ష వయస్కుండయ్యె. ఆ కుమారుని సద్గుణ తేజోగాంభీర్యధైర్య స్థైర్య శౌర్య సంపదల నాలకించి మధురాపురీనాథుం డగు నరిమర్ద నుండను రాజవర్యుండు పిలువనంపి బహూకరించి ప్రార్థించి తన యొద్ద నుద్యోగంబిచ్చి యుంచుకొని యనతి కాలంబున నే ప్రధా నామాత్య పదంబిచ్చి గౌరవించె. అంత వాతపురీవటుండు సర్వ భారంబుఁ దా వహించి రాజ్యంబు సర్వాంగంబుల వేఱువేఱుగ విభాగించి సమర్థులగువారి నందందు నియోగించి సామంతులందు మంత్రులందు బరిజనులందు సేనానులందుఁ గోశరక్షకులందుఁ దన సామర్థ్యంబుఁ జాతుర్యంబు సౌహార్ద్రంబును న్యాయంబును బ్రత్య క్షంబొనరింపుచు నప్రమత్తుఁడై రాచకార్యంబుల నెల్ల నవలీలగ సఫలంబుగ నిర్వహింపుచు సింహళంబు మున్నగు ద్వీపాంతరంబుల నుండి యనేక సువస్తువులను దెప్పింపుచు ప్రభువున కానందము సేయుచుండె. భూమిపతియు సర్వకార్యంబులను సుఖంబుగ నిర్వ హింపుచు రాజ్యంబును నిష్కంటకంబుగఁ జూచికొనుచున్న వాత

పురీ వటువుపై ననుగ్రహం బొంది యాతనిని ప్రేమించి తద్ జన్మ గ్రామంబగు వాతపురంబును మఱికొన్ని సుక్షేత్రంబులును నారికేళవనంబులను నామ్రవనంబులను దివ్యాశ్వ శకటంబులను నవరత్నభూషణంబులను దుకూలంబులను నొసంగెను. ఉత్తమమంత్రియగు వాతపురీశునితో నిర్విచారంబుగ సుఖంబుగ కాలంబు గడుపుచుండె. వాతపురీశ్వరుండును దాను ప్రధానమంత్రి యగుటయే కాక రాజున కిష్టుండై రాజతుల్యుఁడైనను గర్వమొందక స్వకులధర్మాభిరతుఁడై శివపదధ్యానతత్పరుఁడై గురుబంధుజనవిధేయుడై యేప్రొద్దు బందుగులను శైవ దీక్షిత బ్రాహ్మణులను వేదశాస్త్రకోవిదులను అతిథుల నభ్యాగతులను రిక్తులను దీనానాథవృద్ధులను మూకాంధబధిరపంగులను విహితాన్నదానంబులఁ బరితుష్టులను జేయుచు వేదధర్మంబు నప్రతిహతంబుగ విరాజిల్లఁ జేయుచు ప్రత్యహంబు సువర్ణపద్మినీహ్రదంబునఁ దీర్థంబాడి మీనాక్షీ సుందరేశ్వరుల షణ్ముఖగజముఖుల నర్చించి గృహంబునకేగి శైవవిద్వద్బ్రాహ్మణశతంబులతో భోజనం బొనర్చుచుండును. ఇట్లుత్తమమంత్రియొక్క సన్మంత్రసామర్థ్యంబున ధనాగమంబు హెచ్చె రాజునకుఁ గోశాగారంబు సమృద్ధంబై విస్తరిల్లె. రాజమంత్రులకుఁ బరస్పరం బనురాగం బతిశయించె. అమీఁద రాజానుమతితో సద్గుణవతి యగు కులకన్యను బెండ్లాడి యామెతో గృహస్థధర్మంబు నిర్వహింపుచుండె. ఇట్లు పెక్కువత్సరంబులు గడచిన పిమ్మట నొకనాఁ డశ్వశాలా పరిరక్షకు లశ్వసైనికులు రాజసన్నిధానంబుఁ జేరి యంజలిచేసి యిట్లు విన్నవించిరి. ప్రభూ! మందురలయందలి యశ్వంబు లేదియో తెగులు వచ్చి మృతి చెందుచున్నవి. కొన్నిహయంబులు వ్యాధితో మిక్కిలి దుస్థితిలో నున్నవి. హయశాలలన్నియు మిగుల చిన్నబోయి యున్నవి. నూతనాశ్వంబులను గొని తెప్పించిన అశ్వశాలలు శోభించును. మహారాజులకు జతురంగంబులందుఁ దురంగంబులు మిక్కిలి యావశ్యకంబులు. స్వరాష్ట్రరక్షణంబందును నితరరాష్ట్రజయంబందును నశ్వసహాయ మవశ్యభావ్యంబు. అద్దానఁ బ్రియత్నించి సింధుపాంచాల కాశ్మీర గాంధార కాంభోజ దేశంబులనుండియు మఱియు ద్వీపాంతరంబులనుండియు ఉత్తమాశ్వంబులు సంపాదనీయంబులని చెప్పుటయు మహారా జాలకించి

యరసి వాతపురీశ్వరునితో అశ్వానయనంబుఁ గూర్చి ముచ్చటించి తత్ప్రయత్నంబు త్వరితంబుగఁ గూర్పుమని యనుశాసించె. కోశాగారంబు నుండి యథేచ్ఛంబుగ ధనంబులఁగొని పరిమిత పరిజనులతోఁ గతిపయ సైనికులతోఁ దదర్థంబుగఁ బ్రయాణము సేయుమని చెప్పె. మంత్రియు నట్లేయని రాజానుమతితో విస్తారధనంబును జేకొని ప్రయాణ సన్నద్ధుండై మరునాటి ప్రభాతంబున సువర్ణపద్మినీ సరోవరంబున స్నాతుండై విభూతి రుద్రాక్షంబుల ధరించి నిత్యకర్మంబు లొనర్చి తీరస్థుఁడగు గణేశుని పూజించి నారికేళాది ఫలంబుల నివేదించి షణ్ముఖుని అట్లేయర్చించి మీనాక్షీసుందరేశ్వరుల సన్నిధానంబుఁజేరి యభిషేకంబును పుష్ప బిల్వార్చనంబు నొనర్చి మధుర ఫలంబుల నివేదించి మ్రొక్కి యిట్లుధ్యానించె.

శ్లో॥ మహానీపారణ్యాంతర కనక పద్మాంతరతటీ
మహేంద్రానీతాష్టద్విపధృతవిమానాంతరగతం
మహాలీలాభూతప్రకటితవిశిష్టాత్మవిభవం
మహాదేవం వందే మధుర శఫరాక్షీ సహచరం.

తా॥ గొప్ప కడిమిచెట్ల యడవియందలి బంగారు తామరల కొలనియొద్ద దేవేంద్రునిచేఁ బొందింపఁబడిన యష్టదిగ్గజములచే ధరింపఁబడిన విమానపు నడుమనున్నట్టియు గొప్పగాఁ బ్రకటింపఁబడిన మహాత్మ్యంబు వైభవంబు గలట్టియు మధుర మీనాక్షీ దేవికి సహచరుఁడై యున్నట్టి మహాదేవుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఉమాపీనోత్తుంగస్తనతటల సత్కుంకుమరజ
స్సమాహారాత్యంతారుణవిపులదోరంతరతలం
రమావాణీంద్రాణీపతివిరచితారాధన విధిం
మహాదేవం వందే మధురశఫరాక్షీసహచరం.

హాలాస్యఖండము.

తా॥ ఉమాదేవి యొక్క యున్నతములైన స్తనంబుల ప్రదేశమందు కుంకుమ బూయబడిన రజస్సమూహముచే మిక్కిలి యెఱ్ఱనైన విశాలమైన వక్షస్థలముగలట్టియు లక్ష్మీ వాణీ పౌలోమీ భర్తలచేఁ జేయబడిన పూజా విధానము గలట్టియు మధుర మీనాక్షీ సహచరుడగు మహాదేవుని నమస్కరించుచున్నాను.

ఇట్లు నుతించి మఱియు నిట్లు ప్రార్థించె. దేవా! ఇప్పటివఱకు ధన సమృద్ధి లేక యభిమతంబు సిద్ధింపదయ్యె. నేఁ డశ్వార్థంబై నృపతి విస్తార ధనంబు లిచ్చె. శివధర్మం బొనర్చుటకుఁ దగినసమయంబు లభించె. ఈధనం బంతయు శివభక్తులగువారలకు భోజనంబులకై వినియోగించెద. శుష్క ప్రయాణం బొనర్పను. నన్ను గృతార్థుని జేసి రాజకార్యం బీవే తీర్పుమని పలికి ఎనిమిది నమస్కారంబు లొనరించి స్వగేహంబునకు వచ్చి సుముహూర్తంబున ధనంబులతోఁ బరిజనంబులతో సైనిక రక్షకులతో వెడలి నడుచుచుండ శివప్రేరణతో నొకవిప్రుండు తారసించి యీవిభూతిని గొనుము. నీకు రక్ష యగునని యొసఁగెను. మంత్రివర్యుఁ డానందంబుతో భూతిఁ గొని యానవాందు హృదయమందు ధరించి శకునలాభంబునకు కరంబు ముదంబొంది పూర్వసముద్రతీరంబు నుద్దేశించి ప్రయాణంబుచేసె. కొన్ని దినంబు లట్లు కాననమధ్యంబందుఁ బ్రయాణంబు సేయుచు మధ్యమధ్య నదీతీరంబులందు చెరువుల చేరువల సరోవరంబుల పొంత నిలిచి విశ్రమించి మజిలీలు చేసికొనుచు మహానదీతీరంబందలి భువనేశ్వర క్షేత్రంబుఁ జేరెను. అందు బ్రవేశించినతోడనే వాతపురీశ్వరుని మనం బగ్నిసమీపం బందలి లక్క కరంగునట్లు ద్రవీభూతంబయ్యె. అపుడతఁడు శివానుగ్రహముచేఁ బ్రశాంతమతియై మనంబందిట్లు తలఁచె. అనేకంబులగు శివస్థానంబులను గాంచితిని గాని యిట్టి విశేషమును జూడలేదు. ఈక్షేత్రమందుఁ బ్రవేశించుట తోడనే నా హృదయంబు ద్రవించుచున్నది. ఇందే వసించెదను. వేఱొక యెడకుఁబోవను. అని నిశ్చయించి సహాయార్థంబు వచ్చిన పరిజనులను సైనికవర్యులను జూచి పిలిచి నేనీశివక్షేత్రమందే కొన్ని దినంబులు నివసించెదను. ఇందు మహేశ్వరపూజాపరాయణుఁడనై యుందును. అశ్వము లాషాఢమాసమం దిచ్చటికి రాఁగలవు. నేనవ్వాని గొని శ్రావణమాసమందు మధురకు వచ్చెదను. అన్నిట సుందరేశ్వరుఁడే శరణ్యుఁడు. ఆ ప్రభుని యిచ్ఛచే సర్వము సంభావితంబు కాఁగలదు. మీ రిఁక నిచ్చటినుండి మరలి మధురానగరమున కేగి పాండ్యమహారాజున కిట్లు తెల్పుఁడు. ఇందు నాతోఁగూడ కొలఁది పరిజనులే యుందురు గాక యని యనుశాసించెను. వారలంద ఱాయమాత్యవర్యుని యానతినొంది కొందఱు మాత్ర మందుండి తక్కినవార లందఱు పయనము చేసి మధుర

కేగి మహారాజున కాయుదంతంబు డెలిపిరి. ఇచ్చట వాతపురీశ్వరుఁడు తీర్థస్నానం బొనరించి భస్మోద్ధూళితవిగ్రహుండై రుద్రాక్షహారంబుల ధరించి దివ్యంబైన భువనేశ్వరప్రాసాదంబుఁ జేరుట కుద్యమించినంత మహేశ్వరుండగు సుందరేశ్వరుండు వాతపురీశ్వరునియందు దయాళుండై ప్రాసాదమార్గంబం దొకవనంబు నందలి కుందలతావేల్లి తమాకందతరు మూలంబున నొకగురుమూర్తి స్వరూపంబునొంది యనేక సహస్రాంతేవాసులమధ్యమం దాసీనుండై శిష్యుల కఁదఱ కానందప్రదుండై సువ్యక్తంబుగ నుస్వరంబుగ నధ్యాపనంబుజేయుచు గనుపట్టె. మంత్రివర్యుం డపుడు రెండవశివుం డట్లు దివ్యతేజంబుల మెరయుచు వేలకొలఁది శిష్యులు గొలుచుచుండ నామ్నాయం బుపదేశించుచున్న నాగురువర్యునిం గాంచి పులకాంకితవిగ్రహుండై పరమేశ్వరుండే యితండని సాష్టాంగ వందనంబొసరించె. గురువర్యుం డదిచూచి భక్తానుగ్రహపరాయణుండై సమీపంబునకు రమ్మని నట్లు చాక్షుషీదీక్ష నొసంగెను. అమాత్యుండు సంతుష్టుండై నమ్రుండై దోసిలొగ్గి సద్గురుసన్నిధానంబునొంది నిలిచెను. గురువర్యుం డమాత్యునియాచారంబును భక్తిని జూచి సంతసించి తత్కాలంబుననే సూక్ష్మపంచాక్షరంబును స్థూలపంచాక్షరంబును ఉపదేశించి జ్ఞానంబును కవిత్వంబును క్రమంబుగ హృదయంబునందు వాక్కునందు ప్రవర్తిల్లఁజేసిమాణిక్యవాచకుఁడని నామకరణంబొనర్చెను. వాతపురీశ్వరునకు సద్యస్కాలమందే సంసారవాసన నశించెను. గురుమూర్తిసమక్షంబందు సుస్వరంబుగ వేదంబులఁ బఠించుచున్నట్టి బ్రాహ్మణపుత్రసమూహంబును జూచి సంతసించి వారి సన్నిధానంబందే యుండెను. గురుమూర్తియగు పరమేశ్వరుండు వాతపురీశ్వరునిఁ జూచి కుమారా! నాకార్యం బిందు నుంత కలదు. నాశిష్యులతోఁ గూడ నిందుండుమని సెలవొసంగి కొందఱు శిష్యులతోఁ దా నదృశ్యుం డయ్యె. అంత మాణిక్యవాచకుండు గురుమూర్తినిఁ గానక యీతఁడే యీ భువనేశ్వరుండు. ఇతఁడే సుందరేశ్వరుం డితఁడే సదాశివుం డని యనేకంబులగు శ్రీవాచకంబులతో గురువర్యుని స్తుతింపుచు నందే కొన్ని ఘటికలను గడపి నిద్రాహారంబులను వర్జించి భ్రాంతుండై గురువర్యుని వెదకుచుఁ దిరుగుచుండె. శిష్యు లెల్లరు మాణిక్యవాచకునిఁ జుట్టి చేరి

యవ్వాని జూచుచుండిరి. అంత నామాణిక్యవాచకుండు గుఱ్ఱములఁ గొనుటకై తెచ్చినధనం బంత శివభక్తులగు నావిద్యార్థులకు సాధులకు పేదలకు భోజనంబులకై యిచ్చె. మఱియును గొంత ధనంబును సుందరేశ్వరమందిరనిర్మాణంబులకై సుందరేశ్వరార్చనాభోగంబులకై యలంకారంబులకై సజ్జనులైన తనహితజనులచే మధురకుఁ బంపి తా నందేశ్రీవాచకంబుల గానంబుసేయుచు నిస్సంగుండై పరమేశ్వరానందంబుననుండె. అంత మధురయందు సూచకులైన వారలు మహారాజుం జేరి వాతపురీశ్వరునిచర్యను ధనంబులనెల్ల భిక్షులకై విద్యార్థులకై సాధులకై వ్రయంబు చేయుటయునశ్వంబులకై యత్నంబు చేయకుండుటయు సర్వంబు నెఱింగింప భూపతియు నత్యంతకుపితుండై యమాత్యునకు సత్వరంబుగఁ దురంగంబులఁ దోడ్కొని రాజధానికి రమ్మని యొకలేఖనువ్రాసి ప్రణిధులతో నంపె. వార లతిత్వరితంబునఁ బ్రయాణం బొనర్చి మంత్రివర్యుని జేరి పత్రిక నొసఁగిరి. మాణిక్యవాచకుఁ డద్దానిగొని చదివి యాలోచననొంది కర్తవ్య మెఱుంగక హృదయంబునందు సుందరేశ్వరుని ధ్యానంబొనర్చి మ్రొక్కి సాంజలియై "దేవా! నాదుప్రార్థన నాలకింపుము. పాండ్యభూపతి అశ్వంబులఁగొని రయమ్మునఁ దనసన్నిధానమునకు రమ్మని పత్రికఁబంపె. నేను హయంబులఁ గొనలేదు. ప్రభుని ధనంబంతయు నీ భక్తులగు విద్యార్థులకు సాధులకుఁ బేదలకు భోజనార్థమై యిచ్చితిని. కొంత ద్రవ్యంబును నీప్రాకార గోపురాద్యుద్ధరణంబునకును నీయలఙ్కారనైవేద్యభోగంబులకును బంపినాఁడ. ప్రస్తుతము నాయొద్ద ధనములేదు. ఇపుడేమి చేయుదును ? సెలవిమ్ము. ప్రయాణమొనర్చుచుండ నీవే యొకద్విజరూపంబున వచ్చి విభూతి నొసంగితివి. నే నద్దాని రక్షకై దేహమందు ధరించితిని. సుశకునంబునకు సంతసించి యెపుడును నీవే శరణంబని యుంటిని. ఇపుడు నీ వెట్లు చేయించిన అట్లు చేయుదు"నని విజ్ఞప్తి చేసికొనినంత ఆకసమునుండి దివ్యవాణి ఇట్లు శ్రుతమయ్యె.

"అమాత్యవర్యా! ఇపుడే పాండ్యభూపతి కొకలేఖను వ్రాసి పంపుము. అందు రెండుమాసములవఱకశ్వములు రాఁగలవు. అందులకై అశ్వశాలల నిర్మింపుము. మధురోదకసరోవరంబులఁ ద్రవ్వుము. మధురా

పురీ వీధుల నలంకరింపుము. సూచకవచనంబుల నిరాకరింపుము. మున్ను నన్నెట్లు విశ్వసించి యుంటివో అట్లే యిపుడు గూడ విశ్వాసంబుతో నుండుము. నీకు జయంబగునని వ్రాసి పంపుము. భయము నొందకుము. నీకు నేను శరణంబై యుంటిని" అని వినఁబడియె. మాణిక్య వాచకుఁ డట్లే పత్రికవ్రాసి ప్రణిధులతోడ నంపె. అనంతర మతండు ధీరుండైనను గూడ మదిచెదిరి చింతాకులుఁడై యుండుటను పరమేశ్వరుఁ డెఱింగి యంతనే యొకరాత్రి యందు నిద్రించుచున్న మాణిక్యవాచకునకు స్వప్నమందిట్లు దెలిపె. "అమాత్యశేఖరా! నీవు నాకు భక్తాగ్రగణ్యుఁ డవు. నీలాటి భక్తు లరిది. నిన్ను నేను గాచుచుందును. గుఱ్ఱంబులను గూడఁ బంపెదను. నీవు జవమ్మున మధురాపురి కేగి ఱేని కగుపడుము. సర్వము నిర్వాహమగును." ఇట్లు కలనుగని శివధ్యానముచేసి యారాత్రి చరమభాగంబుగనే ప్రయాణము చేసి కొలఁది దినంబులలోనే మధురా నగరిఁ జేరి రాజమందిరంబున కేగి రాజున కగుపడి వందనంబుచేసినిలిచె. అరిమర్దననృపుండు హర్షించి హయంబులను గూర్చి యెంత ధనంబుతో నెన్నియశ్వంబులను గొంటివి? హయంబు లేదేశమునుండి తెప్పించితివి? సులక్షణంబులేనా? ఇట కెపుడు రాగల?వని యడిగిన మంత్రి ప్రభూ! తురగంబులు నానాదేశములనుండి రాఁగలవు. లెక్కలేనంత ధనంబును విస్తారముగ వెచ్చబెట్టితిని. అశ్వంబులు పెక్కులు త్వరితంబుగనే రాఁగ లవు. హరులన్నియు సులక్షణములు. వానిఁగుఱించి నే నెక్కుడు నుడువఁ జాలను. అశ్వంబులను జూచి మీరే సంతసింతురన భూపాలుండు ప్రీతుం డై యమాత్యునకు మణిభూషణాంబరంబులిచ్చి యనుగ్రహించె. మాణి క్యవాచకుండు సువర్ణపద్మసరసిఁ దీర్థమాడి గణేశమహాసేనులఁ గొలిచి మీనాక్షీసుందరేశ్వరుల నర్చించి వినుతించి రాజకార్యమునకై యర్థించి మ్రొక్కినంత సుందరేశ్వర ప్రేరితమై నభంబునుండి "భయపడకుము. నేనంతఁ జక్కదీర్తు"నని ధ్వని వినఁబడియె. మాణిక్యవాచకు డదివిని శివ వచనమని యెఱింగి సంతోషముతో స్వభవనమున కేగి శివభక్తులగు బ్రాహ్మణశతంబులతో నిష్టాన్నంబులు భుజించె. ఆమీఁదఁ బాశుపత గోష్ఠితో నించుక ప్రొద్దుఁగడిపి పర్యంకంబున బవ్వళించె. ఆసమయం బం దమాత్యుని ముఖ్య బంధుమిత్రులు దారసించి తన చరిత్రంబంతయుఁ

గ్రామవిరుద్ధంబుగ నున్నదనియు అశ్వార్థమై రాజొసంగిన ధనం బంతయు క్షేత్రములకిచ్చుట పాడికాదనియు గుఱ్ఱంబు లెట్లువచ్చుననియు నవ్వి రాకున్న రాజకోపాగ్ని చల్లారు టెట్లనియు నీతోగూడ నీహితుల మగు మాకుఁగూడ ముప్పు రావచ్చుననియుఁ బలికిన నాతఁడు మీ రేమియు నన్ను గుఱించి విచారింపవలదనియు మీ కాపద రాకుండఁగ నన్ను బహిష్కరింపుఁడనియు నావారలు నాబంధు లనుకొనుట యజ్ఞాన మని యు శివానుగ్రహమున నాకు సంసారవాసన నశించినదనియు నాకు సుందరేశుఁడే యఖిలమనియు నేను రాజ ఋణంబును దీర్చుటకై యిపుడు వచ్చితి ననియును సుందరేశానుగ్రహమ్మున నది నిర్వహించి యెందేని జోవుదునని యవ్వారలను బంపెను; వారును గాగలది యగునని యందుఁ బాసి పోయిరి. మఱునాఁడు పాండ్యరాజమాత్యుని బిలువనంపి అశ్వము లెపుడు వచ్చునని యడిగినంత మంత్రివర్యుండు రేపో ఎల్లుండియో రాఁగలవని చెప్పెను. భూనాథుఁ డంత మురిసి మందురలను రాజవీథుల నలంకరింపఁ జేసెను. నూతనాశ్వ సందర్శనంబునకై రాష్ట్రమందలి పెక్కురువచ్చి తురంగంబులకై నిరీక్షించుచుండిరి. అంత మూడవ దిన మందు మహారాజు ప్రభాతంబుననే మేల్కాని కృత్యంబులఁదీర్చికొని సభాంగణమునకు వచ్చి సచివునిఁ బిలిపించి యశ్వంబుల యాగమనంబు నడిగె. అతండు ధీరుఁడై నేఁడే రాఁగలవని తోఁచెడు ననియె. వసుమతీ కాంతుండు సంతసించి సాయము వఱకు నిరీక్షించెను గాని యశ్వంబులు రాకుండె. అంత నృపాలుం డుగ్రుండై యమాత్యుని నిగళబద్ధుని జేసి కారాగారమం దుంచి భటులచే శిక్షింపఁజేయుచుండె. మాణిక్యవాచ కుం డపుడు బందినుండియే సుందరేశ్వరు నిట్లు బాడుచుఁ బ్రార్థిం చుచుండె.

శ్లో॥ శంకర! నవ్యాస్తు రగాః! నాయాతా ఇతి భర్త్సయంతి భటాః
నసహే త్యక్షే ప్రాణాన్ । త్రాహి త్రాతా త్వం క్షణాదత్ర.

హాలాస్యఖండము.

తా॥ ఓ శంకరా! అశ్వంబులు రాలేదని రాజభటులు గారింపుచున్నారు. ప్రాణంబులను ధరింప లేకున్నాను. నీవే త్రాతవు వేగ రక్షింపుము.

శ్లో॥ జనవన్నాథ త్వత్కంపవనం విశ్వస్య సుదృఢ ఏవాస్మి
ప్రాదుర్భ వసద్య స్త్వం తురగై ర్మాం సత్యవాదినం కుర్వ్యక్

తా॥ ఓసుందరేశ్వరా! నీయనుకంపను నమ్మియే నేను దృఢంబుగ నుంటి. గుఱ్ఱంబులఁ దోడ్కొని వచ్చి నన్ను సత్యవచనుని జేయుము.

శ్లో॥ వాగర్థాతీత స్త్వం సద్యః ప్రాదుర్భవ క్షణాత్తురగైః
పురుషా భూపస్య భృశం బ్రూహి బ్రూహీతి తర్జయం త్యద్య.
స్కాంద హాలాస్యఖండము.

తా॥ వాగర్థాతీతుఁడవగు నీవు రయమ్మునఁ దురంగమ్ములతో రమ్ము.

రాజపురుషు లశ్వంబులజాడలు చెప్పుచెప్పుమని తర్జింపుచున్నారు. అమాత్యుఁ డి ట్లేకాగ్రచిత్తుఁడై సుందరేశ్వరుని బ్రార్థించినంతఁ బరమ శివుండు కృపాళుండై గణనాథాదులకుఁ బ్రమథులకు నశ్వంబులను మధు రకుఁ గొనితెం డని యానతిచ్చిన వారంద అాదేశంబున నున్నట్టి జంబు కంబులనెల్ల మహాశ్వంబుల నొనర్చి రౌతులై పయనం బొనర్చిరి. పర మేశ్వరుఁడును నిజవృషభంబు నొక మహాహయంబు నొనరించి యెక్కి తాను గూడ వారలతో వెడలె. మధురానగరిలోఁ గాహళధ్వనులు చెలఁగి మ్రోగె. తురంగమఖురోద్ధూతరజంబు లాకసంబు నాచ్ఛాదించె. అశ్వంబులహేషలు సకలింపు లింపుగ వినబడుచుండె. భూమీశ్వరుఁ డవ్వాని విని హయములు వచ్చుచున్నట్లెఱింగి మాణిక్యవాచకుని సంకె లల నూడదీయించి రప్పించి యర్హపీఠంబిచ్చి కూర్చుండుమనియె. సచివుం డట్లు కూర్చుండె. ఇంతలో నానావర్ణంబులగు మహాశ్వంబుల నెక్కి భూషణంబు లుష్ణీషంబులు ధరించి బాలసూర్య ప్రభాభాస్వరులై యనేక సహస్రంబులు సాదులు (రౌతులు) సమీపించి హయంబుల సవ్యాప సవ్యక్రమంబుల లఘ్వలఘుగతుల బిగ్గకళ్ళెంబుల లాగుచుఁ గరవాలం బులు చలించి ప్రకాశింపఁ బరివర్తింపఁజేసిరి. సభాంగణమందు సింహాస నంబు నధిష్ఠించి యున్నయన్నరనాథుండును మంత్రియు నక్కజముతోఁ జూచుచుండిరందు బాండ్యేశ్వరుండు సమానవేషభూషణంబులు గలి ట్టియు సమానవయోబలతేజోవికాసంబులు గలట్టియు నాసాదివర్యుల నవలోకించి విస్మితుండై సంతోషమ్మున మంత్రిని జూచి వీరలలో ప్రము

ఖుండెవ్వఁడు చెప్పుమనియె. మంత్రివర్యుండపుడు ప్రముఖుఁడెవ్వఁడో నాకు తెలియదు. ఒక యశ్వంబెక్కి అశ్వపతి యొకండు వచ్చి యశ్వంబులు క్రియమున కిచ్చెద ననిన ధనంబు లాతని కిచ్చితిని. అచిరకాలంబు ననే హయంబులఁ దెచ్చెద ననియె. అవి యిపు డిట్లరుదెంచె. నీదు భటుల బాధలచే నామనంబు సంక్షోభించె. ఇపుడు సేనతనిని గుఱుతింపలేను. ప్రభువే యోచించి యశ్వంబులను మందురలందుఁ జేర్పుఁడనియె. రాజు "నీ మనఃక్షోభంబును మానుము నీవే ఆ ప్రముఖుని నారసి పిలువు" మనియె. అంతలో మహేశ్వరుఁడే యైన సాదిప్రముఖుండు హయంబును మండలమండలార్ధ గతులచేఁ బరివర్తనంబు చేయించుచు రాజమంత్రులను సమీపించెను. రాజు సాదివర్యుని జూచి తత్తేజఃపరంపరలకుఁ బ్రీతుండై కనులు మోడ్చి తెఱచి భీతుండై సింహాసనంబు డిగ్గి మ్రొక్కి యంజలిఁబట్టి నిలిచె. మంత్రియు బరిజనంబు లట్లే మ్రొక్కి యంజలిఁబట్టినిలిచిరి. అపుడు పరమేశ్వరుఁడగు సాదినాథుండు పాండ్యరాజును జూచి యిట్లనియె.

పాండ్యమహీపాలా ! సర్వోత్తముఁడును గుణోత్తరుఁడును నగు నీ యీమంత్రిచే శ్రేయంబులను సుఖంబుల నొందుచున్నావు. నీ యిచ్చిన ధనంబుల నశ్వార్థమై నీ మంత్రి నాకొసఁగె. ఈతఁడుసుందరేశ్వరభక్తుఁడగుటకు సంతసించి నే నట్లశ్వంబులను దెచ్చి యిచ్చెద నని యొడంబడితిని. నేను నీకన్న మిన్నయైన యైశ్వర్యము గలవాఁడను. నేను ధనాశతో గుఱ్ఱంబు లిచ్చెద నని యొడంబడలేదు. నీవు సన్మంత్రియగు నితని యింగితంబెఱుంగక చాల బాధించితివి. ఈతఁడొందిన బాధల నెఱింగి నాహృదయంబు కుందినది. మహాపురుషుఁడగు నీయనఘుని దుఃఖంబు నన్ను దుఃఖితుని గావించినది. ఇఁక నీ విచ్చిన ధనంబు వలయునేని నీకు నే నవ్వానిని బూర్తిగ నిచ్చెదను. గుఱ్ఱంబులఁ గోరుదు వేని నవ్వానిఁ దెచ్చితి నిచ్చెదను తెలుపుమనియె.

పాండ్యభూమీశ్వరుండు సాదీశ్వరుని వచనంబులకు సంతుష్టుండై యిట్లనియె సాదీశ్వరా ! నీవు మహాత్ముఁడవు సర్వజ్ఞుఁడవు. నాకు ధనంబక్కఱలేదు అశ్వంబులిమ్ము. నీ వొసఁగు నశ్వంబులచే నాకుఁ జతురంగ బలము సంసిద్ధమగును. దాన శత్రువీరుల నోడించి రాజ్యమును నిష్కంట

కముగ నొనర్చి కొనెదను. ఈసచివుఁడు నాకు ముఖ్యుఁడు బహుశ్రుతుఁడు సత్కర్మపరాయణుఁడు శివపూజాపరుఁడు దాత. హయములు రాకుండుటఁ జపలాత్ముఁడనై ఇమ్మహాత్ముని బాధించితిని. ఇఁకఁ దాము మన్నించి అశ్వలక్షణంబు లెఱింగించి అశ్వంబుల నొసఁగు డనిన సాది ప్రభుండు పాండ్యేశ్వరా! నీకు మనస్తుష్టిగ అశ్వంబుల లక్షణంబు లెఱింగించి అశ్వంబులిచ్చెదను. హయంబులు సులక్షణంబులైన అధిపతికి రాజ్యవృద్ధిని విజయలక్ష్మిని ధనంబును యశంబీఁగలవు. అట్లుగానియెడల అధిపతికి దుఃఖ మొసఁగఁగలవు. నేను దెచ్చిన హయంబులెల్ల సులక్షణంబులు పరీక్షించి తెచ్చితిని. ఈ యశ్వంబులందు గొన్ని సింహవేగంబులు గొన్ని శార్దూలవేగంబులు కొన్ని గజయానంబులు కొన్ని వాయువేగంబులు. పొడవునను నిడివిని లావున రమణీయంబులు. కొన్ని ధవళవర్ణంబులు కొన్ని కృష్ణవర్ణంబులు కొన్ని శోణవర్ణంబులు కొన్ని మిశ్రవర్ణంబులు కొన్ని గళమందు దేవమణి గలవి మరికొన్ని శుభావర్తములు గలవి కొన్ని అష్టమంగళసంపన్నంబులు కొన్ని పంచకల్యాణశోభితంబులు కొన్ని కుంకుమాగరు కర్పూర కస్తూరీ గంధబంధురంబులు కొన్ని యమృతఖండసదృశంబులైన ఫేనంబులు గలవి కొన్ని దుర్గమప్రాకారంబులను అగ్నిజ్వాలలను లంఘనంబున దాటగలయట్టివి యని ఆ హయంబుల రప్పించి చూపించె. మఱియు బహుళాశ్వగణంబుల నిరూపించి ఈయశ్వంబులు కాంభోజదేశసంభవంబు లీయవి బాహ్లికదేశజంబు లీయవి గాంధారదేశజంబు లీయవి ఆరట్టదేశంబు లీయవి సింధుదేశోద్భవంబు లీయవి కాశ్మీరదేశసంభవంబు లీయవి యవనదేశీయంబు లివ్వి సౌవీరభవంబు లివి మాళవతుళువభవంబు లివి పాంచాలదేశోద్భవంబు లివి సౌరాష్ట్రదేశజంబు లివ్వి కాళింగదేశజంబు లిందు శిరోవక్షఃపుచ్ఛముఖపాదంబులందు పాండురంబులైనవి. అష్టమంగళంబు లీయవి చూడుము. మఱియు ముఖమందును చరణంబులందును ధావల్యంబు గలట్టివి పంచకల్యాణసంపన్నంబులు ప్రభునకు సర్వ సంపత్కరంబు లురంబందు రెండును శిరంబందు రెండును ముఖంబందు రెండును నాసికయందు లలాటంబు నందొకటొకటి పాదంబులం దొకటి యొకటి యన్నియుఁబది యావర్తంబులు (సుడులు) సర్వతురంగంబులకును ప్రశస్త

ములు. ఈయవి లేని యశ్వంబులు. దుర్లక్షణంబులు. మఱియు వక్షమం పైదు సుడులు శ్రీవత్సలాంఛనంబులు. నాల్గుదిక్కులందు మధ్యమంబున బ్రిక...నాకారంబున సుడులున్న శ్రీవృక్షకీ లాంఛితంబులు. ఈయవి విభవకు సర్వార్థదాయకంబులు. నుదుట రెండు సుడులుండిన యశ్వము స్వామికి ధనధాన్య సుపుత్ర ప్రదము శత్రుజయకరమ్ము. నుదుట నిచ్చెన వలె మూడుసుడు లున్నహయము ధనధాన్య జయంబుల నొసగు. నుదుట సవ్యంబుగ నాల్గుసుడులున్న ఘోటకంబు యజమానునకు బుత్రప్రదమ్ము భూప్రదము. కర్ణమూలములందు రెండు సుడులున్న వృషభావర్తము స్వామికి భూమణప్రదము. ఇంక చెడ్డసుడుల నాలింపుము. గళమధ్యంబున రెండుసుడు లుండిన స్వామికి మృత్యుప్రదము. జంఘలదుం (పిక్కలందు) రెండుసుడులు భర్తకు భయబంధనదుఃఖకరంబులు. కక్షంబులందు (చంకలందు) సుడియున్న స్వామిని యుద్ధమందు జంపించును. ఉత్తరోష్ఠము (పైపెదవి) నందు సుడిగలది యజమానునితల్లిని వధించును. పాపంబైన ఘోణావర్తంబు త్వరితంబుగ నాథుని వధించును. జానులయందు (మోకాళ్ళయందు) సుడి క్షయం బనునది యశ్వస్వామిని రయంబున సమూలంబుగ జంపును. ఇట్లు లక్షణంబు లెఱింగించితి. ఈ యశ్వంబుల కాయువు ముప్పదిరెండేండ్లు. వర్ణంబులలో శ్వేతవర్ణంబుతోఁ గూడిన సర్వవర్ణములు ప్రశస్తములే. ఇతర వర్ణములతోఁ గూడిన శ్వేతాశ్వంబు లప్రశస్తంబులు. మఱియు శ్వేతాశ్వంబైనను గృష్ణాశ్వంబైనను వక్షంబునందు గుక్షియందు పొట్టయందరుణంబులైన నవి శ్రేయస్కరంబులు. జఠరమందునను (పొట్టయందు) గ్రీవయందు (మెడ) ముఖమందు పృష్ఠమందు (వీపు) వాలమందు (తోక) శ్వేతంబులైన యశ్వంబులు పుత్రధన విజయానందప్రదంబులు. ఇంక శ్వేతాశ్వమునకు గూడ శిరస్సు మిక్కిలి శ్వేతంబైన నా యశ్వంబు సర్వార్థప్రదం బుత్తమాశ్వంబునకు నిడివి వంద యంగుళములు. మధ్యమాశ్వంబునకు దొంబది రెండంగుళంబులు. కనిష్టాశ్వంబున కెనుబది యంగుళంబులు నిడివి యుండవలయు నింక ముఖమును మెడయును జంఘలును పొడవులై యుండవలె. ముఖమును నేత్రములును విశాలములై వాలమును రోమములు కేసరములు మృదువుగ నుండుటొప్పు. గిట్టలు మిగుల కఠినంబులై యుండవలయు నిప్పదిగి

శుభాంగకంబులై శుభలక్షణలక్షితంబులైన హయంబులు ధర్మ కామార్థ సిద్ధికరంబులు. నే నిపుడు దెచ్చిన యశ్వంబు లన్నియు నిట్టివే, మిక్కిలి గమనవేగంబు గలవియు నెక్కుడు బరువు మోయఁగలవియు నాకలి దప్పుల నోర్చుకొనునట్టివియునై యున్నవి. ఇవ్వాని బరీక్షించి గ్రహింపుమనిన భూపాలుం డత్యంత సంతోషిత స్వాంతుండై తురంగం బుల నెల్లఁ బరికించి తన యశ్వపాలురఁ బిలిపించి యశ్వశాలలఁ జేర్పించె. సాదీశ్వరునకు జోతచేసి సువర్ణపట్టవస్త్రంబులను ముక్తాహారంబులను మణిమయభూషణంబులను సుగంధచందనసుమస్రజంబులను నొసఁగి తక్కిన సాదులకందఱకు సువర్ణాంబరోష్ణీషంబుల నిచ్చి గౌరవించె. సాది విభుఁడు సాదులందఱతో సుందరేశాలయంబుఁ జేరి యం దంతర్ధి నొందె. పాండ్యభూపతిమాణిక్యవాచకునకుఁబరమానందంబునసువర్ణ మణిభూషణం బులను ధవళాంబరంబుల రాజ్కవంబుల నిచ్చి బహూకరించె. జానపదం బులనుండి వచ్చినవార లెల్ల తురంగంబులఁ జూచి హర్షించి స్వగ్రామం బుల కేగిరి. రాజవర్యుఁడంత మధ్యాహ్నసమయం బగుటఁ జూచి యంద ఱకు సెలవిచ్చి యభ్యంతర గృహమున కేగె. మంత్రివర్యుండు గృహ మున కరిగి బ్రాహ్మణశతంబులతో భోజనముచేసి విశ్రాంతినొందె. ఇట్లు గుఱ్ఱంబులు మదురలఁజేరి రాత్రి ప్రథమయామం బవసానమై నంత అశ్వరూపంబుఁబాసి నక్కలై యఱచుచుఁ బొఱుచు నెగురుచు ద్వార బంధంబులఁ గొఱుకుచు మూల్గుచుఁ గ్రంతల దూరుచు గవాక్షంబుల కెగిరి దుముకుచు మందురలయందున్న తురంగంబుల గొఱుకుచు నానావిధ దుశ్చేష్టల నొనర్చుచున్నంత అశ్వపాలకులు వచ్చి ద్వారం బులఁ దెఱవ నంతనే గుంపులుగుంపులుగఁ బాఱిపోయెను. నూత్న హయంబులం దొకటేనియుఁ గన్పట్టకుండె. అంతకు మున్దున్న యశ్వంబు లను గూడఁ గొరికి నెత్తురులు గారునట్లు వ్రణంబులొనర్చి జంబుకంబు లన్నియుఁ బఱుగిడిపోయె. అశ్వపాలకు లాశ్చర్యమొంది తెలవాఱుట తోడనే రాజమందిర ద్వారంబుఁజేరి రాజునకెఱింగించిరి. నరనాథుండు విస్మితుండై స్వయముగ మందురలఁజేరి యట్లంతయుఁ దెలిసికొని మంత్రి వర్యుని తంత్రంబు గాని మఱియొండు గాదనుకొని చింతాక్రాంతుండై మహాగ్రహంబున సత్వరంబు మంత్రిని శృంఖలాబద్ధుని గావించితోడ్కొని

రమ్మని భటులఁ బంచె. వారలటు దోడ్కొని వచ్చిన మంత్రిని జూచి హయంబులని జంబుకంబులఁ దెచ్చితివా? సాదిపతి యేమయ్యె? నీ విందిజాల మహేంద్రజాలముగల మాయికుఁడవు. ఎట్లైన నగుదువుగాక. నా రొక్కంబులన్నియు నాకిమ్ము. ఈకున్న నిన్ను గ్రాగముగ శిక్షించెదననిన మంత్రి మహారాజున కిట్లనియె. మహారాజా! తమ సమక్షమందే సాదీశ్వరుం డశ్వలక్షణంబులన్నియు నివేదించి అశ్వంబులను జూపి తమ కిచ్చె. మీరు మిక్కిలి సంతుష్టులై అశ్వములను జూచి మెచ్చి సాదిపతికిని సాదులకందఱకు నాకును బహుమానంబులిచ్చి హయంబులను మందురలకు దోలించితిరి. మీ కశ్వంబు లమ్మిన సాది ఈశ్వరుఁడే యనుకొనెదను. మాయలన్నియు నాయనవికాని నావి కావు. రొక్కంబులన్ని యశ్వములకై యాసాదిపతికే యిచ్చితిని. నాయొద్ద నేమిగలవు? ఇఁక శిక్షించినను రక్షించినను సుందరేశ్వరుఁడును దద్భక్తశిఖామణు లగు తామును శరణ్యమనియె. అంతఁ బాండ్యపతి నీకుయుక్తులకును దంత్రములకును నక్కవినయంబులకును నేఁ బాత్రుఁడను గాను. నీవు మంచిమాటలఁ జక్కఁబడ వనుచు భటులను జూచి ఈశృంఖలలతోడనే యీతనిం గొనిపోయి వీపుమీద బరువుగల యొకశిల నుంచి కశలచేఁ బాదుఁడని చెప్పి యప్పగించె. భటులాయనను గొనిపోయి యట్లు శిక్షించుచుండిరి. అపుడు మాణిక్యుఁడా బాధల సహింపఁజాలక మరలనిట్లు సుందరేశ్వరుని బ్రార్థించుచుండె.

శ్లో॥ తురగా సృగాలరూపా యాతా రాజా విబాధతే ద్రవిణం
విత రేతి మే విశేషా దీశ భవానేవ కేవలం శరణం

హాలాస్యఖండము

తా॥ ఈశ్వరా! అశ్వంబులు నక్కలై పాఱిపోయినవి. ధనంబుల నిమ్మని ప్రభుఁడు మిక్కిలి బాధింపుచున్నాఁడు. నాకు నీవే శరణంబవు. అనిగాయనము చేసినంత సుందరేశుండు భక్తవత్సలుండై భక్తుని యార్తిని బాపుటకై వేగవతీనదిని బొంగి మధురా నగరిలోనికి రమ్మనిన తద్క్షణమే యద్దునీవతంసము విస్తారముగఁ బొంగి యుత్తుంగతరంగ సంఘశోభితయై అనేక జలచరోరగభూయిష్ఠయై వేగాకృష్టమహావృక్షంబై మహానీరంబుతో తీరంబుల నతిక్ర

మించి మధురానగర రాజవీధులఁ బ్రవహింపుచు నంతకంత కెక్కు-డగుచు ప్రజాసముదాయంబునకు భయం బుత్పాదించె. అదిగని నాగరు లెల్ల రున్నతసౌధంబు లధిరోహింపఁ బోవుచుండిరి. మాణిక్యుని బాధించుచున్నభటు లాతని బాసి తమ యాలుబిడ్డల రక్షణంబునకై యాత్మరక్షణంబునకై యవ్వారి గృహంబుల కేగిరి. శివానుగ్రహముతో మాణిక్యుని శృంఖలలు గూడ నూడిపోయె. అంత మంత్రి యత్యంత సంతుష్టుండై సువర్ణ పద్మహ్రదంబునఁ దీర్థమాడి గణేశ సేనానులఁ గొల్చి మీనాక్షీ సుందరేశులఁ నర్చించుచుండె. రాజపురుషులు రాజాజ్ఞతో వేగవతీ ప్రవాహంబు నిరోధింపఁబూని కూలిమనుష్యులకై యన్వేషింప నొకరుగూడ దొరుకరైరి. అపుడు రాజభృత్యులు నాగరజనులలో నొకయాజ్ఞను దండోరా చేసిరి. మధురానగరవాసులెల్లరును సంపన్నులైన వారలు మూగురు కూలీవాండ్రను పేదవా రొకకూలివానిని బంపి మట్టిని రాళ్ల నిటుకలను దెచ్చి నది కడ్డముగా సేతువును నిర్మింపుఁడని సాటిరి. వారలట్లే యొనర్చుచుండిరి.

# 20. భక్తపిష్టాంబ - వృద్ధబ్రాహ్మణి

శ్లో॥ కిమీహః కింకాయ స్సఖలు కిముపాయ స్త్రిభువనం
కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతిచ
అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః
కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతః

మహిమ్న స్తవము.

తా॥ పరమేశ్వరుఁడు జగంబులను సృష్టించుచున్నాఁడనుటలో అతఁడు ఎట్టి సంకల్పముగలవాఁడై ఎట్టి దేహముగలవాఁడై ఎట్టి యుపాయము గలవాఁడై ఏది యాధారముగలవాఁడై ఎవ్వి సాధన సామగ్రికలవాఁడై ముజ్జగంబులను సృజింపుచున్నాఁడు? ఊహింపుటకు శక్యముగాని యైశ్వర్యముగలట్టి నీయందు అనవసరదుష్టమైన

నీ కుతర్కము జగత్తునకు మోహముకొఱకు బుద్ధిహీనులగుకొందఱను వదరజేయుచున్నది.

గృహవంతు లంత రాజాజ్ఞప్రకార మిట్లున్నతంబుగ సేతువు నిర్మించుచుండ నానగరి కాగ్నేయదిగ్భాగమం దొకశివభక్తయైన ముదుసలి విత్తంతు (బ్రాహ్మణి పిష్టవిక్రయంబుతోఁ దాను పొట్టపోసికొనుచు ముందఱ నొక బ్రాహ్మణునకు నియతముగా భోజనమిచ్చి తాను భుజింపుచు నందుఁ బ్రతిదినంబును పిష్టంపుటిడ్డెనల నమ్మినధనం బెంచుక మిగిలినయెడల దేహము శాశ్వతము గాదని యాధనంబును శివభక్తులగు బ్రాహ్మణులకు భోజనార్థమిచ్చుచుండును. మఱియు నా యవ్వ ప్రతిదినంబుషఃకాలమందు కాంచనపద్మపుష్కరిణిఁ జలకమాడి పరివార దేవతలతో మీనాక్షీ సుందరేశ్వరులఁ బూజించివచ్చి పిష్టంబుతో నిడ్డెనలఁజేసి విక్రయించి పాకంబు చేసికొని శివభక్తుఁడగు బాపనికి భోజనంబిచ్చి తాను సాపడుచుండును. ప్రస్తుత సమయంబం దామెను రాజపురుషులు ముప్పదియడుగుల వఱకు సేతువును నిర్మింపు మని విధించిరి. మఱొకదిక్కు లేక యొక్కరితయై యున్న నా ముసలి బ్రాహ్మణి కూలివాండ్లు చిక్కకయు నెక్కుడుధనంబు లేకయు రాజభటుల బాధకు నెఱచి వగచుచు సుందరేశాలయంబునకుఁ బోయి సుందరేశునికి మొఱఁబెట్టుకొని ప్రార్థించుచుండె. సుందరేశ్వరుండు గరుణించి తానే యొకపదియా రేడుల వయస్సు గల దృఢకాయుం డగు కూలివాఁడు వలెఁ గన్పట్టె. పిష్టాంబ యవ్వానిఁ జూచి పిలిచి నీకు రుచ్యంబులైన పిష్టంపుటిడ్డెనలను బొట్టనిండఁగఁ బెట్టెదను. నీవు వచ్చి ముప్పదియడుగులవఱకు సేతువును మట్టితోఁ గట్టు మని చెప్పెను. కృతకభృత్యుం డట్లంగీకరించి యాకె యిచ్చిన సుగంధముగల మేలైన యిడ్డెనలను గడుపునిండ భుజించి యొకతట్టయును బాఱయును తీసికొని సేతువునొద్దకుఁబోయెను. ముదుసలి సంతసించి యింట నుండెను. భృత్యుండు నదీతీరముఁజేరి యందు సేతువు నిర్మింపుచున్న కూలివారలను జూచి మందస్మితంబొనరించి తట్టయుఁ బాఱయు నచటఁ బడవేసి తక్కినకూలీలను జూచి హాస్యవచనంబులు చెప్పుచు నందఱను నవ్వించుచుఁ దా నెద్దియుఁ బనిసేయక కూరుచుండె. రాజభటులు వాని జూచి మందలింపుచు వేగిర పెట్టుచున్నను

నవ్వాఁడు వారలను గూడ జమత్కార వచనంబుల నవ్వించుచుఁ బని సేయకుండె. అపుడు వారలు విసిగి కినిసి రాజభీతులై యవ్వాని మిక్కిలి తొందరించి మహారాజశిక్షను జెందెద వనిరి. ఆకృత్రిమ భృత్యుఁడు హాస్యముచేసి యిట్లనెను. మహారాజెవ్వరు ? నేనే మహారాజును. పాండ్యరాజు నాకే భృత్యుఁడు. వచ్చి శిక్షించునుగాక. మీార లూర కొనుఁడనియె. అంత నవ్వార లోయీా! పిష్టాంబ యిచ్చినకుడుములను బొట్టనిండ మెక్కి యామెకూలిపని చేయవా? యని దూరి కసరి పిష్టాంబను దోడ్తెచ్చిరి. ఆమెయు బతిమాలి కట్టుఁ గట్టు మని చెప్పెను. అట్లే కట్టెద నని చెప్పుచు నూరకుండెను. పిష్టాంబ నిర్మింపఁదగిన ప్రదేశము మిక్కిలి లోతుగ నట్లేయుండెను. రాజభటులంత రాజున కాయుదంతంబుఁ జెప్పుడు నాతండంతఁ గృద్ధుండై వచ్చి పిష్టాంబను గృతక భృత్యుని నిందించుచుఁ గొట్టెద ననియె. భృత్యుఁ డపహసింపుచుఁ దట్టను బాఱను గొని మృత్తును దెచ్చునట్లు మెలమెల్లగ నడుగులు వేయుచుండె. రా జవ్వానిజూచి మిక్కిలికోపముతోఁ దనచేనున్న వేత్రముతోఁ గపటభృత్యుని పృష్టమందు దృఢంబుగ బాదె. ఆపురుషుఁడంతఁ దట్టను బార నచటఁ బాఱవేసి తా నం దదృశ్యుండయ్యె. రా జపుడు పిష్టాంబ నాగ్రహించి పరుషంబులాడి కట్టను గట్టింపుమని తొందఱసేయుచుండె. ఆమెయు హృదయంబందు సుందరేశుని గూర్చి యిట్లు ప్రార్థించెను.

శ్లో॥ అనాథనాథ భగవన్ దయాళో మే దయాంకురు
నసహిష్యామి బాధాం త్వం వ్యపోహ్య మమశంకర
త్వత్పాదభక్తా త్వచ్చిత్తా సంసారా దుత్తర ప్రభో !

హాలాస్య ఖండము

తా॥ దిక్కులేనివారలకు దిక్కైనట్టియు దయగలట్టియు ఓభగవంతుఁడా! ఓశంకరుఁడా! నేను చెందునట్టి యీ బాధను బోకడపి దయను జూపుము. నీదుపాదములందు భక్తినొంది నీయందే చిత్తమును జేర్చి యున్నాను. ప్రభూ! ఈ సంసారమునుండి దాటింపుము. అని దీనయై వేఁడగాఁ గృపాకరుండగునా పరమేశ్వరుండు పుష్ప విమానముతో వచ్చి యామెకు దివ్యనారీరూపం బిచ్చి కైలాసమునకుఁ గొనిపోయెను. కృత్రిమభృత్యుని దృఢముగ బాదిన

యంతనే యందలి రాజపురుషుల కందఱకు వీపులందు వ్రణంబేర్పడి బాధించుచుండెను. అందలిద్రష్టలకు గూడ నట్లే వ్రణం బేర్పడి వేదన నొనర్చుచుండెను. పిట్టాంబభాగంపు నేతువయుఁ జాలయున్న తంబుగఁ బూర్తిగ నిర్మింపబడియుండెను. పౌరు లందఱు రాజును జేరి తమ పృష్టంబు లందలి ప్రహారవ్రణంబులఁ జూపి బాధలకుఁ దాళజాల మనిరి. రాజును దత్పరిజనులును గూడ నట్లే వీపు లందలి ప్రహారవ్రణబాధల కడలుచు బిట్టాంబను దమకనుల మందర బుష్పకంబు నెక్కించుకొని శివుఁడు కైలాసంబునకు గొని పోవుటయును యామె నిర్మింపదగిన సేతువు తక్కిన భాగంబుల కన్న నున్నతంబుగ నిర్మింపబడియుండుటయుఁ గూలిమానిసి యదృశ్యుఁడగుటయుఁ జూచి విస్మయపడెను. ఇది యెల్ల పరమేశ్వరుని మాయయే యని తెలియుచున్నయంతనే యందఱకు వినవచ్చునట్లుగ ఆకాశంబునుండి యొకధ్వని యిట్లు వినబడియెను. పాండ్యమహీశ్వరా! ధర్మముగ నార్జించిన నీ ధనము నంతయును నీ మంత్రి వర్యుఁడగు వాతపురీశ్వరుండు నాదు భక్తులకు భోజనార్థమై యిచ్చెను. కొలఁది ధనమును నాదు పూజాభోగాదులకై యిచ్చె. అంతియెకాని యతఁడు నీ ధనంబులను స్వార్థంబునకై మరియు నితరార్థంబులకై యపహరింపలేదు. దుర్వ్యయము చేయలేదు. నీ వాతని బాధించుచుండుటచే నీ వేగవతీనదిని నేనే ప్రార్థించి పొంగించితిని. నా భక్తుమైన పిట్టాంబకొరకై నేనే కూలివాఁడనై మట్టిమోయుచు నీబెత్తముచే బ్రహారము నొందితిని. నేను విశ్వాత్ముఁడను గావున నీదు ప్రహారము ప్రజల కందరకు నీకును దగిలి బాధించుచున్నవి. నాదు భక్తమైన పిట్టాంబభాగంపు స్థలంబు వల్లమును నెత్తుగ నిర్మించితిని. భక్తను బిట్టాంబను దివ్యదేహం బిచ్చి నా సాన్నిధ్యంబును జేర్చితిని. నీవును నాదు భక్తుఁడ వగుట నీబెత్తపుదెబ్బనొందినను క్షమించితిని. నీ మందురలో నశ్వంబులు నిండున ట్లనుగ్రహించితిని. వాతపురీశ్వరుని సంకెలలఁ బాపితిని. అతఁడు నాకు ప్రియభక్తుఁడు. ఆతనిని బాధించిన నాకు బాధ యగును గావున నీ విపుడైన నారసి యాతనిని ప్రేమింపుము.

మీయందటి వ్రణబాధల నిపుడే మాన్పెదనని తెలిపె. రాజది విని విస్మితుండై భీతుండై తక్కిన మంత్రులతోఁ బరిజనులతో మాణిక్యవాచకుని గృహంబున కేగి సాష్టాంగపడి దోసిలిఁబట్టి మహాత్మా! నిన్ను సామాన్యపురుషునిగ నా మంత్రిగ భావించి యజ్ఞుఁడనై పలుమాఱు నిన్ను బాధించి యెగ్గొనరించితి. అది యంతయును క్షమించి విస్మరింపుము నీవే సుందరేశ్వరుఁడవు. సుందరేశ్వరుఁడే నీవు. మీయిరువురకు భేదము లేదు. నేను మందమతినై నీయను భావంబును దెలియనైతి. నీవు నా యపరాధంబులను మన్నించి నా సభాభవనంబుఁ బ్రవేశించి నాదుసత్కారంబుల నొందు మని ప్రార్థించె. అంత మాణిక్యుండు మనంబందు శంకరునకు మ్రొక్కి మహారాజున కిట్లనియె. పాండ్యమహీశ్వరా ! నీవు శంకరాంశ సంభూతుండవు. శంకరభక్తుండవు. కావుననే శంకరుండు ప్రియముగ నశరీరవాణితో నిన్ను దోఁధించె. అన్యులకిట్లు లభించునే. నేను శివ ప్రీతికై నా యుద్యోగంబున నుండియు శివధర్మంబుల నొనర్చితిని. చిత్తశుద్ధి నొందితిని. సంసారవాసన వదిలినది. నేనిఁక మంత్రిత్వ మును జేయజాలను. శివాజ్ఞయైనది. నాకు సెలవిచ్చి శ్రీ చిదంబర మునకుఁ బంపు మందే యుందు ననియె. అరిమర్దననృపుండు మాణిక్యుని హృదయానుసారముగ నట్లే పంపెదనని సెలవిచ్చి యాయనశిష్యులతోఁ దననౌకరులను గూడ గొందరిని సహాయం బిచ్చి ధనంబిచ్చి ప్రయాణంబు చేయించె. తానుగూడ గొంత దనుక ననుగమించి మరలి నగరంబుఁజేరి పూర్వంబునకన్న మిన్నగ మీనాక్షీసుందరేశ్వరుఁ బూజించుచు శివభక్తులను గొలుచుచు శివధర్మంబు లొనర్పుచుండె. మాణిక్యవాచకుండు దక్షిణదేశదేవస్థానంబు లన్నియు సేవించి శ్రీచిదంబరక్షేత్రంబుజేరి శివగంగయందు స్నాతుండై కనకసభను జిత్సభను దత్సభాధీశుని నటనేశ్వరుని శివకామేశ్వరిని బరివారదేవతల నెల్ల బూజించి సంతుష్టుఁడై రాజసేవకులను మరల మధురకుఁ బనిచి శిష్యులకు సెలవొసంగి తా నేకాకియై జీవన్ముక్తుఁడై తత్సమీపం బందలి బిల్వవనంబుఁజేరి యందలి మృగసంఘమును జూచి తానుగూడ

నొక మృగమువలె శివైక్యబుద్ధితో నిద్రాహారంబుల విసర్జించి యుండె.

మఱియొకయెడఁ బాండ్యరాజు శివపదసమర్పితహృదయుండై యుండ నాతనికి శివానుగ్రహంబున నొకపుత్త్రుండు జన్మించిన నా బాలుని జగన్నాథుఁడని పేరిడి పెంచుచు సుఖంబుగనుండెను. ద్వీపాంతరవాసులగు బౌద్ధపరివ్రాజకులు శిష్యులతో వచ్చి చిదంబరమం దొకమఠంబున నివాసంబు చేసికొని ముండితకేశులై కరంబులందుఁ బింఛంబులను ధరించి సమ్మార్జనంబు చేసికొని కూర్చుండుచు దేవుఁడెవండు లేడు వేదములు ప్రమాణములుగావు. జాతులు కల్పితములు. యజ్ఞాదులందు హింస పాపంబు. అహింస పరమవ్రతంబు. బుద్ధియే మోక్షకారణంబు అని ప్రజలకు బోధించుచుండిరి. తద్బోధచేఁ బశుతుల్యులగు జనులందఱు మోహితులగుచుండిరి. ఆ నగరంబందలి భూసురులు విస్మయంబొంది యా బౌద్ధులతో వాదింపఁగడంగిన బౌద్ధులు వేదములను బ్రమాణముగ నంగీకరింపమనియు హేతువాదముతో ఈశ్వర సద్భావంబును జూపవలయుననిరి. అపుడు త్రిసహస్రబ్రాహ్మణు లాబౌద్ధులతో వాదంబునకు గడంగిరి. కాని బౌద్ధులు ప్రమాణంబులకు లొంగక హేతువాదకుతర్కంబులచే బ్రాహ్మణుల నోడించిరి. అంత బ్రాహ్మణులు వంచితులై వాదంబున కేడుదినంబులు వ్యవధికోరిరి. బౌద్ధులట్లేయని యంగీకరించిరి. బ్రాహ్మణులు పాండవేశ్వర సన్నిధానంబుఁజేరి బౌద్ధులయుద్ధతిని నాస్తికవాదంబును కుతర్కహేతువాదంబును అద్దానిచే నగునాస్తిక్యమును దెలిపి శైవసిద్ధాంతమునకు నాలంబము దమకుఁ గన్పట్టకున్నదనియు విజ్ఞాపించి సర్వజగదాధారులగు తామే ప్రతిఘటించి ప్రతివాదుల వాదంబును నిర్మూలంబును జేయ వలయుననియు సాగిలఁ బడియుండిరి. అపు డాకసమునుండి పారమేశ్వరవాణి యొకటి వినఁబడియె. ఈ పుర సమీపవనంబందు మృగపక్షిసమూహంబులలో జీవన్ముక్తుఁ డగు నా భక్తుండు మాణిక్యవాచకుఁడు గలఁడు. అతఁడు వాదంబందు సమర్థుఁడు. మీ రందుల కేగి యాతనికి నా యాజ్ఞను దెలిపి వాదంబునకుఁ గొని రండు. అతఁడవలీలఁగ నీబౌద్ధుల నందఱను గెలుచును గావున మీర లాతనిని దోడ్తెండని వినవచ్చె. బ్రాహ్మణు లంద ఱా గగనవాణిని

బరమేశ్వరోక్తినిగా విశ్వసించి వేగిర మచట కేగి మాణిక్యవాచకా! నమస్కృతులని శివశాసనం జెఱింగించిరి. అంత నతండు సంతుష్టుండై కృతార్థుఁడ నైతిని. ఇందునకే జీవన్ముక్తిపురంబునుండి సుందరేశ్వరుం డిటకుఁ బంచె. ఇదెయే వచ్చుచున్నాఁడ ననిన వారంద అమ్మహాత్మునికి మ్రొక్కి ఆలింగనము చేసికొని తమస్కంధంబులం దెక్కించికొని యొక సుప్రదేశంబందుఁజేర్చి బౌద్ధుల నాహ్వానంబుచేసిరి. వారంద అవిలంబితముగ నందుఁ జేరి పూర్వపక్షంబులొనర్చిరి. మాణిక్యవాచకుండు లక్షణప్రమాణంబులతో రెంటితో మీకు పరమేశ్వరవస్తువును నిరూపించెద ననియు మీకు ప్రమాణం బక్కఱలేకున్న హేతుసిద్ధం బగు లక్షణంబునే స్వీకరింపుఁడని యట్లు పరమేశ్వరాస్తిక్యంబును పరమేశ్వరునకు జగత్కారకత్వంబును విభూతిపరమేశ్వరులకు జన్యజనకసంబంధమును నిరూపించిన మీఁద బౌద్ధులంద ఎదురు వాదింపలేక జయింపఁబడిరి. శైవులకు జయమును బౌద్ధుల కపజయంబును వాటిల్లినంత బౌద్ధులొకకుయుక్తి బన్ని యిది వాదిజయము గాని వాదజయంబు కా దనియు మెపుడో మరల వాదార్థమై వచ్చెద మనియుఁ జెప్పిరి. అపుడు నగరవాసు లందఱు చోళరాజును జేరి యంతయు నెఱింగించి పరిశీలింపుటకై యీసభకుఁ బ్రభుని దోడ్కొని వచ్చిరి. అపుడు చోళరాజు పరిశీలించి వాదంబు లట్లుంపుడు. నాకొక మూకకన్యక గలదు. మీర లామెకు వాక్కుల నొసంగిన వారలే యిందు జేత లట్లు జేయుండని సెలవొసంగె. బౌద్ధు లట్లు చేయుదుమని యక్కన్యకను దారసించి మంత్రింబులతోఁ గమండలోదకంబుతో మంత్రించుచుఁ బ్రయత్నించిరి. కాని అట్లాకన్యకకు మూకత్వంబు పోకుండె. బౌద్ధు లందఱు దుఃఖం బొంది ముఖంబులు వంచుకొని యూరకుండిరి. మాణిక్యవాచకుఁ డానందంబుతో మూకబాలికను దఱిసి స్వచిత్తంబందు చిదంబరంబందు నటించు నటనేశ్వరుడు మూలస్థానంబున నున్న సుందరేశ్వరుండును నొకటే యని వారి సెలవుచే తానిందు వచ్చితి నని రాజతనూజకు మూకత్వనివృత్తియొనర్చి యీమెకు సత్కవిత నొసంగుమని ప్రార్థించె. తదక్షణంబందే యీ రాజకన్యక మూకత్వమును బాసి వాక్పాటవముతో సంగీతసాహిత్యసిద్ధితో నిరువది ద్విపదలతో శివస్తవంబు చేసెను. ఆమె

హృదయంబును సంతోష వికాసములఁ జెంది నిర్మలంబై స్థిరంబై శివైకతానంబై యుండ లలితనిశ్చలదృష్టులతో మాణిక్యవాచక యోగి పాదారవిందంబులను జూచుచుండె. చోళరాజు సంతోషంబు వెల్లివిరియ నానందపరవశుండై మాణిక్యయోగి చరణంబులఁ బడి మ్రొక్కి బౌద్ధుల నందఱఁబట్టి వధింప నుద్యమించె. మాణిక్యవాచకుండు "హింసామాస్తు" యని హింసను వారించి వారల నందఱ మరల నౌకాయానంబున ద్వీపాంతరంబున కనిపె. వారలు ఖిన్నులై స్వదేశంబుల కేగిరి. ఇంకనిందు మాణిక్యవాచకుం డందఱను వీడ్కొని తాండవేశ్వరశివకామేశ్వరులఁబూజించి శివాజ్ఞతో సశరీరంబుగ శివపదంబు నొందె. చోళభూపాలుండును దత్ప్రతిజ్ఞయుఁ బూర్వంబునకన్న నెక్కుడుగ శివభక్తి నొంది చోళదేశవాసులను శివభక్తి పరాయణులఁ జేసి శైవులఁ బూజింపుచు శివపూజా శివకర్మంబు లొనర్చుచుండిరి. శ్రీచిదంబర క్షేత్రవాసులైన విప్రు లందఱు శివపాదజయంబునకు మిన్నంది హర్షించి శివపూజలఁ గావింపుచుండిరి. ఈయది జీవన్ముక్తుఁ డగు యోగిశ్రీ మాణిక్య వాచకుని చరిత్రంబు.

## 21. జ్ఞానసంబంధి గురులు

శ్లో॥ అజన్మానో లోకాః కిమవయవవంతోఽపిజగతాం
అధిష్ఠాతారం కిం భవవిధి రనాదృత్య భవతి
అనీశోవాకుర్యాద్ భువన జననే కః పరికరః
యతో మందాస్త్వాం ప్రత్యమరవర సంశేరత ఇమే ॥

మహిమ్న స్తవము.

తా॥ దేవశ్రేష్ఠుఁడగునో పరమేశ్వరా! మందమతులైన కొందఱు నిన్ను గుఱించి యెందుచే సందేహింపుచున్నారో అద్దానిఁ బరిశీలింపుము. లోకము లవయవవంతంబులైనను బుట్టుక లేనివి యెట్లగును? జగములయొక్క సృష్టిపద్ధతి కర్తను విడిచియే యగుచుండునా? ఈశ్వరునకన్న అన్యుఁడు జీవుఁడెవడేని చేయఁగలఁడా? లోకోత్పాదనమందు సామగ్రియేది.

మున్నొకప్పుడు పాండ్యదేశాధిపతి యగు శత్రుశాసనపాండ్యుం డుగ్రశాసనుండై విక్రమంబునఁ జోళచేరదేశాధిపతులను గెల్చి తద్దేశంబుల నాత్మాధీనంబుగఁ జేసికొనియె. కొన్నాళ్ళకతఁ డంతము చెందిన యంతఁ దత్పుత్రుండు కుబ్జపాండ్యుం డధిపతియై పట్టాభిషేకంబు నొందె. చోళదేశప్రభుండు దనపుత్రిని నూత్నవయోవతిని సుందరరూపగుణవతిని వనితేశ్వరియను కన్యను కుబ్జపాండ్యునకిచ్చి యుద్వాహంబుచేసె. బాంధవ్యంబు ననుసరించి కుబ్జపాండ్యుండు శ్వశురునకుఁ జోళదేశంబును మరల నిచ్చె. చేరదేశాధిపతియును విస్తారధనంబు లిచ్చి కుబ్జపాండ్యుని సంతుష్టుని జేసి చేరదేశంబును మరలఁ గొనియె. ఇఁకఁ జోళేశ్వరుండు దనపుత్రి నల్లుఁడగు కుబ్జపాండ్యునితో మధురకుఁ బంపునపుడు కులబంధనుఁ డను మంత్రిని గూడ అల్లున కొసఁగి పంపెను. కుబ్జపాండ్యుండు మధురకు విచ్చేసి సద్గుణనిధియును సమర్థుఁడునునగు కులబంధను నమాత్యునిగ నొనర్చి యతనిపైని రాజ్యభారమునిచి తాను రాణితో నిష్టభోగంబుల నొందుచుండె. కులబంధనామాత్యుండును నీతితో రాజకార్యంబులన్నియుఁ జక్కఁగ నిర్వహింపుచుండె. పూర్వపాపవశంబున రాజగు కుబ్జపాండ్యునకు వైదికమతమందును సనాతనాచారములందును ద్వేషంబొదవి క్షపణక బౌద్ధాదులందుఁ జెలిమినొంది ద్వీపాంతరంబుల నుండి తదాచార్యులను దత్సమూహంబును బిలిపించి వారలను సత్కరించి ధనంబులిచ్చి తన్మతాభినిష్టుండయ్యె. అంతియెకాక మీనాక్షీసుందరేశ్వరులయుత్సవాదులను గూడ నిరసించుచుండె. విభూతిరుద్రాక్షధరుల నేవగించుటయే కాక తనరాష్ట్రమందుఁగూడ భస్మరుద్రాక్షతల ధరింపరాదని శాసించె. ప్రజలు భీతులై రాజాజ్ఞకు లోఁబడి భస్మరుద్రాక్షల ధరింపమానిరి. మీనాక్షీసుందరేశ్వరుల దేవళంబులకుఁ బోవుటకుఁగూడ జంకుచుండిరి. అపుడు రాజ్ఞియగు వనితేశ్వరియును మంత్రి కులబంధనుండును రాజునకుఁ గల్గిన చెడుబుద్ధికి జింతించి పలుమాఱు రాజునకు హితోక్తులను వినిచినను నతండు పట్టుదలతో దన దురుద్యమంబుఁ బాయక మఱియు నెక్కుడుగా వైదికమతంబును ధిక్కరించు రాణిని మంత్రినిఁ గూడ విభూతిరుద్రాక్షధారణంబును శివలింగపూజనంబును మానుడని దృఢముగ శాసించె. రాణియు మంత్రియు

ఖన్నులై విచారంబు నొంది రహస్యంబుగ భూతి రుద్రాక్షల ధరించు చుండిరి. ప్రదోషంబులందు శ్రీసుందరేశ్వరాలయంబునకుఁ బోవుటకుఁ గూడ ప్రభువు నిషేధింపఁగా నట్లు సుందరేశాలయంబునకుఁ బోనీకున్న మన్నకుంటిమనిరి. అపు డెట్టకేలకు భార్యయందలి మోహంబుతోఁ గోవెలకుఁ బోయివచ్చుటకు సెలవొసంగెను గాని భస్మరుద్రాక్షలఁ దాల్ప వలదని ఖండితముగా శాసించెను. ఇట్లు ప్రభువు జౌద్ధాచారనిరతుఁడై యుండ రాణియు మంత్రియు నేయుపాయంబున రాజదుర్మతిని దొలఁగించి వేదమతప్రవిష్టుని జేయవలయునని నిరతము చింతించుచుండిరి. ఇట్లు దేశంబంత ధర్మంబుఁ బాసి యధర్మభూయిష్ఠంబై యుండుట పర్జన్యుఁ డందు వర్షింపకుండె. దుర్భిక్షం బేర్పడియె. అట్టియెడ నొక నాఁడు రాణియు మంత్రియు శ్రీసుందరేశాలయమందు శివుని సేవించి యందుఁ గూర్చుండియున్నతఱి శివానందుం డనునొక శివయోగి యటకు శివదర్శనార్థమై వచ్చి రాజ్ఞిచే మంత్రిచే సత్కరింపఁబడి వారల కిట్లనియె. చోళదేశమందలి బ్రహ్మపురంబందు శివపాదాబ్జనిరతుఁడగు శివయోగికిఁ గుమారస్వామి యంశంబున నొకపుత్రుండు జన్మించె. పంచాబ్ద వయస్కుఁ డగునాబాలుని దోడ్కొని తండ్రి నదికి స్నానార్థమై పోయి యందుఁ దీరంబున బాలకు నునిచి తాను మజ్జనమాడుచుండ నంతరిక్షంబందుఁ బుష్పకంబున సంచరించుచున్న యుమామహేశ్వరులు కుమారుని జూడఁగ నందుమాదేవి పుష్పకంబు నాగి దిగి కుమారు నెత్తికొని ముద్దాడి స్తన్యంబుఁ గడుపారనొసఁగి మఱియొకబంగరుగిండియం దింకను గొన్నిపాలునింపి యిచ్చి కుమారా! నీవు సర్వవేదశాస్త్రాభిజ్ఞుఁడవై వాగ్మివై వాదశౌండుఁడవై జ్ఞానసంబంధి శివయోగివను పేరితో నిట్లే పంచాబ్దవయస్కుఁడవై మనుము. నీ కీసువర్ణసింహాసనంబును ముక్తాఫలశ్వేతచ్ఛత్రంబును హేమదండ చామరద్వయంబును హిరణ్యాకాహళంబులను పసిండిపల్లకిని ఇచ్చుచున్నాను. వీనిగొని భూమండలి సంచరింపుము; శివభక్తిని బెంపుమని యానతిచ్చి యంతర్థి నొందె. ఆ బాలుని జనకుండు స్నానంబాడి తీరంబునకు వచ్చి కుమారుని జూడఁగ నవ్వాఁడఖండ తేజోనిధియై క్షీరములుగల పసిండిగిండిఁ బట్టికొని భగవతీసమర్పితముక్తాశ్వేతచ్ఛత్రాదులతో బంగరుసింహాసనం బందుఁ గూర్చుండి మఱియు

చుండుటనుజూచి యక్కజపడి యెక్కడివివ్వి యని యడిగె. కుమారుఁడు సర్వమెఱింగించి పార్వతీదేవి వచనంబులను దెల్పె. జనకుఁ డానందించి పార్వతీపరమేశ్వరులను సన్నుతించి వస్తుపత్రికరంబులను బట్టించికొని స్వాగారంబున కేగి ద్వీపాంతరంబులనుండి బౌద్ధులు క్షపణకులు చోళదేశంబును జేరి వైదికమతంబును నిరసించి బౌద్ధక్షపణక మతధర్మంబుల నుపన్యసించి తత్రిత్యుల నవైదికమతావలంబుల నొనర్పుచుండుటను జూచి జ్ఞానసంబాధిశివయోగి వారలను రాజసభకు రప్పించి యోడించి తిరుగ ద్వీపాంతరంబుల కనిపె. ఈ పాండ్యదేశమందుఁ గూడ క్షపణక బౌద్ధచార్యాకులు చేరి ధర్మంబులఁబాపి యధర్మంబుల నెలకొల్పిరని విని జ్ఞానసంబంధగురుఁ డిటకుఁ గొలఁదిదినంబులలో వచ్చి మీనాక్షీ సుందరేశుల సేవించి ప్రతివాదులనెల్ల జయించి యవ్వారిస్థలంబులకుఁ బంపుటకై సత్వరంబుగ రానున్నవాఁడని తెల్పిన రాణియు మంత్రియు నత్యంత మోదంబొంది యమ్మఱునాఁడే ఆ శివయోగినిచ్చటికి వేగిరంబుగ విజయంబు చేయుఁడని పత్రికను వ్రాసి యశ్వారూఢులతో నవ్వారికిఁ బంపుటయు శివయోగీంద్రు లాలేఖను జూచికొని యతిత్వరితంబుగఁ బదహారువేల శిష్యులతోఁగూడి చతురంతం బెక్కి ముక్తాసితచ్ఛత్ర చామరంబులతో నవరత్నఘటితభర్మభూషణభూషితుఁడై హిరణ్యకాహాళంబులు మ్రోయఁ బ్రయాణముచేసి మధురాపురిని జేరి వేగవతీ తీర్థస్నాతుఁడై సుందరేశ్వరప్రాసాదంబుఁ జేరి సేవించి మీనాక్షీదేవిం దఱిసి పూజించి తక్కిన గణేశ్వరశక్తిధరాదులను గొల్చి మంటపమం దాసీనుఁడై యుండఁ దదాగతిని విని రాణియు మంత్రియు వచ్చి శివ యోగిపదంబుల కెరగి సువర్ణ పుష్పంబులఁ బూజించిరి. మఱియు బౌద్ధ మతమందుఁ జేరిన ప్రభుని యుదంతం బెఱింగించి ఱేనికి దుర్మతపగాఙ్మ ఖత్వంబుగ శివభక్తినిఁ గఱపి ప్రభుని దమ్మును శిష్యకోటియందుఁ జేర్చుకొని ధన్యుల నొనర్పుఁడని సాగిలఁబడిరి. గురుఁ డంగీకరించి ప్రణవంబు నుచ్చరించె. ఇట్లు శివయోగుల యాగమనంబును దివ్యకాహాళధ్వనులతోఁ దెలిసికొని యాపురి నున్నట్టి వాగీశశివయోగి యటకు వచ్చి జ్ఞానసంబంధిగురులను సేవించి యానందించి యవ్వారిని భోజనార్థంబును నివాసార్థంబును దమమఠంబునకు విచ్చేయుఁ డని యాహ్వానించె. జ్ఞాన

సంబంధు లామోదించి శిష్యులతోఁ గాహాళధ్వనులతో నచ్చటి కేగిరి. రాణియు మంత్రియు రాజగృహంబునుండి సకలభోజనసామగ్రుల వాగీశ్వరమఠంబున కన్పిరి. అందు జ్ఞానసంబంధులు శివపూజచేసికొని శిష్యులతోఁగూడ భోజనముచేసి యందే వసించె. ఇట్లు జ్ఞానసంబంధిశివయోగులు ముక్తాఫలశ్వేతచ్ఛత్రిచామరంబులతో బంగరుపల్లకి నెక్కి హిరణ్యకాహాలంబులతో షోడశసహస్రాంతేవాసులతో నూరేగుచు వచ్చుట క్షపణకులతోఁ దద్దేశికుండు విని తమనుజయించుటకు వచ్చుటయును నారసి క్రుద్ధుండై జ్ఞానసంబంధుని శిష్యులతోఁగూడ దహింపబూని అభిచారికాహోమం బొనరించి వాగీశమఠంబును దత్రత్యుల నందఱను గాల్పుమని యగ్నిప్రయోగం బొనరించె. ఆయగ్నియు వేవేగ జ్వాలలతో మఠంబును దరిసెను గాని మఠావరణంబు దాటఁజాలక శాంతిఁజెందె. క్షపణకగురుండు మఠంబును నందలి వారును దహింపఁబడి రని తలఁచి నిజశిష్యుల నందుఁ జూచి రమ్మని పనిచెను. అభిచారాగ్ని మఠంబు బ్రవేశింపలేకుండుట వారలు చూచి పోయి గురున కెఱిఁగించిరి. అంత నతఁడు కోపించి మరల నభిచారమంత్రతంత్రంబులతో నగ్ని నుచ్చాటనంబుచేసె. అపుడు జ్ఞానసంబంధిశివయోగిశిష్యులు మఠంబు వఱకు వచ్చుచున్నయగ్నిని గురున కెఱింగించిరి. గురుండు మీనాక్షీసుందరేశ్వరుల ధ్యానించి ఆ యగ్నిని క్షపణకుఁడై వేదమతంబును భస్మరుద్రాక్షంబులను శివుని ద్వేషించుచు నట్లు ప్రజల కాదేశింపుచున్న కుబ్జపాండ్యునకు జ్వరముగఁ బరిణమింపు మని యభిచారాగ్ని కాదేశించె. తత్క్షణంబున నాయగ్ని వెనుకకు మరలి రాజహర్మ్యం బందలి రాజునకు ఘోరజ్వరంబై యెసఁగె. రా జాకస్మికముగ వచ్చినట్టి ఘోరజ్వరముచేఁ గ్రాగి దుర్భరవేదనకుఁ దహతహపడి మంత్రికి రాణి కెఱింగించి వేగిరంబుగ వెజ్జులఁబిలిపించి యౌషధోపచారంబుల నొనర్పించికొనియె. ఎందరు వైద్యు లెట్టి యౌషధంబుల నిచ్చినను నేమియొనర్చినను జ్వరము శాంతింపదయ్యె. అంతఁ దనగురులగు క్షపణకబౌద్ధచార్యాకుల రప్పించి తన యవస్థను దెలిపి వేగిరంబుగ ఆరోగ్యం బమర్చి రక్షింపుఁడనియె. జ్ఞానసంబంధిగురుఁడున్న మఠముఁగూర్చి యొనర్చిన నభిచారమ్మును తదగ్నియు నందు లోఁగి యణఁగి నమ్మైనవని శిష్యులు గురులతో నొడి

విరి. క్షపణకబౌద్ధచార్వాకు లందఱు విస్మితులై ప్రస్తుతమందు నృపుని జ్వరశాంతికై మంత్రింబులఁ జదువుచు మయూరపింఛంబులఁ ద్రిప్పుచు రాజదేహంబుఁ దుడుచుచు నిజకుండికాజలంబులఁ జల్లుచు విస్తార యత్నంబొనర్చిరి. కాని లబ్ధిలేక రాజునకు జ్వరం బినుమడించె. జ్వరాగ్నితాపంబున కోర్వజాలక రాజు వెజ్జులను గురు లగు చార్వాకాదులను నిందించి తిట్టి యవలకుఁ బనిచెను. చేయునది లేక వా రందరు వెడలిపోయిరి. నృపుఁడపుడు జ్వరాగ్నికి భరింపలేక తన్నొందేని నదిలో విడువుఁడని రాజ్ఞికి నమాత్యునకు బిగ్గరగాఁ జెప్పెను. వార లపుడు రాజును దారసించి ప్రభూ! ఈ యూరికి నిన్న నొక శివయోగి శిష్యులతో వచ్చి వాగీశయోగిమఠమం దున్నాఁడు. ఆతఁడు చాల సమర్థుఁడని వినుచున్నాము. తమ సెలవైనచో నిచ్చటికిఁ బిలిపించెదము. అవ్వారి యుపచారంబునఁ దమకు జ్వరము శాంతించి యారోగ్యము చేకూరు నని చెప్పిరి. జ్వరపీడితుఁడగు రాజట్లే పిలిపింపుఁడనియె. సత్వరంబుగ రాణియు మంత్రియు నవ్వారి సన్నిధి కేగి సర్వముఁ దెలిపి రాజునకు జ్వర శాంతి చేయుఁడని యర్థించిరి. అపుడు జ్ఞానసంబంధియోగులు వేగిరము పల్లకి నెక్కి సితచ్ఛత్రచామరములతో సువర్ణకాహళధ్వానులతో బదునారువేల శిష్యులతో రాజగృహంబుఁ జేరి రాజును సమీపించి చూచి శివమంత్రమంత్రితంబగు విభూతి నొసంగి రాజదేహార్థంబునకుఁ బూయుమని చెప్పెను. దొరసానియు మంత్రియు రాజున కట్లెఱింగింపఁగా నతఁడు బూదిని నాదేహమునఁ దాకనీ ననియెను. రాజదేవియు మంత్రియుఁ బ్రాణాపాయసమయంబు నందుఁ గూడ నిట్టిపట్టుదల గూడదనియు ప్రాణంబుల నెట్లేని రక్షించుకొనవలయుననియు హితముచెప్పిరి. జ్వరతాపము సహింపలేక యెట్లో నృపతి యనుమతించెను. వారట్లు రాజార్థదేహంబునందు భూతిలేపనం బొనర్చిరి. తదక్షణమందే యా యర్థతనువందు జ్వరాగ్ని తగ్గి చందనశీతలంబయ్యె. తక్కిన యర్థ దేహంబందు జ్వరాగ్ని బాధించుచునేయుండె. జ్ఞానసంబంధులు బౌద్ధ క్షపణకచార్వాకగురులతో దక్కిన యర్థతనువందలి జ్వరమును మాన్పికొనుఁడనియు వారలు మాన్పఁజాలకున్న రాజవ్వారి మతంబుఁ బాసి శైవమతంబు నొందినఁ దక్కినజ్వరంబుఁగూడఁ బోగొట్టెద నని

చెప్పెను. ఱేఁడు వేగిరముగ నా గురుల నందఱను బిలిపించి స్వదేహార్థం బందలి జ్వరంబును హరింపఁజేయుఁడనియు లేకున్నఁ దమనందఱను రాష్ట్రంబునుండి వెడలించి శైవమతంబందుఁ జేరుదుననియుఁ జెప్పెను. వా రంద ఱపు డేకమై మరల మంత్రంబు లుచ్చరింపుచు నెమలిపింఛం బులకట్టలను ద్రిప్పుచుఁ గుండికాజలంబులఁ జల్లుచు జ్వరశాంతికై ప్రయత్నించిరి. ఎంతసేపట్లొనర్చినను సుంతయు జ్వరంబు తగ్గకయుండె. అంతఁ బ్రభుఁ డమర్షితస్వాంతుండై వారలను వెలుపలికిఁ బంపి జ్ఞాన గురుని జ్వరశాంతికై ప్రార్థించెను. జ్ఞానదేశికుఁడు శివుని దలఁచి మరల విభూతిని దక్కిన దేహార్థమందు లేపనంబు చేయించెను. వెంటనే జ్వరము హరించెను. దేహంబంతయుఁ జల్లనై రాజునకు సుఖం బొసఁగెను. అపుడు నృపుఁడుత్థితుఁడై జ్ఞానదేశిక చరణారవిందంబులఁ బడి సాష్టాంగవందనం బాచరించి మహాత్మా! నీవు శివుఁడవు. నా ప్రాణంబులను రక్షించితివి. నేను నీదు శిష్యుండ నైతిని. అనుగ్రహించి నాకు శివదీక్ష నిమ్మని కోరెను. గురుఁడును కుబ్జపాండ్యుని దేహమందలి కుబ్జత్వము నీక్షించి మరల పంచాక్షరీమహామంత్రమంత్రితంబగుభూతిని దేని సర్వ గాత్రంబందుఁ బూయించె. ఆక్షణంబున రాజదేహమందలి కుబ్జత్వ మంతఁబోయెను. దృఢదీర్ఘసుందరదేహం బమరె. రా జపు డాశ్చర్య పరీతచిత్తుండై మరల గురుపాదంబులకు మ్రొక్కి దేవా! నన్ను జ్వరాగ్ని పరిముక్తుని జేయుటయె గాక జన్మాదినుండి యున్న కుబ్జత్వమును గూడఁ బోగొట్టి సుందరదృఢదేహం బిచ్చితివి. నీకు నే నేమి ప్రతికృతి సేయఁగలను. అని నమ్రోక్తులాడి అపుడే రాణికి మంత్రికి రాజపురుషుల కందఱకు విభూతి రుద్రాక్షల ధరింపఁజేసె. తానును గురునొద్ద విధిప్రకారంబుగ శివదీక్ష నొందె. గురుండును మున్ను రాజునకున్న కుబ్జపాండ్యుఁ డనునామంబును దొలగించి సుందర పాండ్యుఁడను నామ ధేయం బొసఁగె. సుందరపాండ్యనృపుండు రాష్ట్రమందలి ప్రజల కంద ఱకు శివదీక్ష నొందుటకై శాసించె. ప్రజ లంద ఱానందించి యట్లు శివ దీక్షనొంది జ్ఞాన సంబంధిగురుల వేనోళ్ళ శ్లాఘించిరి. ఇంతయు నరసి బౌద్ధాచార్యాదులు మంతనంబులఁ జింతించి శిష్యులను గొందఱను రాజసభ కనిపి ఒక తాళపత్రంబందు మేము లిఖించి పంపెదము. జ్ఞాన

సంబంధునిచేఁ గూడ నట్లే యొక పత్రింబును వ్రాయించి రెండు నగ్ని జ్వాలయందు విడువుఁడు. అందేది దహింపఁబడకుండిన నద్దానివారలకు జయం బనియు నట్లు చేయింపుఁడనియుఁ జెప్పియంపిరి. భూనాథుం డది జ్ఞానసంబంధున కెఱిఁగింపగా స్వామి యంగీకరించి యొక తాళీపత్రంబందు "శివ" యని రెండక్షరంబులను వ్రాసి యొసఁగె. బౌద్ధగురులును నవ్వారి మంత్రం బొక తాటాకుపై వ్రాసి యగ్నికుండం బందలి జ్వాలలోఁ బడ వేసిరి. బౌద్ధుల తాటియాకు సురసురమండి బూది యయ్యె. జ్ఞాన గురుని శివపత్రంబు దగ్ధంబుగాక ప్రకాశింపుచుండె. అంత బౌద్ధచార్యాకు లితం డగ్ని స్తంభంబుచేసె. కానిం డిఁక నిట్లే పత్రిద్వయంబును గావేరి నదిఁ బడవేసెదము. అపు డేది మునుగక కొట్టుకొని పోవక దరికిఁ జేరునో అవ్వారి మతంబు జయంబొందునని నుడివిరి. ఇట్లు మాటికిఁ బ్రతి ఘటించుచున్న నవ్వారలను జూచి నృపుండు కోపించి ఈ మాఱాడిన వారలను సపరివారంబుగఁ బట్టి కొఱతల వేయింతు ననిన బౌద్ధచార్యాకు లంగీకరించిరి. జ్ఞానగురుం డోమని పూర్వప్రకారంబుగ శివపత్రింబొసంగె. ప్రతివాదులొసగిన పత్రంబును శివపత్రంబును గొనిపోయి కావేరీ ప్రవాహమందు వేసిరి. ప్రతివాదులపత్రంబు ప్రవాహంబందుఁ గొట్టికొని పోయె. శివపత్రంబు తీరంబుఁ జేరి పద్మమువలె భాసించుచుండె. అంతఁ బ్రతివాదు లందఱు వగచి తమకుదామేపోయి కొఱతల నెక్కి సమసిరి. తచ్ఛిష్యులు భయంబున పాఱి మరల ద్వీపాంతరంబులఁ జేరిరి. కొంద ఱట్లుపోలేక రాజు నర్థించి శైవమతంబుఁ బరిగ్రహించిరి. ఇట్లు దుర్మ తంబుల నిర్జించి శైవమతప్రతిష్ఠను జేసి తనదు జ్వరంబును గుబ్జత్వం బును బాపినట్టి మహనీయుని జ్ఞానసంబంధిశివయోగిని గౌరవించి యవ్వారిఁ బర్యంకంబందు గూర్చుండఁజేసి నానాదివ్యవాద్యములు మ్రోయగ గ్రామమం దంత మందమందముగ నూరేగించి తెచ్చి తన సింహాసనంబుం దాసీనుచేసి సువర్ణపట్టువస్త్రంబుల నవరత్నాభరణంబుల నిచ్చి తత్పదంబులకు రాణియు దాను నమాత్యుండును మ్రొక్కి ధన్యుల మైతి మనిరి. ఇఁకను శ్రీమీనాక్షీసుందరేశ్వరులకు లక్షపద్మార్చనం బును గోటిబిల్వార్చనంబు నొనరిరి. మఱియు మీనాక్షీసుందరేశ

వంటులకై నిర్మించిరి. దేశమంతయు యథాపూర్వంబుగ శివభక్తి వెలసి విరాజిల్లె. జ్ఞానసంబంధదేశికుండు పార్వతీమహాదేవి వరంబున నెల్లప్పుడు పంచహాయనవయస్కుండై యుండి మధురనుంచి మరలఁ జిదంబరంబునకుఁ దల్లిదండ్రులయొద్దకు జేరె నిది మహాత్మ్యండును షణ్ముఖాంశసంజనితుం డగు జ్ఞానసంబంధిశివయోగి చరిత్రంబు.

# 22. మహాభక్తనందనార - హరిజన

శ్లో॥ దేవం వందే శరధి శరధిం దేవతా సార్వ భౌమం
వ్యాసప్రష్ఠా భువన విదితా యస్య వాహాధివాహాః
భూషా పేటీ భువనమతలం పుష్కరం పుష్పవాటీ
శాటీపాలా శ్శత మఖముఖా శ్చందనద్రు ర్మనోజః
శ్రీదీక్షితకువలయానందము.

తా॥ ఎవనియొక్క వాహనములైన వేదముల కధికృతులు లోకప్రసిద్ధులైన వ్యాసప్రముఖులో ఎవనికి నగలపేటిక పాతాళలోకమో ఎవని పువ్వులతోట యాకసమో ఎవని వస్త్రములను గాచువారు మహేంద్రుఁడు మున్నగువారో ఎవనికి విలేపనంబుకై చందనవృక్షము మన్మథుఁడో యట్టిదేవుని సముద్రమే తూణీరంబుగ ధరించినట్టి దేవచక్రవర్తిని గొలుచుచున్నాను.

ద్రవిడదేశంబం దాదనూ రను గ్రామమందు వేదశాస్త్రపారంగతుఁడగు నొకబ్రాహ్మణుండు విశ్వనాథదీక్షితుఁడను నామధేయము గలవాఁడు గలఁ డాతండు సత్కర్మాచరణపరుండు శివలింగపూజకుండు నిరతాన్నదానవ్రతుండు ధీరుం డకుటిలవచనుం డాయనకు సుశీల సుగుణవతి మృదుభాషిణి యైన భార్యగలదు. ఆభూసురోత్తముఁ డామెతో దైవపిత్రతిథిపూజలఁ బొనర్చుచు సుఖంబుగ గార్హస్థ్యధర్మంబు నిర్వహింపుచుండె. అతనికి భూవసతి యెక్కుడున్నకారణమున నొకరులను బెక్కురను గొని వ్యవసాయమును చేయించుచుండును. అందుఁ బూర్వమునుండి యిద్దఱు హరిజనులు పొలములన్నియు సేవ్యము చేయుచుఁ బశువుల సంరక్షించుచు యజమానియందు విధేయులై

విశ్వాసంబును సంపాదించుకొని యుండిరి. తక్కిన నౌకరుల కవ్వారు ప్రముఖులై యుండిరి. ఆ హరజనులిద్దఱిలో నొకఁడు గోవిందుఁ డను వాఁడు మఱొకఁడు కందసామియనువాఁడు. గోవిందుని కూతురును గంద సామికిచ్చి పెండిలి చేయుటచే గోవిందుఁడు మామయు కందసామి యల్లుఁడునై యుండిరి. నౌకరులగు వీర లిద్దఱు సుఖంబుగ వ్యవసా యంబు నిర్వహింపుచు పశుసంరక్షణంబుచేయుచుండ భూదేవుఁడు సుఖం బుగ సర్వజనహితంబుగ ననుదినం బన్నదానంబు సేయుచునుండఁ గొంతకాలంబు జరిగెను. కాని యా దంపతులకు సంతానంబు గాకయే యౌవనం బతిక్రమించుచుండె. అంత దీక్షితుండు సంతానంబు లేమి యెక్కుడగులేమిగ సంభావించి సంతానలబ్ధికై వారణాసీయాత్రను సేయనెంచి గృహంబునొద్దఁ గావలివారల నునిచి యాత్రోపకరణంబులఁ గూర్చుకొని భార్యను దోడ్కొని సుముహూర్తంబునఁ బ్రయాణము చేయుచుఁ దనపొలంబును బండించుపాలేరు లగు హరజనుల కిరువురకుఁ బోయి వచ్చెదమని చెప్పెను. అపుడు కందసామియనువాఁడు స్వామికి దండముచేసి తనకుఁ గూడసంతానము నిచ్చుటకై దేవునిఁ గోరుమని ప్రార్థించె. దీక్షితుఁ డంగీకరించి వెడలె. అడవులు కొండలు నదీనదం బులు పురములు పట్టణములు మున్నగువాని గడచి హుటాహుటి యా నంబులతో మూడు నెలలకుఁ బ్రయాగను జేరి యం దొకబ్రాహ్మణ గృహంబందు నిలిచి గంగాయమునా సరస్వతీ సంగమం బందు స్నానం బుచేసి వేణీదానం బితరదానంబు లొనర్చి పితృదేవులకు తీర్థశ్రాద్ధంబు చేసి ప్రయాగేశ్వర మాధవీశ్వరులఁ బూజించి వెడలి త్రోవలో వింధ్యా చలేశ్వరినిఁ బూజించి కాశీపురిం జేరిరి. అందుఁ బ్రథమదినంబందు విధితో మణికర్ణికాచక్రపుష్కరిణీస్నానంబొనర్చి విశ్వేశ్వర లింగ దర్శనంబును అన్నపూర్ణాడుంఠిగణేశ్వర దర్శనంబును కాలభైరవబిందుమాధవదర్శ నంబు చేసుకొని క్షేత్రోపవాసంబుండి మఱునాఁడు శ్రీవిశ్వేశ్వరలింగ పూజనం బన్నపూర్ణాడుంఠి ప్రముఖార్చనంబు లొనర్చికొని మూడవ నాఁడు పంచగంగాస్నానంబును నాల్గవనాఁడు గాలాష్ట కార్చనంబును నైదవనాఁడు నిత్యయాత్రయు నాఱవనాఁడు తీర్థశ్రాద్ధంబును సల్పి ప్రత్య హము శ్రీవిశ్వేశ్వరుని అన్నపూర్ణను డుంఠిప్రముఖులను బూజించుచుఁ

బుత్రార్థియై యుండె. అట్లాఱునెలలున్నమీఁద విశ్వనాథుఁ డనుగ్ర
హించి స్వప్నంబందు దీక్షితునకు ఫలంబొసంగి స్వదేశంబున కేగుటకు
సెలవిచ్చె. అపుడు దీక్షితుఁడు తనపాలేరగు హరజనుని ప్రార్థనను గూడ
విశ్వనాథున కెఱింగించి విశ్వనాథుఁ డదియుఁగూడ నంగీకరించి వరం
బొసంగినట్లుగఁ దెలిసికొని కాశీపంచక్రోశ ప్రదక్షిణం బొనరించి అన్న
పూర్ణా విశ్వనాథడుంఠిమాధవకాలభైరవ దండపాణ్యాదుల నర్చించి
మ్రొక్కి యనుజ్ఞఁబడసి వెడలి గయకుఁబోయి యందుఁ బైతృకవిధిని
నిర్వహించి రుద్రవిష్ణుపాదంబులందుఁ బిండదానంబొనరించి మంగళగౌరిని
బూజించి గంగసాగర సంగమంబుఁ జేరి మజ్జనఁ జొనరించి భువనేశ్వర
జగన్నాథక్షేత్రంబులను సేవించి దాక్షారామ భీమేశ్వరుని మాణిక్యాం
బికను బూజించి పట్టిసవీరభద్రుని భద్రకాళికను భజించి మార్గంబందు
గోదావరీ కృష్ణవేణీకావేరీ సువర్ణముఖరీనదీపరివాహంబులఁ దీర్థంబు
లాడి ఆయా స్థలంబులందు దేవులను గొలిచి శ్రీకాళహస్తీశ్వరుని తిరు
త్తని సుబ్రహ్మణ్యేశ్వరుని వెంకటాచలాధీశ్వరుని బూజించి నాల్గుమాసం
బులలో స్వపురిని జేరిరి. గ్రామీణు లందఱు కాశీయాత్రను జేసికొని
వచ్చినట్టి దీక్షిత దంపతులను జూచి హర్షించి గౌరవించిరి. నౌకరులును
బాలేరులు నంద ఱానందించిరి. దీక్షితుఁడు పాలేరువిన్నపంబును
స్వామికిఁ దెల్పితి ననిచెప్పెను. అవ్వాఁడును సంతసించె. అంత దీక్షి
తుఁడు యథాపూర్వంబుగ నిత్యం బన్నదానాదికము నొనర్చుచు సుఖ
గోష్ఠి నుండె. అనంతరము కొలఁది నెలలలో దీక్షితపత్ని గర్భంబు
ధరించె. అట్లే హరజనుని పెండ్లము గూడ చూలాండె. దీక్షితుఁడు
సతికి సీమంత సంస్కారంబుఁగావించె. నెలలు నిండినతోడనే దీక్షితదేవి
శుభసమయమందు శుభలగ్నంబునఁ బ్రసవించి పుత్రుని గనియె.
హరజనునియాలుగూడ సుదినంబున సుసమయంబున గొమరుని గనియె.
దీక్షితుండు పుత్రునకు జాతకర్మంబును సుబ్రహ్మణ్యుఁడని నామకరణం
బును చేసి భూదేవుల కితరులకు మృష్టాన్నదానంబులొనర్చె. దీక్షిత
పుత్రుండును హరిజనబాలుండును దినదినప్రవర్ధమానులై పెరుగుచుండిరి.
హరజనుఁడు తనపుత్రునకు నందుం డని పేర్వెట్టి పెంచుచుండె. దీక్షి
తుఁడు తనపుత్రున కెనిమిదవయేట నుపనయనంబుచేసి వేదపాఠంబు

నకై గురున కప్పగించె. దీక్షితపుత్త్రుఁడును బాల్యచాపలంబున గురు నొద్దకుఁబోయి చదువక యేప్రొద్దు తోడిబాలకులతో నాడుచుండె. ఒకటి రెండుమాఱ్లు జనకుండు శిక్షించి గురునొద్దకుఁ దోడ్కొనిపోయి చదువున నుంచెను గాని బాలుఁడు గారాముతోఁ బెరిగి యుండుటచే నట్లు వేద మభ్యసింపక యూరకనే తిరుగుచుండె. ఇట్లు మూఁడేఁడులు గడచి నంత దీక్షితపుత్రునకు నింతయు విద్య యలవడకుండుటఁ జూచి దీక్షి తునకుఁ గోప మధికమయ్యె. ఒకనాఁ డుషస్సున గురునొద్దకు వేదశాస్త్ర పఠనంబునకై దీక్షితుండు పుత్త్రునిఁ బనుపగా నతఁ డట్లు పోవక వీధిలో నొకచో బాలకులతో నాడుచుండె. యాదృచ్ఛికంబుగ దీక్షితుఁ డా ప్రదేశమునుండి గృహంబు చేరుచుండ నితర బాలురతో బలిగుడుల నాడుచున్న పుత్రుం గాంచె. అవ్వాడును భీతుండై యెందేనొ దిగి కొంత ప్రొద్దుకిలుచేరవచ్చిన దీక్షితుం డాగ్రహపరవశుండై పుత్రుని గృహ ద్వారంబు వెలుపలికిఁ ద్రోచి తిట్టి పొమ్మని ద్వారబంధ మొనర్చె. బుడ తఁడు బీతుఁడై యెందేనిఁ జనియె. దీక్షితసతి కొమరునకు బలుమఱు బుద్ధులు చెప్పినను నతఁడు వినక యట్లే యుండుటయు నాఁడు పెనిమిటి కొమరుని వెలుపలకుఁ ద్రోచి తలుపులు వేయుటఁ జూచియు సుశీల గావున కొమరునియం దెక్కుడు ప్రేమయు వాత్సల్యమున్నను జేయునది లేక భర్త కెదురాడక మదిలోఁ గుందుచు నూరకుండె. మఱికొంత తడవుకు దలుపులు తెఱచి చూచిరి గాని సుతుఁ డగుపట్టడయ్యె. ఎందేనిఁ బోయెనని నిశ్చయించుకొని యందందు వెదకిరి గాని యతఁడు కన్పట్టఁ డాయె. తల్లియుఁ దండ్రియు నిర్వురు మనస్తాపంబుతో విచారించు చుండిరి. ఇఁకఁ గందుని కొమరుఁడగు నందుఁ డల్లారుముద్దుగఁ బెఱు గుచు నెల్లవారలకు ముద్దుపల్కుల నందం ప్రచేష్టల సంతసంబొనరింపుచుఁ బుట్టుకతోడనే యొదవినశివభక్తిచే బూదిసిగొనివచ్చి పూసికొనుచు శివ దేవళం బెదుటఁ జేరి జోతసేయుచు మురియుచు శివోత్సవంబులందలి శివ సేవలఁ జూచుచు తన్మయుఁడై యానందించుచు శివభక్తులకు మ్రొక్కుచు శివభజనలందుఁ జేరి పారవశ్యంబొందుచు జగంబును సర్వంబు శివతేజం బుగ భావించి ఱేఁబవలు శివధ్యానంబునందే గడుపుచుఁ దలిదండ్రులు జెప్పిన పనులందుఁ దవులక చేయుచున్నను నవి చక్కఁగనే నిర్వహింపఁ

బడుచుండుట కక్కజంబొంది శివుఁడే యట్లు నిర్వహింపుచుండె నని తలంచుచుండె. ఇంక విశ్వనాథదీక్షిత పుత్రుండు తండ్రితో నిలునుండి గెంటఁబడి సిగ్గొంది యప్పురిఁ బాసి సాయము వఱకొక యూరిఁజేరి యందలి యొకయగ్రజన్ముని గృహమందు భుజించి విశ్రమించి నాల్గవ జాము రాతిరియందే మేల్కొని కృత్యంబులఁ దీర్చికొని యుత్తర దిక్కు గూర్చి ప్రయాణముచేసి మహానదుల దాటి మూఁడు నెలలలోఁ గాశీ పురిని జేరి గంగాస్నానం బొనర్చి విశ్వేశ్వరు నన్నపూర్ణను డుంఠి మాధవ కాలభైరవాదులను దర్శించి సేవించి యొకచో వాసం బమరించి కొని శ్రీజగదీశపండజీ వారి సన్నిధికరిగి వారి యడుగులకు సాష్టాంగపడి తన దేశమును గులగోత్రంబులను దెలిపి విద్యార్థినై వచ్చితి ననుగ్రహింపుఁడని ప్రార్థించి వారిచే నాదరంబుఁ బడసి గీర్వాణవాణీసాహిత్యం బచిరంబందేయొంది పాణినీయంబులఁ బఠింపుచుండె. ఇం దాదనూకునందు దీక్షితుండును సుశీలయుఁ జిరకాలంబున కీశ్వరవరంబు నొంది వడిసినట్టి యేకపుత్రుని దేశత్యాగంబునకు దుఃఖింపుచుఁ బలుకడల వెదకించియుఁ బుత్రునిజాడ నెరుఁగక పొగలుచుండిరి. ఇంక నందుఁడు దనతోఁ బలు వురను జెలికాండ్రను జేర్చికొని రేఁబవలు "శంకరశంభో సాంబసదాశివ" యని భజనము జేసికొనుచుఁ దన్మయుఁడై యుండును. తనతండ్రి పొల ముదున్నుటకుఁ బంపినపు డందు దృష్టినుంపక నాగలి కేది యడ్డమైనను నట్లే నడుచుచుండును. వృషభంబులే యవ్వాని దప్పించికొని నడుచు చుండును. పైరులను గాఁచుట కంపినపుడు పశువులు విహంగములు చేరి సస్యంబులను గ్రాసంబుచేయుచున్నను వానిని దోలఁగింపక మిన్నక చూచుచుండును. పరిపాకసమయమం దవ్వానిపొలముపంట తక్కిన వారిపంటలకన్నఁ జతుర్గుణితముగఁ బండియుండు. ఆ పండినపంటయందు గూడఁ జేరవచ్చిన దీనానాథభక్తజనంబులకుఁ దృప్తిగఁ బంచిపెట్టు చుండు. ప్రతిదినం బుషస్సున నే మేల్కొని తీర్థంబందు గ్రుంకి బూదిఁబూసి కొని శివాలయంబునకు దవ్వులఁజేరి పరమశివుని నామంబుల నుచ్చరిం పుచు నొకయామంబుఁ గడుపుచుండు. సాయమందుఁగూడ నట్లేజేరి శివ భజనంబు సేయుచుండును. ఇంట నున్నపుడు మునివాకిటఁ గూర్చుండి పరమేశ్వరుని దలంపుచు నానందంబు నొందుచు దేహంబుపై నింటిపైని

విస్మృతి నొందియుండు. వానితాత యగు గోవిందుఁడు వీనికి దెయ్యమో భూతమో పట్టినది. లేక పిచ్చియెత్తినదో యని చింతసేయుచు నపుడపుడు వాని మందలింపుచుఁ గొంపయు సేద్యమును జాగ్రత్తగఁ జూచుకొనుచుండుమని చెప్పుచుండును. కొందఱు వీనికిఁ బిచ్చిగాదు బకితి యని యనుకొందురు. మఱికొంద ఱేదో రోగమని తలఁచుచుందురు. ఎవ్వరెట్లనికొనినను నందుఁడు సుంతవిచారములేక సంతతము శివానందసాగరంబున నోలలాడుచుండును. ద్రష్టలెల్ల వాని సుందరముఖారవిందమందేహాద్దు పాయకయుండునానందపారవశ్యంబుపరికారంబుఁగన్గొని యబ్బురంబొందుచు నీతండు సామాన్యపురుషుండు గాఁడు దైవానుగ్రహితజన్ముండని విశ్వసింతు రిట్లు గొంతకాలంబు జరిగినమీఁద నంతయచటి కొకింత సమీపంబందలి తిరుప్పంగులూ రనుగ్రామమందు శివునకు బ్రహ్మోత్సవంబు జరుగుచుండుటను విని తనతోడివారలఁ బదుగురను బిలిచికొని ప్రయాణంబుచేసి ప్రదోషసమయమందందుఁ జేరి శివాగారగోపురబహిస్థలంబందుండి శివలింగంబును జూడఁ బూనెను. అందు శివలింగంబు కట్టెదుట శైవాగమోక్తపరికారంబుగఁ బ్రతిష్ఠించినట్టి నందికేశ్వర విగ్రహం బడ్డమై యుండుటఁ జూచి లోనఁ జింతించి "నందీ! తొలగవయ్యా! ఇంచుక యెడముచేరి నాకు శివుని జూపింపుమయ్యా! నీకు దండము పెట్టెదను తండ్రీ!" యని ప్రార్థించెను. శాస్త్రపరికారంబు లోహంపుటట్టెములతో బిగింపఁ బడినట్టి నందివిగ్రహం బెట్టులెడముగఁ బోవును ? తాను భక్తిపారవశ్యంబున శివలింగంబును దరిసింప నెంచి యట్లుగోరెను. మహాత్ములైనవారలకు సిద్ధపురుషుల కొకటి సాధ్యమనియు మఱొకటి యసాధ్యమనియుఁ దోచదు కదా ?

శ్లో॥ కోన్యదేశః ప్రబుద్ధానాం । కః పరః ప్రియవాదినాం
కిందుష్కరం సమర్థానాం । కిందూరం వ్యవసాయినాం॥

అభియుక్తోక్తి.

తా॥ విద్వాంసులకు ఎక్కుడు బుద్ధిమంతుల కితరదేశమనెడు నదియును ప్రియముగ మాటలాడు వారల కితరుఁడనియు శత్రుఁడనియును సమర్థులగువారలకుఁ జేయరానిదియును వ్యవసాయము చేయు వారలకు దూరమనియు నుండదు.

ఆ స్తుతిం బు గోరినంగూడ నంది యట్లేయుండుటం గాంచి యలుక [illegible] నందికేశ్వరా! వేగిరము కదలి యెడమిమ్ము. నేను శివునిం జూడవల యునని (తిరస్కారముతో) అట్లు తొలంగకుంటివేని నీ ద్వారమైనపరమ [illegible]ప్రసాదంబులారగింపని యనెను. అపుడు నందీశ్వరుండు హదలి తద్భ[illegible]ంబున నక్షైమును బెఱికికొని యెగిరి పార్శ్వప్రదేశంబుం జేరి యం డుండెను. నందుం డానందించి శివునింజూచి ఆహా! ధన్యుండ నైతి నని మురిసి మొక్కుచుంతి తడవు పరమేశ్వరనామంబుల నుచ్చరింపుచు ఱెప్ప వేయక చూచుచు ధ్యానమయుండై యుండె. కూడవచ్చినవారలు వాని నీ యద్భుత కృత్యంబును జూచి యవ్వానియందు భక్తిభావం బూనిరి. కొంతవడికి నందుండు శివునకుమ్రొక్కి ధ్యానము చాలించి తనతోడ వచ్చిన నెయ్యురతో నిందు శివుని కోవెల కెదురుగా బహిస్థలం బున నొక పుష్కరిణిని నిర్మింపుద మని చెప్పంగా వారలు పొద్దటివఱ కింపనే చేయవలయును. లేకున్న యజమానులు మనలను దండింతు రని చెప్పిరి. నందుం డీ రాత్రి యందే త్రవ్వి పొద్దున నూరికిం బోవుద మని యనె. వారందఱుల కిష్టపడకున్నను నందునియానతి మీఱంజాలక యం గీకరించిరి. నందుండు స్వగ్రామమునుండి వచ్చునపుడు తెచ్చిన నాలుగు మేకలతోం గొందఱు త్రవ్వుచు మఱికొందఱు మట్టి యెత్తిపోయుచు మునిసిరి గాని తెలవాఱువఱకుం గొనే రెట్లగు నని నవ్వుకొనుచు నందుని యాజ్ఞను నెఱవేర్చుచుండిరి. నందుం డందఱికన్న నెక్కుడుగాం ద్రవ్వుచు శివకీర్తనంబు దక్కినవారలకుంజెప్పుచు నలయక మట్టియెత్తుచుండె. సూర్యోదయకాలమువఱకుం బ్రదేశము చాలవఱకు తెగి అమృత మధురంబులగు సలిలములు చెంది నిండె. నందుండద్దానిం జూచి సంత సించి శివుండే యిట్లొనంగూర్చె ననుకొని సూర్యోదయంబునుండి పయ నము చేసి తోటివారలతో మరల స్వగ్రామంబుం జేరె. దీక్షితపుత్రుండు గాకినందుండు బండ్రెండువత్సరంబులుండి షడ్దర్శనంబులందు సంపూర్ణ [illegible]ంబునొంది గురుని సెలవొంది పంచక్రోశప్రదక్షిణంబొనరించి ప్రయాణంబొనరించి మూడు నెలలకు స్వగ్రామ సామీప్యంబుంజేరి ప్రభా తంబందు స్నాతుండై భస్మత్రిపుండ్రంబులొంది ప్రథమయామమందే ఆచమనము చేసి స్వగృహంబున కేగి తల్లిదండ్రులపాదంబులం బడి ఆనందా

శ్రుసేకం బొనరించె. వారలు గుర్తింపక ఎవరో వచ్చి తమకు నమస్కరించిరని చూచి నిర్ఘాంతపోయిరి. అపుడు సుబ్రిహ్మణ్యుడు అమ్మా! నాన్నా! నేను మీకొమరుఁడను సుబ్రహ్మణ్యుఁడను. మీసెలవొందక దీర్ఘకాలము దేశాంతరమందు గడపి మిమ్ముడికించిన ఖలుండను. క్షమించి వాత్సల్యము నొందుఁడని మరల నమస్కరించెను. వారలెగాదిగఁజూచి తమ పుత్రుఁడగుట నెఱింగి దృఢాలింగనంబొనర్చికొని శిరంబును ముఖంబును వెన్నును వక్షంబును స్పృశించి కరుణానందబాష్పంబుల రాల్చి తండ్రీ! ఎచ్చటికేగితివి? ఇన్నాళ్ళకు మరల నెట్లువచ్చితి వని యడిగిరి. అపుడు పుత్రుఁడు తా నిలువెడలి పయనంబొనర్చి కాశిఁ జేరుటయు నందు జగదీశపండోజీవారి సన్నిధానంబొంది వారి యనుగ్రిహంబునఁ బదిరేండేడులుండి షడ్దర్శనంబులఁ జదివి యారితీరి యవ్వారి సెలవుఁబడసి యిట్లువచ్చి పుణ్యంబునఁ దమ పాదారవిందంబులకు మ్రొక్కితి నని నొడివెను. దీక్షితదంపతు లొడలు దెలియనట్టి యానందపారవశ్యము నొంది శ్రీకాశీనాథుండు తమకీనాఁడే పుత్రుని నొసఁగినట్లు తలఁచిరి. ఊరివారందఱు నౌకరులును బాలేరులు వచ్చి యానందంబునఁ బొంగి దీక్షిత దంపతులను మెచ్చి కొనియాడిరి. అంత దీక్షితపుత్రుఁ డొకనాఁడు గ్రామీణపండితులను బందుగులను బిలిచి సభను గూరిచి యందు నిజ పాండితీకౌశల్యంబుఁ దండ్రికెఱిగించె. జనకుఁడెఱింగి సర్వము శివప్రిసాదం బని తలఁచె. సభ్యు లందఱు జయధ్వానంబు లొనర్చిరి. దీక్షితపుత్రుం డొకనాఁటిరాత్రి యాపనిమదర్థంబును యోజింపుచు విద్యల నొందితిని గాని వీనిఫలంబు నొందుట యెట్లని విచారించుచుఁ బరుండె. తెలవాఱు గట్ల శ్రీవిశ్వేశ్వరదేవుండు స్వప్నమందు సాక్షాత్కరించి నీవిందులకై చింతసేయకు నీ నౌకరులం దొకనిచేఁ బ్రబోధంబు నొందెదవని యుపదేశించిపోయె. దీక్షితపుత్రుండు మేల్కొని ఆ యుషస్సునుండి నవుకరులను బరీక్షించుచుండె. ఆ మఱునాఁడు పాలేరగుగోవిందుఁడు చిన్నదొరకు మ్రొక్కి సంతసంబుఁజూపిన నాతం డవ్వారికుశలవిషయంబు నడిగె. గోవిందుఁ డంతయుఁ దమదయతో బాగేయని తన మనుమని గుఱించి యించుక విచారముతో అయ్యగారూ! నందుఁడుగాఁ డేమియుఁ బట్టించికొనక యూరక పిచ్చివానివలె ఆకసమును దిక్కులను జూచు

చుండును. తెల్లవాఱకముందే యేటిలో మునిగివచ్చి బూదిబూసికొని శివుని గుడిముందటి వెలపలికిఁ జేరి యూరక తనకుఁ దాను తిరుగు చుండును. ఎవరైనను బోయి పిలిచిన వచ్చుఁగాని పిలువకున్న నట్లే యుండును. రొట్టెయో అంబలియో యిచ్చినఁ దినుగాని ఈయకున్న నట్లే పస్తుండును. ఎవ్వరితోడఁగూడ మాట్లాడడు. పదుగురు తనయొద్దకు వారగుపడినపుడు వారలకు భజన జెప్పుచు జేయించుచుండును. పొలము నకుఁబంపిన నందుఁ బనిచేయఁడు. ఇంట నుండిన లోనికిఁ గుక్కలు కోళ్ళు వరాహంబులు దొంగలు పోవుచుండినఁ జూచుచుండుఁగాని వాని మర ల్పఁడు. ఒకప్పుడు నవ్వుచుండును. మఱొకప్పుడు కారణము లేకయే యేడ్చుచుండును. ఇట్లు వానికి దయ్యమో భూతమో సోకి యిట్లు బాధించుచున్నది. అట్లుగాక పిచ్చిరోగమో తెలియదు. దొరా! ఇది యొక్కటి దక్క మఱొక్క చిక్కులేదు. నాయనగారి దయతో యిట్లు బ్రతుకుచున్నామనియె. అంత దీక్షితపుత్రుండు గాశీశ్వరుండు కలలోఁ జెప్పినమహాత్ముఁ డితఁడేయని తద్క్షణంబున వానియింటికిఁ బోయి వాకిటియందు శివానందంబున మైమఱచి యున్నవాని గని ఆహా! గోవిందుఁడు చెప్పినంత నేను యోజించిన భంగికన్న నెక్కుడు పదవిలో నున్నాఁడని సంతసించి దవ్వులనుండి వానికి మ్రొక్కెను. నందుఁడుగూడ శివప్రేరితుండై దీక్షితపుత్రునిఁ జూచి మ్రొక్కి నిలు చుండె. అంత వారిర్వురు పరస్పర మనురాగం బొంది యిద్దఱు కలిసి కొని శివాగారంబెదుట నిలిచి భజనంబును ధ్యానంబును సేయుచుండిరి. దీక్షితుం డిదివిని సనాతనాచారపరికారంబు హరజనులతో సాంగత్యంబు నిషిద్ధం బని కఠినంబుగ మందలించుచుండె.

ఇట్లుండ శ్రీచిదంబరక్షేత్రములో నార్ద్రాదర్శనమహోత్సవసమ యంబు దరియఁగా జనంబులు పెక్కురచటి కేగుచుండిరి. నందుఁడది యెఱింగి యందలి కేగఁదలఁచి యజమానుఁడగు పెద్దదీక్షితుని సన్నిధి కేగి చిదంబరమునకుఁ బోయివచ్చెద సెలవిమ్మని యడిగెను. దీక్షితుఁడు మందహాసముచేసి ఈ యున్మత్తునకు శ్రీచిదంబరయాత్ర కావలయుఁ గాబోలు. నిదియొకటి తక్కువయేమో యని యుపహసించి పోవల దనియె. నందుఁడు క్రుంగి బిక్కమొగము చేసుకొని దీనస్వరముతో

సెలవిం డయ్యగారూ! అటకుఁ బోయి ఆసామిసేవలోఁ జేరకున్న యీ తను వుండి యేమిటికి దొరా! యనియె. అవుడు దీక్షితుఁడు నవ్వి మఱొక నెల దినములకు గోయుట కనువగు సస్యమును బరికించి పోరా! నీవు సేద్యముచేయు నీ పొల మందలి పైరు జేపటికిఁ బూర్తిగఁ బండి కోయుట కనువైనయెడలఁ గోసి ధాన్యము గొట్టి మాయింటికనుపుము. అట్లైన సెలవిచ్చెద ననియె. నందుఁడదివిని సామి దయ యని మనస్సున సామిని పరమేశ్వరునిఁ గొలుచుచుండెను. ఆ దినమంతయుఁ గడచి నంత నందుఁడు వేకువనే మేల్కాని తీర్థమాడి బూదిపూసికొని శివాలయం బెదుట భజనచేసి యామీాద పొలమున కేగె. అందుఁజేరి చూచిన నచటిసస్యం బంతయుఁ బూర్తిగఁ బండి పుడమివ్రాలి యుండుటఁజూచి యక్కజంపడి తనతోడి వారలఁ బదుగురను బిలుచుకొని పోయి పైరు గోయించి యా వెంటనే ధాన్యము గొట్టించి బండ్లకెత్తించి దీక్షిత గృహంబునకుఁ బంపెను. ధాన్యం బెప్పటికన్న రెట్టింపుగనుండె. దీక్షితుం డదిచూచి యాశ్చర్యమొంది నందుఁడు దైవానుగ్రహపురుషుఁ డని విశ్వసించి తత్‌క్షణంబున వానిఁ బిలిపించి చిదంబరయాత్రకు సెలవొసంగె. ఆతఁ డుప్పొంగి దీక్షితునకు జోతలుచేసి యారాత్రియందే చిదంబర ప్రయాణం బొనరించెను. దీక్షితపుత్రుఁడు వాని ననుగమింపఁ దలచెను. గాని తండ్రిమానసము నొచ్చు నని మానియుండె. నందుఁడు పాటా పాటి శివసంకీర్తనములఁ జేసుకొనుచు మూడవనాటికే చిదంబరముఁ జేరి దేవునిఁజూచుట కందలి యర్చకాధికారుల నడిగెను. వారొప్పరైరి. నందుఁడు బహిస్థలమందే యుండి శివుని నుతించుచుండె. ఆనాఁటిరాత్రి చరమయామం బందు శ్రీచిదంబరేశ్వరుఁ డా యూరియందలి నిజార్చక సహస్రంబునకు స్వప్నంబం దగుపడి నాకై దవ్వులనుండి నాదుభక్తుం డిటకు వచ్చి నాదరిసెనమును గోరిన మీారందు కొప్పరైతిరి. వాఁడు నా ప్రియభక్తుఁ డుదయంబుననే వానిఁబిలిచి నాదర్శనం బొసంగుఁడు. కాదేని మిమ్మందఱను శిక్షింతునని యంతర్థానొందె. తెలవారినంత నందఱు శివోక్తంబును బరిగణించి యట్లు సల్పకున్న శివుఁ డాగ్రహించి యేమి సేయునో యని వెఱచి దేవాలయబహిఃప్రదేశమందు శివధ్యానమున మైమఱచి తన్మయుఁడై యున్న నందుని కెట్టకేల కుద్బోధించి శివునిఁ

జూపెదమని కొన్నికలశంబుల తీర్థంబుదెచ్చి స్నానంబు గావించి శుద్ధ పటంబు లిచ్చి భస్మత్రిపుండ్రముల నొడలంతయు దాల్పఁజేసి శివకీర్తన ముతో ప్రథమయామంబుననే కోవెలలోకి గొనిపోయి సువర్ణసభను చిత్సభను జూపి శ్రీచిదంబర నటనేశ్వరదివ్యమంగళవిగ్రహంబును శివ కామేశ్వరీదేవిని జూపిరి. నందుఁడమందానందముతో ఈశ్వరేశ్వర మూర్తులను జూచి పులకితుండై ఆనందపారవశ్యంబున ఱెప్పవేయక తదేక దృష్టితో అర్థనిమీలితనేత్రుండై భగవత్పాదారవిందజ్యోతిర్మండలం బును నమోనమో యనుచుఁ జూచుచుండె. తత్క్షణంబం దా జ్యోతి ర్మండలంబు నందుని దేహంబుఁజొచ్చి ధగద్ధగాయమానంబుగ జ్వాల తేజ రిల్లె. అర్చకులు తదితరులు భయకంపితులై యాశ్చర్యముతోఁ జూచు చుండిరి. కొన్ని నిమేషముల కాయగ్ని శాంతించి శమించె. నందుఁ డగుపట్టఁడయ్యె. పరమశివుని తేజంబందు లీనమైన మహాపురుషుఁడు మరలఁ గన్పట్టుటెట్లు? అర్చనజను లందఱు విస్మయంబొంది పరమ శివునిజెందిన నందునకును భక్తవత్సలుఁడై భక్తుని ముక్తునిజేసి తన యందుఁ జేర్చికొనినట్టి శంకరునకును జయజయధ్వానంబు లొనర్చిరి. ఇట్టి దిగదా పరమపురుషులపవిత్రచారిత్రము. ఇదిగదా మహనీయుల కథాసంవిధానము. ఇదిగదా పాఠకశ్రోతృజనమానసదుశ్చింతాదురంత పారావారనౌకారాజము. దీక్షితపుత్రిఁ డీ యుదంతంబుఁ దెలిసికొని తనకుఁ గల్గిన నందవియోగంబునకు సుంత చింతనొంది యనంతర మాతఁ డొందిన శివైక్యమునకు సంతసించి పితౄజ్ఞాప్రకారము తాను వంశ వృద్ధికై కులకన్యను బెండ్లాడి సంతతిఁ బడసి భక్తిజ్ఞానవైరాగ్యంబు లొంది శివభక్తిని బలువురకు బోధించుచుండెను. ఇది మహాభక్త చూడామణియైన నందనయనారు చరిత్రం బిఁక భక్తాగ్రణియైన కన్న ప్పచరిత్రంబు వినిచెద నాలకింపుఁడు.

## 23. ఉడుమూరికన్నప్ప - వనచరుఁడు

శ్లో॥ మాగచ్ఛ త్వ మితస్తతో గిరిశ! భో! మయ్యేవ వాసంకురు
స్వామిన్నాది కిరాత మామక మనః కాంతార సీమాంతరే

వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్య మోహాదయః
తాన్హత్వా మృగయావినోదరుచితాలాభంచ సంప్రాప్యసి ॥
శివానందలహరి

తా॥ ఓ కైలాసవాసా! ఓ ఆదికిరాతుఁడా! నీ విటునటు నెందును బోవకు. నాయందే వాసము చేయుము. సామీ! నా మనంబనెడు నడవియందు మదించిన మోహము మాత్సర్యము మున్నగు మృగములు పెక్కులు గలవు. వానిని జంపి వేట యందలి యానందంబును జెందఁగలవు.

దక్షిణదేశంబందు సువర్ణముఖరీతీరంబందు దక్షిణకైలాసం బని దేవమునిజనముచేఁ గీర్తింపఁబడిన శ్రీకాళహస్తీశ్వరక్షేత్రం బొకండు గలదు. హరమునకు మేరువట్లు శివస్థానములలో నది ప్రధానంబై ప్రసిద్ధంబై శోభించుచుండును. ఇందు గంధవహతత్వప్రధానంబై స్పర్శగుణకంబైన కాలలింగ మనాదిసిద్ధంబై త్రిభువనపూజితంబై భక్తజనమనఃపద్మభాస్కరంబై చెలువొందుచుండును. ఇందు పూర్వకాలమందొక శ్రీ (సాలెపురుగు) యొక నాగుఁబాము ఒక (ఏనుఁగు) వచ్చి ప్రత్యహము శ్రీకాలలింగంబును సేవించి పోవుచుండును. శ్రీవచ్చి శివలింగముపై స్వముఖంబునుండి దారము వెడలించి చక్రంబులను రథంబులను బుష్పంబులను గట్టి సేవించి పోవుచుండును. ఏనుగు సువర్ణముఖరి నుండి తన తొండమం దుదకంబుల నింపికొని తెచ్చి శివలింగమున కభిషేకముచేసి సేవించి పోవుచుండును. నాగుఁబాము వచ్చి తన పడిగయందలి రత్నంబును శివలింగముపై నిడి శివలింగమును జుట్టికొని పడిగతోఁ గొడుగుబట్టి శివుని సేవించి పోవుచుండును. మధ్యాహ్నసమయంబున నూరిలోని యొక యర్చక విప్రుండు స్నానమాడి మడిగట్టికొని యొకచేత సువర్ణముఖరీతీర్థంబును జందనాక్షతపుష్పంబులను వేఱొకచే ఘృతసూపయుతాన్న భాండంబును గొనివచ్చి వేదోక్తమంత్రంబులతో శివలింగంబు నభిషేకించి విభూతి గంధాక్షతి పుష్పంబు లర్పించి తండులాన్నమును నివేదించి పోవుచుండును. ఇట్లే యూర్ణనాభ్యహిగజంబులు నర్చకబ్రాహ్మణుండును గాలలింగంబును బ్రత్యహ మెడపక యర్చించుచుండ నొక్కొకప్పుడు విప్రుండు దేవుని జేరుతిటి సర్పం

జేని యేన్గనియుండిన నించుక తడ వెందేని నొదిగి అయ్యావి విడిచిచనిన మీఁద నెట్లో యులుకుచు బోయి పూజించి వచ్చుచుండును. ఇట్లుండ నొకనాఁడు ముందుగ శ్రీ (సాలెపురుగు) వచ్చి లింగమూర్తిపైఁ బద్మం బుల బుష్పహారంబులఁ జక్రంబుల నిర్మించి శివుని సేవింపుచునుండె నంతలోఁ గాలసర్పము వచ్చి బుస్సుబుస్సుమనుచు శ్రీరచితనిర్మితిని బాయఁదోఁచి యాక్రిమినిగూడఁ దోకతో నడచి తనదు శిరంబున నున్న వైడూర్యంబులను బద్మరాగంబులు మున్నగువాని శివలింగంబు నలంక రించి తానును లింగంబును జుట్టుకొని పడిగె గొడుగుఁబట్టి యానం దంబున సేవించుచుండె. అంతలో వనగజము సువర్ణముఖరిశీ గ్రుంకి తొండంబందు సువర్ణముఖరీనీరంబుల నిండించికొని తామరపూల మారేడు దళంబులను దెంపికొనివచ్చి కాల లింగంబునుజేరి యందున్న నాగుఁబామును రత్నార్చనంబును జూచి యలిగి ఘీంకరించి నాగసర్పంబును గాలితో లాగి రత్నంబుల నవలికిఁ జిమ్మి తుండమందలి యుదకంబును లింగంబుపై నించి పద్మంబులను బిల్వదళంబులను శివలింగంబుపైని నునిచె. త్రోయబడిన సర్పంబు రయంబునఁ దొండంబును బ్రాకి తదున్నత కుంభస్థలంబుఁజేరి యందుఁ గసితోఁ గఱచి విషంబు నింపె. దాన వనకరి యుక్కుసెడియు బామును బోనీక తొండముచే నొడిసిపట్టి పదంబున మెట్టి వధించెను. ఆ మీఁద విసంబెక్కి యేనుంగు గూడ బ్రాణంబుఁ బాసె. ఇట్లేకకాలంబందు శివ పూజాస్పర్ధతో శ్రీకాలహస్తులు మృతిఁజెందుడు బాలేందుకిరీటుండు వానికిఁ గల కైంకర్యాభినివేశమునకు భక్తికి మెచ్చి ఆత్రయమును మరల జీవింపఁజేసి వరంబిచ్చెద కోరుఁడనియె. అపుడయ్యావి పరస్పర ద్వేషంబుఁ బాసి మమ్ము నీయందుఁ జేర్చికొని మా మూగురి నామరూపంబులు గలసామివై ఇందు భక్తులను సాకుచుండుమని కోరెను. శివుఁ డట్లే యమ్మూటిని లింగంబాదుఁ జేర్చికొని శ్రీకాళహస్తీశ్వరుఁడని నామ ధేయంబు ధరించి భక్తరక్షకుఁడై యుండె నంత నా క్షేత్రంబు సమీ పంబం దుడుమూ రనునొక చెంచుగూడెంబం దొక యెఱుకదొరకొమ రుఁడు తిన్నఁ డని పేరిటవాఁ డుండె. అతఁడు మిక్కిలిబలవంతుఁడు. సింగంబులను బులులను నెలుగుబంట్లను అడవిపందులను నడవియేనుఁగు

లను ఖడ్గమృగంబుల నెదిరించి వధించి తెచ్చి తోడిమెఱుకలకెల్ల పంచి యిచ్చి విందుసేయుచుండు. ఇట్లుండ నొకనాఁ డాతఁడు వేఁటకుఁ బోయి యందుఁ బెక్కు క్రూరమృగంబులఁ జంపి మధ్యాహ్నమం దొక యడవి పందిని దఱుముకొని దవ్వులకు పోయి యందది యదృశ్యంబై కనుపట్ట కున్న నాతండు డస్సి యొకపద్మసరంబు చెంత నొకయశోకద్రుమచ్ఛాయను జెంది పరుండె. అపు డవ్వానిస్వప్నమం దొకశివచిహ్నంబులు గట్టి యోగీశ్వరుఁడు దరిసెనంబిచ్చి బాలకా! ఈ యేటిదరిఁ గొండ యందు జగంబుల నెల్లనేలునట్టి సామి నివసించి యున్నాఁ డందుఁజేరి కొలువుము. నీకు మేలగు నని చెప్పి యంతర్ధాన మొందె. పడుచు మెఱుకు నిదురఁబాసి రయంబున నంతటఁ గలయఁ జూచి యెందు నామహాత్ముని బొడగానక ఆతం డుపదేశించినగుఱుతు తీరు సువర్ణముఖరీ తీరంబుఁజేరి యందలి శైలంబును చూచుచుండ నం దుపదిష్టప్రకారంబుగ ఈశ్వరేశ్వరలింగం బగుపడియె. చూచినంతనె కనుగవ సంతోషాశ్రువు లుద్గమించుచుండె. హృదయం బానందపారవశ్యం బొందె. ధన్యోస్మి యనెడునట్లుగ భావంబు పొడమె. అపుడు వనచరుండు శివదర్శన సంజాతజ్ఞానంబున శివలింగంబునకు సాగిలఁబడి మ్రొక్కి యిట్లనియె.

శా॥ ఓసామీ! యిటువంటికొండదరిలో ♦ నొంటిన్ బులుల్ సింగముల్
గాసింబెట్టెడు కుట్రనట్టడవిలో ♦ గల్జువ్విక్రీనీడ నే
యాసం గట్టితి వేటిగడ్డ నిలు నీ ♦ వాకొన్నచోఁ గూడునీ
ళ్ళేసుట్టంబులు దెచ్చిపెట్టెదరు నీ ♦ కిందేటికో లింగమా!

ఉ॥ కొండలఁ గానలం దిరిగి ♦ క్రొవ్వినపందుల లేళ్ళ దుప్పులన్
జెండినపెక్కుచందములఁ ♦ జిన్నక పెద్దకగారు కమ్మగా
వండుదు రట్ల పిట్టలను ♦ వండుదు రిచ్చట నుండనేల నా
కొండొక టానతీక యుడు♦మూరికి రాగదవయ్య! లింగమా!

క॥ ఓలింగమ! వినునివ్వరి, ప్రాలును వడిసిల్లు గునుకు ♦ బాలును వెదురుం
బ్రాలునుసవరపు మెకముల,పాలునుగలవచట నీకుఁ♦ బాయసమునకున్॥

గీ॥ పుట్టతేనియ పెరతేనె♦పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గలవందుఁ♦దోచితోచి
కాలి దులదులనై పిండి♦వోలెరాలు, నట్టినింజెల్లు గలవునీ♦కారగింప॥

మ॥ వను మన్నించెదవేని నీ విపుడు రా ♦ నా వెంట రాకుండినన్
నిను నేఁ బాసి చనంగ నోప నిచటన్ ♦ నీతోడిదే లోకమై
మనువాఁడన్ గనువాఁడ నీ కరుణ నీ ♦ మానంబు చిత్తంబు న
చ్చినచో మానెదుగాక నిన్నిపుడు గ♦స్తిన్ బెట్ట నాకేటికిన్ ॥
దూర్జటికాళహస్తిమాహాత్మ్యము

ఇట్లు పెక్కుచందముల నాలింగమును బతిమాలియు బలుక కున్నఁ జూచి మౌనం బనంగీకారసూచనం బని యెఱింగి తా నింక నూరికి బోవుటను మాని తత్సన్నిధినే యుండ నెంచి తనకై వెతకుచున్న తనగూడెపు బోయల నెల్ల నూరికిఁ బంపి యందు దేవుఁ డెన్నేండ్ల నుండియో వస్తున్నాఁ డాకలిదీర్చెద నని యడవికి బోయి వెదకి బలిసి యున్న వనవరాహమ్ము నమ్ములఁ గూలనేసి యగ్గింగాల్చి వేల్చి తన్మాంసఖండంబుల కమ్మనను జవిచూచి మెచ్చి దొప్పల నింపికొని సువర్ణముఖరీసలిలంబు నోట నుంచికొని వచ్చి లింగంబుపై నిర్మాల్యంబుఁ బాదుకలచే నూడ్చి నోటియందలి యుదకం బభిషేకించి మాంసంబు దొప్పల ముందిడి మ్రొక్కి యారగింపు మనియె. పరమేశ్వరుండు పలుకక యారకుండుటఁజూచి యాటవికుఁ డిట్లనియె.

క॥ కాలవొ క్రొవ్వవొ మాడం, గాలెనొ చవిగాదొ కమ్మ♦గావో నీకున్
జాలవొ యలవడవో తిన. వేలా కరకుట్ల పార్వ♦తీశ్వర ! చెపుమా !
క॥ ఆకలిగాదో భక్తిన్. దేఁకువగలవాఁడఁ గానొ♦తినవేల కృపన్
సాఁకగదే నన్నిపుడ, ట్ట్రాకలి బెట్టక వలాశ♦నాసక్తుఁడవై ॥
క॥ నెప మొకటి గలదె నాపై, యుపవాసముతోడ బడలి♦యుండఁగనీకే
యపరాధము సేయను గద, కృపతోఁ గరకుట్టులార ♦ గింపం గదవే!
క॥ నీ వారగింపకుండిన, జీవనమేమిటికి నాకు ♦ శివ! నీపదరా
జీవములమీఁదఁ బ్రాణము, నేవిడుతు నటంచు వ్రాలి♦యేడ్వన్ దొడఁగెన్॥
కాళహస్తి మాహాత్మ్యము.

ఇట్లా వనచరుం డీశ్వరునియుపవాసంబుఁ జూడలేక సద్యఃప్రాణ విమోచనంబునకుఁ గడంగియున్న సమయంబం దనుగ్రహించి శివుం డేడ్వకు గరకుట్లుతినియెద నని యొప్పించిన నవ్వాఁడు సంతుష్టుండై లేచి మాంసంబులనందించిన శివుం డానందించి యారగించె నమ్మాఱు

నాఁటినుండి యిట్లే ప్రతిదినంబును నడవిపందులు నేదుబందులు దుప్పులు
మున్నగువాని వేటాడి కాల్చి కమ్మని మాంసంబులఁ దెచ్చి పరమేశ్వ
రుని కిచ్చుచుండె. శివుండును నచ్చుమాని మచ్చికతో మెచ్చి భుజించు
చుండె నిఁక శివార్చకుండు విప్రుండు శివలింగసాన్నిధ్యమునకు స్నాతుం
డై మడిగట్టి తీర్థకలశంబును జందనాక్షత పుష్ప బిల్వదళంబులను ఘృత
సూప దధియుక్తోదనపాత్రంబును జేకొని వచ్చి యందలి ఎముకలను
పిశితంబు ఎంగిలి దొప్పలను లింగంపుపై నెంగిలి చారలను జూచి యేవ
మొంది ఖిన్నుండై యట్లు లింగంబునొద్ద రోత గావించినట్టివాఁడెవండో
శిక్షింపవలె ననుకొని దేవుని బరికించి మహాదేవా! నీ వెట్లోర్చి మిన్న
కుంటివి? నిర్మలుండ వగు నీ కీ కసుమాలం బీ రోతచేత లిష్టం
బెట్టయ్యె? శిక్షింపలేక యుంటివా? యెందుల కుపేక్షించితి?వని దూఱి
యుదకంబుఁదెచ్చి లింగసాన్నిధ్యం బంత గడిగి పూజించి నివేదించి
మ్రొక్కి దేవా! యొకవాసరంబునుండి యిట్లు నీదు సన్నిధానంబం ద
పారిశుద్ధ్యంబుఁ గూర్చుచున్నట్టివాఁ డెవండో చెప్పుము. ప్రాణంబుల
కాసవడక యవ్వాని శిక్షించెద నట్లుజెప్పవేని ప్రాణంబుల విడుతునని
మొరకించిన శివుండు మందహాసంబొనర్చి చెంచుయువకుం డొకండు
భక్తిచేసి వేదేతరపథంబున గొలుచుచున్నవాఁడు. వానిభక్తి కలరి నే
నొప్పితి. నీ కిప్పుడె వాని భక్త్యున్నతిఁ జూపుదుఁ జెట్టుచాటున నుండు
మనిన నర్చకుఁ డం దట్లొదిగి యుండె. ఇంతలో వనచరుండు తొల్లింటి
యట్లు వచ్చి లింగంబుపైని నిర్మాల్యంబు బోఁజిమ్మి గండూషోదకంబు
నభిషేకించి మాంసంబుల ముందఱ నిడి భుజింపు మనియె. అట్లు శివుండు
సాపడక యున్నఁదిన్నండు శివునిబరికించినంతనే శివనేత్రంబందుఁగొండొక
జలంబు గారుచుండె నదిచూచి యతం డిందులకే శివుండు నేఁడు
భక్షింపకుండె నని యూహించి రయమ్మున దనవస్త్రాంచలంబునఁ
గన్నీరు దుడిచి యావిరి పట్టినంత యది యుడుగకె హెచ్చెనఁ గని
యడవి కొండమీఁదికిఁ బోయి యందుఁ దా నెఱింగియున్న మూలికలఁ
గొనివచ్చి పసరు పిండి శివనేత్రమందుఁ బోసె నామీఁద మఱియు జల
ధార యురవై కుంభోదకంబట్లు వెడలుచుండుటను జూచి యిది యేదో
గొప్ప నేత్రవ్యాధి శివునకు దాపరించెనని దుఃఖించి యంతలో నొక

యుపాయంబు పొడకట్టుబెంచి యిట్లనియె. ఆ తెలిసితి కంటికిఁ గన్నె యౌషధమగును. నాకుఁ గలకనుదోయియం దొకకన్నుదీసి శివునకిచ్చెదను. అపుడు సుఖం బగునని వేగిరంబుగ నొకభల్లంబున దనకనుగ్రుడ్డు బెకలించి తీసి శివునికంట నమర్చె. కారుచున్న కన్నీరంత గట్టువడియె నదిచూచి యాటవికుం డానందించుచున్నంత నే రెండవకంటిలోనుండి మరల నట్లే జలంబు స్రవించుచుండె. అద్దానిఁజూచి యతండు వెఱవక మందు దొరికినదిగదా యింకఁగుందుటేటికని దిటమొంది శివునిరెండవకన్నుకడఁ దనచెప్పుటుంగరంబును గుఱుతునుంచి మొదటియట్లు బాణాగ్రముచేఁ దనరెండవకన్నుగూడఁ బెకలించి తీసి యసృక్ధారలు స్వనేత్రస్థలులనుండి యొక్కుమ్మడి ప్రవహించుచుండ సరకుసేయక తడువుకొనుచు వెదకి గుఱుతొంది శివుని రెండవకంటియందుంచి ఉదకంబుగాఱుట యుడిగెనో లేదో యని పాణుల నంటి చూచి ఉదకంబుగాఱుటుడుగుటకు మిన్నందియానందించుచున్నంత దివ్యదుందుభివాద్యధ్వానంబులతో నుమతో స్కందగణేశులతో నందికేశునితోఁ బద్మాక్షపద్మగర్భులతోఁ బ్రమథదివ్యవర్గంబులతోఁ బరమశివుండు ప్రత్యంబై వచ్చి కఱుకు టెఱుకు కొమరునకు మరల నేత్రంబులొసంగె. ప్రాఁకు మాటున నున్న యర్చకద్విజుండక్కజంబొంది వచ్చి శివచరణంబులందు వ్రాలె. వనచరుండు విభ్రాంతుండై తన కన్నులు మరల వచ్చుటయును గరుణానిధి యగు శివుడు సాక్షాత్కరించుటయును గాంచి శివుని పదంబులందుఁ బడియె. అపుడు శంకరుండు బ్రాహ్మణునితో ఏవపడితివి చూచితివి కదా యాటవికుని భక్తి వైభవ మని వనచరుని జూచి కుమారా! నీ భక్తిసంపదకు హర్షించితిని. దేహికి సర్వేంద్రియంబులందు నయనంబులు ప్రధానంబులు. అట్టి నయనంబులను నెత్తురు లొలుకిపాఱఁ బెఱికి నా కర్పించితివి. ఇంతకన్న నెక్కుడేద్ది? భక్తచూడామణివైతివి. మీరిర్వురుగూడ మీయిష్టవరంబులను గోరుఁడిచ్చెద ననియె. అపు డర్చకుఁడు తిన్ననిజేరి కౌగిలించి భక్తాగ్రేసరా! నీ భక్తి నెఱుంగక నీ కెగ్గుసేయ నెంచిన నీ వెఱ్ఱిబాపని క్షమింపుమని వేడుకొని యిర్వురును జేతులుమోడ్చి శివునితో సతతము తమదృష్టియు మా దృష్టియు నేకంబగునట్లు సల్పుఁ డనిరి. శివుఁ

డఁట్లే వారల ననుగ్రహించి బంధంబులఁబాపి స్వకీయ స్వరూపం బొసంగి దివ్యగణబృందంబులతో నంతర్ధానం బొందె. ఇది భక్తశిరోమణియగు కన్నప్పచరిత్రంబు.

శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్యకూర్చాయతే
గండూషాంబునిషేవణం పురరిపో ర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కింనకరోతి కాననచరో భక్తావతంసాయతే॥

శివానందలహరి.

తా॥ తోవయందుఁ బలుమాఱులు నడచిన ప్రాఁతచెప్పు శివుని దేహమందు కూర్చబడినది. పుక్కిటినీరు చల్లుట శివలింగమునకు గంగోదకాభిషేకమైనది. కొంచెముతిని చవిచూచిన మాంసపు తునుకలు క్రొత్తనైవేద్యమైనది. భక్తి యేమిచేయదు? వనచరుఁడగు నెఱుకు భక్తశిరోమణి యాయెను.

ఇది ప్రథమభాగము.

---

# శివభక్తవిజయకధావళి
# ద్వితీయభాగము

## 24. జగద్గురులు - శ్రీభట్టభాస్కరాచార్యులు - వేదభాష్యకర్తలు

శ్లో॥ ఏకఃకర్తా త్వంహి సర్వస్యశంభో
నానారూపేష్వేకరూపోస్యరూపః
యద్వత్ప్రత్య ప్స్వర్క ఏకో
ప్యనేకో తస్మాన్నాన్యం త్వాం వినేశం ప్రపద్యే॥

స్కాందకాశీఖండము.

తా॥ ఓ శంభూ! నీవొకఁడవే సర్వమునకుఁ గర్తవు. సూర్యుఁడొకఁడై నను ప్రత్యుదకమం దెట్లనేకులుగఁ గన్పడుచున్నాఁడో నీవరూపుఁడవైన నట్లు నానారూపంబులం దేకరూపుఁడవై యగుపట్టుచున్నావు. అట్టి ఈశ్వరుని నిన్ను దక్క నితరుని నే సేవింపను.

శ్రీశ్రీశ్రీ భట్టభాస్కర శివాచార్యులా సేతుహిమాచలయాత్ర నొనర్చి సకల విద్యాస్థానంబులందు సర్వ రాజస్థానములందు మహాపండిత మూర్ధన్యుల సమక్షంబందు

శ్లో॥ మహాదేవో దేవ స్సకల జగదారాధ్యచరణ స్త్రయీమార్గో మార్గః......

యనెడు సూక్తిని బఠించి ఋజువుచేయుచు శివపారమ్యవాదంబును శివభక్తిని భరతదేశంబునఁ బ్రతిష్ఠించిన మహామహులు. ఈవిద్వదింద్రులే వేదముల కానుపూర్విగ సమగ్రంబుగ భాష్యంబును * రచించి వేదవ్యాఖ్యాతయని ప్రతిష్ఠనొందె. తర్వాత కొంత కాలంబునకు మాధవ విద్యారణ్య మనీషులు జన్మించి వారలుగూడ వేదభాష్యమును షడ్దర్శన గ్రంథరాజములను పరాశర మాధవీయము కాలమాధవీయము మున్నగు ధర్మశాస్త్రగ్రంథముల ననేకంబులను రచించిరి. శ్రీభట్టభాస్కరాచార్యులవారు వేదభాష్యానంతరము వైయాశికసూత్రములకుఁ గూడ భేదాభేదసిద్ధాంతంబుగ భాష్యంబును రచించిరి. శ్రీభట్టభాస్కరాచార్యులవారి యొక్కయు శ్రీకంఠశివాచార్యులవారి యొక్కయు

---

* శ్రీభట్టభాస్కరీయ రుద్రాధ్యాయభాష్యే.

శ్లో॥ చరితాని విచిత్రాణి గుహ్యాని గహనానిచ
బ్రహ్మాదీనాంచ సర్వేషాం దుర్విజ్ఞేయోసిశంకర!

శ్రీయాస్కముని కృతనిర్వచనము పిమ్మట వేదమునకు సమగ్రముగ భాష్యమును రచించిన కోవిదేంద్రులు వీరలే. శ్రీభట్టభాస్కర గురులు ఆచార్యులందరిలోఁ బ్రాచీనులు. అందుచే క్రీస్తుశకమునకు గొంతపూర్వమందే వారు వేదభాష్యమును రచించి శైవమత ప్రచారము చేసినట్లు తోచుచున్నది. ప్రాచీనులగు శ్రీనీలకంఠశివాచార్యులవా రివ్వారికన్న నొకింత యర్వాచీనులే. కొన్నిచోట్ల వీరి సిద్ధాంతమతమును శ్రీనీలకంఠులు స్వీకరించిరి.

సిద్ధాంతంబులందు కొండొక భేదంబు కన్పట్టును గాని కొన్ని యెడల సమానంబుగఁదోచును. వీరలిర్వురప్రతిమానులు శైవపరమాచార్యులు. సమకాలీనులు గాకున్నను సమీపజన్మకాలపువారేయని విశ్వసింప వలసియున్నది. హరదత్తశివాచార్యుఁడు వీరిర్వురికన్న నర్వాచీనుఁడనితోచు.♦ అవ్వారి చరిత్రంబు జగద్విఖ్యాతంబు. సుప్రసిద్ధులగు నీభట్టభాస్కరులను గుఱించి యెక్కుడుగ వ్రాయనక్కరలేదు. కావున నీచరిత్రంబు నింతతో ముగించి శ్రీనీలకంఠారాధ్య జగద్గురుల చరిత్రంబు గూర్చి ముచ్చటించెద వినుఁడు.

## 25. శ్రీ జగద్గురులు - నీలకంఠ శివారాధ్యులు - భాష్యకారులు

శ్లో॥ ఏకోరుద్రోనద్వితీయోవతస్థే। ఏకంబ్రహ్మైవాద్వితీయం సమస్తం
సత్యంసత్యంనేహనానాస్తికించిత్।తస్మాదేకంత్వాంప్రపద్యేమహేశం॥
స్కాందకాశీఖండము.

తా॥ అద్వితీయుఁడైన రుద్రుఁడొక్కఁడే యున్నాఁడు. అద్వితీయంబును సమస్తమగు బ్రహ్మ మొకఁడే యీతఁడు. ఇందు నంతయు నానావిధములేదు. సత్యము. సత్యము. అట్లొకఁడవైన నిన్ను మహేశ్వరుని సేవించుచున్నాను.

ఆంధ్రదేశమందలి * ప్రసిద్ధ లింగత్రయంబునం దొకటియగు శ్రీకాళేశ్వర లింగంబు సన్నివేశంబుచే మహాపవిత్రంబును అత్యంతరమణీయంబును బ్రసిద్ధంబును నగు కాళేశ్వరపురంబందు శైవబ్రాహ్మణ

---

♦ హరదత్తవిజయచరిత్రంబు పద్యకావ్యము నిర్మించి ప్రకటించితిని గావున వారిచరిత్రంబు నిందు జేర్చలేదు. హరదత్తవిజయగ్రంథమందే చూడదగు.

* శ్రీశైల ద్రాక్షారామకాళేశ్వరలింగంబులు-త్రిలింగంబులు.

వంశంబున * భారద్వాజగోత్రమందు విశ్వేశ్వరారాధ్యుఁడను నొక మహాత్ముండుగలఁడు. ఆ యనఘునకు గౌరీదేవియని పవిత్రచరిత్ర గేహిని కలదు. ఆ యుభయుల నన్యసామాన్యసౌజన్యనిధాను లశ్రాంతశివగురుచరణసేవాపరాయణులు నిరతాన్నదానశీలురు. అట్లు వారలు స్వధర్మదీక్షాపరులై యుండఁ జిరకాలము గడచెను గాని సంతానం బలవడకయుండె. అంత వార లత్యంతము చింతచేసి శ్రీకాళేశ్వరుండే తమ కభీష్టవరప్రదుండని హృదయంబున విశ్వసించి తదేకనిష్ఠాగరిష్ఠులై నియతంబుగఁ దపంబొనరించుచుండిరి. అట్టి సమయంబందే పారాశర్యమౌని స్వరచితవేదాంతసూత్రముల కనేకులు భిన్నార్థంబులఁ బ్రతిపాదింపుచు నన్యమతంబుల నుత్పాదింపుటను జూచి యట్లు స్వాభిమతవిరుద్ధంబగుట నారసి స్వసూత్రంబుల కభిమతార్థప్రతిపాదనసమర్థం బగు మహాభాష్యగ్రంథంబు నిర్మింపుటకై సర్వవిద్యానాథుని గౌరీనాథుని గూర్చి తపించుచుండె. ఇట్లువ్యాసునియొక్కయువిశ్వేశ్వరారాధ్యదంపతులయొక్కయుఁ దపస్సులు పరిపాకదశఁ బొందినంత పరమేశ్వరుండు ముందుగ బాదరాయణునకుఁ బొడసూపి తానే ధరణిఁ జన్మించి నీలకంఠారాధ్యుండను పేరితో నిఖిలదేశపండితుల నెల్ల జయించి యనంతరము సూత్రములకు యథార్థప్రతిపాదకంబుగ భాష్యంబును రచింతు నని వరంబిచ్చెను. అనంతరము కాళేశ్వరపురంబందు శ్రీకాళేశ్వరలింగమునుండి నిర్గతుండై విశ్వేశ్వరారాధ్యునకుఁ దత్సతికిఁ బ్రత్యక్షమై మీతపంబునకు మెచ్చితి. నేన మీగర్భమందు జన్మించి దుర్మతంబుల నిర్మూలించి వైయాసికసూత్రంబులకు భాష్యం బొనర్చెద నని వరంబిచ్చి యంతర్థానమొందె. అనంతర మచిరకాలంబందే విశ్వేశ్వరపత్ని చూలొందె.

---

* శ్రీనీలకంఠవిజయ మహాకావ్యే ప్రథమసర్గే-

శ్లో॥ అష్టాంగ యోగసిద్ధానాం ధ్యానయోగ రతాత్మనాం
భారద్వాజమహా గోత్ర పవిత్రతరజన్మనాం
గౌరీ విశ్వేశ్వరారాధ్య తపఃఫల తనూభృతాం ॥
శ్రీకంఠమహితోపాఖ్యా విఖ్యాత శ్రుతిసంపదాం
నీలకంఠమహాచార్య వర్యాణాం మహితాత్మనాం
గురూణాంచరితం వక్ష్యే మహితాం సుధియాంముదే.

గర్భంబం దఖిలేశ్వరుండు ప్రవేశించుట గౌరీదేవి చందనంబు నాభరణం బుల నుజ్జగించి దేహంబందు విభూతిని ధరింపుచు రుద్రాక్షహారంబుల వక్షమందు వేసికొని సంతసించుచుండును. ఇట్లు గర్భంబు నవమాసం బులు నిండినంతఁ బరిపక్వంబగుడు శ్రీస్వభానుసంవత్సర చైత్రశుద్ధ దశమీ సోమవారమందుఁ బుష్యమీనక్షత్రయుక్త గీష్పత్యధిష్ఠిత కర్కటకలగ్నంబందు గ్రహరాజు బుధునితోడ మేషంబునఁ బరమోచ్చ నుండ శుక్రుండు శనితో స్వగేహంబగు వృషభంబున వసింప ధరా సుతుండు మీనంబందు సంచరింప షడ్బలవిలసితంబగు సుసమయంబున గౌరీగర్భమందుఁ బారమేశ్వరావతారంబు పుత్రుం డుదయించె. దివి నుండి సురలు పుష్పవర్షంబుఁ గురిసిరి. గౌరీవిశ్వేశ్వరారాధ్యు లానందం బునఁబొంగి యాత్మజునకు జాతకర్మం బొనరించి నీలకంఠుఁడ నియు శ్రీకంఠుఁడనియు విద్యాకంఠుఁడనియు నాహ్వాయంబుచేసి మాహే శ్వరాగ్రజన్ములకు సురభుల నుపకరణంబులతో దక్షిణలతో నొసఁగి బ్రాహ్మణులకు దీనానాథజనంబుల కందఱకు మృష్టాన్నదానంబు లొన ర్చిరి. * బాలుండు నెలబాలునివలె దినదినము వృద్ధినొందుచు విభూ తిఁబూసికొనుచు శివలింగములకు మ్రొక్కుచు శివకీర్తనములకుఁ జెవి యొగ్గుచు రుద్రాక్షభూషణంబుల ధరించి మురియుచుఁ దోడిచిరుతలకు శివకీర్తనంబులఁ జెప్పుచు శివధ్యానంబందుఁ దన్మయత్వంబు నొందుచుఁ బెఱుగుచుండె. ఇట్లు బాలునకు గర్భాష్టకంబు సమీపించినంత విశ్వేశ్వ రుం డర్భకున కుపనయనము చేయనెంచినఁ దత్సమయమందు జగత్పూ జ్యుఁడగు బోధాయనమహాముని యభ్యాగతుఁడగుట గౌరీవిశ్వేశ్వరు లానందించి యెదుర్కొని నమస్కరించి తెచ్చి యున్నతపీఠంబునఁ గూర్చుండఁజేసి స్వాగతం బాడి యర్ఘ్యపాద్యాదివిధులతోఁ బూజించి మ్రొక్కి యంజలిచేసిరి. విశ్వేశ్వరారాధ్యుం డిట్లు ప్రార్థించె.

* విద్యారణ్యకృతశంకరవిజయకావ్యమందు శంకరాచార్యులవారు దిగ్వి జయ సమయమందు నీలకంఠశివాచార్యునియొద్దకేగి వారితో వాదించినట్లున్నది. శంకరాచార్యులవారి కాలము క్రీస్తుశకము ఒక టవ శతాబ్దమని పలువురు నిర్ణయించినారు. ఇందుచే నీలకంఠ శివా చార్యులవారి కాలముగూడ నట్లేయని స్పష్టమగుచున్నది.

శ్లో॥ అద్య మే సఫలం జన్మ భవదాగమనా న్మనే
అనుష్ఠేయం కి మాజ్ఞాప్య కృతార్థం కర్తు మర్హసి.

మునీంద్రా! ఇపుడు తమరాకచే నాజన్మంబు సఫలంబైనది. నేను జేయఁదగిన దేదేని నాజ్ఞాపించి న న్నింకను గృతార్థుని సల్పుఁడు. అని ప్రార్థించిన బోధాయనముని సంతసించి బాడబేంద్రా! కాళేశ్వరప్రసాదంబున నీకుద్భవించిన పుత్రునిఁ జూచుటకై యిందు వచ్చితిని. ఇంత కన్న వేఱేమియుఁ బనిలేదు. ఈ నీ పుత్రుఁడు మిమ్ము దరింపఁజేయుటయే గాక సర్వజనహితార్థంబై జగత్కల్యాణకారణంబునకై జగన్మోహనివృత్తికై పరమశివుని యవతారంబుగ నిట్లు జన్మించె. మీ తపంబుననే కాక పారాశర్యాది మహామునుల ప్రార్థనంబునను నిట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించి యుదయించె. ఇఁకఁ బ్రస్తుతము నీపుత్రున కుపనయనంబు చేయుటకు సంకల్పించితివి. అందులకుఁ దగిన యాచార్యుండు గావలయును. బాలున కుపదేశపూర్వకంబుగ బ్రహ్మ గాయత్రీ మంత్రంబుల నుపదేశించి తదనుసారంబుగ సాంగచతుర్వేదంబులను దక్కిన మీమాంసాదిచతుర్దశవిద్యలను జెప్పి పాశుపతదీక్ష నొసంగుట కర్హుఁడైన గురుండు శ్వేతాచార్యుం డిపుడు కాశీనగరంబందు నివసించి యున్నాఁడు. మీర లీ బాలుని నటకుఁ దోడ్కొని పోయి తదాచార్యత్వంబును తదనుగ్రహంబు నొందవలయును. ఈయది ముఖ్యకార్యము. ఆ శ్వేతాచార్యుం డప్రతిమానుండు ప్రత్యక్షమహేశ్వరుండు.

శ్లో॥ సఏవ సర్వాగమవేదవేదీ। సఏవ దుర్వాదతతిప్రభేదీ
సఏవ నిర్వాణసుఖప్రమోదీ। సఏవ మాహేశమహాప్రసాదీ॥

తా॥ అతఁడే సర్వవేదాగమవేది. ఆతఁడే దుర్వాదతండంబులను బ్రద్దలు చేయువాఁడు. ఆతఁడే మోక్షసుఖానందముగలవాఁడు. ఆతఁడే శివ ప్రసాదము గల మహనీయుఁడు.

కావున వారాణసీప్రయాణంబుఁ ద్వరితంబుగ నొనర్చి భార్యాపుత్రులతో శ్వేతాచార్యసన్నిధానంబుఁ జేరు మనుడు విశ్వేశ్వరుఁ డానందించి బోధాయనమునిని గూడఁ బ్రార్థించి తమతోఁ గాశికి రమ్మని కోరె. భక్తజనవత్సలుఁడగు నమ్మునీంద్రుఁ డట్లంగీకరించె. యాత్రా సన్నాహం బొనర్చికొని శ్రీకాళేశ్వరార్చనం బొనరించి సెలవడిగి సుము

హూర్తంబున పత్నీపుత్రులతో బోధాయనమునితోఁ గాశీప్రయాణం బొనరించి గోదానర్మదానదీనదంబుల దాటి మాసద్వయంబులోన సితాసితోదక వాహినీసంగమంబగు ప్రయాగ తీర్థరాజంబుఁజేరి త్రివేణియందు వేణీదానంబును బితరులకుఁ బిండదానంబును దీరస్థ బ్రాహ్మణులకు మహాదానంబులనిచ్చి యనేకుల కన్నసంతర్పణంబు చేసి మాధవేశ్వరిని బూజించి యటనుండి వింధ్యాచలనివాసినిఁ జేరి యా జగన్మాత నర్చించి అయోధ్యకేగి యందు సీతారామలక్ష్మణభరతశత్రుఘ్నాంజనేయుల సేవించి కాశీపట్టణంబుఁ బ్రవేశించిరి. అందుపస్సున మణికర్ణికా చక్రపుష్కరిణీ తీర్థస్నానంబొనర్చి విశ్వేశ్వరాన్నపూర్ణాడుంఠిప్రముఖుల నర్చించి

శ్లో॥ విశ్వేశం మాధవం డుంఠిం। దండపాణించ భైరవం
వందేకాశీం గుహాం గంగాం। భవానీం మణికర్ణికాం॥

అనెడువిధి ననుసరించి నిత్యయాత్రను బొనరించి తీర్థవిధి నాచరించి యామీఁద శ్వేతాచార్య సన్నిధానమునకుఁ బోవుచుండి రంతకు మున్నె సర్వజ్ఞుఁ డగు శ్వేతాచార్యుండు బోధాయనమునితో విశ్వేశ్వరారాధ్యుండు సతితోఁ బుత్రునితోఁ దనయొద్దకు వచ్చుచుండుట దెలిసి వారల నెదుర్కొనుటకై యాత్మశిష్యుల నిజాశ్రమాంతికంబున కనిపె. వార లవ్వారి నెఱింగి గురుసన్నిధికిఁ దోడ్కొని వచ్చిరి. బోధాయన శ్వేతమును లన్యోన్యాభివాదనంబు లొనర్చికొనిరి. విశ్వేశ్వరారాధ్యుండు కళత్రపుత్రులతో శ్వేతాచార్యపదారవిందంబుల సాష్టాంగపడి మ్రొక్కి కుమారుని వారి ముందఱ నునిచె. శ్వేతాచార్యుఁడు వారల కందఱ శాశీస్సులిచ్చె. శ్వేతాంతేవాసు లందఱు శుచితాసనంబులొసఁగిరి. అంద ఱాసీనులైరి. శ్వేతగురుఁడు బాలుని నీలకంఠుని నిజాంతికమునకుఁగొని బుజ్జగించె. బోధాయనుండు శ్వేతగురునకు విశ్వేశ్వరారాధ్యుని యాగమనాభిప్రాయం బెఱిఁగించి విశ్వేశ్వరారాధ్యునిచే శ్వేతగురునకుఁ బుత్రుని సమర్పింపఁజేసె. శ్వేతగురుఁ డంగీకరించి ఇట్టి సచ్ఛిష్యునితో నేను సఫలీకృతుండనగుదు నీతండు సర్వవిద్యావిశారదుండై వ్యాసమతంబు ననుసరించి తదీయసూత్రబులకు భాష్యంబొనంచి కుత్సితాత్ముల మోహంబుఁబాపఁగలఁడు. నీవొనరించిన వృత్తికిఁ గూడఁ

బ్రహ్మకార్యంబుఁ గూర్పఁగలఁ డనిన బోధాయనుండు సంతుష్టుండై ఇట్టిజగత్కల్యాణంబునే కోరి వీరల మీసన్నిధికిఁ దోడ్కొని వచ్చితిని భవదనుగ్రహంబున సర్వంబు సమకూరఁ గలదు.

శ్లో॥ తదత్ త్వం కుమారం విధినోపనీయ వేదాం స్తదంగా నుపదిశ్యతూర్ణం
అత్యన్త పునశ్శాంభవవేధదీక్షాం ప్రదాయ దివ్యాగమజాత మద్య
పశ్చాదేహి పశ్చా చ్ఛివయోగసిద్ధిం తతో జగద్దేశికపట్టభద్రం
విధేహి శక్నోషి గురుత్వ మస్య వోఢుం భవానీత్యభిసంధిపూర్వా॥
నీలకంఠవిజయ చరిత్రే.

తా॥ అందువలన నీ వీ కుమారునకు విధిచే ఉపనయన మొంద జేసి వేగిరముగ వేదములను వేదాంగములను జెప్పి శాంభవ వేధదీక్షనిచ్చి శివాగమవైదుషిని శివయోగసిద్ధిని జేకూర్చి జగద్గురుపట్టభద్రుని గావింపుము. బోధాయనుం డిట్లుగోరిన

శ్లో॥ ఆకర్ణ్య బోధాయనమౌనివాచం శ్వేతః ప్రమోదోల్లసితాంతరంగః
శివంమహర్షేభవతాయదుక్తం సర్వంవిధాస్యామిమహేశ్వరాజ్ఞయా
నీలకంఠ విజయచరిత్రే.

తా॥ బోధాయనుని వచనంబుల విని శ్వేతాచార్యుఁడు సంతుష్టచిత్తుండై మహర్షీ! శివముగ నీ చే నెట్లు వచింపఁ బడినదో అట్లు సర్వము శివాజ్ఞచేఁ జేయుదు ననియె.

శ్వేతదేశికాంగీకృతికి బోధాయనముని ప్రీతుండై తదనుమతితో విశ్వేశ్వరదంపతులకు స్వయానంబుఁ దెలిపి స్వాశ్రమంబున కేగె. అనంతరము సుముహూర్తమందు శ్వేతగురుఁడు నీలకంఠున కుపనయన మొనర్చి బ్రహ్మగాయత్రీ మంత్రంబు లుపదేశించి యంతనె ఋగాదిచతుర్వేదంబుల సాంగంబులను షడ్దర్శనంబులను జెప్పినతోడనే యావిద్యలెల్ల ప్రాక్తనసంస్కారంబులవలె నీలకంఠునొందె. ఆ మీఁద పాశవిచ్ఛేదిని యగు శాంభవ వేధదీక్ష నొసఁగి సర్వదివ్యాగమరహస్యంబుఁ దెలిపి శక్తిపాత శివయోగంబుల ననుగ్రహించి యైదువత్సరములు దమసన్నిధినుంచికొని సర్వశత్రునిగ్రహంబులును సర్వాభీష్టప్రదంబులు నగు నఘోర పాశుపత శరభ మంత్రంబుల నుపదేశించి తదుప యోగసంధానోప

సంధానంబులఁ దెలిపి జగద్గురుపట్టం బభిషేకపూర్వంబుగఁ గట్టె ను. అటుమీఁదఁ శ్రీకంఠునితో నిట్లనుశాసించె. కుమారా! ఇఁక స్వదేశంబున కేగి సత్కులీన యగు కన్యను బెండ్లాడి యుత్తమ పుత్రులనొందు మామీఁ

శ్లో॥ కురుష్వ భాష్యం శ్రుతిసూత్ర రాశేః సచ్ఛాత్రవర్గాయ నివేదయార్థం
అలంకురుష్వాప్రతిమప్రబంధాన్ నిరాకురుష్వాఖిలదుర్మతాఘాన్ ॥

తా॥ వేదాంతరాజికి సూత్రరాశికి భాష్యంబును రచింపుము. తదర్థంబును సచ్ఛిష్యులకుఁ జెప్పుము. ఉత్తమకావ్యముల నిర్మింపుము. దుర్మతముల నిరాకరింపుము.

శ్లో॥ శిష్యాన్వితః సంచర పుణ్యభూమిం జయాథ నిశ్శేషకువాదశీలాన్
సమ్యక్ ప్రతిష్ఠాపయ మర్త్యలోకే మతం శివాద్వైతపరం మహాంతం.

తా॥ మఱియు శిష్యులతోఁగూడ పుణ్యక్షేత్రయాత్రఁబొనర్చి కుత్సిత వాదుల నెల్ల జయింపుము. భూలోకమందు గొప్పదైన శివాద్వైత మతంబును బ్రతిష్ఠింపుము.

శ్లో॥ త్రిలింగ దేశే శివసన్నివేశే క్షేత్రేచ కాళేశ్వర దివ్యధామ్ని
మాతాపితృభ్యాంవస జన్మభూమావాపిత్రోర్ముదం సంజనయన్ ప్రహృష్టం

తా॥ త్రిలింగ దేశమందలి శివక్షేత్రమగు కాళేశ్వరపురమందు సంతోషముతోఁ దల్లిదండ్రులనానందింపఁజేయుచుఁదల్లిదండ్రులతో వసింపుము.

ఇట్లాజ్ఞ జేసి శ్రీకంఠుని దల్లిదండ్రులతో స్వగ్రామంబున కేగుటకు సెలవిచ్చెను. శ్రీకంఠుండు గురుచరణ పద్మంబులకు మ్రొక్కి విశ్వేశ్వరాన్నపూర్ణాడుంఠిమాధవ భైరవప్రముఖులం బూజించి పంచక్రోశయాత్రను బొనరించి పయనంబొనర్చి రయంబుగఁ గొన్నినాళ్ళలో నాత్మపురిని జేరెను. పౌరప్రముఖులంద ఱానందించిరి. తల్లిదండ్రుల యనుమతితో నీలకంఠుండు స్నాతకవ్రతంబొనర్చి శిష్టవిప్రునకు గోదానంబుసల్పి హారీతసగోత్రుండును యజ్వయునగు వీరభద్రారాధ్యుని తనూజయును సర్వసులక్షణసంపన్నమైన సర్వమంగళాదేవిని నత్రిముని యనసూయాదేవిని వలెఁబెండ్లాడెను. అనుపమరూపసౌశీల్యసద్గుణవతి యగుసతితో శ్రీకంఠుఁ డభిమతభోగ సౌఖ్యంబు లొందుచు నామెయందు శ్రీవిష్ణుభుజంబులట్లు నలువురు

పుత్రులఁ గనియెను. పుత్రులకు సోమేశ్వరుఁ డఘోరనాథుండు కాళేశ్వరుండు శ్రీగిరీశ్వరుండని క్రమముగ నామకరణంబు లొనర్చెను. బాలురు వృద్ధినొంది బాల్యంబందె జనకునొద్ద వేదశాస్త్రంబులఁ జదివి వినయాదిసద్గుణసంపన్నులై పరస్పరసౌభ్రాతృత్వముతో విరాజిల్లుచుండి రిఁక నంతేవాసులు పల్వురు చేరి గురునొద్ద వేదవేదాంగంబులఁ జదివి యంధారితీరిరి. నీలకంఠుఁ డంత సర్వవేదాంతవాక్యంబులయు దివ్యాగమంబులయు యాథార్థ్యం బెఱింగి వైయాసికసూత్రజాలంబుఁ బరిశీలించి యవ్వానికిఁ గుతర్కాభూయిష్ఠంబులైన నితరాధ్వప్రకారంబుల నేవగించి వేదాంతనిర్ణీతపదార్థంబు జగత్కారకుఁడగుశివుఁడే వ్యాసాభిప్రాయం బని నిశ్చయించి తద్భావంబును బ్రపంచమందలి సర్వవిద్వత్సమక్షంబునందు నిరూపించినమీఁద సూత్రభాష్యంబును గీతాభాష్యంబును రచించుటకుద్యమించి తల్లిదండ్రులసెలవొంది మితచ్ఛాత్రులతో శుభసమయంబునఁ బయనంబుచేసె. ప్రథమమందు వారణాసి కేగి నిజగురుసాన్నిధ్యంబునఁ గాశీపండితమండలామోదంబును గొని తక్కిన దేశంబుల కేగ నెంచి కతిపయదినంబులలోఁగాసికిఁజేరి కల్యాణదేశికాగ్రిం బొంది తచ్చరణంబుల వ్రాలి మ్రొక్కి తదనుమతితోఁ విద్వాంసుల నెల్లర నాహ్వానించి విశ్వేశ్వరాలయమంటపమందు గురుసమక్షంబునఁబండితసభయందు సర్వవేదాంతార్థంబుల మీమాంసాన్యాయావిరుద్ధంబుగ సూత్రశక్తి సమన్వయించి యుపన్యసించినంత శ్వేతగురుండు మురిసె. విశ్వేశ్వరాగ్రిం బందలియొక ఘంట తనకుఁదానై ఓంకారధ్వనితో మ్రోగె. పండితగ్రామణులెల్ల మెచ్చి శిరఃకంపముచేసి సర్వజ్ఞుఁడగు విశ్వేశ్వరుండే యిట్లువచ్చి వేదాంతార్థంబు విశదంబు చేసెనని యైకకంఠ్యంబుగ జయధ్వనులొనర్చి బహూకరించిరి. నీలకంఠుఁడంత సర్వదేశంబులఁ దిరుగఁబూని గుర్వాజ్ఞఁ బడసి యట నుండి వెడలి సింధుకాశ్మీరపాంచాలనేపాళాంగవంగకళింగాంధ్రదేశంబులను సౌరాష్ట్రమహారాష్ట్రకర్ణాటక ద్రవిడచోళపాండ్యకేరళసింహళాదిదేశంబుల కేగి యందలి రాజాస్థానంబులందు విద్వత్సభలఁ గూరిచి వేదాంతమతంబు వ్యాసాభిమతంబు శివతత్త్వంబే

యని నిర్ణయించి జయంబుఁ బడసి సార్ధసంవత్సరంబునకుఁ దిరుగ నిజపురిఁ జేరి నిశ్చలచిత్తుండై వ్యాససూత్రంబులకు భాష్యంబు రచింపుటకై శుభదినోదయంబందు పార్వతీపరమేశ్వరులను గణపతిని బూజించి గ్రంథంబు నిట్లుపక్రమించె.

శ్లో॥ ఓంనమోహంపదార్థాయ లోకానాం సిద్ధిహేతవే
సచ్చిదానందరూపాయ శివాయ పరమాత్మనే॥

తా॥ అహంపదమునఁ జెప్పఁబడువాఁడును శైవజనుల యుపాసనను సిద్ధింపఁజేయువాఁడును సత్యజ్ఞానానందములు స్వరూపముగాఁ గలవాఁడును పరమాత్మయుఁ బ్రణవవాచ్యుఁడు నగు శివునకు నమస్కారము.

శ్లో॥ నిజశక్తిభిత్తినిర్మిత నిఖలజగజ్జాలచిత్ర నికురంబః
స జయతు శివః పరాత్మా సకలాగమ సారసర్వస్వం॥

తా॥ స్వశక్తియనెడుగోడయందు సకలజగజ్జాలమనెడు చిత్రములను నిర్మించినట్టివాఁడును అఖలవేదవేదాంగశివాగమసారములైన యుపనిషత్తులకు ముఖ్యధనంబైనవాఁడును జీవాత్మనియామకుఁడును పరమాత్మయు నైనశివుఁడు సర్వోత్కర్షముగ విరాజిల్లుచున్నాఁడు.

శ్లో॥ భవతు సభవతాం సిద్ధ్యై పరమాత్మా సర్వమంగళోపేతః
చిదచిన్మయప్రపంచ శ్శేషో శేషోపి యస్యైషః॥

తా॥ చిదచిన్మయంబును నశ్శేషంబగు నీప్రపంచ మెవ్వనికి శేషంబగునో అట్టి సర్వమంగళోపేతుండైన పరమాత్మ భాష్యార్థశ్రవణముచేయు వారల కిష్టసిద్ధిప్రదుఁడగుఁగాత.

శ్లో॥ నమః శ్వేతాభిధానాయ నానాగమవిధాయినే
కైవల్యకల్పతరవే కల్యాణగురవే నమః॥

తా॥ వేదాంతార్థమును నవిరోధంబుగ స్పష్టముగ నుపదేశించునట్టి వారును కైవల్య (శివసాయుజ్య) మునకుఁ గల్పవృక్షంబైన వారును పాశుపతదీక్షాప్రదాతలునగు శ్వేతాచార్యులవారికి నమస్కారము.

శ్లో॥ వ్యాససూత్రమిదం నేత్రం విదుషాం బ్రహ్మదర్శనే
పూర్వైః కలుషితం నీలకంఠేనాద్య ప్రసాధ్యతే॥

తా॥ విద్వాంసులకు బ్రహ్మదర్శనమందీ వ్యాససూత్రమనెడు నేత్రము పూర్వులగు కొందఱిచేఁ గలుషితము గావింపఁబడుట నిపుడు నీలకంఠునిచే స్వచ్ఛంబగుచున్నది.

శ్లో॥ బ్రహ్మసూత్రమిదం గాంగం మలత్రయ విశోధకం
పక్షైః పంకిలితం నీలకంఠారాధ్యేన శోధ్యతే ॥

తా॥ ఆణవ మాయిక కార్మికములైన మలత్రియమును బోగొట్టునట్టి బ్రహ్మసూత్రం బనెడు గంగోదకము ఇతరాచార్యులచేతఁ బంకిలంబైనను (బురదతో దూషితమైనను) నీలకంఠారాధ్యునిచే శోధింపఁ బడుచున్నది.

శ్లో॥ నీలకంఠో వివృణతే శ్రీకంఠోపసమాహ్వయః
బోధాయనోక్తి మాలంబ్య బ్రహ్మసూత్రం యథాకృతి ॥

తా॥ శ్రీకంఠుఁడని మఱొక పేరుగల ఈ నీలకంఠారాధ్యుఁడు బోధాయన వృత్తి ననుసరించి శ్రుతిమతానుసారంబుగ బ్రహ్మసూత్రంబులను వివరించుచున్నాఁడు.

శ్లో॥ శ్రీమతాం వ్యాససూత్రాణాం శ్రీకంఠీయః ప్రకాశ్యతే
మధురో వాక్యసందర్భో మహార్థో నాతివిస్తరః॥

తా॥ వేదాంతార్థనిరూపకములైన వైయాసికసూత్రములకు శ్రీకంఠశివాచార్య విరచిత భాష్యసందర్భము మధురముగాను, గొప్పయర్థము గలదిగాను అనవసరప్రసంగములేనిదిగాను ప్రకాశించును.

శ్లో॥ సర్వవేదాంతసారస్య సౌరభాస్వాదమోదినాం
ఆర్యాణాం శివనిష్ఠానాం భాష్య మేతన్మహానిధిః ॥

శ్రీశ్రీకంఠసూత్రభాష్యము.

తా॥ సర్వవేదాంతసారముయొక్క సౌగంధ్యాస్వాదన ప్రమోదులును శివభక్తులగు ఆర్యుల కందఱికీభాష్యము గొప్పనిధానము.

ఇట్లు మంగళ ప్రతిజ్ఞలను బొనరించి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనుసూత్రము మొదలుకొని చతురధ్యాయపరిమితంబులగు బ్రహ్మసూత్రంబులకును వ్యాసరచిత భారతసంహితయందలి భగవద్గీతాష్టావింశదధ్యాయంబులకును భాష్యంబులును మఱి యుపనిషత్తులందలి విషయవాక్యములకుఁ బ్రత్యేకముగ వ్యాఖ్యను విషయవాక్యప్రదీపిక యను

గ్రంథమును రచించి మరలఁ గాశికిఁ బోయి విశ్వేశ్వరసన్నిధానమం దచటి పండితబృందసమక్షంబునఁ దమ భాష్యంబులఁ బ్రకటించి యుప న్యసించిరి. అందలి పండితులు మున్నీయర్థంబులను దామంగీకరించి యుండికూడ తత్పూర్వసిద్ధాంతములు గొన్ని యుండుటనుజేసి భాష్యం బుల నెల్లను అన్నపూర్ణాంబాహర్మ్యాగారంబం దుంచి కవాటంబుల బంధించి మఱునాఁడు తెఱచి చూచిన ఏభాష్యం బన్నపూర్ణాదేవి యంగీకరించి శిరసావహించునో యద్ది గ్రాహ్యంబనిరి. నీలకంఠుఁ డందుల కొడంబడి యట్లుచేసి మర్నాఁడుదయమందుఁ బండితులతో నచటికేగి చూడఁగా నీలకంఠవిరచితసూత్రభాష్యమే యన్నపూర్ణాంబాశిరఃపవి ష్టంబై యుండుట నందఱు జోతలతో నంగీకరించి శ్రీకంఠాచార్యునకు జయధ్వానంబులొనర్చిరి.

అంత శ్రీకంఠుండు స్వమత సిద్ధాంతంబుఁ బ్రతిష్ఠించి స్వగ్రామం బునకు వచ్చి పుత్రులకును శిష్యులకును శివభక్తిని విశిష్టశివాద్వైతం బును గరపుచుండెను. ఇట్టి యసాధారణంబైన శ్రీకంఠారాధ్యునివైదుషీ శేముషీమహిమంబును విని తద్దేశప్రభువగు విక్రమార్కనృపాలుఁడు వారిఁజేరవచ్చి జాంబూనదాంబరంబులను కాంచన గ్రైవేయాది భూషణంబులను దీనార సహస్రంబులను నొసంగి బహూకరించి కృతా ర్థుఁడయ్యె. అనంతర మా యాచార్యునిమాతాపితరులు శివపదంబుఁ జేరుడు వారలకు విధ్యుక్తక్రియలు నెఱవేర్చి కృతకృత్యుఁడయ్యెను. పుత్రులకుఁ దగినట్టి వారల కన్యలను సౌందర్య సౌశీల్యవతులఁ గూర్చి వివాహంబు లొనర్చెను. అంతఁ గొంతకాలంబు మీఁద నీలకంఠా రాధ్యుండు కర్తవ్యంబంత యోజితంబైనట్లెరసి యొకనాఁడందఱతోఁ దమ కైలాసయానం బెఱింగించి శివార్చనంబు సల్పి శివుని ధ్యానించి దివ్యవిమానంబుఁ దెప్పించి యాత్మదేవితో నం దధిష్ఠించి దుంధుభిధ్వా నంబులతోఁ గైలాసాద్రిఁజేరి శివునకుమకు మ్రొక్కి యవ్వారి తేజం బందుఁ జేరిరి. తత్పుత్రులును శిష్యులును వారియట్లు శివమతంబును వృద్ధిచేయుచుండి రిది మహోత్తమశైవాచార్యుఁడును శివభాష్య కారులునగు నీలకంఠాచార్యుని చరిత్రంబు పాఠకులకు శ్రోతలకు సర్వ శ్రేయస్సంపాదకము.

శ్లో॥ దుర్వాదపక్షీకరనీలకంఠః తపఃక్రియాతర్పితనీలకంఠః
శాస్త్రార్థవాదే కృతసింహకంఠః జీయాత్స సాక్షాద్భువి నీలకంఠః॥

తా॥ దుర్వాదములనెడు సర్పములకు నెమలి (శివచింతామణి ప్రభ) యైనట్టివాఁడును తపశ్చర్యచేతఁ దృప్తిఁబొందింపఁబడిన పరమేశ్వరుఁడు గలట్టివాఁడును శాస్త్రార్థవాదనంబందు సింహకంఠుఁడైనట్టిఁవాఁడును భూమియందు ప్రత్యక్షశివుఁడైన శ్రీనీలకంఠారాధ్యుఁడు జయమొందుఁగాఁత.

# 26. శ్రీ జగద్గురులు శ్రీరేవణ సిద్ధారాధ్యులు

శ్లో॥ యఃక్షీరాబ్ధేర్మందరాఘాతజాతో జ్వాలామాలీ కాలకూటోతిభీమః
తం సోఢుం వా కోపరో భూన్మహేశాత్ యత్కీలాభిః కృష్ణతామాప విష్ణుః

తా॥ పాలసంద్రమునుండి మందరగిరియొక్క ఘర్షణ హతిచేఁ బుట్టఁబడినట్టియు జ్వాలాసమూహము గలట్టియు భయఙ్కరమైనట్టియు నేవిషము గలదో అద్దానిని సహించి హరించుటకు మహేశ్వరునికన్న నితరుఁడెవఁడుండెను? ఏ విషజ్వాలలచేత విష్ణుమూర్తిగూడ నల్లనివాఁడాయెనో! స్కాందకాశీఖండము.

శ్రీరేవణసిద్ధారాధ్యగురుఁడు కొల్లిపాకలోని మహాలింగగర్భమందు శివసదృశరూపంబున నుదయించి ఆత్రేయగోత్రంబు ననుసరించెను. ఆ దేశమందలి జనంబులకు శివభక్తి ననుగ్రహించి శివదీక్షనొసంగి చాళుక్యరాజాస్థానికేగి యందు విక్రమనృపునకు దుష్టసంహారార్థంబొక ఖడ్గంబిచ్చి యామీద దక్షిణదేశంబుఁజేరి వైష్ణవచోళుని వాదంబందు జయించెను. మహర్షియగు నగస్త్యమునికి శివతత్త్వము దెలిపెను. అద్వైతమతస్థాపకుఁడగు శంకరాచార్యవర్యునకుఁ జంద్రమౌళీశ్వరశివలింగంబొసంగి యర్చించికొనుమనియె. ఈ రేవణగురునకు రేణుకులను పేరుగూడఁ గలదు. గురువర్యులాపై రాజేంద్రచోళుఁడు మున్నగువారి ప్రార్థనలతో నారాజవర్యుల పుత్రికలఁ బెండ్లాడెను. ఇమ్మహనీయుని సతులందు దుర్గాదేవి యగ్రగణ్యా. త్రియంబకేశ రుద్రముని సదాశివాచార్యులను వారాత్మజులు. పదపడి గురుదేవులుత్తరదేశమేగి భువనేశ్వర క్షేత్రంబుఁజేరి యందుఁ బరిపాలకుఁడైన విశ్వ

వర్మ భూపాలుని తనయుని జంద్రకేతుఁడనువాని మిత్తిఁబాపి బ్రతి కించెను. ఒకనాఁడు నాగరుల కందఱకు దివ్యనేత్రంబిచ్చి కైలాసాద్రిని గనుపఱచె. పెక్కు సంవత్సరంబు లివ్వారు వసుమతియందు శివభక్తి ప్రచారము చేసిరి. ఈ గురుదేవుల విజయచరిత్రబోధకములు గైర్వాణ వాణియందుఁ గర్నాటకభాషయందును బెక్కులు గ్రంథములు వెలు వడినవి. శంకరాచార్యులవారికివ్వారు శివలింగ ప్రదానము చేయుటచే శ్రీశంకరాచార్యులవారి సమకాలీకులగుట వీరుగూడ క్రీస్తుప్రథమశత కాలమువారని తెలియుచున్నది.

ఇమ్మహనీయుని వంశ్యులు కాశినాథునివారనుపేరుతో నెలకుర్తి శోభనాద్రిపురము మున్నగు గ్రామంబుల నగ్రహారంబులను బ్రభులనొ ద్దఁబడసి ఆగ్రామంబులందు నివసించి యున్నారు. జగజ్జేగీయమాన చరి త్రులగు నీరేవణసిద్ధారాధ్యగురుల మహిమం బుల నాయావిజయ చరిత్రగ్రంథంబులందుఁ జూడనగును. ఇఁక మరుల సిద్ధారాధ్య గురు లను గుఱించి చెప్పెదను వినుఁడు.

## 27. శ్రీజగద్గురులు-శ్రీమరుల సిద్ధారాధ్యులు

శ్లో॥ యద్బాణో భూత్ శ్రీపతి ర్యస్యయంతా
లోకేశోభూత్ స్యందనం భూస్సమస్తా
వాహావేదా యస్య యే నేషుపాతా
ద్దగ్ధాః గ్రామా స్త్రైపురా స్తత్సమఃకః॥

స్కాంద కాశీఖండము.

తా॥ ఎవనిబాణము శ్రీనాథుఁడో ఎవనిసారథి బ్రహ్మయో ఎవనికి భూమియంతయు రథమో వేదము లశ్వములో ఎవ్వని బాణపాతము చేతఁ ద్రిపురంబులను గ్రామంబులు దగ్ధములైనవో అట్టిదేవునకు సమానుఁడెవ్వఁడు ?

బ్రాహ్మణాన్వయంబున భారద్వాజగోత్రంబందు శ్రీమరుళ సిద్ధారాధ్యుఁడు జన్మించి గర్భాష్టకహాయనంబులం దుపనీతుండై త్రయిని షడ్దర్శనంబుల నశ్రమంబుగఁజదివి శివలింగదీక్షుకై శ్రీరేవణసిద్ధా రాధ్యుని జేరి సేవించి తదనుగ్రహంబున నాయారాధ్యులచే శివలింగ

ధారణదీక్షను జెంది గురుశాసనప్రకారంబు వసుంధరామండలంబందు శివమతప్రాశస్త్యంబుఁ బ్రకటించి శైవమతంబు నభివృద్ధినొనర్చెను. వీరి యర్ధాంగి శివజ్ఞానాంబిక. ఇవ్వారు గోకర్ణక్షేత్రమందుఁ గొంతకాలంబు తపస్సానరించి కాశ్మీర దేశమందలి శ్రీనగరముఁ జేరి యందు రాజును హిరకాలుని ననుగ్రహించిరి. *

శ్లో॥ శ్రీమత్సర్వకళాసు కోవిదతమః ప్రాలేయశైలాత్మజా
జానేః పూర్ణకృపావిశేష నిచితపరిజ్ఞానధీర్యోబభౌ
సమ్యగ్రేవణదేశికార్పితమహాలింగావధానోజ్వలం
సిద్ధార్యం మరుళప్రభుం బుధనుతం తం మన్మహే శ్రేయసే ॥

శ్రీకరసూత్రభాష్యం.

# 28. ఏకోరామ సిద్ధారాధ్యగురులు

శ్లో॥ యః కందర్పో వీక్షమాణస్సమానం
దైవేరన్యై ర్భస్మజాతస్వయంహి
పౌష్పై ర్బాణై స్సర్వవిశ్వైకజేతా
కో వా స్తుత్యః కామజేతు స్తతోన్యః ॥

తా॥ విరిశరములచే సర్వవిశ్వైకజేతయగు మన్మథుఁ డితర దేవతలతో సమానముగఁ జూచి యెవనిచే భస్మంబాయెనో అట్టి కామసంహారుని కన్న మఱొకఁడెవఁడు స్తుత్యర్హుఁడు?

స్కాందకాశీఖండము.

---

* మహామహులగు శ్రీమరుళ సిద్ధారాధ్యగురుల చారిత్రంబు విస్తరముగ లభింపలేదు. ముందటఁ లబ్ధంబైనయెడల శ్రీవారి చారిత్రంబు విస్తరించి వ్రాయుదు.

ఈశ్రీమరుళసిద్ధారాధ్యగురుఁడు శ్రీ శ్రీ రేవణసిద్ధారాధ్య గురుని యొద్ద శివలింగదీక్షను బడసినట్లు చెప్పుటచే ఈమరుళసిద్ధారాధ్యుఁడు రేవణసిద్ధగురుని కాలమువాఁడే. వారికన్నఁ బ్రాయమునం గొంతఁ జిన్నవాఁడై యుండును.

తిరుచ్చెన్నముద్రాపురంబందు వేదవేదాంగాదివిద్యలందుఁ బారంగతులైన బ్రాహ్మణులయన్వయమందు హారితగోత్రమందు శివాంశంబున నేకోరామసిద్ధుండు జన్మించె. పుట్టుకనుండి శివభక్తినొనర్పుచు శివభజన సేయుచుఁ బలువురు బాలకులను గూర్చికొని భజనముఁ జెప్పుచు నానందింపుచుండును. గర్భాష్టకంబునఁ దండ్రి యుపనయనముచేసి వేదాధ్యయన మొనర్చ గురున కప్పగించినంత నతిత్వరితంబున వేదంబులను శాస్త్రంబులను జదివి వానిసారంబెఱింగి శివతత్త్వనిష్ఠాగరిష్ఠుఁడై ఘంటాకర్ణగణనాథాచార్యుల సన్నిధికేగి యందు వారిని సేవించి తదనుగ్రహంబునఁ బాశుపతదీక్షను జెంది శివపారమ్యంబును శివభక్తిని జనులకు బోధించుచుండె. అట్టితఱి ఆపురము నేలునట్టి వీరభాస్కరపతి యనుప్రభువు వైష్ణవుఁడగుటఁ దద్గురుఁడును వేదశాస్త్రకోవిదుఁడును వైష్ణవమతోద్ధారకుఁడును నగు వ్యాసుఁ డనెడు విద్వాంసునిబోధల నన్యమతంబుల నిరసించుచుండుటను జూచి ఏకోరామపండితుఁడు రాజసమక్షమున కేగి విద్వత్సభను గూర్పుఁడనియు నందు శివైకపారమ్యంబు నిరూపించెద ననియు అట్లు గాకున్నఁ దనశిక్షకుఁ బాత్రుఁడ నౌదు ననియుఁ దనవాదంబుననే జయంబు వొదవినఁ బ్రభువును దద్గురుఁడును స్వమతంబును బాసి శివమతంబందు జేరవలయు ననియును శపథపూర్వకంబుగ నియమం బొనర్చిన నవనీవిభుండు పెక్కండ్రుపండితులను బిలిపించి సభను గూర్చె. అం దేకోరామసిద్ధుం డక్రమంబున శివైకపదార్థనిరూపణంబు శ్రుతిసహస్రంబుతో స్మృతీతిహాసపురాణాగమోపబృంహితార్థంబులతో అనేక దృష్టాంతములతో దృఢంబుగ నిర్ణయించిన సభ్యపండితులెల్ల రానందించి ఏకోరాముని వాదజయంబు రాజున కెఱింగించిరి. ప్రతివాదియగు వ్యాసపండితుఁ డోటమిఁ జెంది జితోస్మియని ఏకోరామసిద్ధునకు విధేయుఁడయ్యె. ఏకోరాముఁడు వ్యాసపండితునకు శివదీక్షనిచ్చి రామనాథపండితుఁ డని నూతన నామధేయంబొనర్చె. రాజునకుఁ దత్కుటుంబమున కంతకు శివదీక్ష నిచ్చె. ఈప్రకారంబుగఁ బెక్కురకు శివమతపారిశస్త్యంబును బోధించి శైవమతంబునకు వృద్ధిఁ గూరిచి శిష్యుం డగునొక శైవపండితుని పుత్రికను సుగుణవతిని బెండ్లాడి యామెతో గృహస్థధర్మంబులను భోగసౌఖ్యంబుల నొంది ఉత్తమ

పుత్రులఁ బడసి వారలను విద్యావంతుల నొనర్చి శివైకచిత్తుండై శ్రీ భోగమల్లికార్జునాలయంబున కేగి శివధ్యానముచేసి యందు లింగగర్భ మందుఁ బ్రవేశించె. మహనీయులగువారలు కర్తవ్యంబులు దీరినమీఁద ప్రాపంచికంబులందు లంపటులై యుండరుగదా! ఓంతత్సత్. ఈగురుని వంశమువారు మల్లమపల్లి యను గ్రామంబు నగ్రహారంబుగఁ బడసి యందుఁ గొన్ని తరములవఱకుండుటను మల్లమపల్లివా రనిపిలువఁ బడుచున్నారు.

## 29. ఉద్భటారాధ్యగురుఁడు

శ్లో॥ యంవై వేదో వేద నోనైవ విష్ణు ర్నోవా వేధానోమనో నైవవాణీ
తం దేవేశంమాదృశఃకోల్పమేధఃయాథాత్మ్యాద్వైవేత్యహోవిశ్వనాథం॥
తా॥ ఎవని వేదంబెఱుఁగదో ఎవని విష్ణువెఱుంగడో ఎవని వాక్కు లెఱుఁగలేవో ఎవనిని మనంబుగూడ యోజింపఁజాలదో అట్టి దేవేశ్వరుని విశ్వనాథుని నాబోటి యల్పబుద్ధిగల ఎవ్వఁడు యథాస్వరూపంబుగఁ దెలియఁగలడు. ఆశ్చర్యము.

స్కాందకాశీఖండము.

రజతగిరిశిఖరంబం దనేకయోజనంబులవఱకు దివ్యసౌరభంబులఁ గుప్పు మంచిగంధపుమ్రాకులచేతనునిండఁగఁబాడిచెన్నొందె తీయనిపానకంబులఁ గార్చుచున్న పెక్కుతీరుల మామిడిచెట్లచేతను దాళఫలంబులను బోలి విరివైన ఫలంబుల నలరారు మారేడు మ్రానులచేతను తనువెల్ల నీలంపుమణులసింగారించుకొన్నకొమ్మలవలె కొమ్మకొమ్మలందుఁ బండ్లగుత్తుల బిత్తరించు నేరేడులతోడను దళములుగన్పట్టకయె పొంగారు బంగారురంగుల రంగారుపండులఁ బండియున్న నిమ్మ గజనిమ్మ దబ్బలచేతను మెండుగఁబండి పగిలి మధురరసంబులఁ గుఱియుచుఁ గెంపుల సొంపుల నొంపఁ జాలిన బీజంబుల శుకనికరంబులకుఁ గ్రాసంబు లిచ్చుచున్న దానిమ్మలచేతను గెలపండి రసంబుల జొబ్బిలుచున్న బలురకంబులగు నరంటులతోడను పరిపక్వంబులై ఫలగుచ్ఛంబుల హస్తంబులకుఁ

దాకుచుఁ దేనెలసోనలఁగుఱియుచు పలుతీరులగు చాక్షితీవెల తోడను విస్తారభారంబున వంగివ్రాలినఫలంబుల నిండైన పనసలతోడను తను వెల్ల సువర్ణాలఙ్కారంబులొందియున్నట్టు బూసియున్న కర్ణికారంబుల తోడను సిద్ధమునిజనాభీష్టఫలప్రదంబులైన సంతానహరిచందనకల్ప కాదిదివ్యతరుబృందంబుచేతను నిండారవిరిసి సుగంధంబుతావులఁ బర్వ తంబంత గుబాళించుచున్న మల్లె బొండుమల్లె మొల్ల బండిగురువింద జాది విరజాది మున్నగు పుష్పలతలతోడను పూవులు పండ్లు మున్నగు నవియెకాక పథికసిద్ధులకు విశ్రాంతిగూడ నొసఁగెడు ఛాయాప్రధానం బులైన మఱ్ఱి వేప రావి జువ్వి పొన్న సురపొన్న పొగడ దేవదారు దిరిసెనము మున్నగు తరులచేతను మిగుల నిండుగఁబెరిగి ఫలంబుల నిండారి దండిగ శోభించుచున్న నారికేళ హింతాల క్రముకద్రుమముల చేతను వివరంబుల మంచి ముత్తియములరాసుల ననమానంబుగ నొసం గుచు భాసమానంబులైన వేణుగణంబులతోడను మఱియు ననేకాశోకా మలకకపిత్థచించాప్రముఖశాఖవ్రాతంబులతోడను సంజివినీ జ్యోతి ష్మతీప్రముఖలతావితానంబులచేతను రంగురంగులఁ బొంగారుచున్న శతపత్రంబులుత్పలంబులు గలిగి చిలుకలు గోరువంకలు రాయంచలు జక్కవలు మున్నగు విహంగరాజంబుల మధురధ్వనిగానంబుల నానందం బొసఁగుచు మధురాంబుపూరితంబులైన రమణీయసరోరాజంబులతో సర్వజనమానసంబుల కామోదం బిడునట్టిదివ్యసుందరవనంబం దొకనాఁడు పరమశివుఁడు జగత్కల్యాణార్థమై శివతో వనవిహారంబు సేయుచు వన పుష్పంబులఁ బార్వతీదేవి నలంకరించుచుండ శైలాది యప్రమాదంబున ననతిదూరంబున ముందఱఁ బసిండిబెత్తం బొంది పహరాచేయుచుండె. అట్టి సమయంబునం దలకానగరియందలి గంధర్వులాత్మయువతు లతో విహారార్థంబై గుంపులుగుంపులుగ వెడలి కైలాసపర్వతోత్తుంగ శిఖరంబందు విరాజిల్లు వనంబుఁజేరి పుష్పకంబుల డిగ్గి యందు మూగి సందడులు చేయుచుండిరి. నందికేశుఁ డవ్వారిఁజూచి సకల లోకాధి నాథుండు పరమేశ్వరుఁ డాత్మేశ్వరితో నిందు వసించియున్నాఁడు. మీ రందఱు క్రిందుసేయ కిందునుండి తొలఁగి వేఱొకచోటికి పొండని నుడి విన వారలహంకరించి లెక్కసేయక మదంబున నందుఁ బాయక తిరు

గుచుఁ బరమేశ్వరు లున్న పుష్పలతామందిరంబు డాయుచున్న గంధర్వ బృందంబులఁ జూచి శివుండు మీరలు మదంబుఁబాసి వేగిరంబుగ భూతంబు లగుఁడని శాపంబిచ్చె. అంతనె గంధర్వులందఱు ఆత్మసుందరీ బృందంబులతో నందంబు చందంబు లంతయు నంతమొంద భూతపిశాచంబు లగుచుండిరి. అపుడవ్వారల కొడయఁడగు చిత్రరథుండు భీతుండై భయభక్తులు సందడింపఁ దొందఱతో నిందుధరుని పాదారవిందంబుల ముందఱ సాగిలఁబడి మహేశ్వరా! క్షమింపు మనుగ్రహింపు మనుగ్రహింపుము. ఈ పిచ్చుకలపై నింతటి బ్రహ్మాస్త్రప్రయోగమా? అజ్ఞులము పశులము. పశుపతివగునీ విట్టివారిఁ బాలనంబు సేయుటగాక యన్యథాతలఁచి శిక్షించెదవా! ప్రమాదంబున దోసం బొదవె. తండ్రీ! నీ నౌకరుల నౌకరులము. నీ బిడ్డలము. రక్షింపు మని నెనరుగల్గునట్లు పలు తీరుల వేడుకొనుచున్నఁ జూచి శివుండు కనికరించి ప్రసన్నుఁడై గంధర్వరాజా! నీ ప్రార్థన నంగీకరించితినిగాని నీవును నీయనుచరులును గొన్నాళ్ళు శాపం బనుభవింపవలయును. భూమండలంబున సల్లకియనునొక గ్రామంబు ప్రాంతంబందొక వటవృక్షంబుగలదు. మీరందఱద్దానిఁజేరి సజ్జనులగు వారి గారింపక ఘాతుకమృగావళి నాహారంబుఁ గొనుచు నం దుండుఁడు. రాఁగల కలియుగంబందు సల్లకీనగరాధినాథుండగు ముంజభోజునకు దేశికుండై మన్మానసపుత్రుండగు నుద్భటగురుం డందుఁ జేరు. ఆ గురుని దేహదాహధూమస్పర్శంబున మీరలు శాపమోక్షం బొందెదరు: "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధకర్మ మనుభవము చేతనే తీఱును. అను నుడిని ఎట్టివారికిని గర్మం బనుభవింపక తీఱదు. ఇఁకఁ బొండని కొండరాచూలితో నంతర్ధానంబొందె. చిత్రరథుం డందఱతోఁ దాను గూడ నొక భూతంబై పుడమిఁ జొచ్చి యాంధ్రదేశమందలి సల్లకీపురంబు వెదకి చేరి యాఁదు గ్రామసమీపంబందలి మఱ్ఱిచెట్టుం జేరి యందుండి క్షుద్రమృగాదుల భక్షించుచు మహేశ్వరశాసనంబునకు నిరీక్షింపుచుండిరి. మహేశ్వరుండును గంధర్వుల కొనర్చిన వాగ్దానంబును స్మరించి యొకనాఁ డోలగంబున సింహాసనం బధివసించి ధ్యానంబుతో నున్నయంతఁ దననుండి యొక తేజఃపుంజంబు వెడలి పురుషరూపంబై తనవలె శిరంబం దిందురేఖయు నుదుట నగ్నినేత్రము వక్షంబునఁ బెనుబాముల పేరులు నీలగళంబు శోభిల్ల నొక బాలుఁడు వచ్చి పాదపద్మంబు

లకు మ్రొక్కి వినతుండై యంజలిఁబూని దేవా! ఏమిసెల వెందులకేగ వలయుఁ గృపతోఁ దెల్పుఁడనియె. శంకరుండు చూచి మురిసి గంధర్వులకుఁ దానొసఁగిన శాపప్రతీకారంబును దత్పరిహారరూపంబును సల్లకపురాంతికవటభూజంబందు వారు వసించుటను నెఱింగించి యానగరీనాథుండగు ముంజభోజునకు శివలింగ మిమ్మనియు నిలామండలి నసద్వాదంబుల నిర్మూలించి వేదపాశుపతాద్వంబును వెలయింపుమనియు భూతంబులై యున్న గంధర్వులకు శాపమోక్షంబుఁగావింపుమనియు ఇట్టి దివ్యమూర్తితోఁ బుడమి కేగక మనుష్యరూపంబొంది నాదు లీలావిహారనివాసంబైనవారణాసియందు మామకీనంబగు 'విశ్వేశ్వరలింగంబు సన్నిధానంబందయోనిజరూపంబునఁ గన్పట్టుమనియు నటుమీఁద ఆంగీగస బార్హస్పత్య భారద్వాజ త్రియార్షేయ ప్రవరాన్విత భారద్వాజసగోత్రంబు నొంది బ్రహ్మకులకన్యకఁ బెండ్లాడి భోగంబులొంది సుపుత్రులఁగనుమనియు అట్టి భవత్పుత్రులు ధీరులై గుణవంతులై ముదిగొండయను పురంబున కధిపతులై జగద్గురులై పాశుపత మతాభివృద్ధిని జేయుదురనియు భవదన్వయంబాకల్పంబు తామరతంపరమై యభివృద్ధి నొందుననియు వ్రాకృచ్చె. ఉద్భటుండు జననీజనకులగుపరమేశ్వరులకు మ్రొక్కి ఆశాసనంబులొంది వెడలి శివాజ్ఞాప్రకార మానందవనంబందలి విశ్వేశ్వరగర్భాలయంబుఁ జెందియుండె. అరుణోదయపూర్వమే గంగాస్నాతులై గంగాతీర్థములతో పూజాద్రవ్యములతో విశ్వేశ్వరలింగార్చనకై వచ్చినట్టివారలు యాత్రికు లర్చకులు తలుపులుదెఱచినంత బాలార్కనిభుండై ధగద్ధగాయమానకాంతులతో విభూతిత్రిపుండ్రవిలసితాననపద్మంబుతో రుద్రాక్షమాలాశివలింగపేటీవిరాజిత వక్షస్థలుండును నై ప్రకాశింపుచున్న బాలకుని జూచి విస్మితులై ప్రమోదమొంది అఖిలలోకేశ్వరుఁడగు విశ్వేశ్వరుండే మనలను సాఁకుటకై యిట్లవతరించె నని యనుకొనుచున్నంతనే విశ్వనాథలింగముఖంబు నుండి కొన్ని సూక్తు లిట్లు వినఁబడియె. "ఉపాసకులారా! ఈ బాలుండు నాపుత్రుండు. ఉద్భటగురుం డనునామంబునఁ జెలువొందు బ్రస్తుతము భూలోకమందుఁ బలుకడలఁ దిమిరచ్ఛటలవలె నావరించుచున్న యసద్వాదంబుల నెల్ల వైదుష్ప్రభల నిర్మూలించి యుపనిషత్తత్వపదార్థం

బును బ్రకాశింపఁ జేయుటకై మఱియుఁ గొన్నియుద్ధరణంబులకై యీ యనస్థుని బుట్టించితి-ఈతని చేమీరలందఱు పాశుపత సామాన్యవిశేషదీక్షల నొంది ఈగురుని బూజింపుఁడు గారవింపుఁడు. ప్రియవస్తువుల నొసఁగుఁడు. సుగుణవతియు సుందరియు నగు బ్రాహ్మణకులకన్య నిచ్చి యుద్వాహంబు సేయుఁడు. మీ కీగురునిచే సర్వశ్రేయంబులుసమకూరు" నని శ్రుతంబైన నందఱానందించి విశ్వనాథుం డిట్లువాత్సల్యంబున మనల ననుగ్రహించి యనుశాసించెనని తెలిసికొని బాలునకు జోతలుచేసిరి.

బాలుండు చూచుచుండఁగనే షోడశవర్షప్రాయుండై యగుపట్టె. ఆ మీఁద బ్రాహ్మణప్రముఖుం డొకడు స్వగేహంబునకుఁ గొనిపోయి అన్నపానాంబరభూషణంబు లిచ్చి సేవించుచుండె. సుబుద్ధియను నొక ధనికవిప్రుండు సుగుణనిధియును సుందరీమణియును నగు సౌభాగ్యసుందరి యనునాత్మజను విధివిహితంబుగ నుద్భటగురున కిచ్చి యుద్వాహం బొనర్చె. అద్భుతమగు నుద్భటుని యుద్భవోదంతంబు విని కాశీ మహారాజును బెక్కురుపప్రముఖులు వచ్చి యుద్భటుని దరిసించి మ్రొక్కి దివ్యాంబరంబులఁ గాంచనమణిభూషణంబుల ముక్తాహారంబుల హర్మ్యంబుల గవాశ్వంబుల సమర్పించి "ధన్యోస్మి ధన్యోస్మి" యనికొనిరి. ఉద్భటగురుండు శ్రీవిశ్వేశ్వరముక్తిమంటపమం దనేకవిద్వన్మహామండలిఁ బరమేశ్వరుఁ డగుశివుండే పరతత్వంబని శ్రుతిస్మృత్యాగమేతిహాసపురాణవచనంబులతో నిరూపించి తత్ప్రసాదంబే మోక్షకారణం బని ఋజువుచేసి యందులకుఁ బాశుపతవ్రతదీక్ష నొందుటావశ్యకమనియు నందు శివలింగధారణంబు విశేషదీక్షయనియు భస్మరుద్రాక్షధారణపంచాక్షరీమంత్రసేవనంబులు సామాన్యదీక్షయనియు నుద్బోధించి యుపాసకుల యభీష్టం బనుసరించి కొందఱకు సామాన్యదీక్షయుఁ గొందఱకు విశేషదీక్షయు నొసఁగెను. పలువురు ప్రేమించి శిష్యప్రశిష్యులైరి. పరమేశ్వరుఁడును నమంగుపుత్రుఁడగు నుద్భటున కెల్లవేళల సహకారియై విద్వత్సభల వివాదంబులందు దుర్మతఖండనంబులందు గురుచరలింగార్చనావసరంబులందుఁ దోడై యవ్వాని నిర్వహింపుచుఁ గంటికి ఱెప్పయై కాచుచుండె. ఉద్భటదేశికుఁడంతఁ బాశుపతమతశాస్త్రంబు సర్వతోముఖంబుగ నావహిల్లఁజేయఁ బూని కతిపయశిష్యులను వెంటఁగొని

ఉత్తమాశ్వంబెక్కి కాశ్మీరదేశంబేగి యందలి ప్రభుఁడగు జయాపీడుని యాస్థానిఁజేరి విద్వత్సన్నిధానంబందు శివతత్త్వం బుత్తమోత్తమం బని నిరూపించి రాజుచే బహుమానంబులొంది కొన్నివత్సరంబు లా రాజ ప్రార్థనచే నందు విద్యాధిపతమై యుండి * యనంతరము సింధు పాంచాల నేపాళ మగధ వంగ కళింగాంధ్ర కర్ణాటకచోళ పాండ్యకేరళ సింహళాదిదేశంబుల కేగి రాజాస్థానంబులందుఁ బండిత సమక్షమందు శివమతపారమ్యంబు నిరూపించి పెక్కురకు శైవదీక్ష నిచ్చి జయంబుఁ గౌరవంబు నొంది తిరుగ వారణాసిని జేరి యందుఁ గొన్ని వత్సరంబులు సౌభాగ్యసుందరీసతితో గార్హ్యస్థభోగంబులొంది మల్లికార్జునగురుఁడ నేఁడు పుత్రుఁగని శివశాసన ప్రకారం బాంధ్రమండలం బందలి ముదిగొండయను గ్రామంబుఁజేరి యందు వసించి యాత్మజునకుఁ బంచమాబ్దంబున నుపనయనం బొనరించి శివలింగధారణదీక్ష నిచ్చె. అనంతరమున నిగమంబుల షడ్దర్శనంబులఁజదివించి శైవాగమరహస్యంబుల బోధించి పంచాక్షర్యఘోరమంత్రరాజంబుల సానుగ్రహంబుగ నుపదేశించె. క్రమంబుగఁ బుత్రుండును దనవలె సర్వసమర్థుఁడయ్యె. గురుండంతఁ బండిత కవులను రంజింపనెంచి హారలీలయను కుమారసంభవంబును ♦ అలంకార గ్రంథమును గావ్యాలఙ్కార సంగ్ర

---

* ఉద్భటుఁడు కాశ్మీర రాజగు జయాపీడుని సభలో క్రీ - 77 నుండి 813 వఱకు విద్యాధిపతిగా నుండెనని రాజతరంగిణిలో నున్నది.

శ్లో॥ విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహంకృత వేతనః
భట్టోభూదుద్భటస్తత్ర జయాపీడ సభాపతిః॥

♦ క॥ క్రమమునసుద్భటుడుగవిత్వము మెఱయఁగుమారసంభ♦వముసాలంకా
రముగూఢవస్తుమయకా, వ్యముగాహారలీల చెప్పిహరు మెప్పించెన్॥

ఉద్భటకృత కుమారసంభవ మిపు డుపలబ్ధముకాకున్నది. అందలి శ్లోకములు గొన్ని యాలంకారికు లుద్ధరించిరి. నన్నెచోడుని కుమారసంభవము పీఠిక చూడుడు.

ఇఁక మల్లికార్జునపండితారాధ్యుని శివతత్త్వసారమం దిట్లున్నది.

క॥ హారలీలా స్తవరచనా, స్థిర నిరుపమ భక్తి తనదు దేహముతోడన్
సురుచిరవిమానమున నీ, పురమున నుద్భటుఁడుప్రీతిఁ బోవఁడెరుద్రా!

హంబును విరచించి యాలఙ్కారికపండితులకుఁ గర్ణరసాయనం బొనరించె.

ఇఁక ఈ యుద్భటగురుని యవతారసమయమందు సల్లకియను నగరికి నాథుఁడైన ప్రమథేశ్వరుఁడను ఱేఁడు ప్రభావతియను రాణితో రాష్ట్రంబుఁ బాలింపుచు శివభక్తుడై శివలింగంబును బూజింపుచుఁ జెక్కెంబ్లవఱకు సంతానంబులేక చింతిల్లి శివప్రసాదఫలంబునఁ గాని పుత్రుండు జన్మింపఁ డనుకొని తత్సిద్ధికై కాశికేగి యందుఁ దపించి విశ్వేశ్వరప్రసాదంబునఁ బుత్రు నొందుదునని దృఢ సంకల్పమొంది మిత జనంబుతో భార్యను దోడ్కొని రథంబెక్కి సుముహూర్తంబునఁ బ్రయాణంబుచేసి యచటి కనతిదూరంబున నున్న కౌండిన్యముని గురుని యాశ్రమంబుఁ జేరి యందు విడిసి దంపతులిరువురును కౌండిన్యమునిఁ దారసించి వారి యడుఁగులకు సాష్టాంగపడిరి. మునియు నవ్వారి గౌర వించి యుచితాసనంబులిచ్చి మధురోదకఫలమూలంబుల నాతిథ్యంబిచ్చి వారల యభిమతంబెఱింగి హర్షించి మీ రనికొనివచ్చినట్లు కాశీయాత్ర నొనర్చి యందు విశ్వేశ్వరమహాదేవుని గూర్చి తపింపుఁడచిరకాలంబందే భక్తజనచింతామణియగు బాలేందుమౌళి మీకనుగ్రహించి పుత్రవరం బిచ్చునని యాశాసించె. దంపతులిర్వురు మురిసి విశ్వనాథుండే యిట్లు చెప్పుచున్నాఁడనికొని యవ్వారిసెలవొంది వెడలి కతిపయప్రయాణం బులతోఁ గాసినిజేరి యందు విశ్వేశ్వరుని గొలిచి విధ్యుక్తంబులను సల్పి గంగాతీరంబందొక పర్ణశాలను నిర్మించికొని అందు వసించి పరిజనంబుల రథంబులను నగరికనిపి నిష్ఠతో శివునిగుఱించి తపించుచుండిరి. ఫల మూల పర్ణజలానిలంబులఁ గ్రమంబుగ నుత్తరోత్తర మాహారంబుచేసి తపించుచుండఁ దరుణేందుధరుండు మెచ్చి యంబికతోఁ బ్రత్యక్షంబై వచ్చి వరంబడుగు మనియె. ప్రమథేశ్వరనృపుం డాత్మదేవితో నుమా శివుల చరణంబులకు సాష్టాంగ వందనంబు లాచరించి ప్రస్తుతులఁ గావించి వంశవృద్ధికై సుపుత్రు నిమ్మనియె. శివుఁ డామోదించి నీకు నా యం శంబున నుత్తమపుత్రుండు జన్మించి వంశవృద్ధి నొనర్చు నని యొక దివ్య సంతానఫలం బిచ్చి యద్దానిఁ బ్రభావతి నారగింపు మని యంతర్ధానొందె. రాజవర్యుండు సంతసించి కాశీయాత్రను బూర్తిగ సల్పి బ్రాహ్మణుల

కందఱ కిష్టదానంబు లిచ్చి స్వనగరికేగె. సుసమయంబునఁ బ్రభావతి శివదత్తదివ్యఫలంబు నారగించె. అనతికాలంబుననే చూలుగొనియె. శివాంశంబున నొక సుదినంబునం దైదుగ్రహంబు లుచ్చగతులై యుండు సునక్షత్రయుతశుభలగ్నంబునఁ బుత్రుండు బన్మించె. ప్రమథేశ్వరుఁ డానందంబునఁ బాడియావులను బంగరంబు నుత్తమబ్రాహ్మణుల కొసఁగె. సర్వజనంబులకు మృష్టాన్నంబులు బెట్టె. కోవెలలందలి వేల్పు లందఱ కుత్సవంబులొనర్చె. పుత్రునకు జాతకర్మం బొనరించి భోజుం డని యాహ్వాయంబుచేసె. బాలుఁడు దినదినం బభివృద్ధి నొందుచు తల్లి దండ్రుల యుల్లంబుల రంజిల్లఁ జేయుచుండెఁ గ్రమంబుగఁ బదియేడులు గడచినంతఁ బ్రమథేంద్రుండు నందనున కుపనయనం బొనర్చి వేద శాస్త్రంబులను ధనుర్వేదంబును నభ్యసింపఁజేయ భోజుం డచిరంబున నవ్వానియం దుత్తీర్ణుఁడై మఱియుఁ గత్తిసాము గరిడి అశ్వారోహణ గజారోహణ చంక్రమణములందుఁ గౌశల్యంబుఁ బడసి జనకున కానందం బుఁగూర్చె. ఇఁక రాజపుత్రుండిట్లు సులభంబుగ సర్వకలాకౌశల్య మొందియుఁ గూడ శివాంశసంభూతుండగుట నేహ్రిద్ధ శివభక్తితత్పరుండై యుండె. ఇట్లు శివభక్తిచేయుచును నొకనాఁడు నిజవిక్రమంబు జగంబునకుఁ జూపఁ గడంగి దిగ్విజయార్థియై చతురంగబలంబుఁగొని జనకాజ్ఞనొంది చని ప్రదక్షిణక్రమంబుగఁ జతురబ్ధిపరీతమగు ధరాతలంబునం దెల్లరాజుల నాజిన్ బరాభూతులఁ గావించి నిజసామంతులనుగా నొనర్చి తత్సమర్పితానేకమణికాంచనంబుల హయరథగోద్విపంబులఁ బడసి కతిపయమాసంబుల కాత్మపురిని జేరి యుత్తమ రాజపుత్రిక లగు మత్తకాశినుల నిరువురుగన్యలఁ బెండ్లాడి వారలతో భోగంబులొందుచు సుఖంబుగ నున్నంత తజ్జనకుండు కుమారుని విజయంబునకును దారా పరిగ్రహంబునకును తత్సాద్గుణ్యావైభవంబునకానందించి దానును బ్రభా వతియును గాశీపురంబు జేరి యందే విశ్వపతిని గొలుచుచుందు మని తనయునకు రాజ్యపాలన ప్రకారంబును రాజనీతియు ధర్మసంస్థాపనంబు మున్నగునవి యుపదేశించి తమ యాత్రకై బుజ్జగించి యొప్పించి ప్రయా ణంబుచేసిరి. ఇఁక భోజుండు తండ్రికన్న నెక్కుడుగ పాలనంబునఁ బ్రజల నానందింపఁ జేయుచు నుండియు మనంబునఁ బరమేశ్వరతత్వంబు నిశ్చిం

కంబుగ నెఱింగి శివలింగధారణము నొసఁగి తన్ను శివప్రసాదభాజనునిగ నొనర్పఁ దగిన దేశికుఁడెట్లు లభించునో! ఎపుడు కృతార్థుఁడ నగుదునో యని చింతించుచుండ నొకనాఁటిరాత్రి చరమయామమందు శివుండు స్వప్నమం దగుపడి నేఁటికి ముప్పదియైదవనాఁడు నా మానసపుత్త్రుండగు నుద్భటగురుఁడు నీ యాస్థానికి రాగలఁ డతఁడు నీకు పాశుపతలింగధారణదీక్ష నొసంగఁ గలఁ డా గురుని సేవింపుము. నీకు శుభంబయ్యెడు నని యంతర్ధానమొందె. ముంజభోజుఁడు స్వప్న వృత్తాంతమందఱకుఁ దెలిపి గురుమూర్తి యాగమనంబున కెదురు చూచుచుండె.

సీ॥ పుట్టె నే గురుమూర్తి భువనాద్భుతముగాగ
 నాగేంద్రహారుమానసము వలన
ఉండె నే యాచార్యమండలేశ్వరుఁడు భూ
 మండనంబగు ముదిగొండ యందు
గట్టె నే దేశికాగ్రణి చేతఁ గంకణం
 బలఖేచరుల దైన్యమపనయింప
గాంచ నే యాచార్యపంచాననుం డన్య
 మత భేదనక్రియాచతురబుద్ధి
తే. గరిమ నెలకొల్పె నే యయ్యగారిఱేఁడు
తరల కుండఁగ ధర శైవ ధర్మవృత్తి
యట్టి శ్రీయుద్భటస్వామి యరుగుదెంచె
రాజకుంజరుఁడగు ముంజరాజుఁ గుఱిచి.

మ. భసితోద్ధూళిత దేహకాంతులు శరత్ప్రాలేయభానుప్రభం
బసచేయన్ బహుశైవలక్షణములన్ భాసిల్లుటన్ మూర్తిశాం
తిసముల్లాసమునం దలిర్చి యట ధాత్రీనాథునాస్థానరం
గసమీపంబున నిల్చె నుద్భటుఁడు శ్రీకంఠాపరాకారుఁడై.

తెనాలిరామలింగకవి ఉద్భటారాధ్యచరిత్రము.

తత్కాలంబందే ముంజభోజుఁ డాస్థానంబుఁ జేరియున్నకతంబున యదృచ్ఛన్ జేసి యుద్భటగురుని గాంచి యంతనే భయభక్తు లొదవి వేగిరింప.

మ॥ మనమారసుందరసౌమ్యతైక కలనన్ ♦ మత్తిల్లఁ గంఠీరవా
సనమున్ బూర్వ నగంబు డిగ్గరవి యో ♦ జన్ డిగ్గి పాపౌఘమ
ర్దనమున్ దద్గురుసార్వభౌమునిపద♦ద్వంద్వంబుఁ గోటీరర
త్ననికాయోల్లసదంశుమంజరులచే ♦ గప్పెన్ విశుద్ధాత్ముఁడై॥

గీ॥ ప్రణతుఁడై యిట్లు మాంపాహి ♦ పాహిపాహి
యనుచుఁ బులకాంచితాంగుఁడై ♦ పలుకునృపతి
లేవనియమించి యా గురు ♦ లింగమూర్తి
పెట్టె శివరక్షయనుచు సం ♦ ప్రీతి భూతి॥

సీ॥ శరదిందుచంద్రికా ♦ చారుప్రభాలబ్ధి
యఖిల దిక్కులనిండి ♦ యమరువాని
నిత్యప్రసాదమా ♦ నితరూపసంపత్తి
మించి చూపరుల బొం ♦ కించువాని
అతిశాంతనిజకటా ♦ క్షాంచలసామగ్రి
దలపులోపలిశుద్ధిఁ ♦ దెలుపువాని
అమృతధారార్ద్రవా ♦ క్యశ్రేణిఁ బశువుల
నైనఁదద్జ్ఞులఁ జేయు♦నట్టివాని

గీ॥ పాపపుంజంబు విరియింప ♦ నోపువాని
బుణ్యముల పుట్టినిల్లయి ♦ పొలుచువాని
సకలశైవాగమార్థల ♦ క్షణధురీణు
నలఘు విజ్ఞాను నుద్భటుఁ ♦ బలికె నృపతి॥

శా॥ ఆదిబ్రహ్మకపాలభూషణుఁ ద్రిమూ ♦ ర్త్యాత్మున్ శివున్ వహ్నిచం
ద్రాదిత్యాంబరగంధవాహజలభూ ♦ యజ్వస్వరూపున్ జిదా
మోదున్ శంభు భజించి యోగిజనతా ♦ ముఖ్యుండవై యున్ననీ
పాదాబ్జంబులఁ గంటిఁ బాశములచేఁ ♦ బట్టూడి శైవాగ్రణీ!

ఉ॥ ఏమితపంబు చేసి పర ♦ మేశ్వరు నేక్రియఁ గొల్చినాఁడనో
యేమునుపంటి పుట్టువున ♦ నిట్టి గురూత్తము నిన్నుగంటి మ
త్కామిత మబ్బెఁ బాపములఁ ♦ గ్రాచితి ముక్తి కురంగలోచనా
కోమలదృగ్విలాసములఁ ♦ గొల్లలఁ గొట్టుదు నింకమీఁదటన్

క॥ శివలింగము ధరియింపక, యవివేకము సుఱుఁగదనుచు ♦ నాత్మజ్ఞులు వే
దవిదులు చెప్పఁగ వినివిని. తవులుదుఁ జింతాభరంబు ♦ తత్త్వజ్ఞనిధీ!

రామలింగకవి ఉద్భటారాధ్య|చరిత్రము

కావున లింగధారణంబు ప్రకారంబును శివలింగార్చనావిధానంబును దెలిపి నన్ను లింగదీక్షితుని జేయుమనుచుఁ బునఃపున ర్వందనంబులాచరించుచున్న రాజవర్యుని జూచి గురుసార్వభౌముండిట్లనియె. రాజేంద్రా! నీ సంకల్పంబునకు మెచ్చితి. పూర్వజన్మంబునం దొనర్చిన పుణ్యవిశేషంబు కతన నీకిట్టి శివభక్తి యొదవె. కాకున్న నిట్లొనరదు. ఇట్టి మతియే మాననీయంబగు

క॥ ఈయంగన లీయాత్మజు, లీయర్థము లీపురంబు ♦ లిన్నియును దృణ
ప్రాయములుచేసి మదిలోఁ, నాయిందూత్తంసు నిలిపి ♦ తద్భుతమధిపా!

సీ॥ హరున కర్పింపని ♦ యన్నంబుఁ గుడుచుట
గుత్సితోచ్ఛిష్టంబుఁ ♦ గుడిచినట్లు
భవున కర్పింపని ♦ పానీయమానుట
మానక యాసవం ♦ బానినట్లు
శివున కర్పింపని ♦ పువుతావిఁ గ్రోలుట
కుణపధూపంబోలి ♦ గ్రోలినట్లు
శంభుభక్తుఁడు గాని ♦ జడబుద్ధి నంటుట
గెంటక క్షుద్రుని ♦ నంటినట్టు
గీ॥ పశుపతికిఁ గానిపుణ్యంబుఁ ♦ బట్టుటయును
బాపములుసేయ యత్నంబు ♦ పట్టినట్టు
లనుచుఁ బ్రాజ్ఞులు విజ్ఞాన ♦ మతిశయిల్ల
నన్ని తెఱఁగులఁ బూజింతు ♦ రష్టమూర్తి॥

ఇఁక శివలింగదీక్ష లేక మోక్షంబుఁ బడయరామిని వివేకంబున నెఱింగియుంటి వట్లుగావున నట్లుచెందుట యవసరంబే. ఇఁక నట్టిలింగధారణంబున కాశ్వయుక్కార్తిక మార్గశీర్ష ఫాల్గున మాసంబులును వైశాఖజ్యేష్ఠమాసంబు లుత్తమంబులు మాఘమాసంబు మధ్యమంబు చైత్రాషాఢశ్రావణభాద్రపదపౌష్యమాసంబులు కనిష్ఠంబులు. సూర్యచంద్రోపరాగంబులు శ్రేష్ఠంబులు. శుక్లపక్షం బుత్తమంబు. కృష్ణపక్షం

బందుఁ బంచమి యుక్తంబు. ఉభయపక్షములందును జతుర్థీ షష్ఠ్యష్టమీ నవమీచతుర్దశీ పూర్ణిమామావాస్యలు శివదీక్షకయుక్తములు. రోహిణీ మృగశీర్షా పుష్య పునర్వసూ హస్తానురాధలును ఉత్తరఫల్గున్యుత్తరాషాఢా మూలరేవతులును ప్రశస్తములు తక్కిన నక్షత్రంబు లగ్రాహ్యాంబులు. రాశులందు స్థిరంబు లుత్తమములు చరంబులు పరిహార్యంబులు. ఇట్లు దోషరహింబగుశుభసమయమందుఁ జిన్మయదీక్షావిధానాను సారంబుగ శివలింగధారణంబు నొందవలయు ననిన ముంజభోజుండు మురిసి శుభసమయంబారసి గురూక్తప్రకారంబుగఁ దానును సతులును లింగధారణంబొంది గురుచరులకు మహోత్సవదానంబులొనర్చి యఖిలజనులను మృష్టాన్నంబుల దనిపి దేశికబుత్విజ్మాహేశ్వరాశీస్సుల నొంది యానందించిరి. అనంతరము ముంజభోజుండు మోహంబుఁబాసి వైరాగ్యంబు నిచ్ఛగించుచున్నంత ఉద్భటగురుండు సలిలంబందలికమలంబువలెఁ గొన్ని నాళ్ళు సంసారంబందుండి ప్రజాపాలనంబుఁజేయు మటమీఁద శివానుగ్రహంబుచే గైలాసవాసంబు దృఢఁబుగఁ గల్గునని శిష్యున కాదేశించిన ఱేఁ డందుల కామోదించి యట్లు ప్రజాపాలనంబు చేయుచు శివభక్తిని శివమతంబును వృద్ధిచేయుచుండె.

సీ॥ ఇందుశేఖరముచే ♦ నేమూర్తి దనరారు
నామూర్తి తానయై ♦ యతిశయిల్లి
ఇభచర్మపటమున ♦ నేమూర్తి గొమరారు
నామూర్తి తానయై ♦ హరువుసూపి
ఇలరథంబుగఁ బన్ని ♦ యేమూర్తి జయమొందు
నామూర్తి తానయై ♦ యనువుమిగిలి
ఇక్షుధనుర్మూర్తి ♦ నేమూర్తిపైఁబూయు
నామూర్తి దానయై♦యయముగల్గి
తే-గీ॥ యున్న యుద్భటగురునాథు ♦ నుగ్రకలుష
కరటికంఠీరవస్వామి ♦ చరణ యుగళి
తనకు నిహపరఫలసిద్ధి ♦ జనని గాఁగ
భూమిఁ బాలించు శ్రీముంజ ♦ భోజమూర్తి.

క॥ చరలింగమూర్తి యగునా
గురుదేవుని సింహపీఠిఁ గోరికనిడి త
చ్చరణాంభోరుహములకును
బరిచర్య యొనర్చు నవని పతియనుదినమున్.

ఉద్భటారాధ్య చరిత్రము.

ముంజభోజుండు ముదిగొండనుండి యుద్భటగురుపత్నీపుత్రుల రప్పించి సకుటుంబంబుగ వల్లకీపురంబందుఁ గాపురంబుంచి సేవించుచుండె నంత నుద్భటగురుం డొకనాఁడు శివశాసనంబు స్మరించి వసుధామండలిని శివభక్తి నిండారె శివలింగధరులు విస్తరిల్లిరి సమర్థుఁ డగు ముంజభోజనృపుండు లింగధారణంబొంది శైవమతంబు నాత్మరాష్ట్రంబునం దంత వెలయింపఁ జేయుచుండె నిఁక భూతంబులై వందురుచున్న గంధర్వులకు శాపమోక్షం బొనరించుటయే యవశిష్టంబు గావున నద్దాని నెరవేర్తు నని స్నాతుండై భస్మరుద్రాక్షాలంకృతుండై గ్రీవం బందలి ప్రాణలింగంబును

శా. హస్తాబ్జంబున సంగ్రహించి వరపద్మాసీనుఁడై జాతవే
దస్తారాధిప భానుభానువులకున్ దానైక్యుఁడై యొప్పుత
న్నిస్తంద్రోజ్వల మూర్తిపై విషయముల్ నెక్కొల్పి యోగంబుచే
మస్తోచ్ఛేదముచేసి జీవితము సంబంధంబుఁ ద్రోచెన్ వెసన్॥

తే-గీ. ఆ మహాయోగి బ్రహ్మరంధ్రాంతరంబు
వెడలె శతకోటి రవిదీప్తి విలసనంబుఁ
గలుగు తేజంబొకండు దత్కరతలేశ
లింగమును గూడి హాయిఁబొందె లీలనెగడి.

ఉద్భటారాధ్య చరిత్రము.

అపు డుద్భటగురుని దేవియుఁ బుత్రుఁడును ముంజభోజనృపతియుఁ బరితాపంబొంది యామీఁద దేశికుని యాదేశానుసారంబుగఁ దత్పురోపకంఠంబునం దున్నట్టి న్యగ్రోధద్రుమసమీపంబున గంధకాష్ఠంబులతోఁ జితింబొనరించి గురుకళేబరంబం దుంచి దహించి రా ధూమంబు సోకిన యంతనే భూతంబులెల్ల సిద్ధరసవశంబున లోహంబు హేమంబైనట్లు దివ్యదేహంబులొంది గంధర్వులై పరమానందంబున జయధ్వాను

లోనర్చుచుఁ గుబేరనగరంబుఁజేరి రందొకచిత్రరథుండు మాత్రి మాహారార్థంబు దవ్వులకుఁ జని యుండుట నతఁ డందుఁ జేరకయుండె నమ్మరు నాఁడచటికి వచ్చి వటం బందలిభూతపుంజంబును గానక చేరువ నున్న యుద్భట గురుని తనుభస్మంబున నస్థులను జూచి యక్కటా! చెడితి మోసపోయితి భాగ్యంబుఁ బాసితి. ఇఁక నేమిసేయుదు నెట్లీపై శాచ దేహంబు నుజ్జగింతు నని దీనుండై యేడ్చుచు ముంజభోజనృపతి పాలికిఁ బోయి మ్రొక్కి చరిత్రంబంతయుఁ బూసగ్రుచ్చినట్లు నుడివి పవిత్రతమం బాగురునికాష్ఠంబందు మరలఁ గొన్నియింధనంబు లుంచి యగ్గిం దరికొల్పినఁ దదస్థిస్పర్శ గల యగ్గిపొగ తాకున దనకుఁ గూడ శాపతనువు దొలఁగి గంధర్వదేహంబు సంప్రాప్తం బగు నని ప్రార్థించె. దయాళుం డగునతం డట్లు చందనకాష్టంబులందు ఘృతంబుంచి చితి స్థలంబున నగ్గిగూర్చినఁ జిత్రరథుండు తద్ధూమస్పర్శంబున భూతదేహం బుఁబాసి గంధర్వపతియై యెగిరి కుబేరపురిఁ జేరె. ఉద్భటగురుపుత్రుం డు జనకున కౌర్ధ్వదేహికకృత్యంబుల నెరవేర్చి రాజు ననుమతిఁ గొన్నియేడులు వల్లకీపురమం దుండి యటుపిమ్మట ముదిగొండఁజేరి వసించె. ఆ గురుమూర్తికి బోలనారాధ్యుం డనుపుత్రుండు జన్మించె నవ్వారివంశంబు వా రందఱు ముదిగొండవారనఁ బరఁగుచుఁ బెక్కు తెగలవారై యాంధ్రమండలిఁ బ్రభులచే మాదల రెంటపాళ్ళ మేడి పాలెము ధవళపురి మున్నగు ననేకాగ్రహారంబు లొంది వృద్ధిగొనిరి. ముంజభోజుండును గుర్వాజ్ఞచే శైవమతంబును సర్వతోముఖంబుగ వృద్ధి గూర్చుచుఁ జివరయందు శంకరపదంబుఁజెందె నిది యఖిలపాపఘ్నం బును సర్వశ్రేయస్సంపాదకంబును నగు నుద్భటారాధ్యదేశికసార్వభౌమ చరిత్రంబు.

## 30. వేమనారాధ్య గురుఁడు

శ్లో॥ యస్మిన్ సర్వం యస్తు సర్వత్ర సర్వో
యో వైకర్తా యోఽవితా యోపహర్తా
నోయస్యాది ర్యస్సమస్తాది రేకో
నోయస్యాంతో యోంతకృత్తం నతోస్మి ॥

స్కాందకాశీఖండము.

తా॥ ఎవనియందు సర్వంబు గలదో ఎవఁడు సర్వంబందుఁ గలఁడో ఎవఁడు సర్వమునకుఁ గర్తయో ఎవఁడు రక్షకుఁడో ఎవఁడుసంహారకుఁడో ఎవని కాదియనునది లేదో ఎఁవఁడు సమస్తమున కాదియో ఎవని కంతము లేదో ఎవఁడు సర్వంబున కంతము చేయువాఁడో యవ్వాని గుఱించి నతుఁడనగుచున్నాను.

బెలిదేవియనెడు గ్రామమందుఁ గౌండిన్యసగోత్రుండు వేమనారాధ్య గురుండను నగ్రజన్మశ్రేష్ఠుండు విద్వాంసుండు ఇష్టలింగపూజాపరాయణుండుండె. అతఁడొకనాఁడు శివపూజాపుష్పంబులను దెచ్చికొనుటకై వనంబున కేగి పుష్పంబులను బిల్వదళంబులను గోసికొని పుట్టికయం దుంచికొని శివమంత్రంబును హృదయంబందు స్మరింపుచు స్వాగారంబున కేతెంచుచుండె. అంతలో నాదేశంబు నేలు మహారాజు తన రాణితో నేనుంగునెక్కి ఎచటికో పోవుచు మహనీయుఁడగు వేమనారాధ్యుని గాంచి భక్తితో వినయముతోఁ దాను రాణితోఁగూడ దంతావళంబును డిగ్గి మహాత్మా! నమస్కారమనియె. దేశికుండు చూచియుఁ జూడనట్లు వినియు విననియట్లుగ నధ్వంబున నడుచుచుండె. తేఁ డది చూచి గురుండు చూడకయుండె వినకుండె అట్లు గాకున్న నన్ను నుగ్రహించి యాశీర్వచనంబు లీకుండునే యని రయంబున సతిఁ దోడ్కొని గురుపథంబున కడ్డమువచ్చి మరల నమోవాకంబు జెప్పె. అపుడుఁ గూడ వేమనగురుండు రాజును బాటింపక తొలఁగి పోవుచుండుటను జూచి ప్రభుఁడు విచారపడి కినిసి ఏమిట్లు శరణుచేసినవాని ద్రోచి యాశీస్సిడక మిన్నక పోవుచుంటిరని గురుని గదిసి యడిగెను. అపుడు దేశికుఁడు మందహాసముతో రాజుకు రేపటిదినమున మిత్తి రానున్న దనియు ఇపుడది సమీపించుచున్నదనియు అందులకై తన దీవన వృథా కాకుండుటకై ఆశీస్సును బల్కలేదని యిలుచేరెను. నృపతి యంతఁ గుపితుండై యాచార్యుని వచనంబును లెక్కసేయక తృణీకరించి ఈతఁడు సర్వజ్ఞుఁడా! ఈయనకు రేపు నాకు రాఁబోవుముప్పు దెలిసినదా! సుంత రోగంబు లేక ఆరోగ్యముతో బలము కలిగి యున్న నేను రేఁపు మృతి నొందుదునా! యని గర్వముతో నాచార్యుని దూఱుచు దూషింపుచు మరలఁగరి నెక్కి నిజప్రాసాదమును జేరి మృష్టాన్నంబులారగించి రాణితో

సుఖంబు గనుండె. ఆరాత్రియు నట్లే సుఖోపభోగంబులఁ గడపె. అమ్మఱునాఁ డుషస్సునఁ గాల్యంబులఁదీర్చి స్వోచితకార్యంబులను సల్పి దారసానితోఁ జతురోక్తులాడుచు భుజించి రాత్రియైనంత గురువచనమ్ము వమ్మైనట్లుఁ దలఁచి మఱునాఁ డగ్గురుని మందలించి వంచింపఁదలంచి మధురభక్ష్యాన్నంబుల దేవితోఁ గుడిచి కప్పురంబు విడెంబువేసి సురభి గంధమాల్యాలంకృతుఁడై యట్లలఙ్కృతయైన సతితోఁ గామసుఖంబు లొంది తనిసి బంగరు తూగుటుయ్యేలందలి పట్టుపరుపుపైఁ బరుండి యిర్వురు నిద్రించిరి. అటుపై రెండుజాములరాతిరి వెలపటినుంచి యొక కాలసర్పంబు వచ్చి గోడకుఁ బ్రాకి యొక కిటికీనుండి సౌధాంతరాళంబుఁ జొచ్చి కప్పుఁజేరి తూగుటుయ్యేలకుఁదిగి రాజును గఱచిపోయె. వెంటనే యతండు శోణితం బొలుకుచుండ హాయని కెవ్వున నఱచి పదంబుల నేలఁ గొట్టుకొనుచు మృతిఁజెందె. రాణియుఁ దెలివొంది మరణించినమగని జూచి విహ్వలయై యెలుగెత్తి భోరున నేడ్చె. ఆ రోదనధ్వనివిని పరిజనులందఱు దెలివొంది యంతఃపురంబుఁజేరి మూగి మృతుఁడైన రాజును విలపించుచున్న రాణిని జూచి విస్మితులై పాముకాటుగల రాజు మొగంబుఁజూచి యందఱువిలపించిరి. తెల్లవాఱువఱకాయుదంతంబు పురమందును జుట్టునున్న పల్లెలయందును నిండె. అట్టివార్తను విని రాజబంధువులును మంత్రులు సేనానులు పురోహితులు పౌరప్రముఖులందఱు నాతురులై రాజభవనంబుఁ జేరిరి. అపుడందు ఘోరదుఃఖంబుతో నేడ్చుచు మొదలంటఁ బెఱికిన తీవవలెఁ బుడమిఁబడియున్న దేవేరిని జూచి మెల్లమెల్లని నుడుల దుఃఖశాంతికై చెప్పుచుండ నాయమ దీనస్వరంబున నేడ్చుచు గతదినప్రభాతంబందు ఆరాధ్యగురుం డాడిన నుడులను వక్కాణించి ప్రభుండు తద్వచనంబులను గురుని గూడ లెక్కసేయక వచ్చి యిష్టోపభోగంబుల నొంది యుండుట యేకాక ఆచార్యోక్తి వృథా యైనదనుకొని మఱునాఁ డాగురుని మందలింపఁగడంగి యుండుటయును రాత్రి ప్రథమయామాంతంబున నుభయులు నిద్రించుటయును ఆ పైని గొంచెము తడవులోనే ఇట్టి ఘోరము జరుగుటయును దెలిపిన నవ్వారందఱొక్కింతసేపు దుఃఖించి యంత ధైర్యముచేసి యిట్లనిరి. మహనీయుండగు నారాధ్యగురుం డట్లు నిర్యాణంబుఁ దెలిపినయపుడే

యవ్వారి యడుగులఁబడి విడువక మహాత్మా! యెట్లైన నీముప్పుఁదప్పింపు మని వేడుకొన్నచో నమ్మహాత్ముండట్లనుగ్రహింప శక్తుండే. "కిందు స్కారం శంకరకింకరాణాం" శంకరభక్తులకు దుష్కరం బేమియుండును. వేడలక్ష్యముచేయుటచే నిట్లు ముప్పుమూడె. ఇప్పుడేని వారిని జేర నరిగి యిందఱము వారిసన్నిధిఁబడి వేడుకొనిన గురున కనుగ్రహము రాకపోదని యందఱును రాణియు శ్రీవేమనారాధ్యగురుసార్వభౌముని గృహద్వారంబుఁజేరి అందఱు ముంగిటమూగి ఘొల్లున నేడ్చుచుండిరి. అభ్యంతరగృహమందుండిన యాచార్యుఁ డాయార్తధ్వనివిని వాకిటఁ జేరిచూచె. అపుడందఱు రాణియుఁ బుడమిఁబడి గురుదేవా! యనుగ్ర హింపు మనుగ్రహింపుము. దీనుల మాపన్నులము. ఇట్టివారి ననుగ్ర హించి రక్షింపుటయే తమలాటిమహాత్ములకుఁ గర్తవ్యము. తాము ప్రత్యక్షశివులు నిగ్రహానుగ్రహ సమర్థులాశ్రితకల్పద్రుమంబులు. రా జెఱుంగక తమనుడి నలక్ష్యముచేసి పోయి యిట్లు మృతుండయ్యె. ఓశివ మూర్తి! నీ కీతనిప్రాణంబులొసఁగి యందఱ నానందింపఁజేసి రక్షిం చుట దుర్లభముగాదు. శివయోగులిట్లెందఱినో పునర్జీవితుల నొనర్చిరి. మున్ను బుషభయోగీంద్రుండు మృతిచెందిన భద్రాయువును బ్రదికింప లేదా? మీర లట్టివారలే. పతిమృతిచేఁ బురపురఁ బొక్కుచు నేడ్చు చున్న నీరాజసతికిఁ బతిభిక్షను బెట్టి యాదరింపుఁడు. మమ్మందఱను నీ దేశంబు నంతను అనాథంబు గాకుండ సనాథంబును జేయుఁడు రక్షిం పుడు రక్షింపుఁ డనిమ్రొక్కుచు నేడ్చుచున్న వారలను జూచి గురుండు హృదయంబునఁ గనికరమొందె. ఇంటనున్న శిష్యులు మున్నగువారు గూడ గురుండు కరుణించుటకై వీక్షించుచుండిరి. అంత దేశికుఁ డా యూరను బ్రాంతంబులందు నున్న యారాధ్యులను బిలిపించి యుచిత పీఠాసీనులఁ బొనర్చి తీర్థంబున వారల చరణంబులను శివమంత్రంబులతో నభిషేకించి యర్చించి యవ్వారికి విభూతి వీడ్యంబులను హిరణ్యంబుల నిచ్చి సంతుష్టులఁ గావించి రాజదేహంబుఁ దెప్పించి శుద్ధోదకంబుతోఁ గడిగించి శుద్ధవస్త్రంబుల ధరింపఁజేసి నెన్నుదుటిపై భూతిత్రిపుండ్రంబుల దిద్దించి శ్రీ శివునకు జగదంబికకు గణపతి కుమార వీరభద్ర నందికేశ చండీశ భృంగీశ మహాకాలాదులకు మ్రొక్కులిడి ఆత్మగురుచరణంబు

లకు జోహారుచేసి మాహేశ్వరుల కందఱకు సాష్టాంగపడి మ్రొక్కి మాహేశ్వరచరణతీర్థంబుఁదెచ్చి రాజదేహంబందు శివమంత్రంబుల నుచ్చరింపుచు సేకంబొనర్చి రాజా! లెమ్మని తనహస్తంబున స్పృశించినంతనే రాజు కన్నులుదెఱచి కూర్చుండి ఆచార్యుని చరణంబులందు శిరంబుంచి మ్రొక్కి "క్షంతవ్యోమేఽపరాధః" యని పునఃపునర్వందనంబు లాచరించె. రాణియుఁ దక్కిన వారందఱు హారుసించి స్వామికి సాష్టాంగపడి మ్రొక్కిరి. రాజదంపతు లాక్షణంబుననే గురుని యనుగ్రహంబున నుత్తరశైవదీక్షయగు శివలింగధారణదీక్ష నొంది ధన్యులైరి. అట్లే ఘటికొండఱుగాడ గురునిచే లింగధారణంబు నొందిరి. మాహేశ్వరులంద ఱిష్టాన్నంబుల నారగించి స్వాగారంబుల కేగిరి. మహారాజదంపతులు శ్రీగురుతీర్థప్రసాదంబు లొంది యానందముతోఁ బరిజనులతో నాత్మప్రాసాదంబుఁజేరి శైవమతంబు నభివృద్ధి నొనర్చుచుండి రిది మహనీయుఁడగు వేమనారాధ్యగురుని చారిత్రం బఖిల కల్యాణకారణము. *

---

* ఈ వేమారాధ్యగురుఁడు శివాపచార మొనర్చితినని పాదములను గత్తితోఁ గోసికొనినపుడు శ్రీ మల్లికార్జున పండితారాధ్యుఁడు వచ్చి పాదములను దిరుగ నంటించినందుచేతను శ్రీ విశ్వారాధ్యగురునొద్ద మల్లికార్జున పండితారాధ్యుఁడు కల్యాణ శివదీక్ష నొందుటచేతను బసవమంత్రిని జూచుటకై మల్లికార్జున పండితారాధ్యుఁడు నిడుగుడమలవఱకుఁ బ్రయాణము చేయుట చేతను శ్రీవేమారాధ్యుఁడును విశ్వారాధ్యుఁడును మల్లికార్జున పండితుఁడును బసవేశ్వరుడును నించుమించు సమకాలికులగుట స్పష్టము. ఇందుచే వీరలు నల్వురు క్రీ॥ ౧౧ శతాబ్ది చతుర్థభాగమునుండి ౧౨వ శతాబ్ది ద్వితీయ భాగాంతమువఱ కున్నట్లు తెలియుచున్నది.

# 31. విశ్వారాధ్య గురుఁడు

శ్లో॥ యన్నైకాఖ్యా వాజిమేధేన తుల్యాం
యస్యానత్యాప్యైకయాల్పేంద్రలక్ష్మీః
యస్యస్తుత్యా లభ్యతే సత్యలోకో
యస్యార్చాతో మోక్షలక్ష్మీర్నదూరా ॥

తా॥ ఎవని యొకనామధేయ మశ్వమేధముతో సమానమో ఎవని యొక నమస్కరణము దేవేంద్ర లక్ష్మినిగూడ అల్పముగఁ గన్పింపఁ జేయునో ఎవనిస్తుతిచే బ్రహ్మలోకము లభింపఁ బడునో ఎవని పూజనముచే మోక్షలక్ష్మి సన్నిహితమో అట్టి శివుని గొలుతు నని అధ్యాహార్యము.

-స్కాందకాశీఖండము.

గోదావరీపావనతీరంబున శ్రీసోమేశ్వరలింగసాన్నిధ్యంబందుఁ జెలువొందు కోటిఫలీతీర్థస్థలంబందు కాశ్యపగోత్రుండు విశ్వారాధ్యుం డని ప్రసిద్ధి నొందిన విశ్వనాథారాధ్యుం డసదృశతపస్సంపన్నుం డిష్టలింగపూజాపరాయణుండు మహామహుండు

ద్విపద. ధరణి శివాద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయవైశేషికోదాత్తశాస్త్రీన
పాయదర్శన పరిపాలనక్షముఁడు
స్వాకృపావలోక నోత్పాదిత శిష్య
నికరమలత్రయ నిష్టితేంద్రియుఁడు
తంత్రాధిగతవీరతంత్ర స్వతంత్ర
మంత్రాధిగత రాజమంత్రసిద్ధుండు
వేదవేదాంత వివిధపురాణోప
పాదిత కేవలభక్తివర్ధనుఁడు
పండితనుతపాదపద్ముండు సుకవి
మండలివిబుధసమాజపూజితుఁడు

ఆరూఢ కీర్తిశుఁడగు కోటిపల్లి
యారాధ్యులందు లోకారాధ్యమూర్తి.
(మల్లికార్జున పండితారాధ్య చరిత్రము)

కలఁడు. ఆ యనఘుఁడు కోటిపల్ల్యారాధ్యసార్వభౌముఁడనియు ఆరాధ్య దేవుండనియుఁ గూడ జనంబులచేఁ బిలువఁబడుచుండు. అనవరత మిష్ట లింగయోగానందపారవశ్యుఁడై నను దన్ననసరించి యుపాసించు విద్వ ద్బ్రాహ్మణులను మహారాజులను ఇతర ప్రముఖజనంబులను అవిద్యా తమంబునుండి బాపి స్వకీయవిద్యాప్రబోధప్రకాశప్రసారంబు లొసంగి ముక్తిమార్గమందుఁ బ్రవిష్టులనొనర్పుచు వందారుజనసందోహ వాంఛితార్థంబులకుఁ గల్పద్రుమంబై యుండె. దాక్షారామంబందు నివ సించియున్న భీమారాధ్యునకుఁ బారమేశ్వరాంశంబునఁ బ్రభవించిన మల్లికార్జునపండితారాధ్యునకు శివాదేశంబున ఇరువది యొక్క దీక్ష లతోఁ గూడికొనిన త్రిదీక్షులతో లింగధారణదీక్ష నొసంగి యనుగ్ర హించె. అరణియందలి యగ్ని ఘర్షణమాత్రంబునఁ బ్రత్యక్షమైనట్లు సద్గురుప్రసాదితదీక్షతో మల్లికార్జున పండితునకు శాంభవ తేజఃపరం పర లావహించి విరాజిల్లె. గురుశిష్యు లిరువురు లక్షణామ్నాయ ప్రమా ణంబులచే దుర్మతంబుల నిర్మూలింపుచు శైవమతసిద్ధాంతంబును బ్రబో ధించుచుండిరి. ఇఁక నొకనాఁడు విశ్వారాధ్యుండు కొందఱంతేవాసు లతో స్నానార్థంబుగఁ గృష్ణాధునీతీరంబుఁ జేరి యందు స్నానాదిక మొనర్చి వామహస్తంబం దిష్టలింగమును జేర్చి పూజింపుచుండ శిష్యులు దేశికుఁడు వసించియున్నస్థలమున కనతిదూరంబున నున్నప్రత్తిపా డని యెడు గ్రామంబు పంటభూమి యందలి కొండొక ప్రదేశంబందు సస్యాంకురంబులను హిరణ్యాంకురంబులనుగ నొనర్పుఁడని కోరిన గురుండు మందహాసముచేసి శివమంత్రపూతంబగు నొక్కింతభూతిని నందుఁ జల్లించి రేఁడెకరముల భూమియందు మేలిమి బంగరు ముక్కలను బుట్టించె. అదివిని అట్టిగురుని తపస్సామర్థ్యంబునకు విస్మితుండై తత్కా లంబం దాదేశంబు నేలుచున్న క్షత్రియప్రభుండు లాంగూలగజపతి యనునతఁడు వచ్చి గురుని దరిసించి సాష్టాంగపడి మ్రొక్కి తద్‌క్షణం బున ప్రత్తిపాడనియెడు నాయూరును గురున కగ్రహారముగ నిచ్చి

గురునియమనుగ్రహంబునకుఁ బాత్రుఁడయ్యె. తదాదిగ నేఁటివఱకా గ్రామం బు పైడిమొక్కల యని పిలువఁబడుచుండె. అనంతరము గురుఁడా గ్రామంబునందుఁ గొన్నాళ్ళుమాత్రముండి అచ్చటనుండి వెడలి శిష్యులతోఁ గాశీపురికేగి యందుఁ గొన్నేళ్ళుండి యచటి విద్వద్గణంబును దమ విద్యామహిమచే శివలింగతత్త్వబోధంబుచే రంజించి రాజానుమోదంబుచేఁ గేదారఘట్టంబం దొక మఠంబు నిర్మించి శైవుల నందు నివసింపఁ జేసి తా నంతేవాసులతో స్వదేశంబునకు విచ్చేసి ఇవటూరను గ్రామంబును తద్భూపతిచేనగ్రహారంబుఁబడసి కోటిపల్లియందు సర్వవిద్వజ్జేగీయమానుండై యుండె. ఆయారాధ్యునిసంతానంబువారలు ధీరులై సూరులై పుణ్యులై గణ్యులై శైవమతాచార్యులై వెలసి పెక్కురకు శివలింగధారణంబొనర్చిరి. క్రొత్తపల్లి ఐదంపూడి ఏలేటిపాడు మినమించిలిపాడు వీరభద్రపురము కొఱగుంటపాలెము మున్నగు గ్రామంబుల నగ్రహారంబు లొందిరి. అట్టి విశ్వారాధ్యగుర్వన్వయము వృద్ధియైనంత నీవంగడపువారు కోటిపల్లియందేకాక పాలగుమి పాలంక పాలకుఱికి ఇవటూరు మున్నగు గ్రామంబులందుఁ గాపురంబుండుటఁ జేసి పాలగుమివారనియుఁ బాలంక వారనియు పాలకుఱికి వారనియు ఇవటూరివారనియు నింటిపేరులఁ జెందిరి. ప్రముఖులైన బ్రాహ్మణులులు నియోగిశాఖవారనేకులు వీరికి శిష్యులైరి. అట్టి ఈ శ్రీ విశ్వారాధ్యగురువంశ మండలియొక ముక్తామణి సోమనాథ విద్వన్మహాకవి. ఈ మహాత్ముం డశ్రాంతశివలింగావధానధురీణుండు వీరశైవవ్రతైకపరాయణుండు చతుర్వేదదర్శనకోవిదుండు కరస్థలవిశ్వేశగురుప్రసాదితకవితాసన్నివేశుండు నిగ్రహానుగ్రహసమర్థుఁడు విద్వత్కవి ఓరుగంటియందుఁ బ్రతాపరుద్రమహీపాలునిచేఁ బూజింపఁబడి డోకిపర్తియను గ్రామంబు నగ్రహారంబును బడసి శిష్యులఁ గొసఁగెను. బసవపురాణంబును మల్లికార్జునపండితగురుచరిత్రంబును చతుర్వేదసారంబును ప్రభులింగలీలను రచించి తమ ప్రౌఢపాండితిని శివభక్త్యతిశయమును బ్రకటించి సన్నుతచరిత్రుండయ్యె. నేఁటివఱకుఁ గూడ ఈ విశ్వారాధ్య గురువంశ్యులగు నివటూరివారు చాతుర్వర్ణ్యపూజ్యులై ప్రసిద్ధి వహించియున్నారు. శివనిభుండగు విశ్వారాధ్య గురుని చరిత్రం బిది పాఠక శ్రోతలకు సర్వశ్రేయోనిధానంబు.

# 32. శ్రీపతి పండితారాధ్య గురుఁడు

శ్లో॥ తోయేశైత్యం దాహకత్వంచ వహ్నౌ
తాపోభానౌ శీతరశ్మౌ ప్రసాదః
పుష్పేగంధో దుగ్ధమధ్యేతు సర్పిః
యత్తచ్ఛంభో త్వం తతస్త్వాం ప్రపద్యే ॥

తా॥ ఉదకమందు శైత్యమును అగ్నియందు వేడిమియు సూర్యునందుఁ దాపమును జందురునియందుఁ జల్లదనంబును పుష్పమందుఁ బరిమళంబును పాలయందు నేయియు ఏదియో అదియెల్ల నీవే యాదువు. ఓ శంభూ! అందుచే నిన్నుగూర్చి సేవింపుచున్నాను.

స్కాందకాశీఖండము.

కైలాస పర్వతమందలి మణిమయోత్తుంగశిఖరంబందుఁ బ్రమథులమరులు గొలువగ నుత్తమరత్నసింహాసనంబునం దుమామహేశ్వరులు గొలువుండఁగ వీణాపాణియై నారదర్షి విచ్చేసి యుమామహేశ్వరులకు సాష్టాంగ వందనముచేసి యంజలినొంది శివునకిట్లనియె. ప్రభూ! నాఁడు సానందమునీంద్రుఁడు మూలమంత్రోచ్చారణంబొనర్చి తచ్ఛ్రవణ మాత్రంబున సంయమనీపురవాసుల కెల్లరకు యుష్మదీయపదంబుఁ జేకూర్పుటఁజేసి పరేతరాట్టు విన్నదనంబొంది ఖిన్నుఁడై తనమంత్రిహిత సామంతులఁ బిలిచి నిజపురంబంతఁ బాడువడుటకుఁ జింతచేసి వారలను బుడమిఁబుట్టి ప్రజలకు వేదధర్మంబులు రుచింపకుండున ట్లధర్మోపన్యాసంబులొనర్చి యవైదికంబులగు దుర్మతధర్మంబులను బోధించిన నవ్వారలట్లుపాటించి దుర్బోధలఁ దవిలి దుష్కర్మంబు లాచరించి మృతి చెందిన మీఁద సంయమనీపురంబుఁ జేరుదురని ప్రేరించిన వారలంత నేపుడమిఁ బుట్టి చార్వాకాది మతంబులఁగొని యసద్ధర్మంబులఁ బ్రజలకాదేశింపుచుఁ దామట్లు నడచుచు దేహావసానంబున యమనగరిని నిండించుచుండిరి. ఇపుడు భూమండలి శైవమతంబు నామావశిష్టంబైనది గాపున సత్వరం బొకనిఁ శివతత్వదర్శనకోవిదుని దేశికుని శైవమతోద్ధరణంబునకై భువికిఁబంపి శైవమతంబు నుద్ధరింపవలయునని ప్రార్థించిన

సర్వజ్ఞుఁడైన ఆదిదేవుండు దరహసితవదనుండై యాసభయందున్న శ్రీపతిని జూచి వసుధను బుట్టి శైవమతంబు నుద్ధరించి రమ్మనియె. హరియును బ్రీతుండై ధరణీమండలిఁ బల్లవభూపాలపట్టణంబందుఁ గౌశికగోత్రవిఖ్యాతుఁడగు మల్లికార్జునారాధ్యున కాత్మసతియందు బుత్రుండై జన్మించె. దివినుండి దేవతలు సువర్ణవర్షంబుఁ గురిపించిరి. అదిచూచి పౌరప్రముఖులు విద్వాంసులు మున్నగువారలు బాలుఁడు శ్రియఃపతియంశంబున జన్మించి యుండుట నిట్లు పుట్టుకతోడనే హిరణ్యాంబు గురిసె కావున నితండు శ్రీపతియని యాహ్వాయమున కర్హుండని యట్లు పిలిచిరి. బాలకుఁడు జన్మమునుండియే యఖిల వేదములను సర్వదర్శనంబులను గుశలుఁడైనను జనకునిచే నైదవయేట నుపనీతుండై గురునొద్దఁ జేరి యనతికాలంబం దశ్రమంబున అఖిలవేదశాస్త్రములఁ జదివి యారి తీరె. అద్దానఁ బండితుఁడని పేరును బడసె. జనులెల్లరు శ్రీపతి పండితారాధ్యుఁడని పిలుచుచుండిరి. *

ఇఁక నొక మంగళముహూర్తంబందు జనకుఁడగు మల్లికార్జునారాధ్యుండు పుత్రునకు శివలింగధారణ మొనర్చి శైవమతధర్మంబులఁ బ్రబోధించె. అంత శ్రీపతి పండితుఁ డెల్లవారలకు శైవధర్మంబు లుపన్యసించుచుండ నొర్వక కొందఱు కుమతులు పల్లవరాజును జేరి విరుద్ధంబుగఁ దోచునట్లు దుర్వచనంబులు చెప్పిన నతం డొక యేనుగు నెక్కి పండితుని శిక్షింపవచ్చినఁ బండితారాధ్యుండు నిర్భీతుండై యందు నిలువఁ బడియుండె. భూమీశుండు శుండాలంబును గురుని పైని దోలె. అంత హస్తీంద్రంబు ముందడుగిడక తనమదోదకముతో గురుని చరణంబులఁ గడిగి కూర్చుండి శిరస్సువంచి గురునకు నమస్కరించె. అంత నృపతి యదిచూచి విస్మయించి జడులగు లోకుల వాకులకు లోనై మంచిసెబ్బర లరయక జగన్మాన్యుని శిక్షింపఁ దలపడిన తనయనుచిత

* ఈ శ్రీపతి పండిత గురుని శ్రీమల్లికార్జున పండితారాధ్య గురుఁడు స్వవిరచిత శివతత్వసారమందు బేర్కొని యవ్వారి చరిత్రంబు నుడివి కొనియాడిరి గావున శ్రీపతి పండితుఁడు మల్లికార్జున పండితునికన్నఁ బూర్వుఁడగుట క్రీ. 11 వ శతాబ్దియందు వెలసి శివమతాభివృద్ధినొనర్చినట్లు తెలియుచున్నది.

కృత్యంబునకుఁ దనయవివేకంబునకు విచారపడి తత్క్షణంబున నేన్గును డిగ్గి గురుని పదంబులకు సాష్టాంగపడి మ్రొక్కి క్షమ్యతాం క్షమ్యతా మని ప్రుడమిఁబడియుండె. గురుండు కరుణతోఁ బ్రభువును లెమ్మని యనుగ్రహించి పంపె నంతఁ గొంతకాలంబునకుఁ బండిత గురుండు పెక్కురు శిష్యులతో శ్రీకృష్ణాధునీతీర్థపూతంబును కనకదుర్గాంబామల్లేశ్వర సన్నివేశనపవిత్రంబగు విజయవాటికా క్షేత్రంబుఁజేరి యచట నివసించె. అందలిపండితబృందంబు శ్రీపతి పండితేంద్రుని విద్యాతపశ్శీల కలరి యవ్వారియం దాదరమొందియుండి రొకనాఁడు శ్రీపతి పండితగురుని యొద్దకొకఁడు నకాషీ శివలింగధారి వచ్చి మ్రొక్కి పండిత దేశికా! నే ననుదిన మార్గచరులకు (లింగధారులకు) భోజనంబిచ్చునట్టి వ్రతంబును బట్టియుంటిని. చాల కాలమునుండి వ్రతం బనపాయంబుగ జరుగుచున్నది. నేఁ డైదుగురయ్యలు దొరికిరి గాని ఆఱవమూర్తి లభింపలేదు. తాము మాహేశ్వరమూర్ధన్యులు సర్వజ్ఞులు భక్తసముదాయుల ననుగ్రహించువారు కావున దాము విజయంచేసి మాయింట శివపూజ చేసి భక్తునివ్రతం బీడేర్పవలయు నని ప్రార్థించెను. పండితేంద్రుఁడు మందహాసముచేసి శివలింగధరుం డెట్టివాఁడేని యాత్మతుల్యుఁ డని యెఱింగినవాఁడు గావున నట్లు చని యవ్వాని గేహమందు శివపూజచేసి కదళీదళంబందు వడ్డించినట్టి యోదనసూపశాకాదు లెల్ల వీక్షామాత్రంబునఁ. గదళీసహకారజంబుజంబీరాది ఫలంబులై యున్న నవ్వానిని యథాయోగ్యంబుగ సేకరించి లింగనైవేద్యమొనరించి భుజించి చిత్రకారుని వ్రతంబు నిర్విఘ్నంబుచేసి యనుగ్రహించి వచ్చెను. చిత్రకారుం డక్కజంబొంది యానందించె. ఇదివిని విజయవాటికాగ్రజన్ము లందఱు కినిసి యాక్రోశించి యొకచోఁ జేరి అగ్రజన్ముఁ డయ్యును విద్వాంసుఁ డయ్యును శ్రీపతిపండితుం డిట్లు చతుర్థకులజునింట సాపడివచ్చె నీకనీతనిపాండిత్యం బేటికని తత్క్షణంబునఁ బండితారాధ్యునకు బహిష్కారణంబు నిర్దేశించిరి. పండితగురుం డదివిని వారల యాటోపం బడంపనెంచి యొకపట్టుపచ్చడంబందు నెట్టని నిప్పులను బట్టివేసి ముడిగట్టి యొక శమీవృక్షంబందుఁ గట్టివేసె. అంత విజయవాడలోని గృహంబు లందెల్ల యగ్గి సురిగి యదృశ్యం బయ్యె. సోమయాజుల మందిరంబులం

దలి త్రేతాగ్నులు నారిపోయె. తక్కిన ద్విజన్ములిండ్ల నౌపాసనాగ్నులు విచ్ఛిన్నంబులయ్యె. ప్రతియింటఁగూడ వంటపొయిలందలి యగ్నులు చల్లారె. ఇట్లగ్ని యంతర్ధానంబైన పూజాహోమౌపాసనాదులు నిలుచుటయేకాక అశనపాకంబులకుఁ గూడఁ దెరువులేకుండుటఁ బ్రజలెల్ల హాహాధ్వనులుసేయుచు నేలఁ బడియుండిరి. విప్రు లందఱు గుమిగూడి పండితారాధ్య కృతం బని యెఱింగి రాజసముఖమున కేగి పండితప్రవర్తనంబు వేదసమ్మతంబు గాకుండుటఁ దాము పండితునకు వెలివేసితిమనియు అ మీఁదఁ బండితుం డలిగి నిజసామర్థ్యంబున అగ్ని నదృశ్యాంబుచేసె ననియుఁ జెప్పి ఇఁకమీఁద వెలిదీసివేసితిమనియు అనుగ్రహించి మరల నగ్నిని బ్రసాదింపుమనియు నిట్లు శ్రీపండితారాధ్యుని జేరి యర్థింపుటకు నృపతిని బ్రార్థించిరి. అంత నతండు బ్రాహ్మణులను దూఱి వారల నందఱను దోడ్కొని శ్రీపతిపండితగురునిసన్నిధి కేగి సాష్టాంగపడి మ్రొక్కి దేవా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. జగత్కల్యాణార్థమై యిట్టిరూపంబు ధరించి వచ్చిన పరమేశ్వరుఁడవు. అజ్ఞులై యెఱుఁగక యపచారంబు సల్పినవారలు శిక్షితులైరి. దయాసముద్రుఁడవై యగ్నులిచ్చి ఈ ఆబాలవృద్ధజనంబులను దీనులైయున్న వారల నెల్ల రక్షింపుమని ప్రార్థించెను. దయాళుండగు పండితగురుండు చిఱునగవుతో జమ్మిచెట్టునందుఁ గట్టిన పట్టుపచ్చడంబువిప్పి నిప్పులసిచ్చె నంతతో సకల గృహంబులం దగ్నులు యథాపూర్వకంబుగ జ్వలించె. అంత బ్రాహ్మణు లందఱు శతరుద్రీయ పాఠంబొనర్చుచుఁ బండితగురునకుఁ బ్రదక్షిణ నమస్కారంబు లొనర్చి క్షమాపణంబుఁ గోరి మందిరంబుల కేగిరి. మానవేంద్రుండును సంతసించి గురునకు మ్రొక్కి చనియె. పిమ్మట నొకనాఁడు రాజపుత్రుఁడు మృగయావినోదార్థంబై యశ్వంబు నెక్కి మితపరిజనంబుతో నడవికేగి యందొక కొండగుహను బ్రవేశించి తిరుగవచ్చుటకుఁ ద్రోవ నెఱుంగక చిక్కువడియుండె. భూమీశ్వరుండు పుత్రుండు రాక చిక్కెనని ఖిన్నుండై విచారమొంది కొమరుని వెదకుటకై నలుగడలఁ బరిజనులను బంపెఁగాని వార లెందునను రాజనందనుని జూడఁగనక మరలరాజును జేరి యట్లుసెప్పిరి. అంత నృపుండును దుఃఖపరితప్తుండై పండితారాధ్య గురు సన్నిధి కేగి పుత్రోదంతంబును

వినిచి వరపడియుండిన గురుండు కృపాళుండై కొండగుహలోఁ జిక్కు-వడియున్న రాజపుత్రునకుఁ బ్రకాశంబుగఁ దెరువుచూపె. రాజపుత్రుండు తెలివొంది యా తెరువున వచ్చి విజయవాడఁజేరి పండిత గురు మందిరంబుఁ జేరి గురునకు మ్రొక్కెను. నిజజనకుం డందే యుండుటను జూచి పండితగురుని జూపి ఈ మహనీయుఁడే వచ్చి పర్వత బిలములోఁ దోవదెలియక చిక్కువడి యున్న నాకు మార్గముఁజూపి రక్షించి తెచ్చినట్టి దయానిధియని యెఱింగించె. రా జత్యంతం బానందించి యాక్షణంబున గురుని సెలవుతోఁ దానును బత్నీపుత్రులు లింగ ధారణదీక్షను జెందిరి. ఇఁకనామీఁద బండితగురుం డహింసాప్రకారం బుగ వేదవేదాంగనిధులు ఋత్విజులై యుండ సోమయజ్ఞం బొనర్చి యవభృథంబును సల్పె నటుమీఁద వైయాసికసూత్రంబులకుఁ దైత్తిరీయోపనిషత్పంచకంబునకు భగవద్గీతలకు భాష్యంబొనరించె. ప్రాచీన భాష్యకారులగు నీలకంఠ శివాచార్యుల సిద్ధాంతమునకు నుంత భేదంబుగ ద్వైతాద్వైత సిద్ధాంతంబు ననుసరించెను. ఇట్టి స్వీయ భాష్యార్థంబుల శిష్యులకుఁ బాఠంబుఁజెప్పి జగంబందు విస్తరింపఁజేసి ధన్యుఁడై శ్రీశైల మున కేగి భ్రామరీ మల్లేశులను సేవించి యందు శైవమఠంబుల నుద్ధరించి స్వకీయంబగు నొకమఠంబు బ్రతిష్ఠించి పుత్రులకు శైవధర్మంబులు దెల్పి గురుపట్టంబిచ్చి తాను శివపదంబుఁ జెందె. తద్వంశ్యులు శ్రీపతి పండితారాధ్యుల వారని ప్రసిద్ధిఁ బడసి జగద్గురులై యొప్పుచున్నా రిది శ్రీపతి పండితారాధ్య గురుచరిత్రంబు సర్వ శ్రేయస్కరంబు.

# 33. మంచన పండితారాధ్య గురుఁడు

శ్లో॥ శబ్దం గృహ్ణాస్య శ్రవా స్త్వంహి జిఘ్రే
రఘ్రాణ స్త్వం వ్యంఘ్రి రాయాసి దూరం
వ్యక్షః పశ్యే స్త్వం రసజ్ఞోప్య జిహ్వః
కస్త్వాం సమ్యగ్వే త్త్యతస్త్వాం ప్రపద్యే॥

తా॥ దేవా! నీవు చెవులులేనివాఁడవై శబ్దమును వినుచున్నావు. నాసిక లేనివాఁడవై పరిమళమును ఆఘ్రాణింపుచున్నావు. పదములు లేని

వాఁడవై దూరమునుండి వచ్చుచున్నావు. కనులు లేనివాఁడవై చూచుచున్నావు. నాలుకలేనివాఁడవై రసముల నెఱుంగుచున్నావు. ఇఁక నిన్ను బాగుగ నెవ్వఁడెఱుంగును? కావున నిన్ను సేవించుచున్నాఁడను.

స్కాంద కాశీఖండము.

శ్రీకాశీపట్టణమందు సాలఙ్కాయనగోత్రుం డగు శివలంకమంచన పండితుం డనుమహాత్ముండు చేరి యందు ప్రతిదినంబు త్రికాలంబులందు విశ్వేశ్వరలింగంబు నర్చించుచు తనపాణియందలి యంగుళంబుల ఛేదించి శివున కర్పించి మరల అంగుళంబులఁ బడయుచుండును ప్రత్యహము విశ్వనాథాలయాగ్రంబందు నిలిచి శివుఁడే జగత్కారకుఁ డని స్పష్టముగ సప్రమాణముగ నిరూపించి ప్రబోధించుచుండు. అట్లుచూచి పాంచరాత్రులు ప్రత్యర్థులై ఈరసఁపడి శ్రీబిందుమాధవహర్మ్యంబుఁ జేరి మంచనపండితుని వాదంబునకుఁబిలిచిరి. పండితగురుండు ధీరుండై శిష్యులతో నటకేగి వారల పూర్వపక్షంబులను వారల గ్రంథరీతులనే ఖండించి శ్రుతిస్మృత్యాగమపురాణేతిహాసవచనంబులఁ బూర్వమీమాంసాన్యాయంబుల ననుసరించి "శివఏకోధ్యేయః శివఏవకేవలం సఏక ఏవరుద్రో నద్వితీయావతస్థే" యని ఋజువుచేసి పాంచరాత్ర పండితుల నిరుత్తరుల నొనర్చె. ఆమీఁద వైష్ణవులు వాయెత్తలేక యొక కుతంత్రంబుఁ బన్ని విద్యలతో నక్కఱలేదు. ప్రత్యక్షప్రమాణమే అంగీకార్యంబు కావున నట్లు శివాధిక్యంబుఁ బ్రత్యక్షంబుగఁ జూపవలయు ననిరి. అందులకు మంచనపండితుఁ డోమనియంగీకరించిశిలావిగ్రహంబుగ నున్న బిందుమాధవుని వేగిరంబుగ లేచి నడిచి విశ్వేశ్వరాలయంబునకు వచ్చి శివపారమ్యంబుఁ జెప్పించి శివునకు మ్రొక్కించెద ననియె. అంత వారందఱు విస్మితులై ఇట్లు సల్పఁగలఁడా యని సందేహించి యట్లొనర్పుమనిరి. అపుడు మంచనపండితగురుండు బిందుమాధవస్వామిని దారసించి పుండరీకనయనా! నీకు గురుండు నొడయఁడు నగు విశ్వేశ్వరుని సన్నిధానంబునకు వచ్చి నమస్కరించి రమ్మనియె. ఆమీఁద దామోదరుం డుత్థితుండై నడచి ముందఱవెనుక తమపాంచరాత్రులు శైవులు తోడునడువ విశ్వేశ్వరాగారంబుఁ దఱియవచ్చి మంటపంబుఁ

జొచ్చి గర్భాగారంబున కేగి విశ్వేశ్వరలింగంబు ముందట సాగిలఁబడి మ్రొక్కి

శ్రుతి. పరాత్పర తరంబ్రహ్మా యత్పరాత్పరతోహరిః
తత్పరాత్పరతశ్శంభు స్తన్మేమనశ్శివసంకల్పమస్తు॥

(బోధాయనః)

తా॥ పరాత్పరతరుఁడు బ్రహ్మ యగును. ఏ పరాత్పరుఁడగు బ్రహ్మ కన్న హరి పరాత్పరుఁడో ఆ పరాత్పరుఁడగు విష్ణువుకన్న శంభుఁడు పరాత్పరుఁడు. అందువలన నామనంబు శివునియందు సంకల్పము గలదై యగుత.

శ్లో॥ ఏక ఏవహి విశ్వేశో ద్వితీయో నాస్తి కశ్చన
తత్ప్రసాదా దహం చక్రీ లక్ష్మీశ స్తత్ప్రసాదతః
త్రైలోక్య రక్షాసామర్థ్యం దత్తం తే నైవ శంభునా ॥

వ్యాసకాశీఖండము.

తా॥ విశ్వనాథుఁడగు శివుఁడొకఁడు దక్క రెండవ వాఁడధికుఁడు లేఁడు. ఆదేవుని యనుగ్రహముచే నేను చక్రముగలవాఁడ నైతిని. లక్ష్మికినాథుఁడ నైతిని. ఆ శివునిచేతనే నాకుఁ ద్రిలోకరక్షణసామర్థ్య మీఁబడినది.

అనువచనంబులఁ బ్రశంసించి మరల నమస్కరించి వెడలి తన యాలయంబుఁ జేరె. ప్రత్యక్షంబుగ నిట్లు మాధవుని బాదచారిగ విశ్వనాథమందిరంబునకు రప్పించి మ్రొక్కించి ప్రస్తుతింపఁజేసిన మంచన పండితగురుని సామర్థ్యంబునకు విస్మితులై యఖిలజనులు గురుని పదంబులకు మ్రొక్కి జయధ్వనులొనర్చిరి. వైష్ణవు లిదియెల్లజూచి తలలు వంచికొని పాఱిపోయిరి. ఇట్లు శ్రీమంచనపండితగురుఁడు కాశీనగరంబున స్వప్రభావంబును జూపి విశ్వేశ్వరానుగృహీతుండై స్వదేశంబగు నాంధ్రదేశంబుఁజేరి ఉత్తమగుణవతి యగు కులకన్యను బెండ్లాడి ఆమెయందు సుపుత్రులనొంది వారల విద్యలఁదీర్చి యామీఁద శివపదంబొందె. అవ్వారి సుపుత్రులుప్రాజ్ఞులై జగద్గురుపట్టంబొంది శివలంకవా రని పిలువఁబడుచుఁ

గృష్ణానద్యుపాంతంబునఁ బెసరమిల్లి మున్నగు గ్రామంబుల రాజులచే నగ్రహారంబులొందిరి. నేఁటివఱకు శివలంక వారు చాతుర్వర్ణ్య గురులై దక్షిణలం బెచ్చుచున్నారిది మంచనపండితారాధ్యగురువిజయచరిత్రము.*

# 34. శ్రీమల్లికార్జున పండితారాధ్య చక్రవర్తి

శ్లో॥ నో తే గోత్రం నేశ జన్మాపి నాఖ్యా
నో రూపం వై నైవశీలం నదేశః
ఇత్థం భూతో పీశ్వరస్త్వం త్రిలోక్యాః
సర్వాన్ కామాన్ పూరయేత్తద్భజేస్త్వాం॥

తా॥ నీకు గోత్రము లేదు పుట్టుక లేదు పేరు లేదు రూపము లేదు స్వభావము లేదు. దేశము లేదు. ఇట్టివాఁడవైనను నీవు సర్వేశ్వరుఁడవై ముల్లోకములలోని వారలకు సర్వాభీష్టంబుల నిచ్చుచున్నావు. అద్దాన నిన్ను నే సేవింపుచున్నాను.

స్కాంద కాశీఖండము.

కైలాసశైలశిఖరాగ్రంబం దుమాదేవితోఁ బేరోలగంబున నున్న శివుఁడు భూలోకమందలి భక్తిరాహిత్యప్రకారం బారసి భక్తి వర్ధనంబునకై నందికేశ్వరుని బసవనిగఁ బుడమిఁ బుట్టఁబంపఁదలంచియు నంతఁదనియక వేఱొక మహావ్యక్తిని గూడనపుడే జన్మింపఁ జేయనెంచి హృదయమందిట్లుఁ దలఁచెను.

ద్విపద॥ అనుపమ పరమప ♦ రానంద మొసఁగు
తనపాద భక్తియుఁ ♦ దన్నందికేశు

---

* ఈ మంచనపండితగురుని గుఱించి పాలకుర్తి (ఇనటూరి) సోమనారాధ్యుండు స్వరచిత బసవపురాణమందుఁ బేర్కొని ప్రస్తుతించె. అందుచే నివ్వారు సోమనారాధ్యునకు బూర్వుఁడగుట క్రీ॥ 11 వ శతాబ్దపు ప్రారంభమందున్నాఁడని తెలియుచున్నది.

సర్వజ్ఞతయు భృంగి ♦ సహజనిష్ఠయును
దుర్వాసముఖ్యుల ♦ ధ్రువశాపశక్తి
అక్షపాదాదుల ♦ యతులితవాగ్వి
చక్షత యుపమన్యు ♦ సద్గురుత్వంబు
మహనీయరుద్రప్రి ♦ మథగణాధిపుల
సహజస్వకీయప్ర ♦ సాద్వైకరతియు
ప్రాక్తన నూతన ♦ భక్తగణముల
వ్యక్తదృష్టప్రీత్య ♦ యారూఢ మహిమ
ఘనవీరభద్రుని ♦ ఖ్యాపితశౌర్య
మును గూడునట్లొక్క ♦ మూర్తిగావింప
ముక్కంటి దలప...........

సోమనాథుని మల్లికార్జున పండితారాధ్య చరిత్రము

ఆ క్షణమందే యట్టి మహావ్యక్తి సిద్ధంబై కట్టెదుట నిలిచి మ్రొక్కె. శివుఁడానందించి నానా వేదాగమపురాణంబుల షడ్దర్శనంబుల నిచ్చి కుమారా! ఇంతకుమున్న వసుమతీతలంబందు భక్తియనునది శూన్యంబగుట నారసి నందికేశుని గొందఱు ప్రమథులతో నందు జన్మించి భక్తిని విస్తరింపఁజేయుమని పనిచియుంటిని. నీవుగూడ నందు జన్మించి భక్తిని బెంపుసేయుము. నేనుగూడ నొక యాకారముతో భూమికి వచ్చి నిన్ను శిష్యునిగాఁ జేకొని మహిమాన్వితు నొనర్చెదను. దాక్షారామ మను పుణ్యస్థలంబందు భీమలింగసన్నిధానంబందుఁ బురోహితుండు వాసస వంశ్యుండు గౌతమగోత్రుండు పవిత్రుండు భీమారాధ్యుండు గలఁడు. అతఁడు పుత్రార్థియై పెక్కుమాఱులు పంచాక్షరీ మంత్రంబును బురశ్చరణంబొనర్చినాఁడు. ఇపుడు శ్రీశైలములో మల్లికార్జున లింగసన్నిధియందు గృహిణితో వసించి పురశ్చరణంబుఁ జేయుచున్నాఁడు. నీవా పుణ్యదంపతుల గర్భంబందు జన్మింపుము శుభం బగునని యనుజ్ఞనిచ్చె. శివశాసనప్రకారం బతండు శివునకుఁ బ్రణమిల్లి భీమపండిత దేవియైన గౌరాంబ గర్భమందుఁ బ్రవేశించె. ఆ దంపతులు మురిసి వ్రతాంతమందు దాక్షారామమునకుఁ బోయిరి. అందు నవ

మాసంబులు నిండినమీఁద నొక శుభదినంబందు గౌరాంబ ప్రసవమై పుత్రునిగనియె. మల్లికార్జునానుగ్రహంబునఁ బుత్రుండు జన్మించుటఁజేసి బాలునకు మల్లికార్జునుఁ డని పేరు పెట్టిరి. బాలుఁడు దినదినప్రవర్ధమానుండై పంచాబ్దంబులు గడచినంత విద్యాభ్యాసం బొనర్చిరి. విద్యలెల్లఁ బ్రాక్తనజన్మసిద్ధంబు లగుటఁ దమకుఁ దామె మాణవకు నొందెను. భీమపండితుఁడు గర్భాష్టకమందు పుత్రున కుపనయనం బొనర్చె నంత మల్లికార్జునుం డఖిలవేదశాస్త్రంబులందుఁ బండితుఁడై పండితుల మెప్పొంది పండితుఁడను బిరుదంబునొందెను. అనంతరము కోటిపల్లి క్షేత్రంబందు నివసించి యున్నశ్రీవిశ్వారాధ్య గురుపాదుల సాన్నిధ్యంబుఁజేరి సేవించి వారలచే వీరశైవదీక్షనొంది లింగధారణంబు నొందె. అటుమీఁద శివైకపరతంత్రుండై వీరశైవవ్రతబద్ధకఙ్కణుండై షట్కాలశివలింగపూజ నొనర్చుచు శైవగణార్చనల నొనరించుచు నెల్లవారలకు శివభక్తిబోధింపుచుండఁ గొందఱోర్వక విభూతిరుద్రాక్షలింగధారణంబుల నాక్షేపించుచుండఁ బండితగురుండారసి మందహాసంబొనరించి యవ్వారల సంశయంబులు దీర్పఁగడంగి వేగిరంబుగ సభను గూరిచి వేదశాస్త్ర కోవిదులనెల్ల రప్పించి యందుఁ దా శివధ్యానంబుతో నుపక్రమించి కాలాగ్నిరుద్రోపనిషద్రుద్రజాబాలోపనిషద్వచనంబుల నుద్ఘాటించి ప్రతిపదం బన్వయించిచెప్పి విభూతిధారణప్రకారంబును రుద్రాక్షధారణప్రకారంబును నెఱింగించి శివలింగధారణంబును గుఱించి మహానారాయణోపనిషద్వచనంబుల శీక్షావల్ల్యుపనిషత్సూక్తుల ననువదించి తద్ధర్మంబులఁ బ్రతిపాదించి శ్రీకంఠ జగద్గురుపాదుల భాష్యంబులను నిరూపించి

శ్లో॥ బిభేత్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రతరిష్యతి
ఇతిహాసపురాణాభ్యాం వేదార్థముపబృంహయేత్.

స్కాందపురాణము.

తా॥ అల్పవిద్యగలవానివలన వేదము భయపడుచున్నది. నన్నీతఁడు వంచింపఁ గలఁడు. ఇతిహాసము చేతను బురాణముల చేతను వేదార్థమును దెలియవలయును.

అనెడు నిబంధనంబు ననుసరించి శైవస్కాందపురాణంబులందలి

శ్లో॥ బ్రహ్మావిష్ణ్వాదయో దేవాః మునయో గౌతమాదయః
ధారయంతి సదాలింగ ముత్తమాంగే హ్యతంద్రితాః
లింగపురాణము:

తా॥ బ్రహ్మావిష్ణువు మున్నగు దేవులును గౌతమాది మునులును జాగరూకులై యెల్లప్పుడు శిరంబులందు శివలింగమును ధరించుచున్నారు.

అనెడు నుపబృంహిత వచనప్రచయంబులఁ గనపఱచి ఇందులకు నిదర్శనంబుగఁ బండరీపుర్యాదులందు విష్ణుదేవునకు శిరంబందలి శివలింగధారణంబును నుద్బోధించె. అపుడు మున్నాక్షేపించిన వారందఱు నిరుత్తరులై మౌనంబు వహించి మల్లికార్జున పండితారాధ్యుని వాదంబు నంగీకరించిరి. సభ్యులందఱేకగ్రీవంబుగఁ బండితగురునకు జయజయధ్వానంబులొనర్చిరి. ప్రతివాదులలోఁ గొందఱు పండితుని వాదప్రాశస్త్యంబు నామోదించి పండితునిచే ఉత్తమశైవదీక్ష యగు శివలింగధారణదీక్ష నొందిరి. మఱికొందఱు సామాన్య శైవదీక్ష నామోదించి భస్మరుద్రాక్షధారణంబును బంచాక్షరీ మహామంత్రోపదేశంబును బండితునిచేనొంది సేవించిరి. ఇట్లు గోదావరీమండలంబునందుఁ గృష్ణాకావేరీతుంగభద్రాసరిత్తీరపత్తనంబులందు శివధర్మంబులగు విభూతి రుద్రాక్ష శివలింగ ధారణంబులను శివపంచాక్షరీమంత్రజపానుష్ఠానంబును శివపారమ్యంబును విశదంబుగ నుద్బోధించి యుపన్యసింపుచు నందందుఁ బెక్కురకు శివదీక్ష నొసంగి శిష్యులను జేసికొనుచు శివమతాభివృద్ధిని భక్తివృద్ధిని గావింపుచుండె. అహోరాత్రంబులు మహేశ్వర మాహేశ్వరార్చనలం దప్రమత్తుండై యొనర్చుచుండె.

ఒకనాఁడు పండితారాధ్యుండు శివపూజకై పుష్పాపచయంబునకు వనంబున కరిగి పుష్పములఁ దెచ్చుచుండఁగా నల్లగొండ మహాదేవయ్య యనెడు నారాధ్యవర్యుండు శివపూజాప్రసూనంబులఁ దెంపికొని శివపూజకుఁ గాలాతిక్రమమైనదని వేగిరంబుగ మందిరాభ్యంతరంబును జేరుచుండఁగా శివపూజోపకరణ వస్తువొకండు పాదంబునకుఁ దగిలె. అంతనే మహాదేవయ్యగారు చూచి శివాపచారం బొదవె నని తద్ప్రాయశ్చిత్తంబుగ నావెంటనే యసిచేఁ దనపాదంబులను గోసికొని యందే

పడియుండెను. ఆయయగారి పుత్రులు మున్నగువారు విలపించుచుం బుష్ప ములం దెచ్చికొని పోవుచున్న మల్లికార్జున పండితారాధ్యున కాయుదం తంబు విన్నవించిరి. అపుడు పండితారాధ్యుం డాహా! భక్తియన నిట్టిది కదాయని సంతసించి వేగిర మవ్వారి యిలుచేరి అందువెలుగుచున్న శివ దీప మందలి చము రించుకదీసి మహాదేవయ్యగారి పాదములకు మర్దించి మరల నంటించెను. పూర్వంబట్లు పాదంబు లతికికొని గమనసమర్థంబు లయ్యె. మహాదేవయ్యగారును మల్లికార్జునపండితుండు నన్యోన్యంబు సత్కారంబు లొనర్చుకొనిరి. మహాదేవయ్యగారి పుత్రులు మున్నగు వారు పండిత గురునకు మ్రొక్కిరి. అనంతరమున బండితారాధ్యుండు శివమతధర్మంబులను సిద్ధాంతంబుల నాంధ్రులకు విశదము చేయంబూని యాంధ్రవాణిని శైవతత్వసారంబను గ్రంథంబును మఱికొన్ని కృతు లను విరచించెను.

ఇట్లాంధ్రదేశమందు వసించి యసమానశివలింగపూజా ధురంధ రుండై మహాపండితుండై ప్రతివాదిసంశయవిచ్ఛేదనకుఠారుండై భక్తి నుద్దీపింపం జేయుచున్న మల్లికార్జునపండితుని గరిమంబును కల్యాణపురంబున నందికేశావతారంబున జన్మించి శివభక్తి నుద్దీపింపం జేయుచు నహరహం బనేక శతంబుల మాహేశ్వరుల కన్నదానంబు సేయుచు బిజ్జలరాజమంత్రి యుద్దండనాయకుండును కోశాధ్యక్షుండు నై యున్న బసవేశ్వరుండును బసవేశ్వరుని యప్రతిమానభక్తివైభవం బును మల్లికార్జున పండితుండు నెఱింగియు వర్ణాశ్రమధర్మానుసరణం బును తదుల్లంఘనంబున భక్తిమాత్రైక గ్రహణంబు ననెడు సిద్ధాంత భేదంబులంజేసి పండితారాధ్యుండును బసవేశ్వరుండును నొక్కెడం జేర రైరి. పండితారాధ్యుండు భక్తి పరవశుండైనను

గీ॥ భక్తితోడ వలపు ♦ బ్రాహ్మ్యంబుతోంబొత్తుం
బాయలేను నేను ♦ బసవలింగ!

యని పల్కుచుండువాండంట. ఇట్లు పెద్దకాలంబు పండితా రాధ్యుండు శివభక్తి నభివృద్ధిచేయుచుండ నంత బౌద్ధగురుం డొకండు శిష్యసహస్రంబుతో నాంధ్రదేశంబుంజేరి చందవోలనెడు గ్రామమందు రాజైయున్న వెలనాటిచోడుం డనువానికి బోధించి బౌద్ధదీక్షనిచ్చి

శిష్యునిగఁ జేసికొనియె. అంతియెకాక వేదమతం బగ్రాహ్యం బనియు వాదంబందు నిలువదనియు సమర్థు లున్నయెడల నవ్వారిఁ బిలిపించిన వాదించి వారల గెలుతుననియుఁ జెప్పుటయు నా రాజాసమయమందు మల్లికార్జునపండితుని వైదుష్యాతిశయంబు నెఱింగించిన బౌద్ధగురుండు సత్వరం బవ్వారిని బిలిపించి సభనుగూర్పు మాపండితుని నిర్జింతుననియె. వెలనాటిచోడుండు పండితుస కిట్లెఱింగించి వాదార్థమై సభకు రమ్మని యాహ్వానించి మధ్యస్థపండితులను గొందఱ నేర్పఱచె. నిర్దిష్టసమయంబున మల్లికార్జున పండితుండు శిష్యులతోఁ జందవోలునకువచ్చి సభాప్రదేశం బుఁజేరె. మధ్యస్థపండితులును విచ్చేసిరి. రాజు బౌద్ధగురుని నాస్థానికి రప్పించి యవ్వారిని పండితారాధ్యుని మాధ్యస్థికపండితుల నుత్తమపీఠా సీనుల నొనర్చి వాదమునకు సెలవొసంగెను. అపుడు బౌద్ధగురుఁడు వేదంబులు ప్రమాణంబులు గావనియు జగత్కారకుఁ డెవ్వఁడు లేఁడ నియు ప్రపంచంబు సర్వంబు దనకుఁదానే పుట్టుననియు నట్లే పెరుగు ననియు నట్లే గిట్టుననియు పునర్జన్మంబు లేదనియు సుఖదుఃఖంబులే పుణ్య పాపంబులనియు అహింస యొక్కఁడే పరమధర్మంబనియుఁ జెప్పెను. మల్లికార్జున పండితుఁడు హృదయమం దుమామహేశ్వరులను గొలిచి బౌద్ధునిదిక్కై యిట్లు చెప్పెను. వేదంబు లపౌరుషేయంబులనియు నిత్యం బులనియు పరమాత్మకారణంబులనియు ప్రవృత్తినివృత్తిప్రబోధకము లనియు విధినిషేధజ్ఞానకారణంబులవుటఁ గాదన్నమాత్రంబున జ్ఞాన శూన్యంబగుటయేకాక మఱియొండులబ్ధి లేదనియు అట్లవ్వాని బరిత్యజిం చిన అజ్ఞానాంధకారంబునఁ గూలుట దప్పదనియు ఇఁక నవ్వాని నట్టు లుంచినను "కారణంవినా కార్యస్యోత్పత్తే రసంభవాత్" అనెడు న్యాయంబునను "ఆధారంవినా ఆధేయతాయాః అసిద్ధేః" అను న్యాయం బునను బ్రహ్మాది స్తంబపర్యంత మగు నీవిచిత్ర జగమునకుఁ గర్తయగు వాఁడును నియామకుఁడగువాఁడును లేకున్న జగం బుత్పత్తిస్థితిలయంబుల నొందదనియు కార్యకారణంబులకు రెండింటికి వ్యాప్తి నిత్యంబనియు అని వార్యం బనియు నోషధులు మున్నగునవి యాధారంబైన పృథివియందెట్లు బుట్టిపెరిగి గిట్టుచున్నవో యట్లీశ్వరుఁడు సర్వమున కాధారంబై తన యందు ధరించుచున్నాఁడనియు జగము ఘటమట్లు కార్యంబగుట జడ

మగు ప్రధానంబును అజ్ఞుఁడగు జీవుఁడును జగంబునకుఁ గారణంబు గాఁజాలరనియు ప్రత్యక్షంబైన నీజగంబునకు సర్వజ్ఞుఁడును సమర్థుండు నగు పరమేశ్వరుండు జగత్కారకుఁడు నిమిత్తోపాదానకారణంబై ప్రత్యక్షంబునను అనుమానంబునను శాబ్దంబున నెడు ప్రమాణత్రయంబునఁ బ్రకటంబగుచున్నాఁడనియు శ్రుతి-"సదేవసోమ్యే ఇదమగ్రఆసీత్॥ బ్రహ్మేవా ఇదమగ్ర ఆసీత్॥ యదాతమస్థం నదివానరాత్రి। ర్నసన్నచాసచ్ఛివఏవ కేవలం। తదక్షరం తత్స వితుర్వరేణ్యం। ప్రజ్ఞాచ తస్మాత్ప్రసృతా పురాణీ" యనెఁడు శ్రుతి సహస్రంబులు పరమేశ్వరుఁడు జగత్కారకుఁడు గలఁడని నిరూపింపుచున్నవనియు పరమేశ్వరుడు ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులచే సర్వజగంబులకుఁ బంచకృత్యంబు లొనర్చుచున్నాఁడనియు జగంబునకుఁ బ్రబోధ ప్రకాశంబు లిచ్చుచున్నాఁడనియు సుఖదుఃఖంబులు పుణ్యాపాపఫలంబులుగాని యన్యంబులు గావనియు పునర్జన్మంబు లేకుండిన నొక తలిదండ్రులకు జన్మించిన సంతానమందు భిన్న భిన్నావస్థ లేర్పడవనియు సృష్టియందుఁ బరమేశ్వరునకుఁ దారతమ్యభావం బొనరదనియుఁ దారతమ్యముతోఁ గనుపట్టుచున్న నీప్రపంచము పునర్జన్మమును జెప్పుచున్నదనియు కావున నిట్లసారంబగు నిరీశ్వరవాదంబును మాని సర్వేశ్వరుని సేవించి ధన్యులగుట శ్రేయంబనియు అనేకదృష్టాంతంబులతోఁ బ్రాపంచికానుభవంబులతో వేదశాస్త్రప్రమాణంబులతోఁ బరవాదంబు ఖండించి సేశ్వరమతసిద్ధాంతంబు నొనర్చెను. ప్రతివాదియగు బౌద్ధుండు ముగ్ధుండై నిరుత్తరుండయ్యె. మధ్యస్థపండితు లారాధ్యునకు విజయంబనియు బౌద్ధగురుఁ డోడెనని తీర్మానించిరి. పండితారాధ్యునిపైఁ బుష్పవర్షంబు గురిసె. బౌద్ధుఁడెవ్వరికిఁ జెప్పక యెచ్చటికో పోయె. సభయంత విరమింపఁబడియె. పండితులందఱు స్వస్థానంబుల కేగిరి. మల్లికార్జునపండితుఁడు శిష్యులతో నాయూరనే యుండె. పరాజితుఁడై సభనుండి వెడలి పోయిన బౌద్ధుఁడు సముద్రతీరంబుఁజేరి యందొక బుద్ధవిగ్రహంబున కెదురుగఁ గూర్చుండి పండితగురుని జంపుటకై ఆభిచారికతంత్రంబుల సల్పుచుండుట నెఱింగి పండితారాధ్యుని శిష్యులగు రేమయ దేచయ యనువార లాతని దారసించి కత్తితోఁ గుత్తుకనుగోసి చంపిరి. తర్వాత బౌద్ధశిష్యులు రాజున

కట్లు దెల్పఁగా రాజు కుపితుండై పండితగురుని బిలిపించి ఇట్లు వధించుట ధర్మమగునా యని యడిగె. పండితగురుఁ డధర్ముని శివాపరాధుని జంపుట ధర్మమే ధర్మమే ధర్మమే యని ముమ్మాఱు బిగ్గరగాఁ బలికె. రాజు క్రుద్ధుండై యీవృద్ధుని శిక్షించుటకు విలంబమేల యనినంత పండితుఁడు నీవు దండింపుటకు మున్నే నేను దండించుకొనెదఁ జూడుమని మూఁడుమాఱులు మస్తకంబుఁ గోసికొనినను మరల ముమ్మాఱులు కబంధంబందు శిరంబుఁజేరె. అంతతోఁ బండితుఁ డుడుగక వజ్రతుల్యంబులగు నఖంబులచేఁ దననేత్రంబులను రెండు తడవలు పెఱికి యందుంచె. రెండు తడవలుగూడ నేత్రంబు లెగిరి తద్గోళంబులందుఁ జేరె. సభ్యులంద ఱాశ్చర్యచకితులైరి. నృపుఁడు మాత్ర మంతకంతకుఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్లఁగాఁ దనకింకరులచేఁ బండితుని కన్నులూడదీయించి యానేత్రగోళంబులందు జీడిపాలు దెప్పించి పోయించి యనిపెను. అపుడు పండితారాధ్యగురుఁ డసంఖ్యాత వీరమాహేశ్వరోత్థితసమాయాతక్రోధోత్కటానలపటలవిరచితజ్వాలల వెలనాఁటి చోడరాజాధమపతంగంబు భస్మమగుఁగాత! తత్సంబంధు లంద ఱట్లె భస్మమై పోదురుగాఁత! యని శపించి తత్క్షణం బాస్థలిని బాసి అమరావతికిఁ బోయి యందమరేశ్వరుని శివుని అమరేశాష్టకరచనతోఁ * బ్రస్తుతించి మరల నిజనయనంబు లొందెను. ద్రష్టలందఱు పండితారాధ్యుని జయధ్వానంబులఁ గీర్తించిరి. వెలనాఁటి చోడుఁడు పండితగురుని శాపప్రకారంబుగ సపరివారంబుగ నశించె. వాని వంశంబుగూడ నంతరించె. ఇకఁ బండితారాధ్యుండు దనకు వార్ధకదశ వచ్చియుండు టారసి బసవేశ్వరునియందుఁ దన కీషదభిప్రాయభేదంబున్నను భక్తశిరోమణియు అశ్రాంతమాహేశ్వరార్చనానియమబద్ధవ్రతుండునగు నా బసవేశ్వరుని గన్నులనైనఁ జూచినభాగ్యంబు నొందనైతిననియు బసవని సన్నిధానంబుఁజేరి వేదశాస్త్రప్రమాణంబుగను బ్రత్యక్షానుమానసిద్ధంబుగను వాదించి తద్వాదంబు నిరసించి యవ్వారినిఁ గూడ వైదిక శైవమార్గప్రవిష్టు నొనర్చెదు ననియును ధైర్యముతోఁ బట్టుదలతో వేగిరంబుగ శిష్యులతో బసవని జూచుటకై కల్యాణపురంబున కేగుటకుఁ బ్రయాణంబుసల్పి మార్గమధ్యంబందు నిసు

* ఈ యమరేశాష్టక ముపలబ్ధము గాలేదు.

గుడుముల యను గ్రామంబుఁ జేరె. బసవేశ్వరుఁడును దన్ను జూచుటకై మహామహుండును వీరశైవవిద్వచ్చక్రవర్తియు భక్తశిఖామణియు నగు మల్లికార్జునపండితారాధ్యుండు వచ్చుచు నిరుగుడుములయం దుండుట నెఱింగి పండితారాధ్యునకు భక్తులతో విభూతి వీడ్యంబులను బంపెను. వా రట్లు పండితునకుఁ దెచ్చి యిచ్చిరి. అవ్వాని గ్రహించిన తోడనే పండితునకు ధారాళముగఁ గర్నాటభాష చేకూరె. అపుడు పండితగురుఁ డాహ్లాదించి యంతకు మున్నుఁ దా నాంధ్రిరచించిన శివతత్వ సారగ్రంథంబందుఁ గన్నడబాసతో మరలఁ గొన్నిశతంబులు పద్యం బులు విరచించి యందుఁ జేర్చెను. మఱియు బసవేశ్వరుని గూడఁ గన్నడ బాసలోఁ గొన్నిపద్యంబులతో నుతించెను. ఇరుగుడుములనుండి పండిత గురుఁడు శిష్యులతోఁ బ్రయాణముచేసి పానుగంటికిఁ జేరెను. ఆపుర మందు ధవళేశునామయ్య యనుభక్తుండు శివభక్తిసేయుచుండఁగాఁ గుటిలులగువారు గొందఱా యూరినేలుచున్న రాజున కుదయావనీశు నకుఁ గొండెములు చెప్పుటను రాజు నామయ్యను శిక్షింపఁ దలంపఁగా నదియెఱింగి నామయ్య తనశిరంబును దానే నఱికికొని తనువుఁబాసి కైలాసంబుఁజెందె. రాజంతనే మృతుండయ్యె. పండితగురుఁ డదివిని రోసి వేగిరమాపురిఁబాసి ప్రయాణముచేసి కతిపయదినంబులలోఁ గల్యాణ పురసమీపంబగు వనిపురిని జేరి యటనుండి కల్యాణపురంబున కేగ నుండె. అపుడు కల్యాణ పురప్రభుఁ డగు బిజ్జలరాజు బౌద్ధుఁడగుట ముదిమిచే నంతకంతకు శివభక్తి కోర్వక యకారణంబుగ నిరపరాధు లైనట్టి శరణులను హింసించుటఁ జేసి బసవమంత్రి యలిగి దండనాథుఁ డగు జగదేకమంత్రి కెఱింగించి రాజును శపించి తాను గతిపయభక్తు లతోఁ గప్పటెసంగమేశ్వరగ్రామంబుఁ జేరి యందు సశరీరంబుగ సంగ మేశ్వర లింగ గర్భంబుఁ జొచ్చి శివసన్నిధానంబుఁజెందె. ఇవ్వార్త వని పురమునుండి కల్యాణపురికిఁ బోవఁదలచుచున్న మల్లికార్జున పండితా రాధ్యునకుఁ దెలియఁగ హాయని విలపించి యిప్పటి వఱకు బసవేశ్వ రుని దరిసింపనితన్ను నిందించికొని ఆగ్రామమునుండి వెనుకకు మరలి కొన్ని ప్రయాణంబు లొనర్చి శ్రీశైల ప్రాంతారణ్యంబును జేరె. అందు శ్రీశైల సోపానంబులవఱకు నడిచి వచ్చి శ్రీశైలంబును బరికింపఁగాఁ

బండితారాధ్యునకు శ్రీశైలంబంతయు శివలింగాకారంబుగఁ గన్పట్టె. అట్లు చూచి తనపాదంబులతో శివలింగమయంబగు శ్రీపర్వతంబును స్పృశింప వెఱచి తా నందుండి యెట్టకేలకు సాహసించి తన శిష్యుఁడగు దోసయ్యను బర్వతంబెక్కి మల్లికార్జునుని సపరివారంబుగ సేవించి తనదుసేవనుగూడ నిఖిలేశ్వరుఁడగు మల్లేశ్వరున కెఱిగించి రమ్మని యాతనిఁ బుత్తెంచె. ఆతండట్లు గుర్వాజ్ఞతో శ్రీశైలం బెక్కుచుండఁగ శ్రీమల్లికార్జునుఁ డొక తపస్వియై యాతని నెదుర్కొని నగంబెక్కించి యందు శిఖరేశ్వరంబును మల్లేశ్వరలింగంబును భ్రామరీశక్తిని సాక్షిగణపతిని ఆరామవీరేశ్వరుని తదాగ్రిజ్ఞిని హాటకేశసారంగేశ్వరులను పంచాక్షరీయంత్రంబును మల్లికాకుండంబు మున్నగు కుండంబులను బాతాళగంగను లింగాల ఘట్టమును సిద్ధబిలంబులను బిల్వవనంబు మొదలగు వనంబులను బంచ మఠంబులను పెక్కుమహిమలుగల వృక్షంబులను జ్యోతిర్లతలను స్వర్ణ వేదిశృంగంబులను సర్వంబులను జూపెట్టెను. దోసయ్య నిఖిలప్రదేశవిశేషంబులను నాలోకించి హర్షించి "ధన్యోస్మి" యనికొని తపస్వివేషియగు మల్లేశ్వరునకు మ్రొక్కి సెలవొంది మరల గురునిజేరి నమస్కరించె. పండితారాధ్యుఁ డానందించి శిష్యుని శ్రీపర్వతవిశేషంబు లడుగఁగా దోసయ్య పర్వతాగ్రిమందే మల్లికార్జునస్వామి యొకతపస్వివేషంబునఁ గన్పడి తన్ను దోడ్కొనిపోయి శ్రీనగం బెక్కించి యందలి సర్వంబును జూపి పంపెనని వక్కాణించె. అంత పండితారాధ్యుండు మురిసి ధన్యుండ నైతి. నన్ను పరమశివుండు మల్లికార్జునుండు పరామర్శించి శిష్యుఁడవగు నీకు దరిసెనంబిచ్చి నిన్నును నన్ను ననుగ్రహించె. ఇఁకఁ గావలసినది యేది? వచ్చినపని యంతయు నిర్వహింపఁ బడియె నని మల్లికార్జునశివునకు మ్రొక్కి భక్తవత్సలా! ఇఁక నన్ను నీ ప్రమథులలోఁ జేర్చుకొను మని వేడుకొనియె. ఆ ప్రార్థన నాలకించి మల్లికార్జున శివుండు సతీసమేతంబుగ సశరీరంబుగ మల్లికార్జున పండితారాధ్యుని తన లింగగర్భంబందుఁ జేర్చికొనియె. దివ్యదుందుభిధ్వానంబులు సెలఁగె. శిష్యుండగు దోసయ్య ధీరుండై గురునికై వగవక వేగిరంబుగ దాక్షారామంబుఁజేరి గురుపుత్రులకు సర్వం బెఱింగించి గురునికై మంగళ కర్మంబు లొనర్పఁ జేసె. మల్లికార్జునపండితగురుపుత్రులును

ధీయుతులై విబుధులై తండ్రిగారి యట్లుభక్తులై శివేష్టలింగభక్తగణార్చనలను సల్పుచుఁ త్రిలోకగురు మల్లికార్జున పండితారాధ్యులను బిరుదంబుతో శివభక్తిని సల్పుచుండిరి. దోసయ్య గురుపుత్రుల కండయై వసించె. ఇది యసాధారణోత్తమశైవాచార్యుండును జగదారాధ్యుండునగు మల్లికార్జున పండితారాధ్య గురుచరిత్రంబు పాఠకశ్రోతృజనంబుల కఖిలాఘ భంజకంబు సకల కల్యాణకారణంబు. *

మల్లికార్జున పండితారాధ్య రచిత శివతత్వసారమందలి
కొన్నిపద్యములు

కం॥ జంగమ లింగంబగు భ
క్తుంగని పూజింపఁడేని ♦ గోటివిధములన్
లింగార్చన చేసిన వృథ
జంగమ ముత్తమముగాన ♦ స్థావరమునకున్॥ 1

కం॥ కుసుమశరారీ ! శివలిం
గసమేతులు దక్కనొండఁ ♦ గాదోగినిర్మా
ల్యాసుఖమని బండారువు
బసవన విసమెత్తిత్రావి ♦ బ్రతుకఁడె రుద్రా ! 2

కం॥ గురుకృత శివదీక్షమెయిన్
విరహిత మల దేహులగు ప ♦ విత్రులు భక్తుల్
హారనిర్మాల్యము గుడుతురు
పరమేశ్వరు నందు దాస ♦ భావముతోడన్ ॥ 3

కం॥ అద్వైతైకస్థితి నీ
యద్వైతముగాన ఈశ్వ ♦ రాద్వైతము స

*ప్రస్తుతమీగురువర్యుని వంశ్యులు చాతుర్వర్ణ్యగురులై పెక్కు తెగలై పెక్కు గ్రామంబులందు వసించి పెక్కుగృహనామంబులతోఁ బిలువఁబడుచున్నారందు గొందఱను దెలుపుచున్నాను. గుడిపాటివారు కొడిమేలవారు నిర్మలవారు ఘట్టెపల్లివారు మడిపల్లివారు మూటకోడూరివారు చప్పివారు కాచాపురపువారు కాళేశ్వరపువారు రామగిరివారు ముత్యంపేటవారు మున్నగువారు.

ర్వాద్వైత మనఁగ వేఱు జ
గద్విపరీతమగు తత్త్వ ♦ గతిగలదె శివా! 4

కం॥ కలనైననొండుదైవము
గలఁడనియెడు పలుకుదక్క ♦ కలఁడొక్కఁడ కే
వలశివుఁడె దైవమని ని
శ్చలభక్తి శివైక్యుఁడుండు ♦ సంతతము శివా! 5

కం॥ త్రిమలకృత దుఃఖసంసా
రమహాబ్ధిని మగ్నజీవ ♦ రాసులు నీయు
త్తమకారుణ్యావశంబున
విముక్తులై నీవపోలె ♦ వెలయుదురు శివా! 6

శివతత్త్వసారము.

# 35. శ్రీబసవేశ్వర మహామంత్రి

శ్లో॥ నాన్యం దేవం వేద్మ్యహం శ్రీమహేశాత్
నాన్యం దేవం స్తౌమి శంభోరుతేఽహం
నాన్యం దేవం వా నమామి త్రిణేత్రం
సత్యం సత్యం సర్వమేతన్మృషాన ॥

తా॥ మహేశ్వరునకన్న ఇతర దేవుని నేను గుఱితింపను. శంభునికన్న ఇతర దేవుని నేను స్తుతింపను. త్రినయనునికన్న నే నితర దేవుని నమస్కరింపను. సర్వమిది సత్యము సత్యము అనృతము గాదు.

స్కాందకాశీఖండము.

భూలోకమందు భక్తిపరివర్ధనార్థమై శివునిచే జన్మించుట కనుజ్ఞాతుండైన నందికేశ్వరుఁడు పుడమి నవతరింప నెంచినట్టి సమయమందుఁ గర్ణాటకదేశ మందలి యొక బ్రాహ్మణాగ్రహారమందు మంద్రెంగ మాదిరాజనెఁడు బ్రాహ్మణుఁడు మాదాంబ యను తత్సతియును బెక్కేండ్లవఱకు సంతానములేకపోవుటఁ బెక్కునోములు నోచి చివరకు నందికేశ్వరవ్రతంబును పుత్రకరం బని విని యద్దాని నాచరింపుచు నంది

కేశుని భక్తితోఁ గొలుచుచున్నంత నందికేశుండు మాదాంబ గర్భ మందుఁ బ్రవేశించె. అంత మాదాంబకు నెలమసలి గర్భాంకురంబై దినదినము గర్భము పరివర్ధమాన మగుచుండె. ఆ మీఁద సతిపతు లిద్దఱు సంతుష్టులై నందికేశ్వరునందు మిక్కిలిభక్తినొంది యెక్కుడు వేడుకతో నంది నలంకరించి పూజించుచు సఘృతశర్కరావిశిష్టంబగు పులగంబు నివేదింపుచు శైవవిప్రులను భుజింపఁ జేయుచుండిరి. అట్లు నవ మాసపూర్తియందు మాదాంబకుఁ బ్రసవము కలుగక దీర్ఘకాలంబు వత్సరత్రియంబుదనుక గర్భమట్లేయుండె. మాదాంబ దుర్భరంబగు గర్భభారంబును వహింపలేక యలసి వగచి జాలిపడి నందికేశుని గూర్చి పలువిధంబులఁ బ్రార్థించెను. నందికేశుఁడు కరుణతో మాదాంబకు స్వప్నమందుఁదోఁచి వెఱవకు పక్వసమయం బాసన్నంబయ్యె. అచిరం బునఁ బుత్త్రునిగ నెదవనియె. మాదాంబ కన్నులు తెఱచిచూచినంత నెవరును గన్పట్టరైరి. అపుడామె నందికేశుఁడే వచ్చి ప్రబోధించె నని యానందించి భర్తకెఱింగించె. ఉభయులు హరుసంబుతోఁ బుత్త్రో దయంబున కెదురుచూచుచుండిరి. కొలఁది దినంబులలోనే యొక సుది నంబం దుత్తమనక్షత్రియుక్త బలవచ్ఛుభలగ్నంబందుఁ బ్రసవం బమరి సుతుం డుదయించె. ధాత్రీ జనంబు సంతసించి సూతికృత్యంబుసల్పి బాలు నకు మజ్జనంబాడించినంతనే ఆయభ్యంతరగృహంబునకు సంగమేశ్వర శివుండు వచ్చి కుమారునకు విభూతి పట్టాఖ్య దీక్షాదుల నిచ్చి పంచా క్షరీ మంత్రోపదేశం బొనరించి శివలింగధారణంబు సల్పి ఈ శిశున కాహారంబు లింగనివేదనం బొనరించి యొసఁగుఁడని యుద్బోధించి యదృ శ్యుం డయ్యె. అందలి వారందఱు వెరగుపడి ఈ మహాత్ముఁ డెందుండి వచ్చెనో ఎచ్చటికేగెనో తెలియమైతిమని విస్మితులైరి. అంత జనకుఁడు వచ్చి తనయుని జూచి యానందించె. పదియొకండవనాఁడు మాహేశ్వ రుల నెల్లఁబిలిచి పీఠంబు లొసఁగి వారిచరణంబులఁ బళ్ళెరంబందుఁ గడిగి యా తీర్థంబును బాలుని శిరంబందుఁ జల్లి ముఖమందు భస్మత్రిపుండ్రం బులఁ దీర్చి మాహేశ్వరులకు విభూతి వీడ్యంబులిచ్చి వారలయనుమతిచేఁ బుత్త్రునకు బసవఁడని నామధేయంబొనర్చి భక్తమాహేశ్వరుల కందఱకు మృష్టాన్నంబులిడి పంపె. బాలుండు దినదినప్రవర్ధమానుం డగుచుండెఁ

అమృతంబుఁ గుఱియు మందహాసముఖారవిందంబుచేతను వెన్నెలలఁ గుమ్మరించు స్తిమితధీరదృష్టులచేతను బంగారమువకుఁ గూడఁ బసిమియుఁ దావియు నొసంగఁ జాలు రమణీయగాత్రముచేతను మధురనాదము గల ముద్దు పలుకులచేతను శివధ్యానపారవశ్యమువ మించు నగవుల చేతను దల్లిదండ్రులయుల్లంబులఁ బుడుతఁ డేప్రొద్దు రంజిల్లఁజేయుచుండెఁ. ఇట్లు బాలుండు పంచాబ్దవయస్కుఁ డగుడు తండ్రి విద్యాభ్యాసమునకై సుతుని గురునొద్దకుఁ బనిచిన సర్వజ్ఞుఁడైన నందికేశుని యవతారం బౌట సర్వవిద్యలును సకలశాస్త్రంబులును సహజంబులై బాలునకొదవె. అంత గర్భాష్టకంబు దాపరింప మాదిరాజు కొమరున కుపనయనంబుసేయ సంకల్పించి సర్వపదార్థంబులను సేకరించి బంధుగులనెల్లఁ బిలిచి సుముహూర్తంబును నిర్ణయించె. బాలుఁ డగుబసవఁడా యుదంతం బంతయు నెఱింగి జనకుని జేరి "వడుగని యిది యెదో చేయనెంచితివి. ఈశ్వరుని బూజించుచుండియే యరయక యిట్లేలపూనితివి? పరమాత్మయగు శివుని గురునిగఁ బడసి మరల నీ దుర్నరుల గురుల నొవర్చుకొనుట తగవా?

ద్విపద॥ నిర్మల గురుకృపా ♦ స్వీతజన్మమునకుఁ
గర్మజన్మంబు దు♦ష్కర్మంబుగాదె
అగ్గురుపాదంబు ♦ లర్చించునతని
కగ్గిలో హావివేల్చు ♦ టదితప్పుగాదె
మలహారాత్మకమగు ♦ మంత్రంబుఁ గొలిచి
పలుమంత్రములఁ గొన ♦ పాపంబుగాదె
కర్మపాశంబు లొ ♦ క్కట దెగనీల్గి
కర్మంపు త్రాళ్ళతోఁ ♦ గట్టుకొదగునె
రుద్రాక్షభసితాది ♦ ముద్రలుదాల్చి
క్షుద్రముద్రలఁదాల్ప ♦ గూడునే చెపుమ
నీరుకుద్రాడుకు ♦ దూరమైయున్న
వీరమాహేశ్వరా ♦ చారదీక్షితుని
నిర్మితోభయకర్మ ♦ నిర్మాలు నన్ను
గర్భాబ్ధిముంపఁగ ♦ గర్జమే నీకు
బ్రహ్మశిరోహార ♦ పరిముద్రైకవంశ్యు

బ్రహ్మవంశ్యుండని ♦ భావించె దెట్టు
లకులస్థుఁడై యున్న ♦ యభవునిభక్తు
నికి నొక కులమని ♦ నిర్ణయించెదవు
కావున నెన్నిమా ♦ ర్గములను వడుగు
గావింపఁగా రాదు ♦ కథ లేమి యిఁకను"

సోమనాథుని బసవపురాణము.

అనినఁదనయునకుఁ దండ్రి యిట్లనియె. కుమారా! చతుర్వర్ణ
ులో మనమగ్రవర్ణులము బ్రాహ్మణులము. మనకు వేదోక్తవిధిగ గర్భ
సంస్కారము మొదలుకొని పదియారుకర్మంబులు విహితంబులు. వానిలో
నే యొకటి లోపించినను గులంబునకు లోపంబగును. ఇఁక నీవడుగు
దు విరుద్ధమేదియో పరికింపు ముపనయనంబునకు నాందీపూజనంబు
ఖము ప్రణవంబు శివవాచకంబు భర్గశబ్దంబుతోఁ గూడినట్టి గాయత్రీ
ంత్రంబు శివైకప్రతిపాదకంబు పంచశిఖంబులు దండంబు కౌపీనంబు
నివేసంబులు భిక్షాటనంబు శివునికృత్యము కృష్ణాజినధారణంబు
రంగధరుఁ డగుశివునిచిహ్నమే. ఇఁకఁగులధర్మంబగునిందు విరోధమేమి
దు? పసిబిడ్డవాట నీ విట్లుపల్కితివి. ఉపనయనము నొందకున్న సాటి
్రహ్మణులు మనలను వెలివేయుదురు. కులదీపకుఁడ వగునీచేఁ గులంబు
ల్లవలయును. ఇట్లు విహితధర్మంబులఁ జెప్పితిని. ఒల్లవేని నీయిష్టం
ట్లు నడువు మని జనకుం డించుక నిష్ఠురంబుగఁ బల్కిన బసవండు
ంబును సంతసం బొనరి మరల నిట్లనియె. బ్రాహ్మణకులంబని తద్ధ
ంబని పలుమాఱు వేఁడుగఁ బల్కెదవు. అదివేఱు. అన్యదైవంబునుఅన్య
త్రంబును లాతిగురుండును లాతివేసంబును లాతిక్రియలు నా కక్కఱ
ు. గాయత్రి కగ్నిముఖమును బ్రహ్మశిరంబును విష్ణుహృదయంబును
ుద్రుఁడు శిఖయు ప్రాణాదివాయువులు ప్రాణంబులు సవిత దేవుఁడు
ఖ్యాయనగోత్రంబు పృథివి యోనియు విశ్వామిత్రుండు ఋషియు
టగలదు. ఇట్టి గాయత్రి యెట్టిదైనను నాకువలదు. నాకు సర్వము
్తృత్వుండగుశివుఁడే దైవము. ఒకశివమంత్రమే మాననీయము మోక్ష
యకము. అదియే సప్తకోటి మహామంత్రంబుల కధిరాజము షడక్ష
. మఱియు భస్మరుద్రాక్షశివలింగజంగమశివమంత్రంబులుపాదేయం

బులు. వీనికన్న నితరంబులను మన్నింపను. ఇదియే పరమసౌఖ్యకరము మోక్షలక్ష్మీప్రాపకంబు. బ్రాహ్మ్యంబునకును భక్తికిని బొత్తుగాదు. బ్రాహ్మ్యంబునఁ ద్రిసంధ్యంబందు హరివిరించ్యాదిదేవతల నెల్లఁ గొలువ వలయును. అట్లు గొలిచిన భక్తి దూరంబగు గొలువకున్న బ్రాహ్మ్యంబు దూరంబగు. తేజస్తిమిరన్యాయంబుగ నన్యోన్యవిరుద్ధంబులగు వీనియందు భక్తుఁడ నగునా కీ బ్రాహ్మ్యంబుతో సంబంధంబు వలదు. రసాల బీజంబు భూతలంబందు విత్తిన రసాలంబు పొడముగాని వేపవృక్షం బంకురింపదు. శివలింగసంభూతుఁడనగు నాకు బ్రాహ్మ్యధర్మంబు లెట్లుగ్రాహ్యంబగును? గౌతమదధీచ్యాదిమునిశప్తులగు విప్రులకు భక్తి యెపుడేని యలవడునే! నేను నుడివినది వేదపథంబే యన్యమార్గం బనియూహింపకు మిట్లు నీ కిష్టము గాదేని మీయంత మీ రుండుఁడు నాయంత నేనుండెద. తల్లి దండ్రి లన్నదమ్ములు కొడుకు లనేఁడు నుడు లెక్కడ?

శ్లో॥ ఉమా మాతా శివస్తాతః ప్రమథాస్తే సహోదరాః
బాంధవా శ్శాంభవా స్సర్వే స్వదేశో భువనత్రయం.

ఇఁక నే నిందుండను సెలవు అని తనసోదరి యగు నాగాంబను దోడ్కొని తత్‌క్షణం బందుఁ బాసిపోవుచుండ వడుగుకై వచ్చినట్టి తన మేనమామ బండారిబలదేవుండను నతఁడు మాదాంబకుఁదమ్ముఁడు బిజ్జలరాజసేనాని యపుడు బసవని దారసించి బుజ్జగించి నీయిష్టాను సారంబుగ నాయింట నుండుము రమ్మని నాగాంబతో బసవన్నను దన యింటికిఁ దోడ్కొని పోయి యందుంచికొనియె. మాదాంబామాదిరాజు లేమిచెప్పినను లబ్ధి లేదనియూరకుండిరి. అటుమీఁద బసవయ్యకుఁ బది యారు వత్సరంబులుదాఁటె పదియేడవయేఁడు ప్రాప్తంబయ్యె. అప్ప టికిఁ లేఁ బ్రాయం బొదవె. బలవద్దృఢదేహంబమరె. సౌందర్యంబు హెచ్చె. భక్తియుఁబెచ్చుమీఱె. అవిరతం బీశ్వరవిషయంబుదక్క నితర మార్గంబులఁ ద్రొక్కకుండె. ఇట్టి మేనల్లుని ధీరుని బలవిక్రమ సంపన్నుని సుందరుని సకలాగమాంతవేదిని సర్వవిద్యావిశారదుని భక్తుని జూచి మెచ్చి మురిసి బండారి బలదేవుండు సౌందర్యవతియును సద్గుణవతి యును బదమూడేడులు దాటిన నూత్నవయోంకురవతియును నగుతన కూతును బసవేశ్వరునకిచ్చి సకలబాంధవసమక్షంబందు వివాహంబు

సల్పె. ఆ వివాహంబందనేకులు భక్తశిరోమణులు వచ్చి యుత్సవం బందుఁ బాల్గొని యానందించి దీవించిరి. అంత బసవయ్య ఆత్మ వధువును దోబుట్టువగు నాగాంబను దోడ్కొని కప్పడిసంగమేశ్వరమందు గురుదేవుఁ డున్నాఁ డందువారిఁ గొలిచి వచ్చెదమని యందులకేగె. ధ్యాన తత్పరుఁడై యట్లు వెడలి దవుదవ్వుల నవ్వూరిని గాంచి సాష్టాంగపడి లేచి మ్రొక్కుచు నా యూరిని జేరి కూడలి సంగమేశ్వరాగారంబుఁ జెంది యందు బహిర్ద్వారంబందు సాగిలఁబడి మ్రొక్కె. అంత సంగమేశ్వరుండు తొంటియట్లు రూపధారియై పొడసూపినంత బసవఁడు చూచి యులికిపడి ప్రమోదంబు భక్తియు వెగ్గలంబై యలర దివ్యపదంబులకు సాష్టాంగముగా మ్రొక్కి యామ్నాయవచనంబుల సన్నుతించి యానంద బాష్పంబులఁ బాదంబులను గడిగి సకల పూజోపచారార్థమై తన్నే యర్పించి చరణసన్నిధిఁ బడియుండ సంగమేశ్వరుఁడు గొడుకును గని కరంబునఁ గాంచి లేవనెత్తి కౌగలించె. బసవకుమారుండును మ్రొక్కుచు మోడ్పుగేలుతో స్వరనేత్రాంగవిక్రియ లమర హర్షపారవశ్యంబున నమ్రుఁడై యున్నంత బసవని భక్తికి మెచ్చి ప్రసాదంబిచ్చి కుమారా! నీదుభక్తివైభవంబుఁ దెలియుచు సంతసించుచుంటి నని మఱికొన్ని శైవాచార విశేషంబులు శీలసంపదలు పుత్రునకు బోధించి మరల నెప్పటియట్లు గుడిఁజేరి లింగమం దదృశ్యుఁడయ్యె. ఆమీఁద బసవనితో వచ్చిన వారందఱు విస్మయఁపడి ఈ బసవయ్య పరమేశ్వరుఁడు గాని యన్యుండు గాఁడు. ఎన్నఁడేని యిట్లు లింగంబునందుండి శివుఁడు తపస్వియై వచ్చి దరిసెనంబిచ్చి శివభక్తి బోధించి మరల లింగంబందుఁ జేరుట కని విని యుంటిమే! ఈ మహాత్మునితో నేమును గృతకృత్యులమైతిమి. "బాపురే మాయన్న బసవకుమార" యని పెక్కుభంగుల బసవని గీర్తింపుచుండిరందు బసవయ్య శివుని గొలుచుచు గుడిమంటపమందుఁ గొన్ని వాసరంబులు నిజజనంబులతో వసియించె. ఆ కప్పడి సంగమేశ్వరపురమందలి గ్రామీణ శ్రేష్ఠులు తత్ప్రాంతపువారలు వచ్చి బసవేశ్వరుని దరిసించి తచ్ఛివభక్తిబోధల కానందించి తాము భక్తులై సేవించుచుండిరి. అంతలోఁ గల్యాణపురంబందు బసవనిమామయగు బండారిబలదేవుండు దైవవశంబున వ్యాధితో మృతుండయ్యె. అతండు బిజ్జలమహారానకుజు

దండనాథుండగుట నాతనిమృతికి బిజ్జలుండుచింతించి యతని యధికారం బువహించుట కెవ్వరేని తత్సంబంధులు గలరాయని రాజపురుషుల నడుగ వారంద ఱేకగ్రీవముగ మహారాజా! కలం డాతనికి మేనల్లుండు కూతునకుం బెనిమిటి మహాపురుషుండగు బసవేశ్వరుండు. ప్రస్తుతమాతండు కప్పెర సంగమేశ్వరమందు సంగమేశ్వరుని బ్రత్యక్షమొనర్చికొని తదుప దేశంబొంది తద్ప్రసాదంబందికొని యందే ప్రజలకు భక్తిసూక్తు లుప దేశింపుచుం బెక్కురను భక్తులనొనర్పుచున్నాండు. ఆతండు ధీరుండు బల వంతుండు శూరుండు మతిమంతుండు నయవేది సకలవిద్యావేది శివవాది సర్వభూతహితకరుండు శివభక్తియోగి భోగి త్యాగి దయాదాక్షిణ్యా పుణ్యుండు గణ్యుం డసమానుండు నిన్నును నీ రాష్ట్రంబును ననపాయం బుగం బోషింప రక్షింప సర్వవిధముల సమర్థుం డా తేజస్విని దాము ప్రేమించి పిలిపించి ప్రధానామాత్యపట్టంబిచ్చి గారవించిన నయ్యానఘుండు మిమ్ముం గంటికి ఱెప్పవోలెం గాపాడుచు మీరాష్ట్రంబునంత విజయ వంతంబుగ నేలించుననిరి. బిజ్జలుండు హైనుండై నను రాజ్యరక్షకై వారల నుడులను అమృతస్యందములనుగ నాలకించి యంగీకరించి తద్ క్షణంబందు బసవేశ్వరునకు రమ్మని పత్రికను వ్రాసి అశ్వారూఢుల నంపె. బసవం డాపత్రిక నందికొని చదివి సత్వరంబుగం గలత్రముతోం జెల్లెలితోం బరివారముతో భక్తులతోం బయనముచేసి కల్యాణపురిని జేరవచ్చె. బిజ్జలుండు బసవేశ్వరుండు వచ్చునని నగరంబంత సింగారించి తాను స్నాతానులిప్తుండై యలంకృతుండై ప్రధానహితసామంతాదు లతో బహువిధ వాద్యంబులు మ్రోయ మాతంగతురంగరథికపదా తులు దోడురాం బాదచారియై బసవని సమీపించి యాలింగనంబుచేసి కొని నగరికిం దోడ్కొని పోయి ఆస్థానిం జేర్చి ఉత్తమపీఠాసీనుని జేసి పట్టుస్వర్ణదుకూలంబులు సువర్ణమణిభూషణంబులు ముత్యాలహారంబు లొసంగి ఏడునూరు లేనుంగులు పదిరెండువే లుత్తమాశ్వంబు లైదువేల రథంబులు పదిరెండులక్షల పదాతులను బన్నిద్దఱు సేనానులను బసవని కైవసంబుచేసి ప్రధానామాత్యపట్టంబుంగట్టి ఈసామ్రాజ్యంబున కంతకు నీవ యేలికవు నాకును నా సకలార్థంబులకును నీవ యొడయండవు. నన్నును నారాష్ట్రంబును గాచుచుండుమనియె. బసవేశ్వరుం డంగీకరించి

సకలలోకరక్షకుఁ డగు శివునకు నిన్నును నీరాష్ట్రంబును రక్షించుట పెద్దయగునే? నీవు మా శివలింగ భక్తులకు మాత్రము విధేయుఁడవై యుండుము. నిన్ను సముద్రాంత వసుమతి నేలింతునని యె. బిజ్జలుండును సభ్యులంద ఱేకగ్రీవముగ నామోదించి జయధ్వానంబులొనర్చి రంత బసవమంత్రి మున్ను తనమామయున్న భవనంబున కేతెంచి బంధుగుల నూరడించి హర్షింపఁజేసి యంద నివసించి రాజకార్యంబులం దప్రమత్తుండై నిర్వహింపుచు రాజు నానందపఱచుచుండె. బిజ్జలుండును సర్వభారంబు బసవమంత్రియం దుంచి తాను నిశ్శంకుఁడై సుఖ గోష్ఠినుండె. బసవమంత్రియంత లింగపసాయితంబను ఖడ్గంబును ధరించి రాచఱికంబు సల్పుచు చరగురులింగపూజావధానుండై లక్షతొంబది యాఱువేల భక్తగణార్చనం బారంభించి భక్తులను గౌరవింపుచుఁ గొలుచుచుండె. ఇఁక నిమ్మహనీయుఁడు నిజవృత్తంబును భక్తుల కాదేశించు తెఱంగెఱింగింతు వినుఁడు.

ద్విపద॥ శివరాత్రినిత్యంబు ♦ చెల్లించుబాస
శివభక్తులెల్లను ♦ శివుఁడనుబాస
భక్తుల యెగ్గులు ♦ పట్టనిబాస
భక్తుల కులమెత్తి ♦ పలుకనిబాస
మృదునైన నొకపరి ♦ యడుగనిబాస
యడిగినయర్థంబు ♦ గడపనిబాస
చీమంత ద్రోహనివం ♦ చింపనిబాస
యేమివేడిన నడు ♦ గిడకిచ్చుబాస
తలఁపెట్టులట్టులఁ ♦ బలికెడుబాస
పలుకెట్లు నడవడిఁ ♦ బాలించుబాస
పలికిబొంకనిబాస ♦ పొలివోనిబాస
చలమెడపనిబాస ♦ సలిపెడుబాస
తప్పఁద్రొక్కనిబాస ♦ తరలనిబాస
యెప్పుడు భృత్యత్వ ♦ మెడపనిబాస
కలనైన శివునకుఁ ♦ గెలుపీనిబాస
గెలుపు భక్తుల కిచ్చి ♦ గీడ్వడుబాస

పరసతిపై దృష్టి ♦ పఱపనిబాస
పరధనంబున కాస ♦ పడకుండుబాస
పరనింద కెయ్యెడఁ ♦ బొరయనిబాస
పరమర్మకర్మముల్ ♦ పలుకనిబాస
పరసమయంబులఁ ♦ బరిమార్చుబాస
పరవాదులనుబట్టి ♦ భంజించుబాస
హరదూషణకుఁ జెవు ♦ లాననిబాస
హరగణానర్పితం ♦ బంటనిబాస
హరగణపరతంత్రుఁ ♦ డైయుండుబాస
హరభక్తులెట్లన్న ♦ నట్లనుబాస
జంగమంబును బ్రాణ ♦ లింగమౌ బాస
వెంగలి మనుజుల ♦ వేడనిబాస
భవికి మ్రొక్కనిబాస ♦ భవిలేనిబాస
భవబాధలకు నగ ♦ పడకుండుబాస
విషయేంద్రియములకు ♦ వెన్నీనిబాస
విషమషడ్వర్గంబు ♦ విజేయించుబాస
వేదోక్తభక్తి సం ♦ పాదించుబాస
ఆదిశివాచార ♦ మ్మలరించుబాస
శిరమట్టుబాసిన ♦ శరణనుబాస
శిరమునకట్టబా ♦ సినమ్రొక్కుబాస
ముట్టినచో వెన్క ♦ మెట్టనిబాస
ఇట్టివన్నియుఁ దుద ♦ ముట్టించుబాస
శరణన్నవారల ♦ స్రాఁకెడుబాస
వెఱవక యమునైన ♦ వెన్నాడుబాస.

బసవపురాణము.

ఇట్లు వీరశైవవ్రతబద్ధకంకణుండై వర్ణాశ్రమధర్మశృంఖలలకుఁ దగులక భక్తులు భవులనెడుభేదంబే పాటించి భక్తసేవాపరాయణుండై శాంతిదాంతిక్షమలకిరవై ఉపనిషత్తత్త్వబోధంబునకు నిధియై పరమశివానందాస్వాదనంబున నిత్యంబనేకసహస్రభక్తుల కన్నుంబులిడుచు

ఈప్సితంబులిచ్చుచు సేవించుచుండె. అంత నొకనాఁడు శివసన్నిభుఁడు శివావతారుఁ డగునల్లమప్రభుండు బసవమంత్రి భక్తివైభవంబెఱింగి ప్రమోదంబొంది తనదరిసెనం బిచ్చి ప్రసాదంబొసంగుటకుఁ గల్యాణ కటకంబునకు వచ్చి బసవేశమందిరంబును డాయఁగా బసవేశుండు పరికించి తనగురుం డగుసంగమేశు నట్లుదలఁచి యెదుర్కొని సాష్టాంగపడి మ్రొక్కి యభ్యంతరగృహంబునకుఁ గొనిపోయి పసిఁడిపళ్లెరంబందుఁ బసిండి కలశంబు నుదకంబుతోఁ బదంబులఁ గడిగి తత్తీర్థధార శిరంబున నొంది తావి గంధాక్షత పుష్ప బిల్వంబులఁ బూజించి బంగరుపళ్లెరం బందుఁ బంచభక్ష్యాన్నంబుల వడ్డించి శివలింగనివేదితం బొనరింపఁ జేసి స్వయముగఁ బెద్దపెద్ద కబళంబు లొనర్చి యందిచ్చుచుండఁ బ్రభుఁ డారగించుచుండె. లక్షతొంబదివేల శరణులకు వడ్డించు నన్నంబులఁ బ్రభు వొక్కండ యారగించె. ఇఁక నన్నంబులు పక్వంబులైనవి కొఱతయౌట బసవఁడు చూచి ఆత్మనివేదనంబొనరించి తన్నే యన్నంబుగ భక్షింపుమనియె. ప్రభుండదిచూచి మెచ్చి బసవా! బసవా! నీయట్టిభక్తుఁడు వేఱొకఁడు గలఁడే? బంగరుకు సుగంధంబట్లు చెఱుకునకుఁ బండట్లు చందన తరువునకుఁ బ్రసూనంబట్లు నీయందు భక్తి విరాజిల్లుచున్నది. సంతసించితి నని ప్రసాదంబొసంగి నీచేఁ బుడమియందు భక్తిమార్గంబు విజయంబునొందు. నీ వెపుడేమి పదార్థంబుఁ గోరిన నది నీయీప్సితంబుకన్న నురువుగ లభించును. నీ ముట్టినయది బంగరం బగును. వేయియేల నీ తలఁచినయట్లెల్లఁ జేకూరఁగలదు. తొడరిన శివునైన గెలిచెదవు. జంగముల దిట్టతనంబున కోర్వఁ జాలుదువనిపల్కి మఱియు లింగరహస్యంబుల లింగజంగమపూజాసమయసంగతులఁ దెల్పి యదృశ్యుఁడయ్యె.

అంత నొక నాఁటిరాత్రి దొంగలగుంపు బసవనియింట బహుధనంబున్నది దాని తస్కరింతమని యెంచి భవులకు బసవనియింటఁ బ్రవేశంబు లేకుండుట నెఱింగి నల్లని వంకాయల లింగంబులట్లు గళములఁ దగిల్చికొని బసవేశ్వరుని గృహంబుఁ జేరి మాహేశ్వరగణంబులు యర్చనలఁ జూచుచు సమయంబు నిరీక్షించుచుండిరి. కొంఁదిసమయంబునకు వారలగళములందలి వంగకాయలు లింగంబులయ్యె. వారలకు శివభక్తి యంకురించి శివపూజకై మనంబు ప్రేరింప నంతనే వారలుగాఁడ శివపూజచేసికొని

భుజించి యిండ్లకుఁబోయిరి. బసవమంత్రి యెఱింగి మఱునాఁడవ్వారలఁ బిలిపించి ధనంబులనొసంగె. తదాదిగ వారలుగూడ భక్తులైరి. ఒక నాఁడొక భక్తుండు వచ్చి బసవేశుని జూచి శివలింగపూజకై ముగ్గునకు ముత్యాలపొడి గావలయునని యందులకుఁ బదివుట్లు ముత్యంబులు వేగిరంబుగ నిమ్మనియె. అపుడు బసవేశ్వరుండు సమీపమందున్న జొన్నల రాశి నీక్షించిన మాత్రంబున నాజొన్నలరాసి ముత్తెములరాసియయ్యె. శరణునిజూచి పదివుట్లేకాదు నీవలసినన్ని ముత్యంబులఁ గొనిపొమ్మనియె నతం డట్లుగొనిపోయె. ఇఁక నొకప్పు డొకనాటియహంబున నొక జంగమవర్యుఁ డేతెంచి రాజభాండాగారంబు నరయుచున్నట్టి బసవమంత్రిని దారసించి బసవేశ్వరా! నాకీ ధనంబునెల్ల నిమ్మనియడిగె. బసవేశ్వరుండు మాఱువల్కక మాడలన్నియు జంగమదేవర కర్పించె నతండు మురియుచు నవ్వాని గొనిపోయె. అందలి రాజభటు లొక్క బసవమంత్రి బండారంబందలి ధనంబంతఁ గొల్లగొట్టి జంగమయ్య కిచ్చె నని రాజునకుఁ జెప్పిరి. రాజాగ్రహించి బసవమంత్రిని బిలిచి యిదేమి యిట్లు బండారంబంత జంగమున కిచ్చితి వనియడుగఁగా బసవేశ్వరుఁడు మందహాసము చేసి మీధనంబు నేనీ మలే దిపుడు మీ ధనంబులఁ జూచి కొనుఁడని బీగంబులు వదలించి పేటికలఁజూపిన నందలిహొన్నులన్నియు నట్లేయుండుటఁ జూచి తేఁడును దత్పరిజనులును విస్మితులై బసవని క్షమాపణం బర్థించి పోయిరి.

మఱొకనాఁ డొకవేశ్యయింట వేశ్యతో భోగంబు లొందుచు బసవేశ్వరునిచే నిత్యపడియందికొనుచు వేశ్యాలంపటుఁడై యున్న నొక తరుణచరుండు వేశ్యాదాసిని బిలిచి బసవేశ్వరుని కడకేగి నిత్యపడిఁ దెమ్మని పనుచుటయు నాదాసి బసవమంత్రి భవనంబున కేగి యందు బసవేశ్వరపత్నిని గంగాంబను బరికించి యామె కట్టియున్నబంగరు పట్టుచీరను జూచి విభ్రాంతిపడి మెచ్చి నిత్యంపుపడిగొని వేశ్యాగృహంబునకుఁ బోయి యాగణికామణితో నిట్లనియె. అక్కా! బసవేశ్వరసతి గంగాంబ కట్టినపుట్టంబుఁజూచితి. అదిచాలరమ్యంబై నది యపూర్వంబై నది. అద్దాని నీవు గట్టుటకు నే నుత్సహించుచున్నాను. బావ బసవమంత్రినడిగినఁ

దడయక నిచ్చును గావున నద్దాని దెప్పించి నీవు ధరింపవలయు నన్న యగ్గణిక యగ్గలంబైన కోర్కెతోఁ దనప్రియున కట్లెఱింగించె. ఆ జంగమయ్య వేగిరంబుగ బసవయ్యను జేరి గంగాంబ కట్టిన పుట్టంబు నిమ్మనియె. బసవేశ్వరుండు కిమ్మనక హర్షించి సతిని బిలిపించి దేవీ! పుట్టుచావులు లేనట్టి యిట్టి మహాత్ముండు నీకట్టినపుట్టంబడిగె. అట్టిచ్చితిమేని మనమింకఁబుట్టబోమని ధీరుండై యందే యామె యొడలందలి పుట్టంబుఁ బట్టికొని విడుచుచుండ నామెయు భర్త కెదురాడక యధోముఖియై నిలిచియుండె. బసవఁ డట్లు వలువను విడిచిన నట్టిదియె మరలఁ గన్పట్టుచుండె. ఇట్లు పలుచీరల నొలిచిన నొకరాశియైనంత బసవఁడు చరమూర్తికిచ్చి కొనిపొమ్మనియె. జంగముఁ డంబరంబులఁ గొనిపోయి వేశ్యకిచ్చి మెప్పఁజెందె. అందు బసవనిమహిమంబుఁ జూచినవారందఱు విస్మయంబొంది గంగాంబను బసవేశ్వరుని వేనోళ్ళసన్నుతించి మ్రొక్కిరి. బసవేశ్వరుఁ డిట్లర్థులగు శరణులకు సర్వార్థంబులొసంగుచుండ గురుండగుసంగమేశ్వరుఁ డొకనాఁడు జంగమరూపంబున బసవని యింటికేతెంచి తనకు మూడవనేత్రం బిమ్మని యడిగె. బసవఁడు తద్విధంబెఱింగి గురుండగు సంగమేశ్వరుఁ డని యారసి తన్ముఖంబు ముందఱ నొకయద్దంబుంచి దేవా! యిందు నీ మూడవకన్ను జూడుమ నియె. సంగమేశ్వరుఁ డద్దంబులోఁ బ్రతిబింబించిన తనదు ఫాలనేత్రంబును జూచి లజ్జించి యదృశ్యుండగుచుండ బసవయ్య చూచి మందహాసము చేసి నీదుభక్తుఁడు నీ కెపుడేని యోడఁ గలఁడే? నీవ యోడవలయును. నేఁ డీ భక్తుండు నీకుఁ గ్రొత్తవాఁడగునే! జగదాది కాలంబునుండి నీవు గురుండవు నేను పుత్రుండను గదాయని బిగ్గఱగా మందలించె. సంగమేశ్వరుఁ డానందించిచనియె. ఇట్లు బసవేశ్వరుఁ డరలేక భక్తులకీప్సితంబు లిచ్చుచు నసంఖ్యాతభక్తమాహేశ్వరుల కనుదినంబు దివ్యాన్నంబు లొసంగుచుఁ బెద్దకాలంబు భక్తగణార్చనంబుసేయుచు బిజ్జలుని రాజ్యంబు సముద్రాంతపరీతంబొనర్చుచు శైవమతంబును సమృద్ధంబును జేయుచు శివుని గొలుచుచుండె. పెద్దకాలం బిట్లుజరిగినమీఁదఁ గొంత కాలంబందు బిజ్జలరాజు విధిప్రేరితుండై బసవమంత్రిపై ననాదరమొంది భక్తవర్యులగు మల్లయ్య మధుపయ్య లనువారల నిరపరాధులను బిలి

పించి నేత్రంబులూడదీసినంత వారలు దుఃఖితులై బసవమంత్రియొద్ద కేగి తమయవస్థను దెలిపిరి. బసవేశుఁడాగ్రహంబొంది ఇఁక నీరాజును నేను గొలువను వీనికిఁగాలము దాపరించినది ఈ కల్యాణకటకంబు పాడువడునని భక్తులగు మల్లయ్య మధుపయ్యలకుఁ దిరుగఁ గన్నులొసఁగి తద్క్షణంబందు నిజకుటుంబముతోఁ బరిజనముతో భక్తులగు మడివాల మాచయ్య మోళిగమారయ్య కిన్నెరబ్రహ్మయ్య మున్నగువారలతోఁ గదలి పయనంబుచేసి కప్పడిసంగమేశ్వరంబుఁ జేరి యుండె. బసవేశ్వరుండు రాజసేవమాని కల్యాణపురంబునుండి నిర్గమించిన యుదంతం బారసి మల్లయ్యమధుపయ్యలు జగదేవమంత్రియొద్దకేతెంచి బిజ్జలుఁడు నిర్దయుఁడై నిరపరాధులగు తమకొనర్చిన ఘాతుకకృత్యంబును బసవేశ్వరునియం దీరసమొంది ప్రతికూలుండగుటయు బసవేశ్వరుఁడు మరల దమకుఁ గన్నులొసఁగి బిజ్జలుని దాను హింసింపనొల్లక కొందఱు భక్తలను గొని కటకంబును బాసి కప్పడిసంమేశ్వరంబున కేగుటయు మున్నగు బిజ్జలుని యపచారంబు లుద్ఘాటించి చెప్పి యిట్టిద్రోహిని బట్టి హింసింపక తీరదనిరి. జగదేవమంత్రి తల్లిగూడ నట్టి శివద్రోహిని బట్టి వధింపుమని తనయున కానతిచ్చె. తద్క్షణంబున జగదేవమంత్రియు మల్లయ్య మధుపయ్యలు ముప్వురు ఖడ్గహస్తులై యాస్థానమందున్న బిజ్జలునిపై కెగిరి శిరంబుఁ ద్రుంచిరి. వీరావేశంబుతో ఖడ్గహస్తులగువారల నేరును నివారింపఁ జాలరైరి. అంత వారలుగూడ నాపురిఁబాసి కప్పడిసంగమేశ్వరంబునకుఁ జని బసవని కా యుదంతం బెఱింగించిరి. బసవేశ్వరుఁడప్పుడు తాను పుడమినుద్భవించినపని యంత సఫలమైనదని యిఁకను భువినుండుటేలయని భక్తులయాజ్ఞనొంది మ్రొక్కి సంగమేశ్వరలింగంబును జేరి దేవా! ఎట్లు పుట్టించితివో యట్లు నీయందుఁ జేర్చుకొనుమనియె. అప్పుడు సంగమేశ్వరుండు వచ్చి బసవకుమారునిగొని తనతోఁగూడ లింగమందుఁ జేర్చుకొని యదృశ్యుఁడయ్యె. భక్తులందఱు విస్మయం బొంది జయజయధ్వానంబు లొనర్చి రిది మహనీయుఁ డగుబసవేశ్వరుని దివ్యచారిత్రంబు పాఠకులకు శ్రోతలకఖిలాఘహరంబు.

# 36. భక్తకిన్నెర బ్రహ్మయ్య

శ్లో॥ అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవా సురనరే
నివర్తంతే నిత్యం జగతిజయినోయస్య విశిఖాః
స పశ్య న్నీశ! త్వా మితరసురసాధారణ మభూత్
స్మర స్స్మర్తవ్యాత్మా నహివశిషుపథ్యఃపరిభవః

మహిమ్నస్తవము.

తా॥ ఓయీశ్వరుఁడా! జయశీలుఁడగు ఏమన్మథుని బాణములు దేవా సురమానుష విశిష్టంబగు నీ జగమందు నెందును సఫలంబులు గాక పోలేదు. ఇఁక నమ్మన్మథుఁడు ని న్నితరదేవతలతోఁ పాటు చూచి నీచేఁ గీర్తిశేషుఁడయ్యె. ఇంద్రియ నిగ్రహముగలవారియందుఁ బరిభవము (తిరస్కారము) హితము గాదు.

పోడూరనునొకగ్రామంబందు బ్రహ్మయ్య యను నొక భక్తశిఖామణిగలఁ డాతఁ డిష్టలింగార్చనాపరుఁడు వీరశైవ వ్రతాచారధురీణుఁడు సర్వప్రాణిదయాకరుండు సంగీతవిద్యా నిపుణుండు వీణావాదనప్రవీణుం డనేకకలాకోవిదుండు ఆత్మేష్టలింగంబు నహర్నిశంబు లర్పించుచుఁ గాయికంబులనేకంబులు నేర్పుటఁజేసి యనేకవిధంబుల ధనంబార్జించి మహేశ్వరార్చనల సల్పుచుండె. చిరకాలంబట్లు జరిగినమీఁద నాతని సంగీతవిద్యానైపుణి కానందించి శివుఁడు ప్రత్యహంబు బహుమానంబుగఁ గొన్ని మాడలను బ్రహ్మయ్యకిచ్చుచుండె. అద్దానితో గాయకకృత్యంబును మాని యొకకిన్నరను జేకొని శివుని గానంబొనర్పుచు మహేశ్వర మాహేశ్వరార్చనలఁ జేసికొనుచుండి కల్యాణపట్టణం బందలి శ్రీబసవేశ్వరుని శివపూజోన్నతిని శరణగణార్చనాప్రకారంబును భక్తిపెంపును వినుచు నానందముతో నమ్మహాత్ముని జూడఁదలచి పయనంబుచేసి బసవేశ్వరుని మందిరంబునకేగె. బసవేశ్వరుఁడు మహాభక్తుఁడగు కిన్నర బ్రహ్మయ్యగారి రాక నెఱింగి యెదురేగి గృహంబునకుఁ దోడ్కొనిపోయి యున్నతపీఠంబిచ్చి పూజించి తీర్థప్రసాదంబులొంది తన మందిరంబందుఁ గొన్నినాళ్ళుండుఁడని ప్రార్థించి యంగీకారంబొంది యునిచి

కొనె. బ్రహ్మయ్య యానందముతో బసవేశ్వరునియొద్ద సుఖగోష్ఠినున్నంత నొకనాఁడా యూరినందలి త్రిపురాంతక దేవుని దర్శింపఁగోరి కోవెల కేగి శివుని సందర్శించి మ్రొక్కి ముఖమంటపంబందుఁ గూర్చుండియుండె. ఆసమయమందొక వేశ్యావిటుండు వేశ్యా ప్రేరితుఁడై వేశ్యాప్రీతికై శాకార్థమొక గొరియనుగొని వేశ్యాగృహంబున కేగుచుండ బ స్తంబు బంధపుత్రాడును లాగి తెంపుకొని శివాలయంబుఁజొచ్చి దాగియుండె. అంత నావిటుఁడు రయంబున వచ్చి గొఱియను బట్టికొని కట్టి కొని పోవుచుండ బ్రహ్మయ్యగారదియంతఁజూచి ఆ విటపురుషుని దారసించి ఓయీ ! ఇది ప్రాణభయంబుచే భగవత్సన్నిధానంబుఁ జేరినది. దీని జంపుటకై కొనిపోకుము విడువుము. వలయునేని నిద్దాని గొనిన ద్రవ్యం బిచ్చెదననియె. అతఁ డట్లంగీకరింపక గుడిఁ జొచ్చుఁగాక ఎందేనిజొచ్చుఁ గాక ! నాప్రియమైన వేశ్యకై కొనితెచ్చిన నీ గొఱియను విడువను దీనినే కొనిపోవుదును. ఇందు నీకేల పట్టుదల యనియె. బ్రహ్మయ్య ఓయీ! మరణ మందలిభీతి సర్వప్రాణుల కొక విధమే. ఈయది భయముఁజెంది యిందుఁ జేరినది. నీప్రియమగు భోగస్త్రీ కీగొఱియయే కావలయునా ? దీనిపైన చొప్పత్తినదా ? రూకలున్న నింతకన్న పెంపగు బస్తంబును గొన వచ్చును. ఇద్దాని నిన్ను నేనుబట్టనీను. నీవలసినంత మూల్యంబు నిచ్చె దను కొనిపొమ్మనియె. అపు డీవివాదంబుఁ జూడవచ్చినవారలలోఁ గొందఱు గొఱియను నిమ్మహాత్ముండు నిన్నుగొనిపోనీఁడు. వేయిమాడ లైన నిచ్చును వెనుదీయఁడు. వాదంబుమాని నీవలసినన్నిమాడలడిగికొని పొమ్ము. ధనంబున్నయెడల నంగడిలో బస్తంబులకుఁ గరవాయని బుద్ధు లుచెప్ప నవ్వాఁ డాలోచించి బస్తంబుకై వేయిమాడలిమ్మనియె. బ్రహ్మ య్యగారు పరికించి చురచురఁజూచి అట్లేయిచ్చెద. ఇఁక నిది నీయది కాదు తొలఁగుము. శివముద్రవైచెదను మాడ లివే కొనుమని జాలెంబు వదలించి వేయిమాడల లెక్కించియిచ్చె. అతఁడమ్మాడలఁగొని పడుపు పడఁతి యిక్కకుఁబోయె. అట నవ్వారయువతి గొఱియను దేవైతివే మని యడిగిన నతఁడు వృత్తంబంతయుఁ జెప్పి వేఱొక గొఱియను దెచ్చి యిచ్చెదననియె. అపుడది మదముచే విటుని జూచి నీయట్టి యధమ విటుని నేనెందును జూడలేదు. వలఁపుల చెలువకై కొనితెచ్చిన గొఱి

యను వేఱొకనికమ్మి రిక్తహస్తంబులతో సిగ్గులేక యిటకు వచ్చితివా? ని న్నేమనవలయును? సరిసానులలో నవ్వులపాలైతిని సిగ్గులపాలైతిని. సరివిటులు నిన్ను నిందింతురనియైనఁ దలఁపవైతివి పొమ్ము. ఇన్నాళ్లవడల నీయాలి కిచ్చికొనుము. జీవితమును గడుపుకొనును. ఇఁక నాయిలుచెంత రాకుము. గెంటించెదనని బింకముతో నదలించెను. అపు డవ్వాఁడు తప్పుచేసితి సైరింపు మిపుడు నీవెట్లుగోరిననట్లు చేసెదననియె. అపుడవ్వారయువతి రోసంబున్న పురుషుఁడవైన మున్ను గొన్నబస్త్రం బును దెమ్ము. కాకున్న నట్లే పొమ్మనె. అంత నా చపలుం డతిప్రీతుండై అద్దానినే తెచ్చెద నని వెడలి మున్నుఁ దాఁజేసికొన్న శపథంబుఁ దప్పి శివాగారంబునకు వచ్చి యందు యథేచ్ఛఁదిరుగుచున్న గోఁటియను బట్టి మొకతాఁటఁ గట్టఁబోవుచుండ బ్రహ్మయ్యగారది చూచి ఓయీ! ఇదియేమి? మరలవచ్చి గోఁటియను బట్టఁబోవుచున్నావనెను. అపు డాకామాంధుఁడు కన్నుమిన్నుగానక తొంటి వేయిమాడల విక్రియంబు లెక్కసేయక నా పడుపుపడుచు దీనినే కోరినది అందుచేఁ గొనిపోవుదు నని గోఁటియను గట్టుచుండె. అపుడు బ్రహ్మయ్యగా రాగ్రహమున వలదు వలదు శివునిసొత్తని మరల్చుచుండినను నవ్వాఁడు మొరకుదనం బుచే నుడుగక యలుగుబెరికి చూపె. బ్రహ్మయ్యగా రవ్వాని యధ ర్మంబున కలిగి మహాగ్రహపరవశుండై బలంబునఁ జలంబున నవ్వానిచే నున్న సురియలాగి దానిచే వాని శిరంబుఁద్రుంచిన నది దేవళంబు వెల పటఁ బడియె. శివద్రోహిబొంది యిందేటికని మొండెంబునుగూడ నీడ్చి బహిఃస్థలంబునఁ బాఱవైచె. తర్వాత వాని మరణం బందఱెఱింగి వాని బందుగులకుఁ జెప్పిన వారందఱు వచ్చి చూచి రాజమందిరంబుఁ జేరి మొరజెప్పికొనిరి. ఱేఁడు బసవమంత్రితో మఱియు ననేకులతో వేగిర మచటికిఁ జేరి యదిచూచి బ్రహ్మయ్యను బరికించి వీని నకారణంబుగ నిట్లేటికిఁ జంపితివని యడిగెను. బ్రహ్మయ్యగారు జరిగినయుదంతంబంతఁ జెప్పి శివద్రోహి యగుటఁ జంపితిననియెను. నృపుఁడవ్వు డిందులకు సాక్షు లెవ్వరనియడిగెను. ఈ శివుఁడే సాక్షియని బ్రహ్మయ్యగారనిరి. భూపతి యట్లేని నీవచనంబు సత్యమని శివునిచేఁ బలికించెదవా? యనిన నట్లే శివుఁడు పల్కుననియె. రా జేదీపిలువుము పల్కింపుమనియె. బ్రహ్మయ్య

గారు త్రిపురాంతకశివునకు మ్రొక్కి త్రిపురాంతకేశ్వరా! యని దీర్ఘముగ సంబోధించి పిలిచె. కవాటంబులు బంధంబులూడి తెరువంబడియె. శివుండో యని ధ్వనిచేసె. బ్రహ్మయ్యగారంత ఈ శివద్రోహి యొనర్చిన యకార్యంబునకై నేను వీని దెగటార్చుట సత్యమేనా? యని యడిగిన సత్యమే సత్యమే యని ముమ్మాఱు పలికె. అపుడందఱు వెఱగొంది బ్రహ్మయ్యగారిని మహాత్మునిగా గురుతించి నుతించిరి. బిజ్జలరాజు బసవమంత్రియు రాజపురుషు లందఱు పాదాక్రాంతులై మ్రొక్కిరి. బసవేశ్వరుండు బిజ్జలరాజునకు తజ్జనంబునకు బ్రహ్మయ్యగారి శివభక్తివిశిష్టతను సామర్థ్యంబు నుపన్యసించె. బిజ్జలుండు మన్నింపుండని ప్రార్థించె. అపుడు బ్రహ్మయ్యగారు కనికరించి ఆ మృతుని శిరఃకబంధంబులను సంధించి విభూత్యుదకముం జల్లి కృపాదృష్టితో లెమ్ము. బ్రదుకుమనినం దత్‌క్షణంబున మృతుండు పునర్జీవితుండై లేచి బ్రహ్మయ్యగారి పదంబులకు మ్రొక్కి క్షమింపుండని ప్రార్థించె. అందఱు బ్రహ్మయ్యగారిని సన్నుతించి సెలవొంది నివాసంబులకుం బోయిరి. బసవేశ్వరుండు బ్రహ్మయ్యగారిని దోడ్కొని నిజభవనంబున కేగె. బ్రహ్మయ్యగారట్లు బసవేశ్వర సదనంబునం గొన్నాళ్ళుండి యానందించి బసవేశ్వరుని సెలవొంది తిరుగ నిజగ్రామంబుం జేరి శివపూజయు శరణగణార్చనంబును సల్పుచుండె నిది మహాత్ముండును భక్తశిరోమణి యగు కిన్నరబ్రహ్మయ్యగారి చరిత్రంబు.

# 37. భక్త శిరియాళుండు

శ్లో॥ ఆనందాశ్రుభి రాతనోతి పులకం నైర్మల్యతశ్ఛాదనం
వాచా శంఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః
రుద్రాక్షైర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి ॥

శివానందలహరి

తా॥ ఓ దేవసార్వభౌమా! నీయందలి భక్తియనెడు తల్లి భక్తుఁడనెడు బాలుని ఆనందబాష్పములచేఁ బులకరింపఁజేసి నిర్మలత్వముచే వస్త్రముగప్పి వేదవాక్కనెడు శంఖంబు ముఖోద్గీతంబులగు నీదు చరిత్రామృతములచేఁ బొట్టనింపి విభూతిరుద్రాక్షలచేత దేహమునకు రక్షనొనర్చి నీయందలి తలంపను మంచమందునిచి రక్షింపు చున్నది.

"నారీషు రంభా నగరేషుకాంచీ" యని భూమండలంబునఁ బ్రశస్తి నొందిన కాంచీనగరంబందు శిరియాలుం డనునొక యార్యుండు కలఁడు. అతఁడత్యంతంబు శివభక్తుండై ప్రత్యహంబు నియత శివార్చనం బొన రింపుచు బ్రతిదిన మార్గురుశివభక్తులకు భోజనంబుఁ బెట్టుచుండు. శివభక్తుఁ డొకఁడేని వచ్చి సాపడకున్నఁ దానును భుజింపక యుండు. ఆశిరియాలుని యర్ధాంగి సంగళవ్వ యను నామె తనసౌశీల్యంబునను దానదయాదాక్షి ణ్యాది సుగుణగణంబునను బుద్ధిమతి యని సార్థకబిరుదనామ మొంది చెలువొందుచుండె. ఆ దంపతుల కొకపుత్రుండు సీరాలుఁ డను బాల కుం డెన్మిదేండ్లప్రాయమువాఁడు బడికిఁబోయి చదివికొనుచుండె. చిర కాలమునుండి యిట్లు శిరియాలదంపతులు శివపూజను శివభక్తాన్నదాన వ్రతంబును సల్పుచుండి రంతనొకనాఁడు శివమాయావిశేషంబున శిరి యాలునింటికి శివభక్తు లేరును రారైరి. సార్థయామంబువఱకుఁ జూచి శివభక్తులకొఱకై శిరియాలుండు నగర వీధులు వెదకుచుండె. అపుడొక కపటమాహేశ్వరరూపముతో శివుఁడు దారసించి శైవలాంఛనంబులగు విభూతి రుద్రాక్షశివలింగములను ధరించి ఒకచేతఁ గఱ్ఱను మఱొకచేతఁ గమండలమును బట్టుకొని వృద్ధరూపంబునఁ గన్పడ శిరియాలుండు పరి కించి సాష్టాంగవందనం బాచరించి ప్రభూ! దర్శనంబున ధన్యుఁడనైతి నిఁకను నీదుసేవకుని యింటికి వచ్చి యాతిథ్యంబుఁ బడసి మఱియుఁ గృతార్థు నొనర్పఁ బ్రార్థించుచున్నానని పదంబులఁబడియుండ వృద్ధ శైవుండు లేవనెత్తి నేనును భిక్షార్థినై గృహస్థు నన్వేషింపుచున్నాను. దాతవైన నీ వగుపడితివి యట్లే వచ్చి శివపూజ చేసికొందును గాని నా కొకయవసరంబు గలదు. అద్దాని సంతరించి శివపూజను జేయింతువేని వచ్చెద ననియె. గురూ! అదియెద్ది చెప్పుఁడని శిరియాలుఁడడుగ నా ముది

శైవమూర్తి యిట్లనియె. భక్తాగ్రణీ! రోగంబులేనట్టి పడుచు మనుష్యుని మాంసం బపేక్షించెదను. అట్లర్పించెదవేని వచ్చెదననిన శిరియాలుఁ డాలకించి కొంకక యట్లే సమర్పించెదనువిజయము చేయుఁడనియె. కృతక శైవుం డనుమానించి ఎట్లు సంపాదించెద వనియె. శిరియాలుండు తన కెనిమిదేండ్ల యెలప్రాయఁపుసుతుఁడు గలఁడనియు నవ్వాని వధించి పాక ముచేసి పెట్టెద ననియుఁ జెప్పెను. కపటవృద్ధుఁడు నిక్కమేనా ? యని యడిగె. ముమ్మాటికి నిక్కము దయచేయుఁడని వృద్ధశైవుని స్వగేహం బునకుఁ దోడ్కొనివచ్చి ఉచితాసనాసీను నొనర్చి అభ్యంతరగృహ మందున్నయాత్మపత్ని కంతయు నెఱింగించెను. ధర్మశీలయును బుద్ధిమతి యనేడు సార్థక బిరుదమొందిన యాసంగళవ్వ కొమరుని వధింపుట కించుకేని చలింపక భర్తృవ్రతనిష్ఠయై అట్లె శివున కర్పింతము మన సుతుఁడు శివప్రసాద భాగ్యమేకదా యని నొడివి బడికిఁ జదువుకై పోయిన కుమారుని బిలిపించి యభ్యంజనస్నాతుని జేసి యవ్వానికిఁ దన్ను శివార్పణమునకై వధించుచున్నామనిచెప్పెను. బాలుఁడు సంత సించి నా భాగ్యమే యట్లుచేయుఁడు ధన్యుఁడ నౌదుననిచెప్పెను. తత్ క్షణంబందు శిరియాలదంపతులు కత్తితోఁ దనయుని శిరంబును గోసిరి. హరహరా యనుచు బాలుఁ డసువులఁబాసెను. అంత శోణితంబును బోనిడి శకలంబులుగఁ దరిగి మంచినీటఁ గడిగి తదామిషంబున ననేక విధంబులుగ శాకంబులను మఱియుఁ బంచభక్ష్యపరమాన్నంబులను వండి సిద్ధముచేసి మాహేశ్వరున కభ్యంజన స్నానముచేయించి ధౌతదుకూలం బులిచ్చి శివలింగ పూజనం బమరించి అరిటెయాకువేసి పంచభక్ష్యాన్నం బులను ఆమిష శాకంబులను వడ్డించి లింగార్పణముచేసికొనుమని వృద్ధ శైవునకుఁ జెప్పిరి. ఆతఁ డవియన్నియుఁ బరిశోధించి చూచి యందు శిరోమాంసంబు లేకుండుటారసి శిరియాలుని జూచి ఓయీ! అన్నియుఁ గలవు. కాని శిరస్సేమిచేసితివి. అదియుండినఁ నైనఁ జాలుఁగదా ఎప్పు డెపుడు చూచికొందు నని యుంచితివి కాఁబోలు. అది లేకున్న నెట్లు సరిపోవును? "సర్వస్యగాత్రస్య శిరఃప్రధాన" మను నుడిని విననైతివా? నీహృదయం బట్లొప్పకున్న నేఁబోవుదు ననియె. అపుడు భక్తుఁడు మహాత్మా! కేశభూయిష్ఠంబగుట మస్తకంబు భక్ష్యంబు గాదేమో యని

సందేహించితిమి. ఇపుడు తమ సెలవుచొప్పున వద్దానిగూడ వేగిరముగఁ బక్వముచేసి తెచ్చెదమని యట్లు చేసి తెచ్చి వడ్డించిరి. కృతకశైవుం డది పాఱఁజూచి యరసి లోలోన మురిసి మరల నవ్వారి కిట్లనియె. మంచిగఁ దెచ్చితిరి. సంతసించితిని గాని నాపంక్తియందు మీరుగూడ శివపూజ చేసికొని నాతోఁ బాటు మీరును సాపడవలయును. మీామనస్సట్లొప్ప కున్న నే నూరక లేచి పోవుదు ననియె. అపుడు శిరియాలుండు దన గేహినికిఁ జెప్పి దంపతు లిరువురు శివపూజను జేసికొని భోజనమునకు సిద్ధులైరి. అంతఁ గృత్రిమవృద్ధుఁడు నగి మీా సంతానమును బిల్వుఁడు బుడుతడును మనమును భుజింతమనె. అపుడు భక్తుఁడు దేవరా! మే మేక పుత్రులము వేఱొకసంతానము లేదు. ఆత్మజుని దమకు శాకార్థమై పచ నముచేసితిమికదా! మఱి యిపుడెవ్వరు వచ్చెదరనియె. అపుడు వృద్ధు కటకటంబడి నగి సుతులులేని యింట నారగింపరాదు. సుతులులేనిగేస్తు లచే నన్నాదికంబు నొందరాదు. నేను మీా యన్నంబుఁ దిననొల్లననియె. శిరియాలుఁడపుడు చేయునదిలేక విషణ్ణుఁడై శివధ్యానంబుఁ జేయు చుండె. తత్సతియగు బుద్ధిమతి వచ్చి ప్రణమిల్లి దేవా! అనుగ్రహింపు మనుగ్రహింపుమని బ్రతిమాలె. అపు డా స్వామి యామె కిట్లనియె. సాధ్వీమణీ! నీవు నీపుత్రుని ముమ్మాఱుబిలువుము. వాఁడు బడిలో నున్నను దనతోడిబాలురతో నాడుచున్నను నీ పిలుపువిని రాఁగలఁడు. తల్లులు పిలిచిన రానట్టికొడుకుండునే? నీ వాలస్యము సేయక చతుష్పథం బుఁజేరి యెలుగెత్తి పిలువుము రాఁగలఁడు. రాకయున్న నపుడు యోజింతమనె. ఆ సాధ్వీలలామ యప్పదనున నదియే కర్తవ్యమనుకొని చతుష్పథంబుఁజేరి పెద్దయెలుఁగునఁ గొమరునిట్లు పిలిచె.

ద్విపద॥ పూర్వజన్మార్జిత ♦ భూరికర్మముల
గుర్వణగించు నా ♦ కొడుక! రావయ్య
దక్షిణాధీశుని ♦ దర్పంబణంచు
దక్షతగల్గు నా ♦ త్మజుఁడ! రావయ్య
విరస పశ్చాజ్జన్మ ♦ మరణదుఃఖములు
బొరిమార్చఁజాలిన ♦ పుత్ర! రావయ్య
ఉత్తరంబేలు ను ♦ దాత్తయోగీంద్రు

చిత్తంబునకువచ్చు ♦ శిశువ! రావయ్య
అలరునాకోపభో ♦ గాతీత పథము
లలవడె నేఁడు నా ♦ యయ్య రావయ్య
దండధరోద్దండ ♦ దండప్రశస్తి
ఖండింపనోపు పు ♦ త్రుండ! రావయ్య
పాయని వ్యామోహ ♦ పాశబంధములు
కోయంగఁ జాలునా ♦ కుఱ్ఱ! రావన్న
ద్రవిణాదికేషణ ♦ త్రియవిజృంభణము
తవులునఁ బడని నా ♦ తండ్రి! రావన్న
సురరాజసుతుఁడు వి ♦ శ్రుతతపోవేషి
వరదుఁడై నాఁడు నా ♦ వడుగ! రావన్న
ఘోరనిస్సారసం ♦ సారవారాశి
పారమొందించుపా ♦ పఁడ! రావన్న
అంచితాగణ్యపు ♦ ణ్యప్రాప్తి నమరు
కాంచీమహేశున ♦ గ్రజుఁడ! రావన్న
దివిజకన్యలఁ దొట్టి ♦ దివిముక్తి కన్య
గవయనున్నదిభక్తి ♦ కాంతుండ! రావె
దండడిమీయయ్య ♦ దక్షిణభుజము
నందునఁ దనరెడు ♦ నన్న! రావన్న
భానుఁడెంతయుఁ బ్రవాలెఁ ♦ బడమట మఱియు
శ్రీనిలయుండ నా ♦ సిరాల! రావె
స్వాదొంద యక్షేశ ♦ సఖుని సన్నిధిఁబ్రి
సాదంబుఁ గొనఁగనా ♦ గాదిలిరావె
యనుచు నాలుగుదిక్కు ♦ లందు నందందఁ
దనయుని బిల్చుశ ♦ బ్దంబులోపలను
జనితమై దిక్కులు ♦ సంజలుదోప
వనితాలలామ బి ♦ ల్వంగ ముందటను
కుండలమ్ములుగ్రాలఁ ♦ గూకటివ్రేల
మండలం బొలయ సా ♦ మ్యపుగంట లులియ

అందెలుమ్రోయ ము ♦ క్త్యంగన డాయ
సందేహ ముడుగ నా ♦ శ్చర్యంబు దొడఁగ
చూపరుల్ గీర్తింప ♦ సురలుగ్గడింపఁ
దాపసి వీక్షింపఁ ♦ దండ్రిమైఁ బెంప
తల్లి కౌగిలిజాపఁ ♦ ద్వరితంబుదోప
ముల్లోకములుచూడ ♦ ముద్దులొల్కాడ
పఱతెంచె సుతుఁడు న ♦ ప్పాటనీశ్వరుఁడు
కఱకంఠుఁడజుఁడుమా ♦ కాంతుఁ డుగ్రాక్షుఁ
డక్షురుం డా సిరి ♦ యాలుకట్టెదుటఁ
దత్క్షణంబుననఁ బ్ర ♦ త్యక్షమై నిలిచె

బసవపురాణము.

అంత సిరియాలుఁ డత్యంత హర్షంబుతో సతియును బుత్రుండును దానును బరమేశ్వరునకు సాష్టాంగపడి మ్రొక్కి కలగని మేల్కాంచిన యట్లు లాయద్భుతంబున కక్కజంబొంది శివలీలల కక్కజంబుండునా యనుకొని పరమశివుని నిట్లు సన్నుతించిరి.

శ్లో॥ నమస్తే వేదవేద్యాయ । నమస్తే వేదహేతవే
నమ ఆర్యాసహాయాయ । మహాదేవాయ తేనమః

శివాగమము.

శివుఁ డవ్వారిని మెచ్చి యిట్టిగట్టి భక్తిగల దంపతులను ఇట్టి గట్టి భక్తిగల చిట్టివాని నెట్టిచోటను జూడలేదు. అని సంబరపడి శిరియాలుని గౌగలించికొని బాలు నెత్తికొనిముద్దాడి సంగళవ్వను జూచి తల్లీ! నీవు జయంతుని గన్న పౌలోమికన్న వామనునిగన్న యదితిదేవికన్న కశ్యపాదుల తల్లిమైన సరస్వతీదేవికన్న మన్మథునిగన్న శ్రీదేవికన్న షణ్ముఖునిగన్న పార్వతికన్న నెక్కువవు. సుంతవిషాదంబుఁ గొనక కన్నకొమరుని నాకై చంపి యర్పించితివి. ఇంతకన్న నెక్కుడేమి? భక్తాగ్రేసరుఁడగు నీ మగనికన్న నీవే యున్నతపదంబునొందితివి. ఇట్టి మిమ్ము నేఁ బాయఁజాలను. నా సన్నిధికిఁ గొనిపోయెద నందయుండుఁ డని హిరణ్మయ పుష్పకంబులను రప్పించి దివ్యదుందుభిధ్వానంబులు సెలఁగఁ బ్రమథదేవసముదయంబులు జయజయ ధ్వనులొనర్ప శిరి

యాల తత్పత్నీపుత్రులకు దివ్యదేహంబులిచ్చి దివ్యాంబరాభరణ సుగంధ పుష్పమాలాలంకృతులఁ గావించి కైలాసశైలంబుఁ జేర్చి స్వసన్నిధానంబం దునిచికొనియె. ఇది యసాధారణభక్తుఁడైన శిరియాలుని చరిత్రంబు పాఠకశ్రోతలకు భక్తికరం బభీష్టప్రదంబు.

# 38. భక్తగొడగూచి

శ్లో॥ సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామ మస కృత్సద్వాసనాశోభితం
భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితం.

శివానందలహరి.

తా॥ సంధ్యాసమయమందుఁ దాండవనృత్యమున విజృంభింపుచున్నట్టియు పుష్పములను వికసింపఁ జేయునట్టిదియును వేదశిఖలను నుపనిషత్తుల స్థానంబులం దధిష్ఠించినట్టిదియును వీనులు శిరస్సు వీనిస్థానంబుల నధిష్ఠించియుండు నదియును ప్రేమయుక్తయగు భ్రమరాంబతో మనోహరమైనదియును ప్రేమతోఁదగు తుమ్మెదలతో నలంకరింపఁబడి నదియును మాటికి సద్భావనచే శోభితమైనదియును సుగంధముచే శోభితమైనదియును నాగేంద్రుఁడే ఆభరణముగాగలదియును భోగవంతులకు భూషణమువంటిదియును సర్వదేవ పూజనీయమగునది యును సమస్తపుష్పములలో నుత్తమమైనదియును సత్వగుణముచేఁ బ్రచురమైనదియును పరిమళమునఁ బ్రకటితమైనదియును పార్వతీదేవిచే నాలింగనము చేసికొనబడిన శ్రీశైలమందలి మల్లికార్జునుఁడన బడుచున్నట్టియు శ్రీశైలమందలి మల్లెతీవచే నల్లికొనఁ బడిన మద్దివృక్షంబును బోలిన మహాలింగమును సేవించుచున్నాఁడను.

భోగేశ్వరపురమను నొకయూరునందు భోగేశ్వరుఁడను పేరుగల యొకలింగంబు గలదు. శివదేవుఁ డను నొకబ్రాహ్మణుండు శివభక్తుఁడై శివలింగంబును బ్రతిదినం బర్చింపుచు ఆలపాలు గుంచెడు నైవేద్య

మొనరించి వచ్చుచుండును. ఇట్లుండఁ బూర్వము దొకప్పుడు చేసికొన్న యొప్పందము మ్రొక్కు ననుసరించి శివదేవుఁడు రాఁగల మాఘమహా శివరాత్రికి శ్రీశైలమునకు సకుటుంబముగ సపుత్రిముగ యాత్రఁబోవ సమకట్టి ఊరిలోనిభోగీశ్వరలింగంబునర్చించుటకుఁగుంచెడు గోక్షీరములు నివేదన చేయుటకును దనకూతును ఎనిమిదేండ్ల ప్రాయముగలదాని నియమించి యింట నునిచి నౌకరుల కామెను జాగ్రత్తగఁ జూచు చుండుఁడని శాసించి పుత్రిని బుజ్జగించి యొడఁబఱచి బుద్ధులుసెప్పి యెట్ట కేలకు శివదేవుఁడు శ్రీగిరికిఁబ్రయాణంబుచేసె. శివదేవునిసతి కూతును బసిదానిని విడువలేకయు భోగీశ్వరార్చనము నియతవ్రతమగుటయు సపుత్రముగ భర్తతో శ్రీశైలమున కేగుట మ్రొక్కుకొన్న విధియాటయు యోజించి గారాబుకూతును ముద్దుచేసి మనస్సును దృఢముచేసి విభునితోఁ బుత్రులతోఁ బ్రయాణము చేయుచు మరలమరల వెనుకకుఁ దిరిగి కన్నీరును దిగమింగుచున్న కూతునొద్దకు వచ్చి కూతునెత్తికొని పండ్లు మిటాయీలు బొమ్మలు దనకు దెచ్చి యిచ్చెదమనియుఁ ద్వరగా వచ్చెదమనియుఁ జెప్పి ఓదార్చిడించి భర్తతోఁ బశ్వాతంబున కేగె. ఇచ్చట మఱునాఁడు తెలతెలవాఱుచుండ కోడికూసినంత గొడగూచి నిదురలేచి కాల్యంబులఁ దీరిచి నౌకరులుపిండిన గంగిగోవులపాలు కమ్మఁగఁగాచి కుంచెడుపాలు కొలిచి కొరలో నునిచి నెన్నుదుట కుంకుమ తిలకముదిద్ది చెరగుతోఁ గోరఁగప్పి భోరున శివాగారంబుఁ జొచ్చి లింగంబు సముఖంబునఁ గోరనునిచి అరగింపుము దేవా! యని విన్నవించి తా నొక్కింతఁ జాటుగ నిలిచియుండె. కొంతసేపట్లుండి మరలవచ్చిచూడఁ బాలట్లేయుండె. అంత వెఱచి లింగమూర్తీ! పా లేల త్రాగకుంటివి ఆలస్యమేలచేసెదవు? త్రాగుము అనిచెప్పి మరల చాటుగనొదిగె. మఱికొంతసేపటికివచ్చి చూచిన క్షీరంబులు పూర్వం బట్లుండుటఁ జూచి శివలింగమును గన్గొని యిట్లనియె.

ద్విపద॥ కాచుట చాలదో ♦ కమ్మనలేదొ
పాచియో విఱిగెనో ♦ పడుచ నేననియో
పొద్దెక్కెనోయుండె ♦ పొగబట్టెనేమొ
బుద్ధిపుట్టదొ నెయ్యి ♦ పోయకుండిననొ

కడువేడియో నీరు ♦ గలిసిన వనియొ
ఎడవాద్యములు లేక ♦ యేనె తెచ్చితినొ
చాలవో యివి యాల ♦ పాలుగావనియొ
పాలపైఁ జిత్తమేఁ ♦ బఱపితి ననియొ
కోరబెడంగనో ♦ కుంచెడు లేవో
యారగింపఁగఁబెట్ట ♦ నేరకుండిననొ
మీఁదుపోయినవనో ♦ మీఁగడ లేదో
ఏదెచ్చునెడ నెవ్వ ♦ రేఁజూచి రనియొ
ఊర కేమిటికిపా ♦ లోపవు త్రావ
కారణం బేదేని ♦ గలఁదేని చెపుమ
నిక్కపుటాకలి ♦ నీకు లేదేని
గుక్కిళ్ళు నినుగొని ♦ చిక్కించునాఁకు
కుడుయుటకీయెడ ♦ గుజగుజ లేల
కుడికెడు తెత్తునా ♦ గుజ్జునోగిరము
మూలఁబన్నారుల ♦ మాలోవిలోన
పోతెలున్నవి చెప్పు ♦ పోయి తెచ్చెదను
ఉట్టిపై బానలో ♦ నున్నది నెయ్యి
ఇట్టున్నఁ దెచ్చెద ♦ నిష్టమే నీకు
కుండెడున్నదిపోయి ♦ కొనివత్తుపుల్ల
ఖండంబువలెనేని ♦ గ్రక్కునఁ జెపుమ
యచ్చన యెల్లిమా ♦ యయగారియింటఁ
జెచ్చెరఁబిల్చెద ♦ చ్చెద నారగింపు
మా శివసోదరి ♦ మఠమునఁగలదు
పాశంబుఁదెచ్చెదఁ ♦ బాలను దాపు
షోడశ పండువుఁ ♦ జూడఁబోవుదము
పోడిగ నీపాలు ♦ పురహర కొనుము
వీరేశు జాతర ♦ వేళ నిఁబండి
యేరొప్పఁ బనిచెద నీ ♦ పాలుద్రావు
ఎడమడుగేటికి ♦ నీపాలలోని

కడుకులు దెచ్చెద ♦ నల్లనఁ జెపుము
ఇత్తఱి శిశువుండ ♦ నెట్టులంజేని
పొత్తుననైనను ♦ నెత్తిత్రావుదము
పిన్నపన్నారులు ♦ చిన్నిబొమ్మలును
యిన్నియు నటుకులు ♦ నెన్నెనిపండ్లు
నాకెల్లి మావారు ♦ నాథ ! దెచ్చెదరు
నీకె యిచ్చెదఁగాని ♦ నీయాన త్రావు
పాలును జల్లారెఁ ♦ బలుకవుతోడ
ఏలయా ! లింగ ! న ♦ న్నేచెద వనుచు
పాప యీశ్వరునకు ♦ బలుమఱు మ్రొక్కు
కోపించు భంగించు ♦ గుంచించునఱచు
కటకటవాపోవు ♦ కరములు విఱుచుఁ
దటతట నేలతోఁ ♦ దాకించు గాళ్ళు
ధారుణిఁబడి బయల్ ♦ దన్నుచునేడ్చుఁ
గోరదిక్కును జూచు ♦ మారారిఁజూచు
బుబ్బగించును వెడ్లు ♦ బుడ్లును పెట్టు
నిర్జీవిక్రియనుండు ♦ నివ్వెరఁగందు
నెప్పటట్టుల నేడ్చు ♦ నెలుగెత్తి పిలుచు
దొప్పఁగఁబడుఁగోరఁ ♦ దొలగంగఁద్రోయు
వెఱచి ముందఱఁబెట్టు ♦ మఱిపలుమాఱు
నెరగుఁబాదంబుల ♦ కెట్లు ద్రావమిని
ఇట్లనఁగాని పా ♦ లేద్రావననవు
ముట్టవు మూర్కొన ♦ వట్టెయున్నయవి
నీవారగింపమి ♦ మావారువిన్నఁ
జావ నడతురు నన్ ♦ సంశయంబేల ?
తనకు నెప్పుడు చావు ♦ తప్పదు మగుడ
చన నిచ్చటనె చత్తు ♦ సరిపోదు ననుచు,
తనతల శివునితోఁ ♦ దాకించుకొనఁగఁ
జనునంతలోనన ♦ జక్కనఁబట్టి

తూరుదుఁ డతిదర ♦ హాసితాస్యుఁడయి
కోరతోఁ బాలెత్తి ♦ కొనియారగించె॥

సోమనాథుని బసవ పురాణము.

అంత గొడగూచి చూచి యానందించి నన్ను జిన్నదానిగఁ జూచి యింతసేపిట్లు మిడికించితివి; మిన్నకుండను. మాయన్న వచ్చినంత నీ దుండగంబును విన్నవించెదను మఱువకుండు మని కోరఁబుచ్చికొని తమ యగారంబున కేగె. ప్రతినిత్య మిట్లే పాల్గాచి కుంచెడు గొలిచి కోరతోఁ దెచ్చి శివున కందిచ్చుచుండె. శివుఁడును బా లారగించుచుండె: ఇఁక శివదేవుఁడు సకుటుంబముగ సపుత్రముగఁ బ్రయాణంబును మజిలీల వరుసఁ జేసి శ్రీశైలంబును సమీపించి శిఖరదర్శనం బొనరించి శివరాత్రి తేపనఁగ శ్రీనగంబును జేరి శ్రీమల్లికార్జునసిద్ధసుందరశివలింగంబునకు శిరస్సుసోకించి మ్రొక్కి ధూళి దర్శనంబొనరించి యొక్కెడ వసతిని జేసి యరుణోదయంబునఁ బాతాళగంగోదకంబుల స్నానంబు గావించి తత్తీర్థంబుఁ దెచ్చి యర్చావస్తువులతో మల్లేశ్వరభవనంబున కేగి యందు విధివిధానంబుగ లింగంబును రుద్రసూక్తంబుల శతరుద్రీయచమక పురుషసూక్తంబుల నభిషేకించి ద్రోణ పుష్పంబులఁ గొండగోగు పూల గన్నేరువిరుల మారేడు దళంబులఁ బూజించి ప్రసాదంబుఁగొని శ్రీభ్రమరాంబావసథంబున కరిగి ఆసకలజగన్మాతను అర్చనాపద్ధతిఁ బూజించి ప్రసాదమొంది పరివార దేవతల నందఱ నర్చించి శ్రీపంచాక్షరీయంత్ర భస్మం బలందికొని మరలఁ బ్రదోషసమయంబున భ్రామరీమల్లేశుల దరిసించి యారేయి శివభజనంబుల శివకథాకాలక్షేపంబులఁ జాగరణచేసి మఱునాఁడు శివభక్తులతో భోజనం బొనరించె. ఇట్లు దినత్రయం బచ్చట విధివిధానంబుల నెరవేర్చి భ్రమరాంబామల్లేశుల సేవింపుచుండి యా పిమ్మట విజ్ఞప్తి చేసికొని వెడలి శ్రీమహానందీశ్వర క్షేత్రంబుఁ జేరి శివతీర్థంబందుఁ గ్రుంకి ఉమామహానందీశ్వరులఁ బూజించి పయనముచేసి పదిమైదు దినంబులకు స్వగ్రామంబుఁ జేరె. ఇట గొడగూచి ప్రతిదినం బుషఃకాలంబున దుగ్ధంబులఁ గాచికొని జలకమాడి కుంచెడుపాలు కోరలోఁగొని భోగేశ్వరున కారగింపుచేసి కోరఁ జేకొని వచ్చుచుండు నానాఁడట్లైవచ్చు

చుండ నంతలో శివదేవుఁడు సతీసుతులతో వచ్చి కూఁతును జూచి సంబర పడి చేనున్నరిత్తకోరను గని యనుమానమొంది ఎందులకేగితివి? పాలెవ రికిఁ బోసివచ్చితి వని యడిగె. గొడగూచి తల్లిని గౌగిలించికొని మురిసి తండ్రితో మీరు చెప్పిపోయినట్లు కుంచెడుపాలు భోగీశ్వరునకు ద్రావించి వచ్చితిని. మొదట నన్ను జిన్నదానవని చూచి పాలు త్రావక మారాము చేసి చాలవిసిగించి యేడ్పించి చివరకుఁ బుచ్చుకొని త్రావె. తదుపరి ప్రతిదినమున వేగిరముగ నే త్రావుచుండె. నేఁ డట్లే భోగేశునకుఁ బా లారగింపుచేసి కోరఁబుచ్చికొని వచ్చుచుంటిననియె. శివదేవుఁడు కోపించి యోసి మూర్ఖురాలా! పాలెవ్వనికిచ్చితివే? దొంగ యెవఁడేని వచ్చి పాలుత్రావు చుండెనా? లేకున్న బ్రహ్మావిష్ణ్వాదుల కగమ్యుఁడైన శివుఁడు నీ వొసగినపాలుద్రావునా! నా వ్రతంబునంత గంగఁగల్పితివి. నిన్నేమి చేయుదును. నీయూడుపడుచుల కెవరికేని బోసివచ్చితివా? లేక నీవు త్రావితివా? నిజముచెప్పు మనిన గొడగూచి యడలి నాన్నా! నేనెవ రికిఁ బోయలేదు నేనును ద్రావలేదు భోగేశ్వరునకే యిచ్చితిని ఆయనయే పాలుద్రావి కోర నాకిచ్చెను. నేనింటికి వచ్చుచుంటిని త్రోవలో మీరగుపడితి రనియె. శివదేవుడు నమ్మక వ్రతము చెడిన దనుకొని చేయునదిలేక మంచిది ఱేపు చూచెద మనుకొని యిలుచేరె. మఱునాఁడెప్పటియ ట్లుషస్సున గొడగూచి లేచి స్నానాదికముదీర్చి పాలుగొలిచి కోరలోఁగొని భోగేశాలయమునకుఁ బ్రియాణం బైన తండ్రి యగు శివదేవుండు నిజము నేఁడు దెలియునని తాను గూడ గూఁతుతో గుడికి నడచె. అపుడు గొడగూచి యాలయమున కేగి భోగేశుముందఱఁ బాలనునిచి దేవా! త్రావుమనియె. భోగేశ్వరుండు శివదేవుని జూచి పాలుగ్రోలకుండె. గొడగూచి బ్రతిమాలినను బ్రార్థించినను బలుకక యుండె. శివదేవుఁడట్లుచూచి భోగేశ్వరుండు నీపాలుద్రాగునా? ఎవఁడో కుటిలుఁడు వచ్చి పాలుద్రావి పోవుచున్నాఁడు. నీవు మోసపోయి వానికిఁ బాలిచ్చి నావ్రతభంగంబొనరించితివి. ఇందులకేకదా నీవు జన్మించితి వనికోపించి మోసముచేసి పాలుద్రావిన కుటిలుండిపుడు గన్పట్టిన వాని శిరంబు నీయసిచేఁ దెగవ్రేయుదును. వాఁడట్లేలవచ్చును. ఇంతకు నిన్ను మ్మినట్టితండ్రి కిట్లు వ్రతభంగ మొనర్చిన పాపను నిను జంపి కోప

శాంతి నపరాధశాంతిని జేసికొనెద నని చేతనున్న కత్తినెత్తి వ్రేటు వేయఁ బూన నిరపరాధి పసిపాప గొడగూచి హడలి భోగేశలింగమును జేరి యొదిగి హా లింగ! హా లింగ! యనుచు కెవ్వున నరచి లింగంబు నాలింగనంబు చేసికొనియె. అపుడు భోగేశ్వరుండు విశాలంబుగ నోరు దెఱచె. గొడగూచి యందుఁజేర భోగేశ్వరుండు వక్షంబందుఁ జేర్చికొనియె. శివదేవుఁ డదిచూచి హా మోసపోయితి. శివుఁడు పాలుద్రావుటకై నోరు దెఱచె. పాలకు మాఱుగ బాలయే యందుఁ జేరుచుండె నని యాతురుఁడై బాలను లాగుటకై యత్నించెను గాని యాపసిపాప యపుడే యీజనకుని బాసి యఖిలలోకజనకుఁ డగు శివునిగర్భంబుఁజేరె నంత శివదేవుఁడు చింతతో నేడ్చుచుండుడు శివుఁడు భోగేశ్వరుఁడు సాక్షాత్కరించి నిలిచి శివదేవా! భక్తుఁడవై నను మూర్ఖుఁడవై సత్యంబారయక కూతును బసిపాపను జంపఁగడంగితివి. నిన్నేమనవలయును? ఐన నాయందలిభక్తిచేతనే వ్రతభంగం బైనదనుకొని యిట్లనుచితమునకుఁ బూనితివి గావున నిదియును నాభక్తిలోనియంశమే. నీపుత్రి గొడగూచి నా సన్నిధాన మొందినది. దివ్యులకు సిద్ధమునులకు మహాభక్తులకొందరాని నాదుపదంబు నొందినది. ఇఁక నీకభీష్టవరంబుల నిచ్చుటకై యిట్లు ప్రత్యక్షంబైతిని. అభీష్టవరం బడుగు మిచ్చెదననియె. శివదేవుఁడపుడు శివచరణములందు వ్రాలి మ్రొక్కి సిగ్గుతో వెఱపుతో భక్తితో శివునిట్లర్థించె. మహేశ్వరా! భక్తయుఁ బసిపాపయు నైన కూతును వధించిన యదయుఁడను మహాపాపుఁడను క్షుద్రుఁడను. వీని నెట్లు మన్నించి వరంబిచ్చెదనంటివో తండ్రీ! ఈ ఘాతకుని నీత్రిశూలంబునఁ దెగవ్రేయుము లేదా! మన్నింపుము. దయాసముద్రా! నీవఖిలపాపహరుండవు. హరుండవు. దయతో వరమిచ్చెదనంటివి కావున నీ సన్నిధానంబందు నాపుత్రియున్నకడ నాకుటుంబము నంతను జేర్చికొనుము. నీపదభక్తిని మఱువనీకుమనియె. అపుడు శివుండు శివదేవా! నీకును నీకుటుంబమునకును ముఖ్యముగ నీ యీ పుత్రికి నాయందుఁగల భక్తిచేతనే యీ సంఘటనం బొనర్చితిని మెచ్చితి. ఇపుడు మీ సర్వకుటుంబముతో నేఁడ్రావిన పాలొసఁగినట్టి గంగిగోవులతో దూడలతో నాసన్నిధానంబుఁ జెందుఁడని వరంబిచ్చి యట్లు జేర్చికొనియె. గొడగూచితో వా రందఱు

శివసన్నిధినుండి పరమానందంబున శివుని గొల్చుచుండె రిది బాలమైన గొడగూచి చరిత్రం బిది చదివిన వినిన సకల సుఖప్రదంబు.

# 39. భక్తసిద్ధరామ గోపబాలుఁడు

శ్లో॥ భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహా సితవపుః పంచేషుణాచాదృతః
సత్పక్షస్సుమనోఽవనేషు సపున స్సాక్షాన్మదీయేమనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీవిభుః

శివానందలహరి.

తా॥ భృంగజాతియొక్కయు భృంగీశ్వరునియొక్కయు ఇచ్ఛానుసార నటనమం దుత్కటేచ్ఛగలట్టియు ఏనుఁగుమదమును గజాసురుని యొక్క మదగర్వమును గ్రహించుస్వభావముగలట్టియు అణఁచి నట్టియు వసంతఋతువునందును మోహినీరూపుఁడైనవిష్ణువు నందును ఆనందముగలట్టియు ఝుంకారముతోఁ గూడినట్టియు ప్రణవనాద ప్రతిపాద్యుఁడైనట్టియు మిక్కిలి నల్లనిదేహము గలట్టియు మిక్కిలి తెల్లనిదేహముగలట్టియు మన్మథునిచే సహాయముగ నాదరింపఁ బడి నట్టియు మన్మథుని పుష్పబాణములకు లక్ష్యముగ నాదరింపఁ బడి నట్టియు పుష్పవనములందు అభిమానముగలట్టియు దేవతలయొక్క రక్షణమందుఁబక్షపాతముగలట్టియు మంచిరెక్కలుగలట్టియు భ్రమరములకధిపతియైనట్టియు భ్రమరాంబాదేవికి భర్తయైనట్టియు ఇట్టి గుణగరిష్ఠుఁడై కన్నులయెదుటనున్నట్టి శ్రీశైలవాసియైన ప్రభుఁడు (భ్రమరాధి పతి) నా సంబంధమైన మనఃపద్మమందు విహరించును గాఁత.

పశ్చిమదిశయందు సొన్నలాపురంబను గ్రామంబందు ముద్దయ్యా యనెడునొక శివభక్తుఁడొక గొల్లఁడు గలఁడు. అతనికి శుభాంగి యనెడు సతియుండె. వా రిరువురకు సుపుత్రుఁడొకరుఁడు జన్మించె. గోప దంపతులా బాలునకు సిద్ధరాముఁడని పేర్పెట్టి పిల్లవాని నల్లారు ముద్దుగఁ

బెంచుచు సంతోషంబుగ నుండిరి. ఆబాలుఁడు దినముదినము పెంపొం దుచు నై దేఁడులవాఁడై తనయీడుజోడు పిల్లవాండ్రతో నాడుకొనుచు వేడుకలుసేయుచుఁ దల్లిదండ్రుల యుల్లంబుల రంజిల్లఁ జేయుచుండె. అట్లు బాలకుఁ డెన్మిదేండ్లవాఁడై నంతఁ దలిదండ్రులు తోడిచిన్నవాండ్ర జతగూర్చి దూడలుగాఁచుటకై వనమునకుఁ బంపుచుండిరి. బాలుఁడు చల్లడమును గోర్పడమును దలచీరయు ధరించి కిరుచెప్పులు దొడిగి చేనొకకోలను మఱొకచేఁబిల్లనగ్రోవిని బూని దూడలఁ దోలుకొని పోవుచు నందే చద్దితిని సాయమువఱకు మరలఁ బురిని జేరుచుండు. ఇట్లు జరుగుచుండఁ గొన్నినాళ్ళకు మాఘమాసము దఱియ దూర దేశంబువారలు శ్రీశైలంబునకుఁ బ్రయాణంబుసేయుచు ప్రోవులు గూడి పోవుచుండ నూరివెల్పటఁ బసులఁగాచుచున్నసిద్ధరాముఁడు చూచి యందొక శరణవర్యుని జేరి మ్రొక్కి యిట్లడిగె. కావడి గొట్టెలును సొరకాయబుఱ్ఱలును మూటలు మున్నగువాని కంట్లపెద్దులు మోసి కొనిరా మీరలేడకో గుంపులై పోవుచుంటిరి గమ్యస్థానంబేదియో నా కెఱుఁగఁ జెప్పుడని యడిగె. అపుడామాహేశ్వరుఁడు బాలుని జూచి మందహాసము చేసి ఓయీ! భక్తులకుఁ బెన్నిధానమును ముక్తికి నివాస మును తీర్థంబులకు నాయకంబును సర్వేశ్వరునకు విహారప్రదేశంబును నగు శ్రీపర్వతంబును జేరఁబోవుదుమనియె. బాలకుఁడట్లు అందు మీ యందఱ కేమిపనిగలిగె? పెండ్లికి బోవుచున్నారా? అందు బంధుగు లున్నారా? తెలియఁజెప్పుమన్న జంగమవర్యుండు బాలకా! అందు జగద్బాంధవుండు సర్వదేవాధినాథుండు మల్లికార్జునశివుం డుండుననియె. బాలుఁడదివిని మల్లికార్జునుఁడనఁగ నొక దేవుఁడా లేకమునియా అట్లు గాక నొక రాజా? చెప్పుమనియె. అపుడు శరణుండు చిఱుతవానిమాటలఁ ద్రోసిపుచ్చక దయతో ఆతఁడొకమునిగాని యొకభూపతిగాని కానేరఁడు. సర్వజగదీశ్వరుఁడు మహాదేవుఁడనియె. బాలకుఁ డాదేవుఁ డెట్లుండునో చెప్పుడనియె. అపుడు శరణుండు మరలనిట్లు నొడివె. మస్తకంబందుఁ జంద్రరేఖయు నుదుట బూదియు నగ్నినయనంబును స్కంధంబందు నాగేంద్రహారంబును గుత్తుకయందు విసంబును హస్తయుగ్మంబందుఁ ద్రిశూలడమరుకంబులు మఱొక హస్తయుగంబందు హరిణంబును బ్రహ్మ

కరోటంబును వామార్థదేహంబందు బర్వతరాజకన్యయు జడలందుత్తుంగ తరంగరంగయగుగంగయును మొలయందు గజచర్మంబును నమ్మహా దేవునకు విరాజిల్లుచుండు. అట్టిదేవుఁడామల్లికార్జునుఁడనియె. బాలుండట్లు విని విస్మితుండై అట్టిదేవుని జూడ నాకును మనసుపుట్టె. దేవరా! నన్ను గూడఁ దోడ్కొనిపోయి యాదరముతో నాదేవుని నాకుఁగూడఁ జూపింపుమని వేఁడుకొనినఁ గుఱ్ఱనికి జంగమ శ్రేష్ఠుండిట్లనియె. బాలకా! శ్రీశైలం బిచటికిఁజాలదవ్వులనున్నది. త్రోవలో అడవులు కొండలు నదు లుండును వేళ కన్నము దొఱక దెండలకు బడలెదవు. పసిబాలుఁడవు. ఇందు నీ తలిదండ్రులు నీకొఱకై వందురుదురు. నీవిట్టి వెఱ్ఱిబుద్ధులు మాని నీయూరి కేగుమనియె. అపుడు బాలుఁ డట్లు వినక త్రోవ కష్ట మని రాఁగూడదని నాకుఁ గొంకుజనింప నిట్లేలచెప్పెదవు? అంతటి దేవుని జూచుభాగ్యము నాకుఁగల్గిన నేను దల్లిదండ్రుల విడువఁజాలెద ననియె. అంత శరణుండు శ్రీశైలమునకు వచ్చెదనన్న వాని నిషేధింపరాదు తల్లి దండ్రులు వీనికై చింతిల్లుచుండ వీని దోడుకొని పోవుటయుఁ బాడిగాదు. నేను మాఱువల్కక మార్గంబునఁ బోవుచుందును. వీని యిష్టంబెట్టు లట్ల గుఁగాకయని యట్లు పోవుచుండె. బాలుఁడును తనదూడలనుబాసి శర ణుని వెనువెంట నడచిపోవుచుండె. కొంతవఱకు నడచి శరణుండు వెనుకఁ జూడ తనవెనువెంట నాబాలుండు వచ్చుచుండుటను జూచి యక్కజ పడి వచ్చుఁగాక యనుకొని వాని కన్నపానంబులిచ్చుచు నలయనీక శ్రీగిరికిఁ దోడ్కొని పోవుచుండె. మజిలీలొనర్చుచుఁ బెక్కడవులను గ్రామంబులను గడచి కృష్ణానదిని దాటి శివరాత్రిచేపకడ శిఖరదర్శనం బొనరించి శ్రీగిరిని జేరి యందలి విశేషంబు లా బాలున కిట్లు చెప్పు చుండెను.

సీ॥ ఇదె తీర్థసందోహ ♦ మిదె కుండ సంఘాత
మిదె మంటపవ్రాత ♦ మిదివనాళి
ఇదె గోపురానీక ♦ మిఁదె నందు లివెభృంగు
లిదె శిఖరావళి ♦ యిదెదుమాళి
ఇది నదీనదజాల ♦ మిదియె గంగాదేవి
యిదె మూలి కోత్కరం ♦ బివెసరంబు

లివె మునిస్థానంబు ♦ లిదె పరిఘావార
మివి చిత్రకంబులు ♦ నివిరథంబు
గీ॥ లివిమహాశక్తు లివిజోతు ♦ లివిమఠంబు
లివియె మణిమయసుస్థలు ♦ లివిబిలంబు
లివి సువర్ణాశ్మ సముదాయ ♦ మివెతటంబు
లరసి కన్గొను మన్నియు ♦ హర్షమమర॥

చెన్నబసవపురాణము.

అని హస్తంబుచేఁజూపుచు మల్లికార్జున దేవుని మందిరంబుసొచ్చి యమందానందపారవశ్యంబున శరణవర్యుండు మల్లికార్జున లింగంబునకు మస్తంబుసోక మ్రొక్కి బుడతనిజూచి యోరీ! నీవు కోరి సేవింపవచ్చిన మల్లికార్జున మహాదేవుం డితఁడే రమ్ము శిరమ్మున మ్రొక్కుమనిన నవ్వాఁడు పాఱఁజూచి జంగమవర్యున కిట్లనియె.

మ॥ ఇతఁడా! శ్రీగిరి మల్లికార్జునుఁడు సా ♦ మీ! లెస్స బాగాయె నీ
మతిలో నేమితలంచి దైవమని సం ♦ భావించి కాన్పింపఁజూ
చితి నే వెఱ్ఱినిగాను వేలుపని ద ♦ ర్శింపంగ నాతోడనా!
చతురత్వంబులు చాలు దేవునిఁక దా ♦ చకపోక కాన్పింపవే!

చెన్నబసవపురాణము.

అనిన జంగమవర్యుం డదరి ఓరీ! ఏలయిట్లు వదరెదవు? ఈతఁడే మల్లికార్జునుఁడు ముల్లోకంబుల నేలుసామి. చూడవా లెక్కకుమిగిలి నానాదేశంబులనుండి పలుతావులనుండి వచ్చిన భక్తులందఱు భక్తితో సాష్టాంగపడి మ్రొక్కుట. దేవళంబు మంటపంబెట్లు యాత్రికస్తోమంబుతోఁ బిక్కటిల్లి నిండియున్నదో చూడుము. పసివాఁడ వగునీతోడ నేఁగేరడము చేసెదనా! లింగమునకు మ్రొక్కుమనియె.

గోపబాలుఁడు చిరునవ్వునవ్వి అయ్యా! కేరడంబునకేఁక వేఱు తెరఁగేది? నాకు నీ విట్లే చెప్పితివా?

గీ॥ ఏదివినుజాలు కనువాలు ♦ నిట్టికేలు
ఏదితోల్‌చీర మెడచార ♦ యెముక కోర

ఏది నెలకూన సామేన ♦ నిడీనచాన
యితఁడు జేజేలదొరయని ♦ యెటులనందు?

చెన్నబసవపురాణము.

అని యడిగిన జంగమ నర్యుండు తిరుగనిట్లనియె. ఓయీ ! పర మేశ్వరుండు సాకారుండై యుండునపుడు నేను సెప్పిన లక్షణంబులతోఁ గూడియుండు. అట్లు భావించి మనము ధ్యానింపవలయును గాని మన చర్మదృష్టుల కట్లగుపడఁడు. జ్ఞానదృష్టిమాత్రగమ్యుఁడు. సందియమొందక వందనంబొనరింపుము పోద మనియె. బాలుఁడట్లు వినక మహేశ్వరుండు ధ్యానంబునకొకతీరును దర్శనంబునకొకతీరుగనుండు నని మున్ను చెప్పి తివా ? ఆదియందు నీ వాడినయట్లు నాయాదిదేవుని నాకుఁ జూపింపుము పిన్నవాఁడనని చిన్నచేసి తిప్పలు పెట్టకుమనె. అంత శరణుండు మరలఁ జిన్నవాని జూచి శివునియాకారంబును జెప్పుమనిన నట్లు నుడివితిని గాని యట్టి దివ్యాకృతిని మనము చూడఁగలమా ! మనకు దేవుఁడిట్లే యగు పడును. ఆపరమేశ్వరుని కరుణాప్రసాదంబెట్టి పుణ్యులయందో యావిర్భ వించిన నట్టివారల కా స్వరూపంబుతో సాక్షాత్కరించును. మనమంత వారము కాము. మారాముసేయక స్వామికి మ్రొక్కి రమ్ము పోవుద మనియె. సిద్ధరాముఁడు విని దేవుఁడు కరుణతో నగుపడవలయుఁగాని నీవు చూపలేవుగద పొమ్ము నేనూరక యూరికిరాను. వచ్చినచో సరి వాగలతో సిగ్గుఁ జెందుదును. ఎన్నియేండ్లైనను నిందే యుండి వెదకెద ననియె. శరణమూర్తి విని కసుగందును దుర్గమశైలంబందు నొక్కని బాసిపోఁజాలక చాలఁగ బతిమాలిబుజ్జగించిచెప్పినను వినకున్న నంతఁగోపించి యదలించి కొట్టెదనని భయపెట్టినను లబ్ధిలేమికి వనరి వీనికర్మంబనుకొని తాఁజనియె. జంగమయ్య తన్ను విడనాడి పోవుటనుజూచి సిద్ధరాముఁ డడలి మూర్ఛపడి యొక్కింతసేపునకుఁ దెలివొంది యేడ్చుచుఁ బుడ మిపైఁ బొరలుచు లేచుచు దిక్కులు సూచుచు నుస్సురనుచు నరచుచు దుఃఖించుచు శరణుఁడు చనిన మార్గంబు జూచుచు ఇందు నాకుదిక్కె వ్వరు? దేవుని నాకెవ్వరు చూపింతురని యగ్గలికతో లేచి తనకుఁ గన్ప ట్టిన వారలఁ నెల్లరను దేవుని జూపెదరా ? యని యడుగుచు గిరులందు తరులందు దరులందు ఝురులందు చరులంగు తొంగితొంగి చూచుచుఁ

గనపడఁడని యడలుచు దిమ్మెరపోవుచు నిఁక నేమి సేయుదునని చెట్టు చెట్టును జూచి యడుగుచు నడవిఁ దిరిగితిరిగి యాఁకటబడలి నడువలేక దుమ్ముతో ధూళితో నెండతో గాత్రంబెల్ల డిల్లవడి కమలి సొలి యొక చోఁగూలవడి తన్నరయువారిని గానక వగచుచు నిట్లు మదిలో శివుని గూరిచి యనుచుండె. "అక్కటా! జంగమదేవరకనుబడి నిన్ను జూపెదనని తెచ్చి చూపకయే పోయె. నీవెందు దాగియుంటివో? ఈయడవియంత చూచి వెదకితిని వేసారితిని ఆకలిదవ్వుల బడలితిని. ఇప్పటికేని నీకు దయ రాకున్నది. దయవచ్చిన నెడల నీవే కన్పడెదవని జంగమయ్య చెప్పిపోయె. నీ కెట్లు దయవచ్చునో ఎఱుగఁజాలను. బాలుఁడను తల్లిదండ్రులను జుట్టంబులను దోడిబాలురను దూడలను బాసి యొక్కరుఁడ వచ్చితిని. అన్నిటికి నీవ దిక్కనుకొంటిని. అక్కటికతో నీదిక్కుచూపి కన్పడి యనుగ్రహింపుము తండ్రీ!

చ॥ నను వెతబెట్ట కిప్పుడ క ♦ నఁబడితేని రయంబుమీఱ నే
నినుగొనిపోయి మాకుగల ♦ నెయ్యుర బంధులఁ దల్లిదండ్రులన్
బనువడులేగలాల సిరి ♦ బాయనియిండుల దొడ్డిమందలన్
దనియఁగఁ జూపెదన్ నుడుపు ♦ దప్ప బిరాలున నీవు రాగదే!

చ॥ తడయకరమ్ము! నిన్నతిమ ♦ దంబునఁ దోడ్కొని పోయి పాలు మీ
గడ నెయి వెన్న జున్నుపుల ♦ ఖండముఁ గొబ్బరి పప్పు నానబ్రా
లడుకులు తేనె పండులొడి ♦ యంబులు పానక మూరుగాయల
ప్పడములు నన్నముల్ బెరుగు ♦ పాశము కజ్జము నీ కొసంగెదన్."

చెన్నబసవపురాణము.

అని యిట్లు పెక్కుతీరుల సిద్ధరాముఁడు తన్నుద్దేశించి ప్రార్థించి యడుగుచుండఁ గృపాపారావారుండగు హరుండు బాలుని భక్తికి పట్టు దలకు మెచ్చి ముగ్ధాలాపంబులకు నెనరొంది యొక మాహేశ్వరరూపం బున నవ్వాని దఱిసి నీవెవ్వఁడ వేయూరు? కాటుపడి యొకరుఁడ విట్లేటికిఁ దిమ్మరెద విది యుగ్రాటవీస్థలం బిందు మదపుటేనుఁగులు సింగంబులు పులులు మున్నగు హింసక మృగంబులు సంచరించుచుండు. నిన్నెవ రిట్లు పసివాని నిందు దించి పోయిరి. వలయునేని మార్గంబుఁ జూపెద ననిన మోదంబుతో బాలుండు దండముపెట్టి యిట్లు చెప్పె.

ఉ॥ సొన్నల యూరు ముద్దయకు ♦ సూనుఁడ దూడలఁ గాచుచుండఁగా
నన్నొకజంగమయ్యా గిరి ♦ నాథుని జూపెద నంచుఁ దెచ్చి ము
న్నెన్నినవాని జూపిడక ♦ యిచ్చట నక్కవిడనాడి యేగె నే
తెన్నునఁ గాంతు సామి నని ♦ త్రిమ్మరి డస్సితి నెందుఁగానమిన్॥

చెన్నబసవపురాణము.

అయ్యా! నీవైన నెఱింగియుండిన స్వామియుండు నెలవుఁ జూపింపు మహాత్మా! చూపినపుడే యుడుతభక్తిని నాపైనున్నగోర్పడ మిచ్చెద నమ్మమనియె. హరుండు బాలుని నుడులకుఁ జెలునవ్వునవ్వి డింబకా! జడియకు విలపింపు టుడుఁగుము. జంగమవర్యుండు నీకుఁ జెప్పినట్టి దేవుని నీకు నేను జూపింతును రమ్మనిన బుడుతఁడు పుడమిపై సాగిలఁబడి మ్రొక్కి భాగ్యముఁ బడసితి మిమ్మొడఁ బాయక మీ వెంటవచ్చెద. సామిని నాకనుగ్రహించి చూపుఁడనియె.

హరుఁడా బాలుని దోడ్కొని మల్లేశ్వరసదనంబుఁ సమీపంబుఁ జేరి మల్లికార్జున లింగంబుఁ జూపి యితఁడే మల్లికార్జునుండు చూడుమనియె. బాలుఁ డాలోకించి మున్ను జంగమవర్యుండు చూపినట్లే నీవు చూపించితివి. నీవును ఆయనవలె నన్ను గటకటఁ బెట్టకు. నిక్కంబుగ శివుని జూపుమనియె. అపు డలికమాహేశ్వరుఁడు మందహాసముచేసి నావచనంబు నమ్మి మొకించుక కనులుమూసి విప్పుము. నీవనుకొనినయట్లు సర్వేశ్వరుఁ డగుపడుననిన బాలుఁడట్లే కనుఁగవను మూసుకొని తెఱచి మాచె. అంతలోఁ గృతకశైవుఁ డదృశ్యుఁడయ్యె. మల్లికార్జున లింగంబందు సగుణాకారంబుతో సర్వలక్షణలక్షితుఁడై భ్రమరాంబాసహాయుఁడగు మల్లికార్జునశివుఁ డగుపట్టె. అంత సిద్ధసంకల్పుఁడగు సిద్ధరాముఁ డతులపరిమోదంబున ధన్యుఁడనైతినని సాష్టాంగవందనం బాచరించి ఆ యాదిదేవునితో నిట్టులనియె. ఎక్కడదాగితివయ్యా! ఇంత తడవేల చేసితివి? ఎచ్చట వెదకినను గన్పడవైతివి. ఇంతలో నేడనుండి వచ్చితివో యెఱుఁగనైతిని. అడవిలో నిడుములఁబడుచు విలపించుచుండ నాభాగ్యవశమున నీకరుణాసముద్రుఁ డీ మాహేశ్వరవర్యుండు రమ్మని మిమ్ముఁ జూపించె. కావున్న నేమియాడునో యని వెనుకకు దిరిగిచూచిన నం

దా మాహేశ్వరుఁ డగుపట్టఁడయ్యె. అంత బాలుఁడన్నిదిశలఁ బరికించి చూచిన నెందును నతఁడు గాన్పింపఁ డయ్యె. బాలుఁడంత హా మోసపోతి. కన్నులుమూయుమన్న మూసి తెఱచితి. ఇంతలో నా యాపద్బాంధవుఁ డెందులకేగెనో? ఏమిసేయుదు? కనులు మూసుకొనునపుడు గురుని గట్టిగఁ జేపట్టుకొననై తినని-యార్తుఁడై వనరుచుండ శివుఁడు దయతో బాలుని జేరదీసికొని తొడపైని గూర్చుండ బెట్టుకొని యొడలునిమిరి కూకటి బుడికి చిఱుతనితో నిట్టులనియె. వత్సా! నీ భక్తికి మెచ్చితిని. నీ వట్లడవిలో విలపించుచుండ నేనే యమ్మాహేశ్వరుని నీయొద్ద కంపితిని. అతఁడు నిన్నుగొనివచ్చి నీకు నన్నుజూపె. అతఁడేఁక నీకగుపడఁడు. నీ గోర్పడము నీకు వజ్రకవచముగఁ జేసితిని. యోగవేగములకు పాదుకలివిగో కొనుమని యిచ్చి ఫాలనేత్రంబును స్పర్శవేదియు నొసఁగి ఇఁక నీ యిష్టవరంబడుగు మిచ్చెద ననుడు బాలుఁడు సంతసించి తండ్రీ! నీ వీ రూపంబుతో మా యూరికివచ్చి యందుండుము. నేనును మావారందఱు నిన్ను బూజించునట్లొనర్పు మింతకన్న నాకు వేఱువరం బక్కఱ లేదనియె. శివుఁడట్లే వచ్చెదఁగాని ఇట్టిరూపంబుతో నీకుమాత్ర మగుపడుదును తక్కినవారలకు లింగరూపముననే కనుపట్టుదు నిఁక నీ పాదుకలనెక్కి వేగిరముగ నీయూరికిఁ జేరుము. నేనును త్వరితంబున నందుఁ జేరుదుననిన బాలకుఁడొప్పి శివానుగ్రహంబున నమరినదివ్యవాణితోఁ బరమేశ్వరు నిట్లు స్తుతించెను.

శ్లో॥ కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్య ఫలోదయాయ సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిం
నృత్యద్భక్తమయూరమద్రినిలయం చంచజ్జటామండలం
శంభో! వాంఛతి నీలకంధర! సదా త్వాంమేమనశ్చాతకః

శివానందలహరి.

తా॥ ఓశంభూ! నీలకంధర! కరుణామృతంబును వర్షించునట్టియును గొప్పవిపత్సంతాపమనెడు గ్రీష్మమును విచ్ఛేదించుట యందు దంటయైనట్టియు విద్యయనెడు సస్యముయొక్క ఫలమగు బ్రహ్మానందానుభవంబుటుత్పత్తికై దేవతలచేతఁ బండితులచే సేవ్యంబైనదియు

[illegible] కారంబుగలట్టియు నృత్తము సేయుచున్న భక్తులనెడు మయూ[illegible]ంబులు గలట్టియు పర్వతమందు వసించినట్టిదియును ప్రకాశించుచున్న జడలయొక్క గుంపు గలదియునగు మేఘమును బోలియున్న నిన్ను నా మనశ్చాతక మెప్పుడును వాంఛించుచున్నది.

అని నుతించిన శివుండానందించి కుమారా! నీకై నీతల్లిదండ్రులు [illegible]చున్నారిఁక నీపాదుకల జవంబున నెక్కి నీపురిఁ జేరుము. నే నందేఁ గన్పడుదు నని యదృశ్యుండయ్యె. సిద్ధరాముఁడు మల్లికార్జున [illegible]ంబునకు భ్రమరాంబకు గణపతికి వీరభద్రదంపతులకు మ్రొక్కి పాదుకలెక్కి యొకనిముసములో సొన్నలాపురిని జేరి సదనమునకరిగి [illegible]ల పదంబులకు మ్రొక్కె. వారలంతకుమున్ను తనయునిగానక [illegible] సేయుచు నిద్రాహారంబులుమాని విలపించుచు శివుని తలఁచు [illegible] నాప్రన దనయుని నెగాదిగఁజూచి యానందపరవశులై పుత్రు [illegible] ముద్దాడి దేహంబంతయు నిమిరి నేఁడే పుత్రుండు జన్మించె [illegible] తలపోసి ఎచ్చటికేగితివి? ఇన్నాళ్ళెందుంటివి? నేడెట్లు వచ్చితివని [illegible]. సిద్ధరాముఁడంతయుఁ జెప్పిన విని ప్రమోదంబొంది పుత్రుని [illegible]ంబు నధికంబుగ నొందితిమని యానందించిరి. ఇంతలోఁ [illegible]ంబున విశాలంబైన శివాలయంబందుఁ బరివార దేవతలతో శివలింగంబు శివదేవి యుండుటయు ముందఱఁ బుష్కరిణి యుండుటయు [illegible] లిది యక్కజంబని కొందఱువచ్చి చెప్పుటయు సిద్ధరాముఁ [illegible] మహేశ్వరానుగ్రహమే యని చెప్పి తల్లిదండ్రుల బంధుగుల నంద [illegible]నివోయి చూపించెను. సిద్ధరామునకు మాత్రము తొంటి [illegible]ంబుగనే శివుండగుపడియె. అపుడు సిద్ధరాముఁడు తక్కిన [illegible] శివునకు సిద్ధరామేశ్వరుఁడని నామధేయమిడి పూజించి రది [illegible] యూరివారందఱు దేశమువారందఱువచ్చి పూజించుచుండి రంతఁ [illegible] సిద్ధరాముఁడు శివలింగధారణంబు లేకయున్న దేహంబు [illegible] పవిత్రంబుగాదని యెఱింగి కల్యాణపురిని జేరి యందు శివభక్తా[illegible]డైన చెన్నబసవేశ్వరునిచే శాంభవదీక్షాప్రకారంబుగ శివ[illegible] మొంది తత్ప్రసాదంబొంది వచ్చె నంతమీఁద సిద్ధరాముఁ [illegible]క భక్తులకు శివభక్తిఁ గూర్చి తాను తరించి యనేకులను దరింపఁ

జేసె నిది మహాభక్తుఁడగు సిద్ధరాముని దివ్యచరిత్రంబు పాఠక శ్రోతృ జనకల్యాణకరంబు.

# 40. భక్తకులాలుఁడు గుండయ్య

శ్లో॥ స్వలావణ్యా శంసా ధృతధనుష మహ్నాయ తృణవత్
పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధ మపి
యది స్త్రైణం దేవీ యమనిరత దేహార్ధఘటనా
దవైతి త్వా మద్ధా బత వరద! ముగ్ధా యువతయః.

పుష్పదంతాచార్యః

తా॥ ఓ త్రిపురధ్వంసకా ! పార్వతీదేవి తన సౌందర్యముయొక్క ప్రశంస గలదై ధనుర్ధరుఁడగు పుష్పాయుధుని ఎదుట గడ్డిపరకవలె శీఘ్రముగ గాల్పఁబడినవాని జూచి తాను తపోనిరతవై దేహార్ధంబు నొందుటచే నిన్ను స్త్రీలోలునిగఁదలఁచుచుండినయెడల ఓవరదా! యువతులు ముగ్ధలుగా నెంచఁబడుదురు గదా. కష్టము.

పెనుపట్టణంబనేఁడు నగరంబందుఁ గులాలకులుం డైన గుండయ్య యనెడు భక్తుఁడు గలఁడు. అతఁడు నిత్యనియతేష్టలింగపూజకుండు గృహస్థుండు. సతియుఁ దానును గులవృత్తిచే జీవింపుచు శైవులైన యతిథులకు అభ్యాగతులకు శివపూజలఁ జేయింపుచు శివుని గొలుచుచుండిరి. అంత నొకనాఁటిసాయమందు గుండయ్య యాపురి నున్న తికునీలకంఠేశ్వరునిగుడి కేగి స్వామిని సేవించి స్వాగారంబున కేగుదెంచుచుండ మధ్యేమార్గమందొక వేశ్యయువతి భోజనముచేసి తనయెంగిలికంచమును గడిగి యాజలంబుల వీధికెగఁజల్లె. గుండయ్య శివధ్యానతత్పరుఁడై యమ్మార్గంబున వచ్చుచుండ నాయెంగిలి నీళు లాయన శిరస్సుపైని బడియె. అంత నతం డదికన్గొని యరసి శివశివాయని పలికె. మేడమీఁది తరుణవేశ్య కులాలభక్తునిచే నుడివఁబడిన శివనామధ్వనిని విని తన యెంగిలికంచపు నీటఁదడసినట్టి శిరంబును నుత్తరీయంబును గల కులాలభక్తవర్యుని జూచి బిత్తరబోయి తత్తరముతో మేడదిగివచ్చి ఆశరణుని దఱిసి పదంబులఁ

బడి మహాత్మా! దాసురాలను నీచురాలను మదమున నెఱుంగక యిట్లు నేరము సల్పితిని. మన్నించి నా మందిరంబుఁజేరి మజ్జనంబొనగించి పొమ్మని మిక్కిలి ప్రార్థింప నాభక్తుఁడా పెప్రార్థనానిర్బంధమునకోడి యనుమతించి యిల్లెప్పుడుగాడ జూడక కంచంబు జలంబుల వీధిని జల్లరాదని యుపదేశించి యామె మేడ కేగె. అంత నావారకాంత యత్యంతసంతోషితస్వాంతయై ఆ భక్తవర్యునకు సంపఁగినూనెతోఁ దలయంటి సుగంధద్రవ్యమిళితపిష్టంబుతో నలుగుబెట్టి స్వయముగ జలకమాడించి పట్టుధోవతి నుత్తరీయంబు నిచ్చి విభూతినిచ్చి పునుఁగుజేర్చిన చందనగంధంబును వక్షంబునకు హస్తయుగ్మంబునకుఁబూసి మల్లెమొగ్గల దండల నరుత వేసి మధురఫలంబులను బచ్చకప్రంపు విడెంబును బళ్ళెరమందునిచి యిచ్చి ప్రణమిల్లి సుందరుఁడును యువకుండునగు నాభక్తోత్తమునితోఁ గ్రీడింపఁదలఁచి యాయనఘున కిట్లనియె మహాత్మా! నీయడుగులుంచుటచే మేడయు నొకించుక నీసేవతో నాహస్తద్వయంబును బావనంబులయ్యె. ఇఁక నీరాత్రియం దిందువసించి యీ పర్యంకమందు నన్ను సురతభోగంబుల నానందింపఁజేసి నా దేహసర్వస్వంబును నాయాత్మంబును బవిత్రం బొనర్పుము. నీదాసురాలను. మహాత్ములడుగులఁ బడినవారల నుపేక్షింపరనిన మందహాసముచేసి యా ధీరుం డా వారసుందరి కిట్లనియె. యువతీమణీ! నీవనినయట్లర్థులను సంతుష్టుల నొనర్పుట విధియైనను నేను మాహేశ్వరుఁడను. అందును బత్నీవంతుఁడను. అందుఁగూడ ఏకపత్నీవ్రతుండను. ఇట్టి నేను నీయట్టిమచ్చకంటి నెట్టు గైకొందును? కూడదిది తెరువుగాదు మన్నింపుము. వేఱొకయందమైన యువకునితోఁ గ్రీడించి యానందింపుము. గృహంబందు నాసతి నాకై నిరీక్షించుచుండు. రాత్రి యెక్కుడైనది నాకిఁక సెలవిమ్మని యెడఁబఱచి మెట్లు దిగి స్వాగారంబునకు వచ్చుచుండె. గణికయుఁ జేయునది లేక బలాత్కరించినఁ బరమశైవుండు శపించునేమో యని యులికి నిట్టూర్పువిడిచి మిన్నకుండె. భక్తకులాలుఁ డాత్మసదనంబుఁ జేరువఱ కాతనిసతి పతిరాకకై ప్రతీక్షింపుచు నందాలస్యమగుటకు హేతువరయక మునివాకిలిఁ జూచుచుండె. రాత్రినొక యామంబు గడచినయంత మీఁద గుప్పుగుప్పున పునుంగు కమ్మ గందపు తావులు మున్ముందుఁ బరతెంచునొకధులు వచ్చు

లెటింగింపున ట్లుద్బోధింపగా సద్యస్నాతుండును సుగంధచందనలిప్త దేహుండును సురభిళమల్లీముకుళహారవక్షస్థలుండును దివ్యాంగరాగదీపితుండునగు నాత్మనాథునిజూచి యబ్బురపడి యెదుర్కొని ఈ యలంకారంబు లేసుందరి యొనర్చినది? ఇంతదనుక నేయందంపు వాల్గంటియింటనుంటిరి? ఇపుడేటికి యనుగ్రహించి వేగిరంబుగ నిందు వచ్చితి రని యడిగె. కులాలభక్తుఁ డించుకనగి శివదర్శనంబుచేసికొని వచ్చుచుండఁ మార్గంబందు జరిగిన యాయుదంతంబంత నిక్కంబుగఁ దెలిపె. అంతఁ గులాలయువతి విభునివచనంబు సత్యంబని విశ్వసింపక వేశ్యతో భోగంబులొంది వచ్చినట్లు నిశ్చయించి హృదయంబందు గొండొక కాలుష్యంబొంది గృహాభ్యంతరంబున కేగె. భక్తకులాలుండును దోడనే యామెతో గృహంబులోపలి కేగి యామెను బతిమాలుటకై చేయి బట్టుకొనఁ డాయుచున్న నాపె యదల్చి ఎన్నిపున్నెములు చేసినను నెన్ని శివపూజలు చేసినను బరస్త్రీజారునకు వేశ్యాలోలునకు నన్నియు నిష్ఫలంబులే. నీ విఁక నన్నుముట్టకు. ముట్టితివేని తిరునీలకంఠేశ్వరుని పాదంబులాన యని దూరంబుగఁ దొలఁగి కూర్చుండె. భక్తుఁడంతనే యదలి యొసరిల్లి మరలి యంతయు శివాధీనంబని మనమును దిటంబొనరించి యుండె. కొంతసేపటి కాయమ యలుకఁబాసి పశ్చాత్తాపంబొంది విభుని సన్నిధికి వచ్చుటను జూచి భక్తోత్తముఁ డగునాకులాలుండు వెనుకకొదిగి ఖండితముగా నిట్లు నుడివె.

ఓసీ! నీవు నాయందపోహనొంది పదరుటయే కాక సర్వజగత్కర్తయు సర్వజగన్నాథుండగు పరమేశ్వరునందాన పెట్టి ముట్టకు మంటివి. తొలఁగుము దవ్వుల కేగుము. దరిసితివేని జంపెదను. నీవ యిట్లు త్యాగంబుచేసికొంటివి. అనుభవింపుము. పొమ్మనియెను. అపుడామె భీతయై వెనుకకు బోయి మంతనంబునఁ జింతించుచుండె. నిజంబెఱుఁగక వేగిరపడువా రిట్లే కష్టంబు లొందుదురు.

శ్లో॥ సహసా విదధీత నక్రియా మవివేకః పరమాపదాం పదం
వృణుతేహి విమృశ్య కారిణాం గుణలుబ్ధా స్స్వయమేవ సంపదః
భారవికవి.

తా॥ విచారించక యేపనిని జేయగూడదు. అట్లుచేయునవివేకము సర్వా

పదలకుస్థానము, విచారించిచేయువారలకు సంపద లనురాగముతో వరించి చెందును.

అంత నాకులాలదంపతులన్యోన్యసాంగత్యమును బాసి ఆయింటనే కాలంబుఁ గడుపుచుండిరి. ఇట్లు చిరకాలంబు గడచి నంత దంపతు లిర్వురు వృద్ధులైరి. అంత శివుండు వారల ననుగ్రహింప నెంచి యొకనాఁ డొకభక్తవేషంబుతో వారియిమ్ముఁజేరి వారిచేఁ బూజలొందితనయొద్దనున్న నొకపసిండికప్పెరనుగులాలభక్తునకిచ్చిదీని మీయొద్దనుంపుఁడు నే నిపుడే వేగిరముగవచ్చి యిద్దాని బుచ్చి కొనెదనని యెటకో పోయెను. కులాలుఁడద్దాని నొకభాండంబందుంచి భద్రముచేసెను. శివుఁడద్దాని నంతర్ధానముగావించి తాను మరల నవ్వారిఁజేరి కప్పెరనడిగెను. గుండయ్య భాండముసు దెఱచి చూచిన నందదికనృట్టకున్నఁ జకితుఁడై యిల్లంతయుఁదానును భార్యయును వెదకిరి. కప్పెరగన్పట్టకుండుటకు ఖిన్నులై మిన్నుజూచుచుండిరి. అపుడు గపటభక్తుఁ డలుకదెచ్చికొని మీరు నాకప్పెర దొంగిలించి యపహరించితిరి. కాదేని నిరువురు పరస్పరము హస్తంబులు వట్టుకొని నాముందఱ గప్పెరనపహరింపలేదని ప్రమాణంబు చేయుఁడనియె. అట్లుగాకున్న నిద్దఱను శిక్షింతుననియె. కులాలుఁడట్లు సతినంటుట కోడి గురూ! మీయిచ్ఛానుసారంబుగ శిక్షింపుఁడనియె. అంత శివుం డపహసించి మీరు చోరులు. ఇపుడే మిమ్ము శిక్షించెదనని యాదంపతుల నిద్దఱ నొకత్రాటిచే వక్షములకుఁగట్టి బిగించి యొక కూపంబున దిగిచి ముంచె. ఒక్కింత తడవుననే మరలఁ జేది గట్టుకెక్కించె. ఆ దంపతు లపుడు వృద్ధతనువులఁబాసి శతప్రాయపుసుందరమూర్తులై యుండుటఁజూచి పరమశివుఁ డానందముతో వారికిట్లనియె. "నాయందాన వెట్టుకొని చిరకాలంబు నుండి దాంపత్య సుఖంబులను బాసితిరి. నాయందలి భక్తికి మెచ్చితిని. సర్పంబులు కుబుసంబులుబాసి కోడెలైనట్లు మీరు వృద్ధజీర్ణదేహంబులనువీడి సుందరతరుణదేహంబు లొందితిరి. నాయందలి యానసుగూడ నేను మరలించితిని. మీ రిఁక నన్యోన్యానురాగంబు లొంది సాంసారిక భోగసుఖంబులఁ దనియుచు నాయందు భక్తి సేయుచు నెనుబదియేండ్లు పుడమిపై గడుపుడు. అటుమీఁద నేను

నాసన్నిధికిఁ జేర్చికొనెద” నని యిద్దఱను ముట్టించెను. కులాల దంపతులు విస్మితులై భగవత్పాదారవిందంబులఁ బడిరి. శివుఁడు వారల ననుగ్రహించి యంతర్థిఁ జెందె. వారలు శివశాసనప్రకారం బన్యోన్య ప్రేమలతో జిరకాలంబు సుఖంబునొంది యాప్తై శివపదంబుఁజెందిరిది కులాలభక్తచరిత్రంబు పుణ్యదాయకం బిఁక నరసింగనయనారుని కథను జెప్పెదవినుండు.

# 41 భక్త నరసింగనయనారు

శ్లో॥ తవైశ్వర్యం యత్నా ద్యదు పరి విరించో రధహారిః
పరిచ్ఛేత్తుం యాతా వనల మనలస్కంధవపుషః
తతో భక్తిశ్రద్ధా భరగురుగృణద్భ్యాం గిరిశ యత్
స్వయం తస్థే తాభ్యాం తవ కిమను వృత్తి ర్నఫలతి॥

తా॥ ఓకైలాసగిరివాసా! నీస్వరూపంబం దాద్యంతము లెఱుంగఁగోరి ప్రయత్నముతో బ్రహ్మావిష్ణు లగ్నిస్తంభాకారముతో నున్న నీలింగంబు నూర్ధ్వభాగంబుఁ జూడ బ్రహ్మయు నధోభాగంబుఁజూడ హరియును బయనించి చూడఁజాలకపోయిరి. అనంతరము భక్తిశ్రద్ధాతిశయముతోఁ గూడి కొన్నవాక్కులతో స్తవమొనరించ వారలకు నీవు స్వయముగాఁ గనుపట్టియుంటివి. ఇఁక నీయనుసరణము ఫలింపదా? దృఢముగ ఫలించును.

మహిమ్నస్తవము.

ద్రావిడదేశంబందుఁ బురాతనభక్తులలో నరసింగనయనా రను రాజు భక్తుండు శివభక్తితత్పరుండై శివపూజసేయుచు నుండె. ఆతని భార్యలలో నెల్ల నగ్రపత్నియగు నామె యొకనాఁడు శివునిఁ బూజించుటకై సర్వోపచారంబులఁగొని దేవళంబున కరిగి యందుఁ దనయొద్ద పూజార్థమై తెచ్చిన పుష్పంబులలో నొకచెంగలువపుష్పంబును గొని యాఘ్రాణించె నదిచూచి యందలి యర్చకవటువు కత్తితో నారాణి ముక్కును గోసె. రక్తధారలు ప్రవహింప నామె యచ్చోటఁ బడియె.

దాసీలు వేగిరముగఁ బోయి రాజున కెఱింగింప నాతండు బిరబిరవచ్చి యర్చక వటునకు మ్రొక్కి నాసికనేలఁగోసితి వని యడిగె. ఆ వటువు శివపూజార్థమై పళ్ళెరమందిడి తెచ్చినట్టి పుష్పంబులలో నీరాణి యొక పుష్పంబుఁ జేకొని యాఘ్రాణించినందున ముక్కుగోసితి ననియె. అపుడు ఱేఁడాలించి మహాత్మా! మంచిపనిచేసితివి గాని యందొకింత యనాలోచనము గలదని తన పట్టంపుదేవిని దనయాస్థానికి రప్పించి మొదటఁ బుష్పంబును జేకొని యటుపై నాఘ్రాణించినందున నాసికకన్న నాదియందు హస్తంబుఁ దునుముట యవసరం బటుపైని ముక్కును నుత్తరింపఁజెల్లునని రాణిని హస్తంబుఁజూపు మని ఖడ్గంబున నద్దేవి దక్షిణహస్తంబుఁద్రుంచె నపుడు సభ్యులందఱు రాజున కుల్కి లోలోన వగచిరి. భక్తులైనవారలు గొందఱు నృపతి శివాపచారదోషంబునకు యుక్తశిక్షయే యొనర్చె ననికొనిరి. అపుడు సాంబశివుఁడు ప్రత్యక్షమై వచ్చి రాజును మెచ్చి తత్సతికి జేయియు **నాసికను** నొసంగి యవ్వారికిఁ దనసామీప్యముక్తి నొసంగె. ఇది శివభక్తుండగు నరసింగనయనారు నృపతి చరిత్రంబు.

## 42. కూకద మారయ్య మహారాజు

శ్లో॥ హరిస్తే సాహస్రం కమలబలి మాదాయ పదయోః
యదేకోనే తస్మిన్ నిజ ముదహరన్ నేత్రకమలం
గతో భక్త్యుద్రేకః పరిణతి మసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం.
మహిమ్నస్తవము.

తా॥ ఓత్రిపురదహనా! మహావిష్ణువు నీపాదములను సహస్ర కమలార్చన చేయనెంచి ఆపూజయందు ఒక పద్మము తక్కువయందు తననేత్ర పద్మమును సమర్పించెనో అట్టి యీభక్తి విశేషము సుదర్శనచక్రాకారముతో పరిణామమును పొందినదై త్రిభువనరక్షకై జాగరూకమైనది.

ఆంధ్రవసుంధరామండలి నాగులూరను నొక పురంబు నేలుచుఁ గూకదమారయ్య యను జననాథుండు భక్తోత్తముండుగలఁడు. ఆతఁడు

శివభక్త శ్రేష్ఠుండు శూరుండు ధీరుండు శ్రీమంతుండు విద్యావంతుండు సద్గుణవంతుఁడు చతురుండు సుందరుండు సత్యనిష్ఠుం డిష్టలింగపూజకుం డశ్రాంతమాహేశ్వరాన్నదానవ్రతపరాయణుం డంతియె కాకమాహేశ్వరులేది యడిగిన నెడపక యద్దాని నొసంగునట్టి వదాన్యుండు. అట్టి రాజ మౌళికి సతు లష్టోత్తరశతం బందచందంబులు లేజవ్వనంబు విద్దెయుఁ జాతురి శివభక్తియుఁ బతిరక్తియు సతోక్తియు గురుచరశివపూజా సక్తియు ఉచితానుచితజ్ఞానశక్తియుగల వారలు గలిగియుండిరి.

ప్రతిదినము మాదయ్యామహారాజనేతలు భక్తులకు సాధుసజ్జనులకు నన్నదానంబుచేయుచు నభీష్టధనంబు లిచ్చుచుండె. ఇట్లు నడుచు చుండ నతిథులై వచ్చిన మాహేశ్వరులు గొందఱు గొంకక యధర్మం బనుకొనక మాదయ్యాగారి భార్యల నిమ్మని యడుగుచుండ నాయన ఘనుండు ధీరుండై కాదనక యట్లే యిచ్చుచుండె. మాహేశ్వరులా రాణులనుదోడ్కొనిపోయి తమకు గృహిణులను జేసికొనుచుండి రిట్లు కొంత కాలమునకు మాదయ్యాగారికి యొక కలత్రంబు దక్క తక్కిన నూట యేడ్గురు పెండ్లములు మాహేశ్వరదారలైరి. మంత్రిహితజనంబు లట్లు గాంచి యీ యొక్కరాణినిగూడ నేఁడో రేపో ఎవనికేని దానమీఁ గలఁడు. పిమ్మట భార్యావిహీనునకు హవ్యకవ్యాతిథ్యక్రియలు సాధ్యంబులుగావు. కావున నీమె నొక్కరితనైన మిగిలించి యుంచుటావశ్యకమని నిశ్చయించి రాజభార్యలను నూటయెనమండ్రను రాజు దానమిచ్చినాఁడిక భార్యార్థులై యేసును భార్యల నర్థింపరాదని దేశంబం దంతట దండోరా వేయించి రదివిని మాహేశ్వరులిఁక దారల నడుగరైరి.

ఇట్లుండ నొకనాఁడు నారదముని మహతిన్ బరమేశ్వరు గానంబు సేయుచుఁ గైలాసాద్రికేగి పరమశివున కార్యాదేవికి సాష్టాంగపడి మ్రొక్కి సింధురవదన సేనానులకు వీరభద్రునకు నమస్కరించి శైలాదికి శరణుచేసి తక్కిన చండీశ్వరాదులకు జోహారుచేసి వినతుండై శివానుమతితో నొక మణిపీఠంబెక్కి కూర్చుండి సర్వలోకోదంతంబుల నివేదింపుచు మధ్యమలోకంబందలి నాగలూరి కూకదమారయ్యారాజుచరిత్రంబు సాకల్యంబు చెప్పి యాతేనిదాతృత్వంబును బ్రశంసించి మఱొక

భార్య యయ్యానఘునకు మిగిలి యున్నదని చెప్పి నమస్కరించి వెడలి పోయె. పిమ్మటఁ బరమేశ్వరు డాభక్తుని బరీక్షింప నెంచి యొక ముదు సలి మాహేశ్వరుఁడై నాగలూరిఁజేరి తనవార్ధకంబు ప్రకటంబగునట్లు లోకచేతి కఱ్ఱచేఁ బుడమిఁబొడుచుకొనుచు నందందు తూలుచు గోడ నీడలజేరి కూర్చుండుచు లేచి ఇంచుకనడచి బడలికచే వంగి మోకాళ్ళ పైఁ గరములుంచుకొనుచు వెనుకకు జూచుచు నుస్సురనుచు బయలు జూచుచు బాలకుల దిట్టుకొనుచు ఎండకడ్డముగాఁ దలపైఁ దాళవృంతం బు నిడుకొనుచు విసుగుచు దిట్టుకొనుచు రాజసభకుఁ జేరనరిగి వేడి నిట్టూర్పు లెగయగ చెమ్మటలూరగ కూర్చుండి యున్నంత రాజ వర్యుం డా శరణవర్యుని జూచి భయపడి లేచి తారసించి నమస్కరించి యెండవేడి దాకకుండ నంతనే నందొక వితానంబు వేయించి పన్నీటిని పైఁజిలికించి కప్పురంబును జెవులయందుంచి చందనగంధం బెదకుఁ బూసి తాళవృంతంబుచే విసరుచు నిమ్మపండురసము శొంటిపొడి సైంధవ లవణము గలిపిన మజ్జిగ దెచ్చి త్రావించినంత గొంతసేపటికి మాహేశ్వ రాగ్రణి సేదదీరి కన్నులుదెరచి రాజునుజూచి ఔరా! ధారుణీంద్రా! నీభక్తికి ప్రమోదంబుజెందితి. ఎట్టివారేని నిన్నుబోలరు ధన్యుండవనియె. అపుడు మారయ్య మ్రొక్కి మహాత్మా! నన్నేటికి బెద్దచేసెదవు. నే నత్యంతంబు జపలుఁడ యనుచితవర్తనుడ దుర్మదుడ లోభదూషి తుడ దంభుండ భక్తిహీనుండ దయారహితుండ మన్నింపుమనియె. కపట మాహేశ్వరుండు రాజా! ఆత్మస్తుతి కూడదని నీ విట్లు చెప్పెద వంతి యేకాని నీకు సమానుఁడీ లోకమ్మున నెవ్వండు లేడు. నీవు దాతృ చూడామణివి దయా నిధివి దీనలోకరక్షకుడవు. పెక్కులేల? అగ్ని సాక్షిగా జేకొనిన యాత్మసతులను సద్గుణవతులను సౌందర్యవిద్యాయౌవ నవయోవతులను సచ్ఛీలసంయుతులను నర్థులగు మాహేశ్వరుల కర్పిం చినట్టి నెరదాతవు నేతవు కృతార్థుఁడ వ్రపతిమానుఁడ విట్టి నీసద్భక్తి ధైర్య సాహసంబు లబ్బురంబుగ విని నాకు వార్ధకదశ వచ్చినందున సేవ చేయుటకై చెంతనొక చేడియ యుండిన బాగుండునని యాశతో నీకడ కరుదెంచితిని గాని ఈపురిఁ బ్రవేశించినంతనే నీకికభార్యలు లేరని తెలి సితి. ఇఁకవచ్చినట్లు పోయెద సెలవిమ్మనియె. అపుడు భక్తవర్యుండగు

మారయ్య మానవేంద్రుఁ డదరి మహాత్మా! కడుదవ్వులనుండి ఇటకు వచ్చితిరి. నేఁడిందు మాగృహంబందు వసించి శివపూజ చేసి యాగగించి నన్నుధన్యునిజేయుడు. తమకు శ్రమమంత దీరును. సతియు గూడ నీక నొకర్తుక గలదనియె. కృతకశైవుండు వికటహాసముచేసి చక్కనిమక్క వంటి పెండ్లము నింటదాచుకొని అద్దాని నెవరేని నడుగుదు రేమో యనునడలున నీక భార్యలు లేరని దేశమంత జాటించితివా? బళిరా! మంచియుపాయంబు చేసితివి. నే నేమో యనుకొంటి. నీదుభక్తియు వితరణమును దెలియవచ్చె ననిన ననఘుండైన నాభక్తప్రకాండుఁ డిట్లనియె. ప్రభూ! దారను దాచితినంటిరి. అట్లు కాకష్టోత్తరశతకళత్రం బులలో నొక్కతె మిగిలి యున్నది. దీనినెట్టియర్థియును వచ్చి యడుగ లేదు. నేను లేదనలేదు. దండోరాను నే నొనరింపలే దద్దాని నే నెరు గను. తమకుఁ దరుణి కావలయునేని నద్దాని నిచ్చెదను గొనిపొం డనిన నా సామి మరల నిట్లనియె.

సీ॥ అనువైనసతులెల్ల ♦ నయ్యలపాలైరి
కొరమాలిచిక్కిన ♦ కుటిలమతియొ
మాటసూటెరుగదో ♦ నోటిగయ్యాళియో
అచారహీనయో ♦ యలసురాలొ
పనివంజయో ఇంటి ♦ బానిసబిడ్డయో
వెఱ్ఱిచెదములదో ♦ చిట్టిగొట్టొ
తెవులుగొట్టియొ వైను ♦ తీరినమేనిదో
యోజమాలినదియొ ♦ బీజుగొట్టొ

గీ॥ ఎవ్వరకు నక్కరకురాని ♦ ఇగురుబోడి
బోరమల్లన పాలన ♦ బోల్కి మా కొ
సంగదలచితివా ? చాలు ♦ చాలు నీప్ర
సంగము లటుండనిమ్ము ర ♦ సాతలేశ! చెన్నబసవపురాణము.

అనిన నాభక్తగ్రామణి మరల నిట్లనియె. దేవరా ! మీ రనిన యవగుణంబు లొక్కటియైన నాచానయందు లేదు. మిక్కిలి గుణవతి సచ్ఛీల గురుచరేశ్వరపూజాపరాయణ యువతీభూషణం బని నుడివిన మందస్మితముఖారవిందుండై యా గురుం డిట్లుపలికె. ఓయీ! అంగడి

వ_క్తకుఁ డమ్మాగ మిగిలిన వస్తువు నిదియే నుత్తమం బనునట్లు నీవిపుడు పడతిం గొండాడెదవు. అంద జేరికొని పడయగ మిగిలిన నాతిని గొను మని నన్ను మోసగింపకు. భక్తి గలదంటివి. కుటిలాలక లెక్కడ? నిట లాక్షునిభక్తి యెక్కడ. అనుడు పుడమితేడు ప్రమొక్కి తిరుగనిట్లనియె. బాలేందుధరమూర్తీ! ఏల ఇట్లు నిరాకరించి జాలము చేసెదవు? భవనం బునకు రమ్ము భక్తురాలిని జూపెదను. వలయు నేని మీా కా చెలువ తన చర్మంబొలిచి చెప్పులు చేసి ఇప్పించుటకు నొప్పికొనును. విజయము చేయుఁ డని యమ్మహాత్ముని దన హర్మ్యంబునకు గొనిపోయి సువర్ణ పీఠంబున గూర్చుండబెట్టి రాణిని బిలిపించి సామిని జూపించిన నా రమణీ లలామ ఎఱిఁగి గురుమూర్తికి సాష్టాంగ మెరగి నమస్కరించి దేవా! తమదర్శనంబున ధన్యురాలనైతి ననిన శరణవర్యుం డామెనుజూచి ఇట్ల నియె. రమణీ శిరోమణీ! ఉఱకపోవువాని బిలిచి నీపెనిమిటి నాసతి శివ భక్తుడగు నతిథికి చర్మ మొలిచి చెప్పులు చేసి ఇచ్చునని నుడివి నీ యంతః పురంబునకుఁ గొనివచ్చె. ఇందు ని న్నరసిచూచిన నట్టిదానవని తెలి సితి సంతసించితి ననినఁ గేల్మోడ్చి యా వనితారత్నంబు స్వామికిట్ల నియె. స్వామీ! ఎండలోఁ గడు దవ్వునుండి దేవర విచ్చేసినట్లుగాఁ దెలియుచున్నది. ఇంతకష్టం బేటికి కొందితిరి? పాదరక్ష లేటికిఁ దొడుగ రైతిరి? మీాగాళ్ళుకందినవి. యరికాళ్ళందు వ్రేళులఁ బొక్కులు పొడమి నవి యనఁ జనవర్యుండు సీమంతినీ తిలకమా! భవిస్పర్శనొందని నేను బశువు లెల్ల భవు లగుటజేసి యవ్వాని చర్మమున నొనర్పబడిన చెప్పుల నొప్పక ధరింపకుంటిని. సాధ్వీరత్నమా! నేనేవేళలం దితరులకష్టంబులకై జాలి నొందుచుందును. నాకష్టం బెవ్వరును దలంపరు. సచ్చరిత్రవగు నీవు నా పదంబులందలి పొక్కులజూచి పొక్కుచుంటివి మెచ్చితి. నీ చల్ల నినుడులకు నామది చల్లనయ్యె. మెచ్చితి గాని లోకములోని వారలలో

శ్లో॥ కర్మణ్యాన్యం వచస్యాన్యం మనస్యాన్యం దురాత్మనాం
కర్మణ్యేకం వచస్యేకం మనస్యేకం మహాత్మనాం॥

తా॥ దురాత్ములకు మనస్సునందువేఱు చెప్పుటయందువేఱు చేయుట యందువేఱు. మహాత్ములకు మనస్సున నొకటియే చెప్పుటయందొక టియే చేయుటయందొకటియే.

అన్నట్లు కొందఱు వాక్కులందు దేనెలు గురుపించుచు మనంబులందు విషమొంది యుందురు. వాఙ్మనఃకాయకృత్యంబులలోఁ గాయకృత్యంబే ప్రయోజకం బుత్తమము. అగ్గిం దాకితి నన్న గాలదు. కాలితోడనో కేలితోడనో తాకిననే కాలును. నిన్ను జూడ త్రికరణంబులం దేక రూపమనియే తోచుచున్నది. మాటలు చెప్పవచ్చును గాని నడుచుట దుర్లభం బనియె. అపుడా రాజసధర్మిణి మందహాసముచేసి ధీరయై విభుని జూచి జీవితేశ్వరా! ఈ వచ్చిన చరుండు శివుం డీయన చేతనే మనమీ సంసారసముద్రంబును దరింతుము. వేగిరం బసిచే నాచర్మంబు నొలిచి సంబువులొనరించి వీరి పాదంబులకు దొడుగుడు. ధన్యులమౌదు మనియె. పరమభక్తుండును దాతృశ్రేష్ఠుండును నగు నమ్మహీజాని ఖడ్గం బుఁదెచ్చి సాహసంబుతో సతికృత్తి నొలువం బూనిన కుహనామాహేశ్వరుండు వికవికనగి జగతీవల్లభున కిట్లనియె. రాజమౌళీ! పుష్పంబులు గొనిరమ్మనినఁ బుష్పవృక్షంబు నరికి తెచ్చినట్లు గోరఁజీఱుదానికై గొడ్డలిఁ గొన్నయట్లు కులసతిని ధర్మవతిని జంపఁదలకొంటివి. నేనంతఁ గ్రూరకర్ముఁడనుగాను. మానుము. మాకు సంబువులఁదొడుగ నీకిచ్చ హెచ్చుగఁ గలదేని నిమ్మానిని లోగిటికి గొనిపోయి యందు సులభంబుగఁ జర్మం బొలచి వాని నిర్మింపుమనిన నాతఁడట్లేయని భార్య నభ్యంతరగృహంబునకుఁ గొనిపోయి తనయట్లు భక్తయు ధీరచిత్తయు నైనసతియొక్క కృత్తి నొలచి సంబువులొనర్చి తెచ్చి శరణవర్యుని దొడుగుమనియె. కపట శరణుండు నవ్వి భూపతీ! ఇచటనుండి యిప్పుడ లోనికిఁ బోయితివి. చర్మం బెప్పుడొలిచితివి? ఎప్పుడు చెప్పులు గుట్టితివి? నేనమ్మఁజాల. మున్న నీయింటనున్న వీనిఁ దెచ్చితివేమో. చాలు వచ్చె. నేఁబనివినియెద సెలవిమ్మనిన ఱేఁడు గటకటఁబడి దేవా! నేనట్లు బూటకము చేయలేదు. మున్ను మాయింట నివిలేవు. తమ సేవకురాలి చర్మంబే వలిచి యీ సంబువుల నిర్మించితి. ఇందులకుఁ బంచభూతంబులు దేవరచరణంబులు సాక్షియనె.

కృత్రిమచరుం డంతవిని యట్లేని నీసతి నెందుఁ జర్మంబొలిచితివో నేను గాంతుఁజూపింపుమనినఁ బుడమిఱేఁడు మాహేశ్వరవరుఁ దోడ్కొని పోయి మూర్ఛలోమునిఁగి యసువులఁ బాయనున్నట్టి శోణిత పూర్ణయైన

రాణిని జూపించి వధూమణీ! పరమ శివమూర్తియగు చరమూర్తి యను కొంచెపు లేచి శరణు సల్పుమనిన నాసతి చివ్వనలేచి శరణపాదారవిందం బులందు శిరంబుంచిన కృతకగురుండు మరల హాసంబొనర్చి రాజా! ఏల ఇట్లు మాయలు పన్నెదవు. ఈ యింతి తనువందెచ్చటను వెదకిన నేని గాయంబగుపడదే. ఎట్లు చర్మంబొలిచితివి? ఈ నటనంబంతయు నాయొద్దనే చేయవలయునా? అందంబు సుగుణసంపత్తిగల యీ యన్నుల మిన్నను నొరులకీఁజాలక యె భార్యలు లేరని చాటఁ బంచితివి. ఇపు డిందుదాచి నాయెడఁ గోడిగంబొనర్చితివి. చాలిఁక పోయివచ్చెదననిన భక్తధరాధినాథుం డలికి యుచ్చైస్స్వనంబుతో దేవా! యిదే నీసముక్షమంబుఁ గృత్తి నొలుచుచున్నాఁడను. చూడు మపచారం బెంచకు మని ఖడ్గంబుఁ జేఁగొని సతిని డాయుచున్నఁ దత్‌క్షణంబునఁ గృతక తనువుం బాసి

సీ॥ ఒకకేల మొనవాలు ♦ సినపట్టి వినుజాలు
మొలతోలు నెమ్మోన ♦ తెలుపుడాలు
చేతకంకటి తొండు ♦ చెంపజాబిలిచెండు
గెడలజేజేపిండు ♦ జెడలదిండు
గుదిగొన్న మెడకప్పు ♦ నుదుట వ్రేలెడునిప్పు
కనికరంబుననొప్పు ♦ కనులమెప్పు
చెలువైన సామేన ♦ నలరుచు గనుచాన
పలుకుతేవియసోన ♦ వలపులీన
ఆ॥ వెండికొండబోలు ♦ వెలగిత్తపైనెక్కి
బాసవాలుగములు ♦ బలసి కొలువ
నాకసంబు పుడమి ♦ నలమిన వెలుగున
గానవయ్యె బేసి ♦ కంటివేల్పు.

చెన్నబసవపురాణము.

ఇట్లు ప్రత్యక్షమైన మహేశ్వరుని జూచి యారాజదంపతులు సాష్టాంగమెరగి యిట్లు వినుతించిరి.

సీ॥ శ్రీపార్వతీలోల! శ్రితజనపాల! పా
పాబ్ధివాతూల! భ ♦ క్తానుకూల!

పన్నగాధిపహార! ♦ పాండు శరీర! స
న్నుతసురవార! దు ♦ ర్మతివిదూర!
నందీశ కంఖాణ ♦ నాట్య ధురీణ! వం
దారు సంత్రాణ! వ ♦ ననిధితూణ!
ధర్మాద్రి కోదండ! ♦ పాలితాజాండ! ని
ర్మలగుణకాండ! వి ♦ క్రాంతిచండ!
తే॥ యక్షనాయకమిత్ర! హ ♦ వ్యాశనేత్ర
శిక్షితాసుర గోత్ర! చి ♦ న్మోక్షసత్ర
మేశసంభవభంగ! పృ ♦ థ్వీశతాంగ!
పరమపాశుపతస్వాంత! ♦ పద్మభృంగ!

చెన్నబసవపురాణము.

ఇట్లు నుతించి యంజలిఁబట్టి నిలిచినట్టి రాజదంపతుల నీక్షించి దయాసముద్రుండగు యాదిదేవుండు మీరొనర్చిన భక్తికెంతయు సంతోషించితి నిట్టిదికదా నిద్దంపుభక్తి. ఇదియేకదా యాచార్యంబు. ఇఁకఁ గొంతకాలంబు మీరలీయైహిక సుఖంబులఁజెంది యాపై నాసన్నిధానంబున రాఁగలరని నొడివి సెలవిచ్చి యంతర్హితుండయ్యె. భూరమణుండు శివసన్నిధికరుగుట కింకను శివుండు తడవుచేసె నని కొంకుచు శివాజ్ఞాప్రకారంబు శైవవ్రతంబు సల్పుచు వసుమతినిఁ బాలింపుచుఁ గొంతకాలంబునకు సధర్మిణితోడ శివునిఁజెందె నిది భక్తశిరోమణియైన కూకదమారయ్యగారి చరిత్రం బఖిలపాపహరంబు శుభదంబు.

# 43. మహాభక్త తాండారి

శ్లో॥ వియద్వ్యాపీ తారాగణగుణిత ఫేనోద్గమరుచిః
ప్రవాహోవారాంయః పృషతలఘు దృష్టశ్శిరసితే
జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి
త్యనేనైవోన్నేయం ధృతమహిమదివ్యం తవవపుః॥

మహిమ్నస్తవము.

తా॥ ఓపరమశివా! ఆకాశమునంత వ్యాపించినదియును జుక్కలగుంపుచే మఱియు రెట్టింపఁబడిన నురుగుల పుట్టుకచే నగు శోభ గలిగినట్టి దేవ యుదకముల ప్రవాహము నీశిరస్సందొక జలబిందువువలెఁ గన్పట్టు చున్నదో అట్టిదానిచేత నీజగము సముద్రముచే వలయాకారముగఁ జేయఁ బడినట్టి యొక ద్వీపమువలెఁ జేయఁబడుచున్నది. ఇట్లగుటచేత నీదేహము ధరింపఁబడిన మహిమముగలదై ప్రకాశించునదియొట ఊహింపఁబడుచున్నది.

పగల్తాండారి యనునొక శివభక్తుండు దినదిన మగస్త్యేశ్వర శివ లింగంబు నొక వందకలశంబుల నుదకంబులచే నభిషేకింపుచు నర్చించు చుండె. ఒకవత్సరం బనావృష్టియగుట మరుసటియేటి యెండలందెచ్చోట నుదకంబు సులభంబుగాకుండె. వాపీకూపతటాకంబులన్నియు సలిల శూన్యంబులయ్యె. పుష్పఫలారామంబు లెండె. అరణ్యంబులందు దావాగ్ని చెలరేగి కాల్చుచుండె. భోజనపానోదకంబులకే యెద్దడియయ్యె. అట్టి సమయమందుఁ గూడఁ బగల్తాండారి విత్తంబులిచ్చి దవ్వులనున్న మహానది యందలి యుదకంబులు వందకలశంబులు దెప్పించి శివలిం గంబు నభిషేకించుచుండె. ఇట్లేకదీక్షతో దుర్భిక్షమందుఁగూడ నా భక్తుం డహరహంబు శతకుంభోదకంబులతో శివలింగంబు నభిషేకించి పూజించుచుండ నొకనాఁడు పూజకై తెచ్చిన యుదక కలశములలోఁ జేయిదప్పి యొకఘటంబు భిన్నంబై యుదకంబు పోయె. అపుడు భక్తుఁడు మరల దవ్వులకుఁబంపి యుదకంబుఁదెప్పింపుటకుఁ బూజాసమయంబు మీరుననియుఁ జేరువ నీరంబులు శూన్యంబగుటయు నెఱింగి పూజా భంగంబు ప్రాప్తంబయ్యెనని వగచి మూర్ఛనొందె. అపుడు శివుఁ డొక జంగమరూపంబునవచ్చి యొక హిరణ్యకలశంబు సలిలపూర్ణంబును జూపె. అంత భక్తుండు గన్నులు తెఱచి యంతటఁ గలయఁజూచె. ఎందును గన్పట్టకుండుటకు విషాదంబొంది మరలఁ గన్నులుమూసె. అపు డుదకపూర్ణఘటంబు తనగర్భంబం దుండినట్లగుపడియె. అపుడు భక్తుండు గర్భం బసిచే ఛేదించి యుదకుంభంబుఁగొనియెద నని తద్ క్షణంబందు సురియఁగొని గర్భంబు ఛేదింపఁబూనిన శివుం డాతురుండై రయంబున డాసి వలదువలదని నివారించి భక్తుని జూచి నీదుభక్తికి

మెచ్చితి రమ్ము! దివ్యవిమానంబెక్కుము కైలాసమునకుఁ జేసుమనియె. భక్తుండపుడు దేవా! ఈ వ్రతభంగం బిట్లొంది నేను నీ సన్నిధానము నకు రాఁజాలను. నాకు నీవ్రతంబు గావలయు ననియె. శివుఁ డపుడు వ్రతంబు లర్చనంబు లన్నియు నాదు సాక్షాత్కారంబునకే నా మెప్పు నకే కదా! నేను మెచ్చి సాక్షాత్కరించితి. ఇఁక నీకు వ్రతార్చన లేటికి? నిధిలబ్ధికై కొనినయంజన గడ్డపాఱయున్నగు సాధనంబులు నిధి లబ్ధంబైన నక్కఱ లేదుగదా! అట్లు నేను నీకు మెచ్చి మత్పదం బిచ్చెదనన్నను నీవిం కేటికి తడవుచేసెదవనియె. అపుడు భక్తుండు మహాదేవా! అహరహం బిట్లు నిన్నర్చించుట నావ్రతంబు దేహపాతంబువఱకుఁగాని ఈలోకంబుఁ బాసి నీయనుగ్రహంబున నీదుపదంబుఁ జేరినయంతకుఁగాని ఈవ్రతం బెట్టి విఘ్నంబు లేక జరుగవలసినదియే యనిన శివుఁ డాతని భక్త్యతిశయంబు నకు దృఢదీక్షకు నానందించి యుదకపూర్ణఘటంబునిచ్చె. అద్దానిగొని శతఘటోదకంబుల శివలింగంబు నభిషేకించి పూజించిన భక్తునిగాంచి శివుఁ డికఁ బుష్పకంబు నెక్కుమనియె. భక్తుఁడు శివునితో సదయహృదయా! నాకీ శివలింగంబు నీయనుగ్రహపాత్రుని జేసె. అందున నీయగ స్త్యేశ్వరలింగాగారంబుతోడ నీపదంబుఁ జేర్పుము. అందుఁగూడ నీ లింగంబు నర్చించుచుందును. అనవుఁడు శివుండామోదించి భక్తుండు గోరినయట్టులే యా శివాలయంబుతోఁ గూడ నాభక్తుని స్వపదంబుఁ జేర్చుకొనియె. ఇది మహాభక్తుఁడగు పగల్తాండారి చరిత్రంబు.

# 44. మహాభక్త కడమలనంబి

శ్లో॥ మహీపాదాఘాతాత్ వ్రజతిసహసా సంశయపదం
పదం విష్ణోర్భ్రామ్యద్భుజ పరిఘ రుగ్ణగ్రహగణం
ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడితతటా
జగద్రక్షాయై త్వం నటసి నను నామైవవిభుతా ॥

మహిమ్నస్తవము.

తా॥ ఓశివా! నీదు పాదాఘాతమువలన భూమి తత్కాలమందే సందేహస్థానము నొందుచున్నది. విష్ణుపదము (ఆకసము) తిరిగెడు నీదు పరిఘలవంటి బాహువులచేఁ బీడింపఁబడినట్టి సూర్యచంద్రాది గ్రహసముదాయముగలదై యగుచున్నది. స్వర్గలోక మెగురుచున్న నీదు జడలచేఁ గొట్టఁబడిన తటములు గలదై మాటికి దుస్థితిని జెందుచున్నది. నీవు జగద్రక్షకై నటించుచున్నావు.

కడమలనంబి యనునొకభక్తుండు తనప్రాణలింగమునకుఁ బ్రతిదినమందు సహస్రదీపములు వెలిగించి యుత్సవమొనర్చుచుండె. కొన్ని దినంబులకుఁ బూర్వార్జితధనంబును స్వార్జితధనంబు నంతయును నంతంబయ్యె. అంతమీఁదఁ భక్తుఁ డనుమానింపక నాకుఁ గల తనుధనంబులలో ధనంబంతయు సరిగె నిఁక తనువొండున్నది. దీనినిపుడు శివున కర్పింపుటకు సమయంబాసన్నంబయ్యె ననిమనమున మురిసి శిరస్సునందలి కేశంబుల నెల్ల నూర్ధ్వంబునకుదిగిచి మండెడుకొరవినిదెచ్చి శిరోజంబులకు ముట్టించె. అంత జ్వాలయేర్పడి మస్తకంబును ముట్టుచుండె. భక్తుండు శివైకపాత్రుండై యానందంబుననుండె. అపుడు శివుఁడు మెచ్చి భక్తుని యొద్దకు వచ్చి అగ్నిజ్వాలల నార్పి భక్తు నాలింగనము చేసికొని యాత్మధామమునకుఁ జేర్చుకొనియె నిది మహాభక్తుఁడగు కడమలనంబి చరితంబు.

# 45. మహాభక్త వైజకవ్వ

శ్లో॥ ధ్రువం కశ్చిత్ సర్వం సకల మపరస్త్వ ధ్రువమిదం
పరోధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదత వ్యస్తవిషయే
సమస్తే ప్యేతస్మిన్ పురమథన తైర్విస్మితఇవ
స్తువన్ జిహ్రేమి త్వా నఖలు నను ధృష్టా ముఖరతా.

మహిమ్న స్తవము.

తా॥ ఓ త్రిపురసంహారా! ఈ కనఁబడుచున్న సర్వజగంబు నొకఁడు నిత్యమైనదానిగా మఱొకఁడు సర్వవిశ్వంబు ననిత్య

మైనదానిగాను వేఱొకఁడు ఒకటిమైన నీసర్వవిశ్వమందు నిత్యానిత్యములను వేఱువేఱుగా నియతములైనవానిగాఁ జెప్పుచున్నారు. నిన్ను బొగడుచున్నట్టి నే నిట్టివారిచేతఁ బరిహసింపఁబడిన వానివలె నున్నను సిగ్గుపడుట లేదు. వాచాలత్వము దిట్టతనముగలది.

కర్నాట దేశంబున బరవళిగయను పురంబందు వైజకవ్వయను సువాసిని యువతికలదు. ఆమె శివభక్తాగ్రగణ్యా విదుషి. ఆయమ పెనిమిటి జైనుఁడు. సతతము జైనగోష్ఠులఁ బొనరింపుచు జైనగురులఁ బూజించుచు జైనకథాశ్రవణంబుల సంతుష్టుఁడగుచుండు. సాధ్వీమణియగు తత్సతి యామతమందిష్టము లేకయుఁ బత్యధీనగావున నస్వాధీనమై ఏనాఁటికేని శివలింగపూజనంబుగాని యొక శరణచరణార్చనంబుగాని లభింపకుండె నిఁక నీజన్మంబెట్లు ధన్యంబగునని రేఁబవలు పరితపించుచుండె. ఇట్లు నడుచుచుండ నొకనాఁడు జైనగురులకుఁ దచ్ఛాత్రులకును దనయింట విందుసేయఁబూని గృహపతి సకల పదార్థంబులఁ దెచ్చి పాకంబులనొనర్పుము నేను జైనమండలిని బిలిచికొనివచ్చెదనని గృహిణికాన తిచ్చి చనినంత వైజకవ్వ పదార్థంబులనెల్ల వేఱువేఱుగ బాగుచేసికొని సేకరించి శాకంబుల సూపంబు నన్నంబు పులుసులు చేరులు పాయసంబు లడ్డువంబులు మణుగుపూవులు గరిజెలు మున్నగునవి యొనర్చి చిత్తంబందకటా! పంచభక్ష్యాన్నంబులు సిద్ధమొనర్చితి. ఒక్క మాహేశ్వరుఁడేని వచ్చి శివపూజ చేసికొనునంతటి భాగ్యమునకు నోచనైతిఁ గదా! ఈ వంటకంబంతయు జైనచార్వాకులపాలుచేసి వడ్డింపనుంటిఁగదా! నా భాగ్యమిట్లున్నది. శివునకు నాయందనుగ్రహము లేకపోయె నని దురపిల్లుచుండె. శివుఁడదియారసి యొకచరమూర్తియై గృహంబుఁ దారసింప నాయువిద దవ్వులనుండియే చూచి కడుఁగడు సంతసించి యెదుర్కొని సాష్టాంగ మెరగి యుదకంబుఁ దెచ్చి పళ్ళెరంబందు మాహేశ్వరచరణంబులఁ గడిగి యాతీర్థంబును శిరంబందుఁ జల్లుకొని ప్రాశనముచేసి పదంబులందలి తడిఁదుడిచి పుష్పంబులుంచి మ్రొక్కి భర్తవచ్చి దన్ను శిక్షించునేమో యనెడు భయంబుఁ బాసి తెగువతో స్వామీ! ఇందు శివపూజ సేయుఁడని కోరి యనుమతిఁబడసి తదక్షణంబందు లింగపూజను సల్పించి కదళీపత్రంబువేసి సర్వపదార్థంబులను వడ్డించినంత

శరణుండు శివలింగార్పితంబుచేసి భోజనంబొనరించె. అంతట జైన చార్యాకులంద ఱింటికివచ్చి యందు ముందుగ సాపడికూర్చుండియున్న శైవుని జూచి కినుకనొంది వంటకం బెంగిలియయ్యెనని వెడలిపోయిరి. అనంతరంబందు గృహపతి యింటికివచ్చి కలయఁజూచిన శరణుఁ డదృశ్యుండయ్యె. యజమానుఁడు నిజంబరసి తనయత్నంబంతయు వృథాయగుటకుఁ జింతించి సతిపై నాగ్రహించి ఓసి ప్రతికూలా! నా ప్రయత్నమ్ము వమ్ముచేసి నన్ను బరిహాసపాత్రునొనర్చితివి. ఇట్టి నిన్నేమి చేసిన నీయపచారంబుతీరు? దుర్మతీ! నాగురులకుఁ గుడుపనున్న మృష్టాన్నంబుల నెవనికో ముందొసఁగి పాకంబులనెల్లఁ జెరిచితివి. ఆతఁడెచ్చటికేగె? ఎచ్చోటదాచితివి? వానికి నీకెన్నటినుండియో తగులంబున్నదికాఁబోలు. నే నెఱుఁగకుంటి. కాకున్న నిక్లేల తెగించి పవిత్రాన్నంబుల ముందుగఁ గుడువఁ బెట్టెదవు? చూడుము. నిన్నిపుడే యంతకపురికిఁ జేర్చెద నని యొక కొరడాపుచ్చుకొని కసిదీర భార్యను బాదుచుండెను. అపుడామె చేయునది సుంతలేక మంతనంబున నీశ్వరు నీశ్వరి నిట్లర్థింపుచుండెను.

శ్లో॥ గౌరీవల్లభ కామారే కాలకూట విషాదన
మా ముద్ధరాపదంభోధే స్త్రిపురఘ్నాంతకాంతక !
మలయాచల ఖండస్థ శివతత్వ సుధానిధి.

తా॥ ఓ గౌరీప్రియా! ఓమన్మథారీ! ఓవిషభక్షణ! ఓ త్రిపురదహనా! ఓ మృత్యుహరా! ఆపత్సముద్రమునుండి నన్నుద్ధరింపుము॥ అని యర్థించి ఆర్యా దేవినుద్దేశించి

శ్లో॥ తనోతుక్షేమంన స్తవవదనసౌందర్యలహరీ
పరీవాహస్రోత స్సరణి రివసీమంత సరణిః
వహంతీ సిందూరం ప్రబలకబరీ భారతిమిర
ద్విషాం బృందైర్బందీ కృతమివ నవీనార్క కిరణం ॥
శ్రీశంకరాచార్య సౌందర్యలహరి.

తా॥ ఓ తల్లీ! సిందూరమును ధరించినదై దట్టమగువేణీభరతిమిర శత్రుసమూహముచే బందిగావింపఁబడిన బాలభానుని కిరణమువలె నున్నట్టియు నీముఖమండలి సౌందర్య నదీప్రవాహంబు త్రోవవలె నున్నట్టియు నీదు పాపటిత్రోవ మాకు శుభమును వృద్ధి చేయుగాత.

అని ప్రార్థించుచుండఁగా శివానుగ్రహంబున కొరడాదెబ్బ లన్నియు నామెకుఁదాకక ఆపోవుచున్న జైనులకందఱకుఁ దాకుచుండె నవ్వారలు వీపులను స్పృశించుకొనుచు నేడ్చుచుండిరి. గృహస్థుఁడు చాల సేపు కినుకదీర తనయువిదను మోది యలసి పెండ్లమును ఇంటివెలపలికి గెంటి నాయింటనుండకు నీ వలసినయెడకు బొమ్మనియె:

అపుడు వైజకవ్వ యేమియుఁదోఁచక యెందుఁబోవుటకరయక అడలుచు నడుచుచు నొకయాలయంబగుపడ నద్ది శివాలయంబనుకొని యపుడందుఁజేరి శివుని దిరుగ ధ్యానించుచుండె. వైజకమ్మ తలపోసి నట్లది శివాలయంబుగాక నొక జైనాలయంబగుట నాసతిధ్యానయజ్ఞంబున నావసతియందలి జినవిగ్రహంబు శివాలింగంబయ్యెఁ దత్పరివారం బంత సన్నిహితంబయ్యె. అందలిజనంబులంత నావిచిత్రసంఘటనం బీక్షించి విస్మయించి యందఱికెఱుక చేసిరి. ఊరివారందఱువచ్చి వైజకమ్మ యొనర్చిన ధ్యానమాత్రంబున జినవిగ్రహంబు శివలింగంబగుటకుఁ బరివార దేవతలందఱు చేరుటకును వైజకమ్మను దద్భర్త కొరడాతోఁ గొట్టినట్టి దెబ్బలు జైనగురులకు జైనులకుఁ దాకుటకును నత్యాశ్చర్యంబునొంది వైజకమ్మను శివభక్తశిరోమణిగాఁ దలంచి నుతించి మ్రొక్కిరి. జైనగురులుగూడ వైజకమ్మభక్తి మాహాత్మ్యంబున కలరి మ్రొక్కి వైజకమ్మయుపాసించు శివమతంబందుఁ జేరిరి. వైజకమ్మపతియును దనసతి శివభక్తిని నిర్మలాంతఃకరణంబు నెఱింగివచ్చి యామెను గారవించి నిజాగారంబునకుఁ దోడ్కొనిపోయె. నాఁడు మొదలుకొని యాతండును శివభక్తుఁడై శివుని శివభక్తులను బూజింపుచుండె. వైజకమ్మచేఁ బ్రాదుర్భవించిన యాశివలింగంబు వైజనాథుండని ప్రసిద్ధినొంది పూజకులకు సర్వార్థంబులిచ్చుచుండె. వైజకమ్మ బోధచే ననేకులు శివభక్తి నొంది భక్తాగ్రగణ్యులైరి. ఈయది మహాభక్త వైజకమ్మ చరిత్రము హర్ష వర్ధనము.

# 46. ఆత్మారామ - మహాయోగి

శ్లో॥ మనః ప్రత్యక్చిత్తే సవిధమవిహాయాత్త మరుతః
ప్రహృష్యద్రోమాణః ప్రమద సలిలోత్సంగితదృశః
యదాలోక్యాహ్లాదం హ్రదఇవ నిమజ్జ్యామృతమయే
దధత్యంతస్తత్త్వం కిమపి యమినస్తత్కిలభవాన్.

మహిమ్నస్తవము.

తా॥ నిరోధింపఁబడిన ప్రాణములు గల యోగీశ్వరులు వాసనారహిత మగు పరమాత్మమందు విధ్యుక్తముగ మనస్సును జేర్చి అమృత మయమైన హ్రదమందు మునిఁగినయట్లు పులకించిన రోమములు గలట్టివారలై ఆనంద బాష్పములతో నిండిన నేత్రములుగలవారలై ఏదియోయైన యేతత్త్వమునుగాంచి అంతస్సులో నానందమును ధరించుచున్నారో ఆ యానంద వస్తువు నీవే కదా!

ఆత్మదేవుండను భక్తుఁడొక పల్లెయందు వసించి యిష్టలింగమును బూజింపుచు మానసంబును బద్మకోశప్రతీకాశంబును నధోముఖంబును నగు హృదయంబు నందలి జ్వాలమాలాకులంబును విశ్వాయతనంబు నగు జ్యోతిర్లింగంబు మధ్యంబందు గీలుకొలిపి ధ్యానావాహనాద్యుపచారంబు లొనర్చి సేవించి చొక్కుచుండు. ఇట్లు చిరకాలంబు జరిగినయంత నొకనాఁ డాత్మదేవుండు వృత్త్యర్థమై కూలికి పండినవరిచేనుగోయుటకై పోయి యందు మధ్యాహ్నవేళయగువఱకు వరిఁగోసి యంత సాపడుటకై యందఱు పని నిలుపుటఁ జూచి తానును బనిమాని యొక వృక్షంబు నీడనుజేరి యందుగూర్చుండి మానసంబందు జ్యోతిర్లింగార్చనంబు చేయుచుండె. తక్కిన కూలివాండ్రిందఱుసాపడి మరలఁ బనిలోఁ బ్రవేశించుచుఁ జెట్టుక్రిందఁ గనులు మూసికొనియున్న నీ యాత్మదేవునిఁ జూచి నిదురింపుచున్నాఁడనుకొని పరిహసించిరి. అందొకఁడు వచ్చి ఓయీ! కూలికి వచ్చి నిదురింపుమని యెవ్వరు చెప్పిరి? లెమ్ము లెమ్మని తన వ్రేలితో నాతని గర్భపార్శ్వంబును గట్టిగఁ బొడిచె. అంత నతం డుస్సురని లేచి తన కడుపును బొడ్డి

చినవానిఁ జూఁచి కినిసి తనమొలనున్న కొడవలితో నవ్వాని తలను గోసివేసె. అపు డా హత్యాకృత్యంబును జూచి యందఱు భీతులై పోయి యారాజున కెఱింగించిరి. నృపుండును నాతురుండై ఖడ్గహస్తులగు తన భటులచే నాతని బిలిపించి అకారణంబుగ మనుష్యుని నేలవధించితివని యడిగిన నాతండు ప్రభూ! అనిమిత్తంబుగ నేనేలవానిఁ జంపుదును? నేను శివలింగ పూజామహోత్సవంబున నుండ నవ్వాఁడు శివనైవేద్యమునకై యుంచిన పెరుగుముంతను బొర్లఁబోసె నందులకై పూజాభంగంబును శివాపచారంబును సల్పెనని నవ్వానిని గడతేర్చితి ననియె. అపుడు వరి కోత కూలీలందఱు ఈతని నుడులు నిక్కములు గా వసత్యములు పూజించుటలేదు. పెరుగుముంతలేదు. కునుకుచున్నవాని ముట్టికొని ప్రబోధించిన మాత్రమున నే యీతఁడు వానిఁ బొదివిపట్టి చంపెనని చెప్పిరి. ఆత్మదేవుండు విని భూనాథా! నాదు నుడు లసత్యంబులనిరి. నే నిందు బాహ్యార్చనంబొనర్పలేదు మానసపూజ యొనర్చితిని. మీాకు నా వచనంబునందు నమ్మిక లేకున్నఁ బ్రత్యక్షంబుగఁ జూడుఁడని చేనున్న కొడవలిచేఁ దనవక్షంబు జీల్చి యిరుప్రక్కలఁ బుప్పసలఁదోఁచి యందు మధ్యంబందు రత్నపీఠంబును జ్యోతిర్మయలింగంబును దా నర్చించిన గంధాక్షత పుష్ప బిల్వదళంబులను షడ్రసాన్ననైవేద్యంబులను బొరగిలఁబడి పుడమిఁదొరలిన పెరుగుగలట్టి చట్టిని జూపించె. అపుడు సభ లోనివారందఱును బ్రభువును నా ప్రకారంబంతయును జూచి విస్మయఁ పడి భీతివడి చేతులుమోడ్చి మ్రొక్కి పరమశివునకు మ్రొక్కి యమ్మ హాత్ముని క్షమింపుమని ప్రార్థించిరి. అంత నతండు దనవక్షంబును స్పృశించినయంత వక్షంబు మూసికొని పూర్వమువలె నుండెె. మృతుండైన కూలివాని దేహంబుఁ దెప్పించి యద్దానిపైని జేమోపినంత నవ్వాఁడు పునర్జీవితుండై లేచి కూర్చుండి యాత్మారామునకు జోతలుచేసె. అపు డందఱు ఆనందంబున మిన్నంది యాత్మారాముని బూజించి నంత నతండు యథేచ్ఛగ జని యిష్టలింగపూజను జ్యోతిర్లింగపూజ నొనర్చుచుండె నిది యాత్మారామునిచరిత్రం బఖిలశుభప్రదంబు.

# 47. శివయోగి అంబికచౌడయ్య

శ్లో॥ త్వమర్క స్త్వంసోమ స్త్వమసి పవన స్త్వం హుతవహః
త్వమాప స్త్వం వ్యోమ స్త్వముధరణి రాత్మాత్వ మితిచ
పరిచ్ఛిన్నా మేవం త్వయిపరిణతాబిభ్రితుగిరం
నవిద్మ స్తత్త్వం వయమిహాత యత్త్వంనభవసి.

మహిమ్న స్తవము.

తా॥ నీవు సూర్యుఁడవు నీవు చందురుఁడవు నీవు గాడ్పువు నీవగ్నివి నీవు దకమవు నీవాకసమువు నీవు భూమివి నీవాత్మవు నీయందు భక్తులైన వా రిట్లు పరిమితిగలవాక్కును బలుకుచున్నారు. లోకమందు నీవే స్వరూపముగావో అట్టిస్వరూపమును మే మెఱుఁగము.

అంబికచౌడయ్య నానొక మహాశివభక్తుం డొకనగరంబున వసించి సూదవిద్యా (వంటకమున)నిపుణుండై వంటకమునే జీవనవృత్తిగాఁ గొని ఆర్జితధనముచే నియతంబుగ మాహేశ్వరుల కనుదినంబు భోజనంబిడుచు ఇష్టలింగంబును నిష్ఠతోఁ బూజించుచుండె. ఇంత యొకానొక నాథీరుండు జీవిత వృత్తికై పోవునపుడుదక్క తక్కినసమయంబులం దెల్ల శివైకాసక్తచిత్తుండై ఇష్టలింగార్చనమందును శివకథాపఠన శ్రవణంబులందును శివభక్తి ప్రబోధనంబునందును శివలింగధరులసేవయందును జెలిమి యందును బ్రేమగలిగి యానందంబున నుండు. ఇట్లుండ నొకనాఁడొకచతుష్పథం బందలి పురమందిరంబందుఁ బెక్కురుభక్తులు గూర్చుండి యర్చనా ప్రకారంబును మోక్షోపాయంబును గుఱించి పెక్కుభంగులఁ జర్చింపు చుండిరి. చౌడయ్యగారందు వారల ప్రసంగంబులను వినుచుండె. అంత నందలి పలువురేకమై బాహ్యపూజకన్న యోగంబున నంతర్లింగార్చనంబే యధికంబనియు నదియే సులభంబుగ మోక్షప్రదంబనియు జన్మరాహిత్య కారణంబనియు నందులకై షట్చక్రశోధనంబొనరించి ప్రాణాదిదశానిలంబుల నిరోధించి యధోముఖకుండలిని బ్రబోధించి యూర్ధ్వముఖినిజేసి దశధ్వనులనాలకించి సహస్రారంబుఁ జెంది యందుఁబరమశివతేజంబు నొందుటావశ్యకంబని నిరూపించి రదివిని చౌడయ్య యక్కజంపడి ఇది

యెల్ల ఇష్టలింగార్చనాపరుల కనవసరంబనియు సర్వం బిష్టలింగార్చన చేతనే సమకూరుననియు తక్కినవన్నియు శ్రీమహేతువులనియు ఇష్ట లింగార్చనమే పరమేశ్వరసాక్షాత్కారణంబై సులభంబుగ మోక్షంబు నిచ్చుననియుఁ జెప్పె నపుడు యోగవాదు లందఱేకమై నీకేమి దెలి యును? నీ విష్టలింగార్చనతోఁ బరమేశ్వర సాక్షాత్కారంబును జూపె దవా? యని యడిగిరి. చౌడయ్య ధీరుండై చూడుఁ డిపుడే కనపఱ చెద నని కూర్చుండి ఇష్టలింగమునకు మ్రొక్కి తనమొలనున్న గరిటె నాకసంబున వైచె. తత్క్షణంబున నంబరంబునఁ గోటి సూర్యప్రకాశం బైన తేజంబు పొడమి యందు వెండికొండయును దన్మధ్యంబందు బంగారుమేడయును నందు రత్నపీఠంబందు బఱచియున్న వ్యాఘ్రాజినం బందుఁ బరమశివుం డుమాదేవితోఁ గూర్చుండి కుమార గణేశులతోడను నందికేశునితోడను సకలప్రమథామరవర్గంబుతోడను బరివేష్టింపఁ బడు చుంకుట యందఱకుఁగానుపట్ట నపుడందఱు విస్మితులై లేచి పరమేశ్వ రున కార్యాదేవికి గణేశకుమారనందికేశులకుఁ బ్రమథామరకోటికి మ్రొక్కి నుతులొనరించిరి. అంత చౌడయ్యగారు మరల నాకసం బాచ్ఛాదనంబునొనర్చినంత నాగోష్ఠి యంతర్ధానంబొందె. ఇందు సభ నున్నవారందఱు చౌడయ్యగారిపదంబులకు మ్రొక్కి మహనీయా! అమ రులకేని దుర్లభం బైన శివదర్శనంబు మాకొసంగించితివి ధన్యుల మైతిమి. నీదయకుఁ బాత్రులమైతిమని సన్నుతించి యవ్వారి యుపదేశంబుచే వారందఱిష్టలింగధారణం బొంది లింగంబును బూజించుచుండిరి. చౌడ య్యగా రానందించి రిది మహాభక్తుండైన చౌడయ్యగారి చరిత్రంబు.

# 48. భక్త సుగ్గళవ్వరాణి

శ్లో॥ విశ్వంప్రాదుర్భవతి లభతే త్వామధిష్ఠాపకంచే
న్నహ్యుత్పత్తిర్నపి జనయితా నాస్తిచైతన్య యుక్తం
క్షిత్యాదీనాం భవతిచ కలావత్తయా జన్యవత్తా
సిద్ధత్వేవం సతి భగవతస్సర్వలోకాధిపత్యం॥

ధండిమహాకవ్యనామయస్తుతి.

తా॥ ఓ పరమేశ్వరా! ఈప్రపంచము నిన్నధిష్ఠాతగా నొందిన యెడలఁ బుట్టుచున్నది. జ్ఞానయుక్తుఁడగు జనకుఁడు లేని యెడలఁ బుట్టుక నొందదు. భూమ్యాదులకుఁ బుట్టుకగల్గుట నవయవములు గలదై యగుచున్నది. ఇట్లు భగవంతుఁడవగు నీకు సర్వలోకాధిపత్యము సిద్ధింపుచున్నది.

ఆంధ్రదేశంబందు పొట్లచెర్వనెడు గ్రామంబందు పల్లవుండనెడు నొకరాజుగలఁడాతఁడు జైనబోధలచే నామతమందుజేరి జైనపండితు నొకని గురునిగాఁబడసియుండెను. ఆతనిసతి సుగ్గలదేవియను వనితారత్నము బాల్యంబందే శైవాచారనిరతయై దేవరదాసయ్యగారను శివభక్తకోవిదుని ఆచార్యునిగఁ జేసికొని యమ్మహాత్మునిచే శివదీక్ష నొందియుండె. యువతియై పరిణయంబొందిన యంతనే నాథునియొద్దకు వచ్చి విభుని పాద్ధకర్మంబుల సేవగించి తనపరిచారకులను గురునాథుని యొద్దకనిపి యవ్విధంబుఁ దెలిపి తనభర్తకు బౌద్ధాచారంబుఁబాపి శివభక్తినిష్ఠునిగ నొనర్చుమని వేడుకొనియె. అపుడు గురుమూర్తి కొందఱు శిష్యులతోఁ బొట్లచెరువునకు వచ్చుచుండుటఁదెలిసి జైనులనేకకుత్సిత క్రియలొనరించిరి. వానినెల్ల లెక్కగొనక పాయఁజేసి గురుండు పొట్లచెర్వునకు వచ్చినంత సుగ్గలదేవి యెదురేగి గురుచరణారవిందంబులఁ బడి మ్రొక్కి యొక్కయుచితస్థలంబున నవ్వారివిడియించె. జైనులు రాజునకవ్వారిరాక నెఱింగించి భావ్యంబెట్లోయనిరి. నృపతి యవ్విధంబంత నెఱింగి సతియొనర్చినకార్యంబని తలఁచి యామెయొద్దకేగి రాజ్ఞీ నీకొక గురుఁడును నాకొకగురుండును నీయది యొకమార్గంబును నాదియొక మార్గంబగుట యొప్పునా! సతిపతులకొక్కగతియెగాని భిన్నంబుగ నుండుటెందువినమైతిమి. జైనగురు లిదివినినఁ గోపింపరా! ఇపుడేని నీ నాగురుని వెడలించి యాత్మపురి కనుపుమనియె. అపుడు సుగ్గళదేవి ధీరయై ఈ నాగురులు జైనుల పెంపడపనేవచ్చిరి. ఇట్టివారుఇక యెట్లు పోవుదురు? సతీపతుల కేకపథంబేయని యేనును విశ్వసింతును. నీవును వివాహంబందు ధర్మంబు మున్నగువాని యందు "నాతిచరామి" యని వచించితివికదా! నీమార్గంబునకనువగు వేఱొకయాలున్న నన్నువిడువుము. నేను సనాతన శ్రౌతమార్గంబును విడువఁజాలను. నీగురులు సమర్థులేని

వేదశాస్త్రాదివాదంబందుఁ దర్కవాదంబందు మావాదంబునోడింపు మనుఁడు ఉభయులవాదములో నేదిజయంబొందునో అద్దాని గ్రహింత మనిరి. అందులకు రాజంగీకరించి జైనమునులను బిలిపించి వాదింపుఁడని సభను గూర్పించె. అందు సుగ్గళదేవి గురుని రప్పించి యాస్థాని యందు జైనుల కెదురుగ నొక రత్నపీఠంబందు గూర్చుండఁజేసి యవ్వారి పాదములయొద్దఁదానుగూర్చుండె నపుడు శైవగురుండు శివుని గుఱించి యిట్లుపస్థానంబొనర్చెను.

శ్లో॥ భోగ్యామాహుః ప్రకృతి మృషయశ్చేతనాశక్తిశూన్యాం
భోక్తాచేనాం పరిణమయితుం బంధవర్తీ సమర్థః
భోగోప్యస్మిన్ భవతి మిథునే పుష్కలస్తోత్రహేతో
నీలగ్రీవ! త్వమసి భువనస్థాపనా సూత్రధారః.

దండిమహాకవి అనామయస్తుతి.

తా॥ కొందఱు చైతన్య రహితమైన జడప్రకృతిని భోగింపఁదగిన దానిగాఁ జెప్పుచున్నారు. అవిద్యాబంధముచేఁ గూడినపురుషుఁడు ఈ ప్రకృతిని జగద్రూపముగఁ బరిణమింపఁ జేయుటకు సమర్థుండుకాఁడు. ఈ ప్రకృతి పురుషరూపమగు మిథునమందు భోగముగూడ స్వతంత్రంబై యుండలేదు. విస్తారమగు స్తోత్రమునకు హేతువైన ఓనీలకంధరా! నీవ విశ్వనిర్మాణమునకు ముఖ్యకారణంబవగుచున్నావు.

ఇట్లు స్తుతించి శైవగురుండు జైనగురులతోఁ గొంతసేపు తర్కమీమాంసాదర్శనంబుల నుద్ఘాటించి వాదించెను. జైనమునులా మార్గంబందు జయంబునొందక వేఱొక తెలుగు యోజించి యిట్లనిరి. మీరు చెప్పెడుశివుఁడు చరాచరప్రపంచమున కంగమా? జీవమా? చెప్పుఁడనిరి. అపుడు శైవగురుఁ డంగంబు పూర్వకర్మాంశంబు సుఖదుఃఖాకరంబు పుణ్యాపాపాలయం బస్థిరంబొట నద్ది శివుండుగాఁడు. ఇఁక జీవుండును శివుఁడుగాఁడు. జీవుండు మలినుండు శివుఁడమలుఁడు. జీవుఁడు దుష్కర్ముఁడు. శివుఁడు నిష్కర్ముఁడు జీవుఁడు సభవుఁడు శివుఁడభవుఁడు జీవుఁడనిత్యుఁడు శివుఁడు నిత్యుఁడు. జీవుఁడు పశువు శివుఁడు పశుపతి జీవుఁడు దుఃఖి శివుఁడదుఃఖుఁడు. కావున జీవుఁడు శివుఁడు కాఁడు. ఇఁకఁ బ్రపంచమందు సకలవిజ్ఞానస్వరూపంబైన యాత్మంబే శివుఁడు. ఇట్లు వక్కాణింప ఆశివుఁడెందుండు నెట్టులుండు!

ప్రపంచమునకు శేషమా? ప్రపంచాతీతుఁడా? చెప్పుమనిరి. అపుడు గురుండు శివపరమాత్మంబు సర్వజగదుపాదానకారణంబై సర్వప్రపంచాంతర్యామియై యవిచ్ఛిన్నంబుగ దేశకాలాఽపరిఛిన్నంబై యణువు నందణీయమై మహత్తుకన్నమహీయంబై తరువందగ్నియట్లుపాషాణమందు లోహమువలె నేత్రంబందు రూపంబట్లు కుంభోదకంబందుఁ జంద్రునిలాగు బీజంబందు వృక్షంబుతీరుండు. మఱియు సర్వశాసకుండై ప్రపంచంబునంత లయింపఁజేసినను ఘటమఠంబుల నాశమందుఁ దద్గతాకాశము నిత్యంబై యుండునట్లు సర్వగతుండై నను తాననశ్వరుండై యుండును. సర్వప్రపంచ మాశివునకు శేషంబగును. శేషి యా శివుఁడేయగు. ఇట్లు దృష్టాంతహేతుపురస్సరంబుగ ఉపనిషచ్ఛాస్త్రోక్తులతో బహుభంగులఁ బ్రతిపాదించుటను జూచి జైనులాశాస్త్రదృష్టాంతంబులతోఁ బనిలేదు. ప్రత్యక్షంబుగ నిరూపింపవలయు. మీరు శివుని సర్వగతుఁడంటిరి. మేమడిగినచోటఁ జూపుదురా? యని యడిగిరి. శివదేశికుఁడు సందియమేమియట్లే చూపించెదమనిరి. అపుడు వారందఱొక భయఙ్కరమగు నాగుబాము నొకకుండయందుఁ బ్రవేశింపఁజేసి సభకుఁదెచ్చి కలశముఁజూపి ఈఘటంబందు శివుండుండెనా చూపుమనిరి. అపుడు శంకరదాసయ్యగారు ఘటమును దఱిసి.

శ్లో॥ నమో నేదిష్ఠాయ ప్రియదవ! దవిష్ఠాయచనమో
నమఃక్షోధిష్ఠాయ స్మరహర! మహిష్ఠాయచనమః
నమోవర్షిష్ఠాయ త్రినయన! వరిష్ఠాయనమో
నమస్సర్వస్మైతే తదిదమతిసర్వాయచనమః. మహిమ్నస్తవము.

తా॥ ఓవనవాసప్రియుఁడా! మిక్కిలి దగ్గఱగానున్నట్టియు మిగుల దవ్వులనున్నట్టియు నీకు నమస్కారములు. ఓ కామారీ! అణుస్వరూపముగా నున్నట్టియు మహత్తరముగా నున్నట్టియు నీకు నమస్కారములు. ఓత్రినేత్రా! మిగుల వృద్ధుఁడవైనట్టియు యువకుఁడవైనట్టియు నీకు నమస్కారములు. ఓశివా! సర్వరూపుడవైనట్టియు సర్వమునతిక్రమించినట్టియు నీకు నమస్కారములు.

ఇట్లుశివుని నుతించి నిర్భయంబుగఁ గలశంబందుఁ జేయుంచి బుసకొట్టుచున్న నాగుఁబామును బట్టుకొనియె. అంతలోఁ గలశంబును

మధ్యంబందు స్ఫాటికశివలింగం బుదయించి స్వకీయదివ్యకాంతిపుంజం బుల దిగంతరాళతమంబులతో జైనజనమనోగతతమంబులఁబాపి ప్రకాశంబును జేకూర్చె నాగసర్పం బదృశ్యంబయ్యె. కలశంబు భిన్నంబై నలుదిక్కుల నొరగె. అట్టి యసమానాద్భుతఘటనంబును జూచి నృపతియుఁ దత్సతియు సభ్యులును జైనమునులును గూడ నక్కజంబొంది శివలింగంబునకు మ్రొక్కి నిటలతటఘటితకరకమలులై శివదాసయ్యగారికిని సాష్టాంగపడిరి. భూపతి యంత జైనమార్గంబుఁబాసి శైవగురునిచే శివలింగధారణంబునొందె. సుగ్గలవ్వ యానందించె. జైనులుఁగొందఱు పాఱిపోయిరి మఱికొందఱు శంకరదాసయ్యగారిచే శైవదీక్షనొందిరి. అపుడు శంకరదాసయ్యగారు వారలకందఱకిట్లుపదేశించె.

శ్లో॥ సా రసనా తే నయనే తావేవ కరౌ సఏవ కృతకృత్యః
యా యే యౌ యో భర్గం వదతీక్షేతే సదార్చతః స్మరతి.
శివానందలహరి.

తా॥ ఏది శివుని (భర్గుని) బలుకుచున్నదో ఏవి శివుని జూచుచున్నవో ఏయవి శివుని నెల్లపుడు పూజించుచున్నవో ఎవఁడు శివుని స్మరించుచున్నాఁడో అదియే నాలుక అవియే కనులు అవియే కరములు అతఁడే ధన్యుఁడు.

కావున నిష్ఠైఱింగి శివుని సేవించి ధన్యులగుఁడని బోధించి శిష్యుల నందఱను వీడ్కొని యాత్మపురికేగె. ఇట రాజదంపతులును దత్ప్రజలును సంతోషముతో శివపూజను జేయుచుండి రిది భక్త సుగ్గలదేవీ చరితంబు.

# 49. భక్తవీరసంగాంబ

శ్లో॥ యోగక్షేమధురంధరస్య సకలశ్రేయఃప్రదోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యంమయా
శంభో! త్వం పరమాంతరంగ ఇతి మే చిత్తే స్మరామ్యన్వహం ॥
శివానందలహరి.

తా॥ ఓశంభూ! అప్రాప్తమగు వస్తువును జెందించుటయందును బ్రాప్తంబైనదాని రక్షించుటయందును ధురంధరుఁడవైనట్టియు సకలశుభంబుల నిచ్చునట్టియు ఐహికాముష్మికముల కిష్టమైన యుపదేశమందు సమర్థమైనట్టియు బాహ్యాభ్యంతరములందు నిండియున్నట్టియు సర్వమును దెలిసినట్టియు దయానిధివైనట్టియు నీకు నాచేఁ దెలుపఁదగినది ఏమియున్నది? నీవు నాకు పరమాప్తుఁడవని చిత్తమందుఁ బ్రతిదినము దలఁచుచున్నాను.

సద్గుణకదంబ భక్తిభావాలంబ వీరసంగాంబ యను శివభక్తురాలొ కర్తృక యొకయూరనుండె. ఆమెకు యౌవనదశ చెల్లుచున్నంతనే పెనిమిటి మృతుండయ్యె. అనంతర మాయమ్మకు నిజదేశికుఁ డరుదెంచి ఒక కదురొసఁగి యద్దానితో దారగమువడకి యద్దాని విక్రయించి యాధనమ్మున జీవితమ్ము గడుపుకొనుచు వీలైనట్లు శరణార్చనంబు సల్పుచుండుమని యుపదేశించి చనియె. ఆయనఘచరిత్ర యట్లులే యా కదురుతో దారంబు వడికి యద్దానినమ్మి యా విత్తముచేఁ బ్రతిదిన మైదుగురయ్యలకు భోజనం బిడుచుఁ దాను శివపూజచేసికొనుచుండె. నిత్యంబట్లుగడుపుచున్న నాయమను బరమేశ్వరుఁడు పరీక్షింపనెంచి యొక జంగమవర్యుఁడై వచ్చుటయు నాయమ యెదురేగి పదములుగడిగి తత్తీర్థంబు నెత్తినెత్తిని జల్లుకొని మ్రొక్కి పూజించి షడ్రసాన్నంబులు వడ్డించె. జంగమవర్యుఁడు భుజించి రుచుల మెచ్చికొని యిట్లనియె. అవ్వా! నీవొంటిదానవు వితంతువవు బిడ్డలుండు తెఱంగు గన్పట్టదు కుటీరము చిన్నది ఇందొక ధాన్యపు గుమ్మియైనఁ గనపడదు పేదదానవని తోఁచుచున్నది. ప్రతిదినం బిట్లు మృష్టాన్నం బైదుగురయ్యలకుఁ బెట్టుచుంటివని వినియుంటి. నీపొట్టకే అన్నంబెట్లువచ్చునని సందియము కలుగుచుండ నీగణార్చనవ్రతం బెట్లు గడుపుచుంటివి నాకుఁ దెల్పుమనియె. అవుడామె మందహాసముచేసి మాహేశ్వరాగ్రణీ! నీయనుగ్రహంబున్న జంగమార్చనమునకేమికొదవ వ్రతంబునకుఁ గలిమియుఁ గాదెలు గావలయునా? అవ్వి సాధకములుగావు. సాధకము నీపాద భక్తియే నాజీవితంబునకును శరణగణార్చనంబునకునుగాను నాగురుఁ

డొక కదురొసఁగెను. దాన దారంబు వడకి యద్దాని నమ్మి తద్ధనంబుచే నిట్లు జంగమార్చనం బొనరింపుచు జీవింపుచున్నదాన ననియె. కృతక మాహేశ్వరుం డలంతిగ నవ్వి కాయికము సూక్ష్మము. భక్తగణార్చన కాదాయం బెక్కుడు గావలయు నెట్లొనరించుచుంటివో! యచ్చెరువగు చున్నది. ఏదీ! యాకదురుచూచెద నొకమాటిందుఁదెచ్చి కాన్పింపు మనియె. అపుడామె వేగిరంబుగ రాట్నమందున్న కదురును దీయు చుండ నయ్యది పెళక్కున నడిమికిఁ దునుకలయ్యె నయ్యదిచూచి యాభక్తవనిత గుండెలు ఝల్లనగ బెంకువడి కూలి మూర్ఛనొంది కొంతవడికి స్మృతినొంది యక్కదురుతునుకలఁ జేనొంది ఘొల్లననేడ్చె. అపుడు జంగమవర్యుండు సుంతకిట్లు పెద్దచేసి యేడ్చెదవేటికి? ఇనుప ముక్కల కిట్లు విలపించిన శివుఁడు మెచ్చునా? ఇట్టివి యంగడిలోఁ బెక్కులు లభించును. వలయునేని నేనిచ్చెదను గొనుమనియె. అపుడా భక్తురాలు అయ్యా! గురుఁడు నాకు మాహేశ్వరార్చనతో జీవితంబు జరుగునట్లు దీని ననుగ్రహించె. ఈయది యిపుడు భిన్నంబయ్యె. ఇఁక నాకు మాహేశ్వరార్చనంబెట్లు జరుగును. సెలవిమ్మనె. అపుడాతఁడు తనజోలెనుండి యొకపసిండికదురుదీసి యాయమ ముందఱవేసె. అపు డామె యద్దానిజూచి దేవరా! నన్ను మాయయందుఁ బడఁద్రోచె దవా? ఈయది నాకక్కఱలేదు. నాకుఁ బసిండియు గిసిండియు వలదు. నీముందఱ నిపుడే గురుదత్తంబగు నీకదురు తునుకలతో శివుని జేరెదను. సెలవిమ్మని మ్రొక్కి యిట్లు శివుని నుతించె.

శ్లో॥ సోమకలాధరమౌళౌ కోమల ఘనకంధరే మహామహసి
స్వామిని గిరిజానాథే మామక హృదయం నిరంతరం రమతాం.

శివానందలహరి.

తా॥ చంద్రికలనుధరించిన శిరస్సుగలట్టియు కోమలంబును మేఘమట్లు నల్లనిదియునగు కంఠముగలట్టియు పార్వతీదేవికి భర్తయైనట్టి స్వామి యు నగునట్టి యొక గొప్ప తేజమందు నాహృదయము సుఖముగ నుండుఁగాత.

అక్కదురు తునుకల నొక చీఁకటి గర్తగుహాయందు వేసి తాను గూడ నందుఁ గూలఁబోవుచుండె. అపుడు శివుఁడు నిజరూపంబుఁజూపి

యూమెనువారించిన నాపుణ్యశీల హరునకు సాష్టాంగపడి మ్రొక్కి నిలిచి నుతించె. శివుఁడామెను మెచ్చితినని తన సాన్నిధ్యమునకుఁ దోడ్కొనిపోయి యందుంచె నిది భక్తురాలగు వీరసంగాంబ చరిత్రం బిఁక మహాభక్తుఁడగు ఉరులింగ పెద్దయ్యగారి చరిత్రంబు జెప్పెద వినుఁడు.

# 50. భక్త ఉరులింగ పెద్దయ్య

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిం
వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రియం సువరదం వందే శివం శంకరం॥

అభియుక్తోక్తి.

తా॥ పార్వతీపతియైన శంభునిగూర్చి నమస్కరించెదను. వేల్పుల గురువగు జగత్కారకుని గూర్చి నమస్కరించెదను పాములను సొమ్ములనుగాఁ దాల్చిన మృగహస్తునిగూర్చి నమస్కరించెదను పశువులగు దేవతలకెల్ల ప్రభుఁడగు వానిగూర్చి నమస్కరించెదను సూర్యచంద్రాగ్నులను నేత్రములుగ ధరించిన వానిగుఱించి నమస్కరించెదను విష్ణువునకుఁ బ్రియుఁడైన వానిగుఱించి నమస్కరించెదను. భక్తజనులకాశ్రయమైనట్టియు శ్రేష్ఠమ్మైన వరము లొసఁగువాని గుఱించి నమస్కరించెదను సుఖము చేయునట్టి శివుని గుఱించి నమస్కరించెదను.

మోగులూరనేఁడు గ్రామమందు వెలపలనున్న యొక వనప్రదేశమం దొకపద్మసరోవరంబు ప్రక్క స్థలంబునఁ బద్మాసనాసీనుండై కనులుమొగిచి శివధ్యానంబు సేయుచున్న నొకమాహేశ్వరవర్యుని జూచి పెద్దయ్య యనేఁడు నొకఁడా సమీపంబందుఁ గాచికొనియుండి ఘటికొంతవడికి ధ్యానంబు దించి దిక్కులఁ జూచుచున్ననాయయ్యను గాంచి యించుక దవ్వులనుండియే సాష్టాంగపడి మ్రొక్కి నిలిచె. ఉరు

లింగమూర్తియనేఁడు నగ్గరుండు వానిజూచి ఎవ్వఁడ విందేటికి వచ్చితి వని యడిగె. ఆతఁడు మరల మ్రొక్కి స్వామీ! నేను వెలివాడలోని మనుష్యుఁడను. పెద్దయ్యయను పేరిటివాఁడ. ఈ దాసుని శిష్యునిగఁ జేసికొని కృతార్థుని జేయుఁడు. నాకుఁ దల్లియైనను దండ్రియైనను గురుఁడైనను దొరయైనను మీరలేయని త్రిశుద్ధిగ నమ్మితిని. కరుణారసంబు నాపైని జల్లుఁడు. తాము ధరించినట్లే నాకును శివదీక్షనొసఁగి లింగధారణంబు జేయుఁడనియె. అపుడు గురుఁడు వాని వినయంబునకును శివభక్తికిని మెచ్చియు నొక్కించుకఁ గొంకి హీనకులుఁడగు వీనికి శివదీక్షతో లింగధారణంబెట్లు చేసెదననికొని వానికిట్లనియె. ఓయీ! ఇంతకుమున్ను నీ వెట్టేఁడవో నీ గుణమెట్టిదియో ఎందుండువో నేనెఱుఁగకుంటి. పట్టుపట్టుమని యిపుడు నీకు లింగంబెట్టు గట్టుదునన్న నవ్వాఁడు మరలనిట్లనియె. గురూ! నేనీపురమం దేయుందు నాగుణంబులు దమకు నచ్చినపుడే నాకు శివలింగ మొసగుఁడు. గురుశుశ్రూష పెద్దకాలంబొనర్పకయే యట్టి భాగ్యంబెట్లు చేకురు? తామనుగ్రహించి తమశిష్యునిగ నంగీకరించి కొన్ని బుద్ధులుచెప్పి దీక్షనిచ్చుటకుఁగూడ నామనస్సు నెఱుంగుటకు నొక మితి నేర్పఱచిన నట్లు సల్పువాఁడననియె. గురుండు సంతసించి నేఁడు మొదలుకొని మధుమాంసంబులను బాసి భక్తితో భూతి రుద్రాక్షధారివై శివభక్తులు గన్పట్టిన మ్రొక్కుచు సేవించుచుండు మట్లు పదిరెండేండ్లు గడుపుమని బోధించిన నాతఁడానందించి యట్లంగీకరించి మ్రొక్కిపోయె. గురుండును దన సదనంబునకుఁ జనియె. పెద్దయ్య గురుబోధనొంది భక్తుఁడై చరియించుచు గురూక్త ప్రకారంబుగ భూతి రుద్రాక్షమాలికల ధరించి శివభక్తులగువారలకు దవ్వులనుండియే మ్రొక్కుచు వారలు పనిసెప్పినఁ జేయుచు నిత్యం బడవికేగి యొక మోపు వంటకట్టియల భక్తులగృహంబులలో బయటనుండియే వైచుచు దినముల గడుపుచుండె. ఇట్లైదేడులు గడచినమీఁద నొకనాఁడుదయమున పెద్దయ్య గురుని గృహంబునకరిగి యందంకణంబుముందఱ గురుని దలఁపుచు నిటునటు దిరుగుచుండె. అపుడు మంచమందుఁ బరుండియున్న గురుఁడు నిదుర మేల్కొని పెద్దయ్య యడుగుల సవ్వడివిని ఆవుదూడయో ఎద్దో యనుకొని వాశి వాశి వాశి యని ముమ్మారునుడివె.

అనుడి పెద్దయ్యాకు జెవినిబడినంత మహానందంబునొంది ధన్యుండనైతి నా గురుండనుగ్రహించె.

గీ॥ కంటి భాగ్యంబు భక్తిని ♦ గంటిఁగీర్తిఁ
గంటిఁ జ్ఞానంబుఁ గంటి మో ♦ క్షంబుఁగంటి
గంటిఁబెన్నిధి నింకనే ♦ కడమలేక
మంటి నిత్తఱి నీ గురు ♦ మహిమవలన॥

అనుచు నిట్లు సంతసించుచున్న సమయంబున గురుఁడీవలకు వచ్చిన పెద్దయ్యా చూచి సాగిలఁబడి గురూ! మంత్రింబొసంగి కరుణించితివి ధన్యుడనైతి ననిన గురుం డక్కజపడి నేను పశువనుకొని యదల్చుటకై వాశియని మూమ్మారనిన వీఁడది మంత్రంబని గ్రహించెను. తథాస్తు. వీనికది యట్లే యగుగాత యనుకొని కృతార్థుఁడవౌదు వికబొమ్మని యెను. అతఁడానందంబునఁ బొంగుచు మ్రొక్కి పోయి ఆ యక్షరద్వయము నతివేగమున ననేక సహస్రింబులు దినదినము జపించుచుఁ గొలఁది వత్సరములలో మంత్రసిద్ధినొంది తత్సిద్ధితోఁ భూమికి జానెడెత్తున నిలిచి తిరుగుచుండె నింతలో నాయూరి నేలురాజొక కోనేటిని నిర్మింపఁబూని నుప్పరులను బిలిపించి యొక సుముహూర్తంబం దారంభముచేసి త్రవ్వించుచుండె. కొన్నాళ్ళకు బావిని లోతుగఁద్రవ్విరి గాని యందుదకంబుపడక యొకచట్టు గన్పట్టె. అంతఁద్రివ్వువా ,రాచట్టును బలుదినంబులు పగుల్చుచుండిరిగాని యద్ది యెన్నాళ్ళకుఁగూడ యథాపూర్వకంబుగఁ గన్పట్టుచుండె. అపుడు వారందఱు విసిగి తేనికెఱింగించిరి. ఆతఁడును మంత్రులను బండితులనుగూర్చి ఆరాయి తెగువిధంబడిగిన నవ్వారలందఱారసి అవ్వీటను దత్పరిసరంబులందున్న జ్ఞానవృద్ధులను మహాత్ములగువారలను బిలిపించి యీ చట్టుపైని బదంబులుంపుమనుడు. మహాత్ములయడుగులు సోకిన పాషాణంబు భిన్నంబై యుదకంబులూగు ననిరి. అపుడు పుడమితేఁడా యూరనున్నమహాత్ములను శివభక్తులను విష్ణుభక్తులను యోగులను వేదాంతపరులను బిల్పించి యవ్విధంబెఱింగించి త్రివ్వుచుండెడు వాపీగర్తంబున కవ్వారిఁగొనిపోయి యందా పాషాణంబును ద్రొక్కించెను. ఎందఱు ద్రొక్కినను జట్టట్లేయుండెను. రాజు ఖిన్నుఁడై విచారించుచుండఁ దత్సేవకజనంబందలియొకఁడు

రాజును జేరి మ్రొక్కి యిట్లు విన్నవించెను. ప్రభూ! వెలివాడలోఁ బెద్దయ్యయను నొక్కరుఁడు హరజనుఁడుగలఁడు. అతఁడు గొప్పభక్తుఁడు సత్యవాది జ్ఞాని పుడమిపైని నడుగిడక జానెడు పైనుండి తిరుగుచుండు నట్టివాని దామరు బిల్పించి యాశిలను ద్రొక్కించిన నద్ది ద్రవ్యమై మంచి నీళులూరుననియె. నృపతి ఆతురుఁడై తత్క్షణం బవ్వాని రప్పించి సర్వంబెఱింగించి పాషాణంబుఁ ద్రొక్కుమనియె. అతఁ డంగీకరించి తన యంఘ్రిని మోపినంతనే చట్టు వందలకొలఁదిగ వేలకొలఁదిగఁ దునుక లయ్యె. రయంబున మధురోదకంబు లూరఁగఁ గోనేరంత నుదకంబుల నిండుకొనె. రాజెంతయేని సంతసించి నీ వీశ్వరుండవుగాని మనుష్య మాత్రుండవుగావు. మహాత్ములగువారల కశక్యంబైన నీపాషాణంబు ద్రవ్యలుచేసి మధురోదకంబులఁ బుట్టించితివి. నీకు సరియెవ్వరని ప్రశం సింపుచున్నసమయంబున నూరిలోనివారందఱు వచ్చి మధురోదకపూరి తంబగు కోనేటినిఁ జూచి మెచ్చి యాశ్చర్యచకితులై భక్తుఁడగు పెద్ద య్యను గొనియాడుచుండిరి. అపుడు గురుండగు నురులింగమూర్తి వచ్చి సర్వంబెఱింగి యానందించి తనకుమ్రొక్కి నిలిచిన శిష్యుని గౌఁగిటఁ జేర్చికొని తనగృహంబునకుఁగొనిపోయి తత్క్షణంబందు పాశుపత దీక్షతో శివలింగధారణంబుచేసి భక్తవర్యా! గురుఁడును శిష్యుఁడును నొకరే. కావున నేనును నీవును నొక్కరమే. శిష్యుఁడవగు నీచేత నేను ధన్యుఁడనైతిని. మఱియు నీనామధేయంబందు నాపేరుగూడఁ జేర్చికొని యురులింగపెద్దయ్యయనెడు పేరుతోఁ బిలువఁబడుచుండుము. అపుడు నేను విఖ్యాతుఁడనౌదు ననియె. భక్తుఁడుప్పొంగి సర్వము దమ ప్రసా దంబని యంగీకరించె. చిరకాలము గురుశిష్యు లిర్వురు భక్తితో శివపూజ సేయుచు శివానుగ్రహం బొంది రిది పరమభక్తుఁడగు నురులింగపెద్దయ్య గారి చరిత్రంబు శ్రేయస్సాధకం బిఁక నిజలింగ చిక్కయ్యగారి చరితము జెప్పెద వినుడు.

## 51. నిజలింగ చిక్కయ్య

శ్లో॥ అద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీత్
విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్

సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తేర్భాజనం రాజమౌళే.

శివానందలహరి.

తా॥ చంద్రశేఖరా! నీ యనుగ్రహమున నిపుడు హృదయమందలి యజ్ఞానమంతయు వెడలిపోయినది. ఉత్తమమైన జ్ఞానము హృదయమునఁ జేరినది. శ్రీకరంబగు నీపాదపద్మము నెల్లప్పుడు సేవించుచున్నాను. మోక్షమునకుఁ బాత్రమైన వానిఁగ భావించెదను.

మహాపవిత్రంబగు గోదావరీతీరమండలం బందొకయూరునందుఁ జెక్కయ్య యనునాతఁడొకఁ డుండెను. అతఁడు యువకుఁడు బుద్ధిశాలి శ్రీమంతుడు దృఢకాయుఁడు సుందరమూర్తి. శైశవమందు తలిదండ్రులు కలిసినను నెట్టి విద్యయు నేర్వకుండెను. ప్రాయమువచ్చినదిమొదలు జీవితంబునకై యొరుల కడదాస్యముచేసి జీవించుచుండెను. అట్లు గొన్నాళ్లకా వృత్తియం దిష్టములేక చౌర్యమం దభిలాష యొనర నద్దానికిఁ దగినవేసము దగినపరికరములు సమకూర్చికొని యుపాయంబుల నేర్చికొని చీకటిరాత్రులందు సంపన్నగృహస్థులయిండ్లయందు మృచ్ఛిలితస్కరంబుచే జీవయాత్ర సేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగినంత నొకచీకటి రేయి ద్వితీయయామమధ్యంబున నొక విశాలగృహంబునకుఁ గన్నంబువేసి లోనఁ బ్రవేశించి నలుగడలఁ బరికించెను. అపుడా మొగసాలనుండి యొకత్రోవ గన్పట్టఁగ నాత్రోవఁ జొచ్చి యతండు లోనికిఁ బోవుచుండెను. అట్లుపోవుచున్న నాతనికి దివ్వెలవెలుగు పొడసూపి గంటలయొక్కయు శంఖంబుల యొక్కయు ధ్వనులు వినంబడియె. అతండును జంకక యిదియేమి విశేషమో కన్గొందమని లోపలికిఁ బోయెను. అపుడందుఁ జాలనిడివియు వైశాల్యంబుగల మందిరంబందు పెక్కండ్రారాధ్యబ్రాహ్మణులు శుద్ధులై మడుగులు గట్టికొని విభూతి రుద్రాక్షములధరించి రంగవల్లులందుఁ బూజాద్రవ్యంబులఁ గలశోదకంబుల జంట దివ్వెలఁ దీర్చి హస్తపీఠంబులందు శివలింగమూర్తులధరించి యామ్నాయసూక్తులఁ బఠింపుచు లింగార్చనంబులఁ జేయుచుండిరి. ఆ యర్చనల నాలస్యముగ నతఁడు తెప్పవేయక చూచి హర్షించి పరవశుండై యొకమూల నొదిగి కిమ్మనక కూర్చుండెను. అట్లు గొంతసేపమ్మాహేశ్వరులు లింగ

ముల కభిషేకంబును విభూతి గంధాక్షత పుష్ప బిల్వసమర్పణం బొనరించి దశాంగధూపంబుల ఘృత ర్తిజ్వాలాహారతుల నొసంగి నైవేద్యంబునకు గాను వంటవారికి వడ్డించుటకు సెలవొసంగిరి. అపుడు చిక్కయ్య శివ పూజలను జూచి పరమానంద భరితుండై ఆహా ! ధన్యుండనైతిని. నేఁడిమ్మహాత్ముల శివపూజాసందర్శనంబునఁ గృతకృత్యుండనైతిని. వీ రిపుడాత్మ లింగంబుల కన్నాదులను నివేదించి భుజించెదరు. నేనిపుడిం దించుక దొలఁగి వారిభోజన పాత్రంబులను జూడక దృష్టిదోషంబు లేకుండఁ జేసెదను. అదీక్షితుండనగు నేను వీరల యన్నాదిపదార్థంబు లను జూచుట దోసంబని తలఁచి యామందిరంబున కించుక దవ్వుల కరిగి యందు గూర్చుండెను. పాత్రంబులందు భోజ్యపదార్థంబు లన్నియు వడ్డించినంత నాయారాధ్యులు శివలింగంబులకు నివేదించి షడక్షర మహా మంత్ర స్మరణంబొనర్చి భుజించిరి. ధౌతహస్తులై యాచమించి యొక చోఁ గూరుచుండి వీడ్యంబుల వేసికొనుచుండిరి. అపుడు చిక్కయ్య మదిలో నిమ్మహాత్ములచే నేను లింగదీక్షఁ జెందనిచో నాకన్న కాపురు షుఁ డుండఁడు. ఇపుడే వీరల పదంబులఁ బడి లింగనిష్ఠునిమ్మని ప్రార్థిం చెద ననికొని నమ్రుఁడై దోసిలియొగ్గి మహాత్ములారా! రక్షింపుడు! రక్షింపుఁడని వారిదరిసి యవ్వారి యెట్టయెదుట సాగిలఁబడియెను. వా రందఱక్కజంబొంది చూచి ఓరీ! నీవెవ్వఁడవు? ఇందేటికివచ్చితివి? మమ్మి పుడేమిసేయుమనికోరెద వనియడుగ నవ్వాఁడు పుడమినుండి లేచి కూర్చుండి యంజలిఁబట్టి మహానుభావులారా ! మాన్యులారా ! గురు లారా! ఏమనిచెప్పుదును. తమ సన్నిధిని సత్యమే చెప్పెదము. నేనొక హీనకులుండను. కులముననేకాదు సర్వవిధంబులఁ గూడ హీనుండను. బాల్యమందే తల్లిదండ్రులఁ గోల్పోయి కొన్నాళ్ళు చుట్టములచేఁ బోషిం పఁబడి యటుపై దాస్యవృత్తిబూని మఱికొన్నినాళ్ళు గడిపితిని. పిమ్మట నద్దానిమాని తస్కరవృత్తిఁ బ్రవేశించి తత్పరికరంబుల సమకూర్చికొని వెరవుల నేర్చి యావృత్తితో జీవించుచుంటి. నేఁడుగూడ చౌర్యంబునకే పూని యిందుఁజేరి పుణ్యవశంబున దివ్యపురుషులగు తమ దర్శనంబును దమశివలింగార్చనా మహోత్సవ ప్రకారంబును జూచితిని. అజ్ఞానం బడుగంటెనది. భక్తిజ్ఞానంబులు పొడసూపినవి. గురులారా! ఈ పాపిష్ఠుని

ఈ నికృష్టుని ఈహీనుని ఈదీనుని ఈదురాచారుని ఈ చోరుని మన్నించి కనికరించి కరుణించి యనుగ్రహించి తమ సేవకునిగ శిష్యునిగఁ జేసికొని నాకిపుడు శివలింగదీక్ష నొసంగి రక్షింపుడు. అట్లొసఁగుటకు సమ్మతింపలేని వీని నిపుడె శిక్షించి సమయింపుడు. తాము లింగదీక్షను దయసేయకున్న నే నీ తుచ్ఛదేహంబును నిలుపను. కరవాలంబుతోఁ గంఠంబు ద్రుంచికొని ప్రాణంబులఁ బాసెదను. దేవరలు శివలింగ దీక్షను గృపతో నొసంగిన యెడల యీ‌క్షుద్రవృత్తిని ద్యజించెదను. ఈవృత్తితోఁ బాటు మధుమాంసాహారంబుల పైశున్యవాక్పారుష్యమిథ్యావచనంబుల నవియివియన నేల? సర్వ దురిత కృత్యంబుల దవ్వుల గెంటివేసెదను. మీ దు పాదరజస్నాతుండనై పూతుండనై యావజ్జీవము తమరిచ్చు శివలింగంబును బూజించుకొనెదను. ఇఁక సర్వమునకు యుష్మచ్చరణంబులే శరణంబులు కల్యాణకారణంబులు. అని మరలదూరంబుగ సాగిలిబడి యుండె. అపుడా యాచార్యు లక్కజం బొంది యందఱాలోచించికొని వానికిపొడమిన భక్తి నిశ్చలమని యారసి వానిలెమ్మని కూర్చుండిన పిమ్మట వాని కిట్లనిరి. ఓయీ! నీవు సేవావృత్తిని బాసి చౌర్యంబును జెంది జీవనంబు చేయుచుంటివి. ఇపుడద్దాని మానెదనంటివి. ముందఱ నీమనుగడ యెట్లు? ఏమిచేయఁబూనితివి చెప్పుమనిరి. అపుడతఁడు గురులారా! తమను శివలింగముగ భావించి శివసన్నిధానంబున సత్యంబు జెప్పుచున్నాఁడను. బుద్ధిహీనతచే నీతస్కరవృత్తిఁ బ్రవేశించితిని. ఇపుడు విడిచితిని. ఇఁక ముందు దమయనుగ్రహంబున శరణులగువారియొద్ద సేవావృత్తినే చెంది వారొసఁగు భృతకంబున బ్రతిదినం బేకవారాశనంబు నెచెంది జీవయాత్రను జేసెదను. శివలింగార్చనంబును బ్రత్యహంబు తమసెలవుప్రకారం బొనర్చికొనెదననియె. అపుడు వారందఱాలోచించి రేపుప్రభాతంబందు స్నాతుఁడవై యటకు రమ్మనిరి. శివలింగధారణంబొనర్చెద మనిరి. అంత నవ్వాఁడు మురిసి గురులకు మరలమ్రొక్కి సెలవొంది స్వాగారంబున కేగి నిద్రించె. అరుణోదయవేళయందే ప్రబుద్ధుండై కాల్యకృత్యంబుల దీర్చికొని గోదావరికిఁబోయి స్నాతుండై మడివస్త్రంబులఁగట్టి విభూతి రుద్రా

షంబుల ధరించి మహేశ్వర గణార్చనామందిరంబుఁజేరి దేశికులకు సాష్టాంపపడి నిలిచె. అమ్మహేశ్వరులు వానికిఁగలిగిన భక్త్యున్నతికి సంతసించి శుభముహూర్తం బారసి తత్క్షణంబందే వేదికనిర్మించి విధి ప్రకారము వాని భస్మస్నాతునిజేసి షడధ్వపరిశోధనంబొనరించి యిరువదియొక్క దీక్షలతోఁ ద్రిదీక్షలతో రుద్రాక్షపంచాక్షరీ శివలింగ ధారణంబుల నొనరించి భక్తుని బొనరించి శివధర్మంబులను శివపూజాప్రకారంబులను శైవాచారంబుల నన్నిటిఁ దెలిపి బోధించి శ్రీమత్తీర్థ ప్రసాదంబుల నొసంగి యనుగ్రహించిరి. అపుడు చిక్కయ్య ప్రబలనీహారాచ్ఛాదనంబుఁ దొలంగిన భాస్కరునిబోలి యజ్ఞాన భవపటలంబుఁబాసి తేజస్వియయ్యె. గురు లాతని వృత్తిశూన్యతను నెఱింగి మరలఁ గింకరవృత్తి వలదని శైవమత నిధినుండి కొన్నిమాడ లరువిచ్చి వానిచేఁ గొన్ని ముత్యంబులను బగడంబులనుగొని యొక కట్లసంచినింప యిందలి ముత్యంబులను బగడంబులను విక్రయించికొని తదాదాయంబున జీవింపుమనియు మూలద్రవ్యంబుఁ జెరుపక మరల శైవనిధికొసంగుచుండుమని యిచ్చి బుద్ధులు గఱపిపంపిరి. చిక్కయ్య సంతుష్టుండై గురులకుఁ బునఃపునర్వందనంబులొసఁగి సెలవుగొని వారానతిచ్చినట్లు ప్రత్యహంబుషఃకాలంబున సుప్తోత్థితుండై తీర్థమాడి శుచియై శివలింగంబు బూజించి ప్రసాదంబుఁ గొని యా మీఁద కట్ల సంచిని గొని అంగడివాడను జేరి యందునందు సరకులమ్ముకొని తదార్జిత ధనంబున శివగురు చరపూజల నొనర్చుకొనుచు సంతుష్టుండై యుండెఁ. ఇట్లొక కొంతకాలంబైనంత నతండొక నాఁడు నాల్గవయామంబునఁ గట్లసంచితో నొక వీధియందు ముత్యాలు పగడాలని పలుకుచుఁ బోవుచుండెను. ఆ ధ్వనివిని యువకుఁడును సుందరుండును దృఢదేహుడునగు చిక్కయ్య నొకచక్కని యువతిచూచి చిక్కయ్య లేతప్రాయంబునకును అందంపు తీరునకును దృఢమూర్తికిని మెచ్చి యానందించి యవ్వానితో సుఖింప నెంచి చెయిసాచి యాతని బిలిచెను. అతఁడు ముత్యాలను గొనుటకై పిలిచెనని చేరవచ్చెను. అపుడామె గుమ్మమునుండి లోగిటికి గొనిపోయిన నందొక యరుగుమీద నాతండు గూర్చుండి యామెతో ఏమికావలయును ? ముత్యములా ? పగడములా? చెప్పుమనియెను. ఆమె మందహాసముచేయుచు నీవియన్నియునాకుఁ గావలయును. తొందరపడెదవేల ? కూర్చుండుము. ఎందెందుఁ

దిరిగి శ్రమనొందితివో! నెమ్మొగంబునఁ జెమ్మట లూరుచున్నవి. ఇందు
జేరి దీర్చుకొనుము. మగఁడు పొరుగూరికిఁ బోయెను. ఱేపటికి
వచ్చును. నేఁడేమిపని లేకయున్నదానను. ఈ తాళవృంతంబున బడలిక
దీఱునట్లు వీవనచేయుదునా? చక్కెరపోళీయలున్నవి. తెచ్చియిత్తు
నారగింపుమనియె. చిక్కయ్య యాపెనుడులకు విస్మయంబొంది యన్యథా
తలఁపక నేను ముత్యాలవర్తకుఁడను. ముత్యంబులను బగడంబు లమ్మె
దను. మీరు పిలిచినపుడు వాని గొనెదరేమోయని మీ యిమ్మున
నరుదెంచితిని. తలవాకిటనుంచి లోగటికి రమ్మనుట నట్లువచ్చి కూర్చుం
టిని. మీకేవేని సరకులుగావలసిన యెడల సరసంబుగ నిచ్చెదను
గొనుఁడు. కానిచో సెలవనియె. అపుడామె చిక్కయ్యనుజూచి నగి చలువ
పయ్యెద జార్చి చక్కచేసికొని ఓయీ! ఎఱుఁగనట్లు మాట్లాడెదవేల?
నీ సరకు బుచ్చుకొనుటకే నిన్ను బిలిచితిని. నిన్నూరక పోనిచ్చెదనా?
వేగిరపడకు. భోజనగృహంబునకురమ్ము. అందెవరును లేరు. నీకు భక్ష్యం
బులనిచ్చి నేనుగూడ నారగించెదను. ఆ పిమ్మట నీసరకుల నేను బుచ్చి
కొనెదను. నాయొడలందలి నగలను జూడుము. నీకు రూకలకేమికొదవ
లేదు. రమ్ము. అనుచు చేతులు సాచెను. అపుడు చిక్కయ్య యర్థము
చేసికొని నిర్వికారుండై ధీరుండై యాపె మాటలకుఁ జలింపక కట్లసంచి
మరల గట్టుచుండెను. అపుడాయువతి ముత్యాలవర్తకుని చందంబుఁ
జూచి యతఁడు తన మాటల రూపెఱుంగకయుండె ననియో, కాక
యిష్టములేక యుండెననియో యెఱింగి యిఁకను గాలక్షేపమేల? యను
కొని ఓయీ! నా పలుకుల తీరెఱుంగ లేకుంటివి. సిరిరా మోకాలొడ్డెద
వేమి? స్పష్టముగ వినుము. తీయని భక్ష్యంబులను గడుపారఁదిని విరుల
రాల్చుచున్న నీజాదిపందిరియందు నాతోఁగ్రీడించి నన్నతనుసౌఖ్యంబు
లఁడనుపుము. రూకలకేమి? నీయడిగినట్లిచ్చెద. తడవోర్వఁజాల. రమ్ము
కౌగిలిమ్మనియె. చిక్కయ్యయదరి భక్తునకుఁ బరస్త్రీగమనం బయుక్త
మనికొని అట్లువలదు. నేనందులకొడంబడను. గురుభక్తుఁడను. నింద్య
కర్మంబులన్నియుఁ బాసితినని గురులకడ బాసచేసితి. నీకామోద్రేకంబు
నీమగనితోఁ దీర్చికొను మాతఁడు ఱేపటికు వచ్చునంటివిగద. నేఁడెట్లో
యోర్చుకొని చిత్తమును గాపాడుకొనుము. నేఁబోయెదనని రివ్వన

లేచి నిలిచినంత నాయువతి మట్టుమీఱిన తమకంబున హా! యెక్కడికో యెదవు ? నిన్ను నే బోనిత్తునే ? యని గుమ్మముద్వారము బంధించి నిలిచి యున్న చిక్కయ్యను జక్కబట్టి నిక్క చనుగుబ్బల నురంబందు గ్రుచ్చి యొత్తి బిగ్గఱ కౌగిలించికొని ముద్దిడి పైఁబడియె. అంతనతండు లోంగక ధీరుండై యాపె మోటుతనంబు చెయ్వినకుగోసి బలముతో విదిల్చికొని బుజంబులఁబట్టి వెనుకకుఁద్రోసి ద్వారబంధం బెడలింపుచుండె. అప్పొలఁతియుఁ బుడమిపైఁ బడిలేచి కురులను బయ్యెదను జక్కఁజేసికొని మరల నాతని కడ్డము పోవుచుండె. చిక్కయ్య యదిగని కినుకొంది అడ్డమువచ్చి నిల్చితివేని చీల్చెదనని కనులెఱ్ఱచేసి పోవుచుండె. అపుడక్కామిని చేయునదిలేక నిన్నే చీల్పించెదను పొమ్మని తనవాఁడి గోళ్ళతోఁ జన్నులను గుత్తుకను రెట్టలను నెత్తురొల్కునట్లు రక్కుకొని యిరుగుపొరుగువారిని బిలిచి ముత్యాలవర్తకుని ముత్యములు గొనుటకై పిలిచిన నవ్వాఁడొంటరిగ నున్న నన్నుఁ జూచి కామించి పైఁబడియె. నేనంగీకరింపకుండుట నిట్లు దేహంబంత రక్కిగాసిచేసి పోవుచుండె. పాపము చూచితిరే ? ఎట్లు వీని శిక్షించెదరో యనియుఁ జని యేడ్చుచుండె. అపుడందఱు గుమిగూడి యింత పాపమా ? ఇంత ద్రోహమా ? యని నలుగడల నవ్వాని వెదకిరి. అవ్వాఁడొక వీథిఁ బోవుచుండ కట్ల సంచిగురుతు నరసి వానిఁ బట్టుకొని రక్షకపురుషాలయంబుఁ జేర్చి యందు రక్షకాధికారి కాయుదంతంబంతయు వినిపి వాని నేరంబును జెప్పిరి. అధికారియైన నతండు వానిఁదోడ్కొని యాయువతి యుండు గృహంబునకు దోడ్కొని వచ్చి యామె చెప్పిన విశేషోక్తు లన్నియు వ్రాసికొని నిశ్చయమేనా ? యని చిక్కయ్య నడిగె. ఆతఁడా వైపరీత్యమున కాశ్చర్యముతో మందహాసము చేసి జాలమిది యనికొని మఱుమాట సెప్పక శివస్మరణంబు చేసె. ఆ కుటిలాలక రేఁగుచు "దొంగబకితి. దొంగ. నాపైఁ బడి రట్టుచేసినాడు. సరదాపని కారికుండ గూడదు. తగిన శిక్షనీయకున్న వీడిట్లే యెందఱినో హింస పెట్టఁగలఁడు. నన్నొంటరిగఁ జూచి యీతుంటరి యిట్లు కొంటెపనికి గడంగినాఁడు" అని చెప్పెను. రక్షకాగ్రణి యపుడత్యంతము కృద్ధుఁడై కేఁకమాటలు నుడువకుండుటయే యంగీకరించిన విధము. వీని నుఱక పోవిడుదునా ? యని

అచ్చటవారల సాక్ష్యమొంది కట్లసంచితో వానిని అపరాధ గృహంబు నకుఁ గొనిపోయి యందుంచి మఱునాఁడే శిక్షా ధర్మాధికారి కడఁజేర్చి వానినేరంబును సాక్ష్యంబులతో బుజువు చేయించె. చిక్కయ్య ఆపాప విధంబునకు రోసి శిక్షాధికారి ముందఱగూడఁ గిమ్మనకయుండె. అపుడు శిక్షాధికారిగూడఁ గుపితుండై నేరంబారసి యవ్వానికి శిరచ్ఛేదనంబు విధించి తలవరుల కట్లుసేయుఁడని యప్పగించె. వారలును జిక్కయ్యను వధ్యస్థానంబునకుఁ గొనిపోయి యట్లొనర్చిరి. ఆక్షణమే శిరంబును గబంధంబును నాకసంబున కెగిరె. అంత శిరంబు "సాంబశివదేవా! భవానీధవా! ఓ సాంబశివదేవా!"యనుచు భజనసేయుచు మాహేశ్వర గణార్చనా మందిరంబు వఱకుఁ బ్రదక్షిణత్రియం బొనరించి జోత చేయు చుండ నందలి యారాధ్యులు పరికించి యవ్విధంబెల్లఁ దెలియుచుండ నవ్వాని మనఃపారిశుద్ధ్యంబునకు శివభక్తిపారమ్యంబునకు మెచ్చి పరమ శివునానతితో శివదూతలు చేరవచ్చి వానికి దివ్యశరీరంబిచ్చి శివలోకంబు జేర్చిరి. ద్రష్టలెల్లరు రాజపురుషులును రక్షకభటులును సర్వజనంబులది చూచి విస్మయంబొంది సత్యంబెఱింగి ఆయువతి చిక్కయ్యను గామించి యట్లు హింసాకాండంబు సల్పిన పాపమతియని గుఱుతించి యామెను ద్ర శీలను హంతకను గొరతవేసిరి. చిక్కయ్య ఆదియందుఁ జోరుండైనను మహేశ్వరుల శివపూజాసందర్శన మాత్రంబునఁ బాపవృత్తి నంతయుఁ బాసి పునీతుండై శివలింగధారణంబొంది పెక్కేండ్లు శివలింగంబును నియత భక్తిచేఁ బూజించి తన్నుగామించి బలాత్కరించిన సుందరయువ తిని ధీరుండై త్రోసి వైచి నిధనంబునకుఁగూడ వెరవక పరమశివునిజేరి కొనియె. మొదట నెట్టివాడైనను పశ్చాత్తాపంబొంది క్షుద్రవృత్తిని బాసి భక్తుడై శివుని బూజించిన నవ్వాఁడు కృతార్థుడగును. ఇది నిజ లింగచిక్కయ్య చరిత్రము పరమపవిత్రమిఁక శ్రీమలహణకవిగారి చరి త్రంబు వినిచెద నాలకింపుడు.

# 52. భక్తమలహాణకవి

శ్లో॥ మధుస్ఫీతావాచః పరమమమృతం నిర్మితవతః
తవబ్రహ్మన్ కింవాగపి సురగురో ర్విస్మయపదం
మమత్వేతాం వాణీం గుణగణనపుణ్యేన భవతః
పునామీత్యర్థేస్మిౝ పురమథన! బుద్ధిర్వ్యవసితా.

మహిమ్న స్తవము.

తా॥ ఓ మహేశ్వరా! తేనెలతో నిండినట్టి వాక్కునుండి మిక్కిలి యమృతమును (వేదమును) నిర్మించినట్టి నీకు బృహస్పతియొక్క వాక్కైని ఆశ్చర్యకరమగునా! ఓ త్రిపురమథనా! నీదు గుణగణనపుణ్యము చేత నా యీవాణిని పవిత్రము చేయుదు ననెడు ప్రయోజనమందు నాదుబుద్ధి నిశ్చితమైనది.

ఆర్యావర్త దేశంబందొక నగరంబున సంపన్నబ్రాహ్మణదంపతుల కరుదుగా నొక పుత్రుండు జన్మించె. బాలునకు మల్హణుఁడను పేరిడి గారాబముగఁ బెంచుచుండిరి. గర్భాష్టకమందే బాలున కుపనయనంబొనర్చి గురునొద్ద వేదశాస్త్రాధ్యయనంబునకై యప్పగించిరి. చిఱుతఁడు బుద్ధివైభవంబున నతిత్వరితంబుగ వేదశాస్త్రంబుల సాహిత్యగ్రంథంబులఁ జదివి యందుఁ బాండిత్యగడించుచుండె. ఇట్లు బాలునకుఁ బదిరెండేండ్ల ప్రాయము వచ్చువఱకు విధివశంబున దల్లిదండ్రులిద్దఱు కాలధర్మంబునొందిరి. ఆ పిమ్మట మాతామహులును జ్ఞాతులు మున్నగువారు బాలకునకుఁ బోషకులును బోధకులునై యుండిరి. నాలుగైదేడులెట్లో యాత్మజనంబునకు విధేయుఁడై యుండి కాణాదంబును బాణినీయమును నలఙ్కారశాస్త్రంబును జదివి వానియందు గుశలుండయ్యె. అప్పటి కాతనికి బదునెనిమిదియేండ్లు గడచి పందొమ్మిదవయేడు ప్రారంభమై నడుచుచుండె. అపుడు విద్యాలయం దుత్తీర్ణుఁడగుటయేకాక సుందర దృఢదేహంబునను స్తిమితగంభీరదృష్టిప్రసారంబునను మధురవాక్చాతురీప్రౌఢియందునను జూపరుల కానందంబు చేయుచుండె. అపుడు

సతీర్థ్యులేకాక సమానవయస్కులగు మిత్రులు పలువురాతని బరివేష్టించి తిరుగుచుండిరి. బాల్యంబునుబాసి యౌవనాంకురదశ నొందుట మల్హాణుఁడు మాతామహాదులకు విధేయుఁడైనను స్వాతంత్ర్యము నొందియే యుండెను. అట్టితఱి నొకపండువునందు నగరేశ్వరుండగు శివుని యాలయంబునకుఁ బ్రదోషవేళ మల్హాణుఁడు గతిపయమిత్రులతోఁ గలసి పోయి యందుఁ బరమేశ్వరుని బరదేవతను నందిని గణపతి మున్నగు పరివారదేవతలను దరిసించి మ్రొక్కి ప్రస్తుతించి ముఖమంటపమందుఁ జెలికాండ్రతో గూర్చుండి యుండెను. ఆసమయమం దా యూరనున్నట్టి యొక ప్రముఖ వారస్త్రీకుమారి పదియాఱేండ్ల యందంపుబాల ప్రాయంపు చెలులతో దాసీలతో మన్మథబాణంబనునట్లు శివప్రాసాదంబునకు వచ్చి శివునిసేవించి ముఖమంటపమం దొకచోఁ గూర్చుండి దాసిపడుచు గొని వచ్చిన వీణను బుచ్చికొని శ్రుతిచేసి మోహనరాగంబు నాలాపించి జంత్రగాత్రంబుల నేకంబు చేసి రాల్గరగునట్లు గీతికను బాడుచుండె. అచ్చటి కనతిదూరంబునఁ గూర్చుండియున్న మలహాణుండును దత్సహచరులును వల్లకి దోడుగ అమృతంబు గుఱియునట్లు మోహనగీతికను బాడుచున్న గణికాకుమారి నవలోకించి విస్తుపోయి తదేకచిత్తులై గానంబునాలకించుచుండిరి. అట్లొకకొంతతడవు గానముచేసి యావారసుందరీరత్నము గానమునాగివీణకుగొసెనవేసి దాసికిచ్చి నెచ్చెలులతోఁగూడి నగుచు మంటపమందొకించుక సమీపంబందే మిత్రులతో గూర్చుండి యున్న మలహాణునిజూచి సుందరుండును నవయౌవనుండును ధీరుఁడు నగుట కంతరంగంబున మెచ్చి.మురిసి యోరచూపుల తన్మూర్తిని జూచుచుఁ గదలిపోయెను. అపుడు మల్హాణుఁడు మన్మథబాణతాడితుఁడై ధైర్యంబుఁబాసి పలుఁతీరుల గణికామణి చక్కదనంబు నొయారంబుఁ బాటమాధురి దలపోయుచు నచ్చెలువ నడచిపోయిన తెరువుఁ జూచుచుఁ గామవికారంబు నొంది మఱికొంతతడవున కెట్లో మిత్రులతోఁ గలసి యచ్చటినుండి వెడలి తానొక్కరుండు తనగేహంబును జేరెను గాని యాతని మానసంబుమాత్రము వారకన్యాను సరణంబై యే యుండె. అంత నతఁడు మన్మథవేదనాదోదూయమానుండై యారేయి నన్నంబుఁగూడ నిష్టంబుగఁ దినక మంచమందుఁ బరుండి గణికా బాలికా

సౌందర్యంబున కువ్విళులూరుచు నద్దానిగలియుట కుపాయంబు వెదకుచు నెట్లో నారాత్రి గడపె. మఱునాఁడు సహపాఠీలు చెలికాండ్రు వచ్చి యెందునను నౌదాసీన్యంబుగనున్న మల్హణుని బరికించి యిట్లుండుటకు వారసుందరీసందర్శనంబును దద్రిచితగానకౌశల్యంబే కారణంబని నిశ్చయించిరి. కొందఱడిగిరి కాని చెప్పఁడయ్యె. అంత వారలు చింతతో వెడలిపోయిరి. ఇట్లు దినత్రయంబు మల్హణుండు హృదయంబున నాటుకొనిన మదనవేదనను నిరాకరింపలేక కుందుచు నెట్లేని దద్గణికాసంగమంబందు దృఢసంకల్పుఁడయ్యె. అట్టితఱి మాతామహమాతులులు మల్హణునకుఁ బెండ్లిచేయుటకై కులకన్య నన్వేషింపుచుండిరి. అద్దానినారసి మల్హణుఁ డిపుడు నేను పెండ్లియాడనని స్పష్టంబుగ వారల కెఱింగించెను. నిరతము వేశ్యాకుమారీ సమావేశంబునకై యూహించుచుండె. అట్టితఱి నా బాల్యసఖుండగు నొకమిత్రుండు దారసించి రహస్యంబుగ నాతని మనోగతంబుఁ దెల్పుమని యడిగె. గత్యంతరంబులేక సాహాయ్యంబునకై వానికిఁ దనయవస్థను దెలిపెను. అంత నతండు వారస్త్రీసంగమంబునకింతచింత యేలయని యవ్వాని నవ్వేశ్యామందిరంబునకుఁ గొనిపోయె. అందుఁ బ్రౌఢవేశ్య వారినెదుర్కొని యింటిలోపలికిఁ గొనిపోయి యుచిత పీఠంబులఁ గూర్చుండఁజేసి చందనపుష్పతాంబూలంబులొసఁగి కూతును బిలిచి వారలకు మ్రొక్కించెను. అపుడు సమీపంబుఁ జేరిన నక్కలికిని జూచి మల్హణుండు మఱియు విభ్రాంతుండై ఇదియే ప్రాణధనంబని తలఁచెను. ప్రౌఢగణికయు వారలకుఁ గూతుర్ జూపి ఇది పదియాఱేఁడుల బాల. సంగీతసాహిత్యములందు విదుషి. పుష్పగంధియనిపేరు. అనాఘ్రాత పుష్పము. దీనికిఁ దగిన ప్రియుని గూర్చుటకై యోజించుచుంటి. నేఁడు దానిపాలి కీశ్వర ప్రాప్తియట్లు తమ దరిసెనము చేకూరెననియె. అపుడు బిల్హణుఁ డాడఁబోయిన తీర్థం బెదురు వచ్చినట్లుగఁదలఁచి చెందిన యానందంబునకు మేరలేదు. అనంతరము తత్సఖుఁ డిక జాగేలయని మల్హణునిజూపించి ఈతఁడు సంపన్నగృహస్థుఁడు విద్వాంసుఁడు నవయావనుఁ డిప్పటివఱకుఁ బెండ్లాడనివాఁడు. నీకూతును వలచి చేకొనవచ్చినాఁ డని దెలిపెను. అంత నాప్రౌఢవేశ్య పెక్కురు రాజపురుషులు తరుణధనికులు పెక్కురు వచ్చి దీనియందంబు చందంబులకు మెచ్చి వలసినధనంబు

లిచ్చెదమని యక్షించినను నిద్దియవ్వారిని మెచ్చలేదనియు నేడు మల్హాణుని జూచినయంతనే సంతసించి మురిపంపు సిగ్గును ఆనందంబును జూపె నని యుః జెప్పి దీనిని పాణిపిరియనుగఁ జేకొను మిపుడే నీకిచ్చుచున్నా నని కూతుచేతిని మల్హాణుని కరతలంబందుంచి తత్సన్నిధిని గూర్చుండఁ బెట్టె. మల్హాణుఁడు ధన్యోస్మి యనుకొని యానంద పరవశుండయ్యె నంతఁ దత్క్షణము మరల వచ్చెదనని పోయె. మల్హాణుఁ డద్దానికై తెచ్చిన సువర్ణ ముదిరికల మూటయొకటి పుష్పగంధికిచ్చెను. తన్మాత యామూటను గనులకద్దికొని పుచ్చికొని తత్క్షణంబందు శయ్యాగృహం బలంకరించి పెక్కుతీరుల మిఠాయిలను మధురఫలంబులను ఆవుపాలను సుగంధంబులగింజ్లను పుష్పహారంబులను వీడ్యముల నందు సంతరించి కూతునుసింగారించి యల్లునితోఁ బడుకగదికిఁ బంపెను. అందు వారిరువు రన్యోన్యానురాగంబులఁ గలసిమెలసి కామేష్టభోగంబులనొంది తనిసియుఁ దనియరైరి. చతుర్థయామంబు గడచుచున్న మల్హాణుండెటెంగి వేకువ యందే పడుకనుండి తొలఁగి విడువలేక యెట్టకేలకుఁ బుష్పగంధిని గౌగిట నుండి విడిచి యాత్మగేహంబుఁ జేరె. ఇట్లు మల్హాణుండు మన్మథైక నిష్ఠుఁడై పుష్పగంధియే ప్రాణంబు ధనంబు దైవం బనుకొని దానితో భోగమే ఇంద్రభోగంబని యనురక్తితో రాత్రింబవలు పుష్పగంధితోఁ గామసుఖంబులొందుచు నితరంబుఁ దలఁపకయుండె.

శ్లో॥ చేతోభువశ్చాపలతా ప్రసంగే
 కావాకథా మానుషలోక భాజాం.

తా॥ అసాధారణమైన మన్మథచాపల్యంబందు మనుష్యులమాట లెక్క యేమి ?

ఇంక మేనమామలు మున్నుగువార లిట్లువలదు చక్కని కుల కన్యను దెచ్చి పెండ్లి చేసెదమనిన మల్హాణుం డంగీకరింపక వలదు నేను పెండ్లాడననియె. వారలు చేయునదిలేక "భ్రష్టస్య కావాగతిః" యని యూరకుండిరి. అనంతరమొక పదిరెండేండ్ల వఱకు మలహాణుని ధనంబు సువర్ణాభరణంబులు రాజితభాజనంబులు పొలములు తోటలు దొడ్లు బావులు పశువులు బండ్లు తామ్రకాంశ్యఘటంబులు చివఱకు గృహము గూడ బుష్పగంధికై తన్మాతృవశంబులయ్యె. అంత నొకనాఁడు రిక్త

హాస్తంబులతో వచ్చిన మల్హణుని జూచి వేశ్యమాత నేఁడు ప్రియురాలి కేమిదెచ్చితివని యడిగె. మల్హణుఁడు చిన్నబోయి తలవంచికొని నాకుఁ గలసర్వార్థములొసంగితి నిఁక నేమిదెచ్చెద ననియె. అప్పుడు గణికామాత కోపించి యేమియుఁ దేలేని వాఁడవేని నీయట్టివానికిఁ జక్కని కెలఁజవ్వని యెట్లుచిక్కు ననికొంటివి? వేగిరము వాకిలిదాటుము. అట్లు పోవేని శిక్షించి గెంటించెదననియె. మల్హణుండు ఖిన్నుండై పుష్పగంధి మొగంబుఁ జూచె. పుష్పగంధియును దల్లిధార్ష్ట్యంబునకును గృతఘ్నతకు రోసియు మల్హణుని పైని మమకారంబును బ్రేమబంధంబును బాయలేక తల్లికెద్దియో చెప్పఁ బోవుచుండె నయ్యది చూచి కూతును గసరి గదిరించి యేమియు వదర కోకు మిచ్చటినుంచి తొలఁగి లోపలికిఁ బొమ్మని గదుమగా పెద్దపులి కావు భయపడినట్లులిలికి చేయునదిలేక యాపె లోపలికిఁబోయె. మల్హణుఁడేమియుఁ బల్కక వ్యసనపడుచు వాకిటికి వచ్చె. యౌవనవశంబున హితులగు పెద్దలను ధిక్కరించి ధర్మంబధర్మంబుఁ దలఁపక చెడ్డత్రోవఁ బట్టి మోహంబున దిరిగినట్టివారికిఁ బట్టెడుగతి యిదియెకదా! అపుడు పుష్పగంధి దొడ్డివాకిటినుంచి యావలకుఁ జేరి సాయమందు నగరేశ్వరాలయమునకు రమ్మనిసన్న చేసె. మలహణుఁడు చింతతో సాయమున కెదురుచూచుచు సాయమం దీశ్వరాలయంబుఁ జేరెను. తరువాత గొంత సేపటికి అలంకార మొందకయే పుష్పగంధి యొకదాసితో శివప్రాంగణంబునకుఁ జేరఁగ మల్హణుఁ డానందించి యాపెను దారసించెను. అపుడు పుష్పగంధి ప్రియునిజూచి యాతని దైన్యమునకు మది నొక్కింతవనరి తెగువతో నాతని కిట్లనియె. ఓయీ! నాకై నీసర్వస్వమును ధారవోసి నిర్ధనుఁడవైతివి. ఇట్టినిన్ను మాతల్లి మావాకిలిఁ ద్రొక్కనీయదు. అది వ్యాఘ్రము. నాకు నీయందుఁగూరిమియున్నను నన్నది నీకంటఁ బడనీదు. ఇఁక నీతోఁగూడ నేనులేచివచ్చి ఎట్టకైన దూరదేశమున కేగి యం దుండదమనుకొన్నను నీవు రిక్తుఁడవగుట మనకిద్దఱకు జీవితం బెట్లునడచును. మఱియు నేను నీకు కులసతినిగాక వేశ్యనగుటచే మనదాంపత్యమును మతిమంతులు హర్షింపక యేవపడుదు రిఁక నీకై నేనేమి చేయవలయునో చెప్పుమనియె. మల్హణుఁడేమియుఁ దోచక నీవే చెప్పుమనియె. అపుడు పుష్పగంధి నేనుచెప్పినట్లుగ వినియెదవా యన మలహణుఁడు

దృఢముగ వినెద ననియె. అపుడమ్మానిమతి మలహణునకిట్లుప దేశించెను.

ఓయీ! ఇప్పటివఱకు నీ వలసినట్లు నాయందుఁ గామభోగ సుఖంబుల నొక పుష్కర కాలం బనుభవించితివి. ఇఁక జీవితాంతం బిట్లే యనుభవించినను దీనఁ జాలునని తృప్తి యొనరదు.

శ్లో॥ నజాతుకామః కామానాం ఉపభోగే నశామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభి వర్ధతే.

మహాభారతము.

తా॥ కామంబెప్పుడును కామోపభోగంబులచే శమింపదు. హవిస్సుచే నగ్నివలె మఱియును వృద్ధియగును.

కావున నీక కామసుఖంబునకు స్వస్తి చెప్పుము. హృదయంబును మరల్పుము. భక్తి జ్ఞాన వైరాగ్యంబులనొందుము. సర్వేశ్వరుండునుదయాళుండును అమృతప్రదుండును నగు నీ మహాదేవుని సేవింపుము. ఈతఁడే నిన్నును నన్నును సర్వజనంబులను గడతేర్పఁగల పెన్నిధానము. పుష్పగంధి యిట్లుబోధించిన ధీరుండగుట నాతఁ డట్లేయని యంగీకరించె. అపుడా గణికామణి మెచ్చి మలహణునితో ఏదీ! నీపాండితీశౌండిమ దశ దిక్కుల నిండునట్లు వాఙ్మయరూపంబునఁ బరమేశ్వరు నుపస్థానింపుమనె. * మల్హణుండపుడు శివునకు జోతచేసి వాఙ్మయోపాస్తి నారంభించె. పుష్పగంధి వినుచుండె.

శ్లో॥ కాంతాకచపరిచయపుష్పసుగంధి గంధ

యనుటతోడనే పుష్పగంధి యదరి ఓయీ! మరల నిదియేమి! నీకు నాయందు మోహము పాయకున్నది. నేనేమిచేయుదు? శివస్తవం బొనరింపు మన్న అందుఁగూడ నన్నే స్మరింపుచుంటివేమి? యని యడుగ నాతఁడు వేగిరపడక వినుము. నేను నీ హితబోధను మీరను అని నుడివి ఆ తరవాయిగ నిట్లుచెప్పె.

---

* ఈ మల్హణకవి. క్రీస్తు 1300 శతాబ్ది ప్రారంభమందున్నట్లు తెలియ వచ్చుచున్నది. శ్రీనాథకవియు, పాల్కురికి కవియు నీతని ప్రశంసించిరి.

లుబ్ధభ్రమద్భ్రమరకర్బుర కంధరాయ
గంధర్వ యక్ష సురసిద్ధ కిరీటకోటి
సంఘట్టఘృష్ట చరణాయ నమశ్శివాయ.

మలహణ స్తవము.

తా॥ సుందరస్త్రీలయొక్క కొప్పునందుఁ గలట్టి పుష్పసుగంధములుగల పరిమళమందు లోభంబునొంది తిరుగుచున్న తుమ్మెదల వలె జిత్రవర్ణమైన గళముగలట్టియు గంధర్వ యక్ష సురసిద్ధుల కిరీటంబుల మొనల యొక్క సంఘర్షణచేత రాపిడిబడిన పదములు గలట్టియు శివునకు నమస్కారము.

ఇట్లు శ్లోకమును బూర్తి చేయుటను విని పుష్పగంధి సంతసించి ఇదియే కడతేపబాట. ఇట్లే పద్యంబులను విరచింపుమనియె. మల్హణుఁడాశుధారగఁ జెప్పుచుండెను. పుష్పగంధి వ్రాయుచుండెను. ముప్పదియారు శ్లోకంబుల నిట్లు మల్హణుండు శివుని గానంబుచేసె నంతఁ బరమేశ్వరానుగ్రహంబున నాతని కంతరంగం బందు భక్తి యొదవి తోడనె జ్ఞానవైరాగ్యంబులు చేకూరె. అంత మలహణుఁడానందించి పుష్పగంధి నిమ్ముకేగుమని పంపి సర్వకాలములందు హృదయంబందు శివుని ధారణ చేసి మహాభక్తుండై యనేకులకు శివభక్తిఁ గఱపి శివానుగ్రహమునకుఁ బాత్రుండై శివసాన్నిధ్యంబునొందె. పుష్పగంధియు మల్హణుని బాసి నిజమందిరంబుఁ జేరిన యంత నాపెతల్లి మరల నొకరిద్దఱిని శ్రీమంతు లగు యువకులను దెచ్చి పుత్రికిఁజూపించి వీరలు చాల గొప్పవారనియు మనకు ధనంబు విస్తారంబుగ నిచ్చెదరనియు నిర్ధనుఁడగు మల్హణుడు వెడలిపోయెను గావున వీరలిద్దఱిలో నీకిష్టమైనవాని వరింపుమనియు దాన మనకు సుఖంబగుననియుఁ బ్రతిమాలి చెప్పెను. పుష్పగంధి యాస్ఠ డించి తల్లినిదిట్టి నేను కామసుఖంబులను విసర్జించితిని. నా దేహ మనః ప్రాణంబులు శివునివైనవి. జీవితాంతం బశనవస్త్రంబులు దక్క తక్కిన వేవి నా కక్కఱలేవు. శివధ్యానము చేసికొనుచు బ్రదుకుదును. ఈ నా యిష్టమునకు నీవు ప్రతికూలించి బలాత్కరించితివేని యురిఁబోసికొని సూర్యోదయమువఱకుఁ జచ్చెదను. తెలవాఱినంతఁ బీనుగును జూచెద వని తెంపున దృఢముగఁ జెప్పెను. తజ్జనని యానుడుల కడలి యుఁకఁ

బ్రియోజనము లేదనుకొని కూతుతో నీయిష్టమెట్టులో యట్లే యుం డుము. వేఱుదలఁపకు మనిచెప్పి యూరడించెను. పుష్పగంధియంత దయ్యముబాటినుండి తప్పించుకొనిన యట్లు తలఁచి ధైర్యము జెంది తాను నుడివినట్లు దైహికసుఖంబులం దనాదరమొంది విసర్జించి భక్తురాలై యేవేళల శివధ్యానంబు సేయుచు శివానుగ్రహంబున శివపదం బొందె. ఇట్లీ యిరువు రత్యంతము కాముకులైనను గూడ మల్హాఱుఁడు వేశ్యాప్రబోధితుఁడై తరించె. పుష్పగంధియు నట్లే శివభక్తినొంది తరించెను. ఇట్టివీరి చరిత్రంబు పాఠకులకు శ్రోతలకు విస్మయకరంబై శివభక్తి కారణం బగునని శ్రోతలందఱా గురునకు మ్రొక్కి బహూకరించి పూజించియానందించిరి.

శ్లో॥ ధర్మో మే చతురంఘ్రికస్సుచరితః పాపంవినాశంగతం
కామక్రోధమదాదయో విగళితాః కాలా స్సుఖావిష్కృతాః
జ్ఞానానంత్యమహౌషధి స్సుఫలితః కైవల్యానాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే.
శివానందలహరీ స్తవము.

తా॥ మోక్షనాథుఁడగు రాజశిరోమణి (శివుఁడు) నాదుమానసకమల నగరమందుండి యెల్లపుడు పాలింపుచుండఁగా ధర్మము నాల్గుపాదములు గలదై సుఖముగ నాచరింపఁ బడుచున్నది. పాపము వినాశంబు నొందినది. కామక్రోధ మదమాత్సర్యాదులు దొలగినవి కాలములు సుఖముగా నావిష్కరింపఁబడినవి విజ్ఞానమహౌషధులు చక్కఁగా ఫలించినవి.

శ్లో॥ సర్వాలఙ్కారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యాం
ఉద్యద్భూషావిశేషాముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కల్యాణీం దేవ గౌరీప్రియ! మమ కవితాకన్యకాం త్వం గృహాణ.

తా॥ గౌరీదేవియందు ప్రేమగల ఓ మహాదేవ! సర్వాలఙ్కారయుక్తమైనట్టియు మృదులములు సుబోధకములగు వాక్కులుగలట్టియు

సత్సమ్మతమైన నడవడిగలట్టియు మంచియక్షరములు (రంగు) గలట్టియు సత్పురుషులచే స్తుతి నొందినట్టియును సరసములైన గుణములు గలట్టియు లక్షణంబుల సమర్థమైనట్టియు ప్రకాశించుచున్న భూషణములు గలట్టియు వినయము గలట్టియు స్ఫురింపుచున్న అర్థరేఖలు భాగ్యరేఖలు గలట్టియు ఈ కనఁబడుచున్న కల్యాణిని నాదు కవితా కన్యను గ్రహింపుము.

శివానందలహరి.

# 53. మహనీయులు. శ్రీశంకరారాధ్యగురులు *

శ్లో॥ యస్మైనమోభవతి యస్యగుణా స్సమగ్రాః
నారాయణోపనిషదా యదుపాసనోక్తా
యోనఃప్రచోదయతి బుద్ధి మధిక్రతౌయ
స్తంత్వామనన్యగతి రీశ్వర సంశ్రియామః॥

తా॥ నమస్కార మెవనికొఱకగుచున్నదో (నమస్కారము లన్నియు నెవనికిఁ జెందునో) సమగ్రములగు గుణము లెవనివో నారాయణోపనిషత్తుచే (మహోపనిషత్తుచే) ఎవని యుపాసన చెప్పఁబడినదో ఎవఁడు బుద్ధిని ప్రేరించుచున్నాఁడో (గాయత్రీరూపమున) ఎవఁడు యజ్ఞమందీశ్వరుఁడో ఓ యీశ్వరా ! అట్టినిన్ను అనన్య శరణుఁడనై సేవింపుచున్నాను.

హరదత్త శివాచార్యచతుర్వేద తాత్పర్యసంగ్రహము.

* క్రీస్తు 19 వ శతాబ్ది తృతీయభాగమందు హైదరాబాదు రాష్ట్రమందు శివలింగధారి బ్రాహ్మణవర్ణమందు జన్మించి వేదవేదాంత శాస్త్ర కోవిదులై సంగీత సాహిత్య కవితా కుశలులై భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నులై షట్కాల శివపూజావ్రతులై శైవాన్న సత్ర స్థాపకులై శైవమతప్రచారంబొనరించి శైవమత వృద్ధిని బొనరించినట్టి శ్రీశంకరారాధ్యగురుల చరిత్రంబు నీ శివభక్తవిజయకథావళి యందుఁ జివరఁ జేర్చి ప్రకటించితిని. ము-నా.

శ్రీమల్లికార్జున శివలింగావాసంబగు శ్రీపర్వతంబునకుఁ బూర్వదిశ యందును అమరేశ్వరలింగస్థానంబగు నమరావతీ పట్టణంబునకుఁ బశ్చిమదిశయందును ఇష్టకామేశ్వరలింగస్థానంబునకు గృష్ణామహా నదికి దక్షిణంబునను శ్రీకోటిలింగాద్రికిఁ బశ్చిమోత్తరంబుగ వెలసి యున్న నందిగ్రామంబందు జగదారాధ్యులైన యుద్భటారాధ్యగురుల వంశపారంపరిలోని ముదిగొండవారను వీరశైవలింగధారి బ్రాహ్మణు లగు మల్లేశ్వరారాధ్యునకు మంత్రారాధ్య వీరభద్రారాధ్యులను వా రిద్దరు పుత్రులుండిరి. అందు మంత్రారాధ్యుఁ డంతర్ముఖుం డఖండ శివ తత్త్వవిజ్ఞానసంపన్నుండు ద్వితీయుండగువీరభద్రారాధ్యుఁ డుభయ శాస్త్ర కవితా ధురీణుండు. ఉభయులు విద్వాంసులై ఆయూరునందే కాక ఇతర ప్రాంతంబులందుఁగూడఁ బ్రసిద్ధులై పేరుచెంది సర్వజనమాన్యులై యుండిరి. మంత్రారాధ్యునకు గృహిణియగు శ్రీ జేజెమ్మయందు నాగ లింగ వీరమల్లికార్జున చెన్నమల్లికార్జును లను మూగురు సుతులును వీర భద్రారాధ్యునకు శంకరయ్యయను నొక కొమరుఁడును జన్మించిరి. మంత్రారాధ్యుఁడు వీరభద్రారాధ్యుఁడును బరస్పరసౌహార్ద్రంబుతో నేకత్రంబుగ మెలఁగుచు వ్యవసాయవృత్తిఁ జేసికొని యశ్రాంత శివ లింగార్చనా ధురంధరులై అనవరతమాహేశ్వరాన్నదానపరాయ ణులై వెలసియుండ నొక మాఘకృష్ణ చతుర్దశీ (మహాశివరాత్రి) దిన ప్రభాతమందొక శివయోగి సిద్ధపురుషుఁడు తపస్వి యిష్టలింగధారియైన మహనీయుండు మార్గవశంబున యదృచ్ఛచే మంత్రారాధ్య సోదరుల గృహంబునకేతెంచిన వీరభద్రారాధ్యసోదరు లెదురేగి తెచ్చి మ్రొక్కి సుప్రవిష్టునిచేసి పూజించి యాశివరాత్రి నవ్వారి శివవ్రతంబు సల్పించి సేవించిరి. మర్నాడమ్మహనీయుఁడటనుండి కదలి పోవుచు మంత్రారాధ్యునిజూచి యచిరకాలంబందు నీకు మహాదేవుని యంశంబున మహాదేవసమానుం డుద్భవించి మిమ్మందఱనేకాక జగంబందుఁ బెక్కు ఘన కర్మ్యముల నొనర్పఁగలఁడని నుడివి యాశీర్వదించి యథేచ్ఛఁజనియె. అంత ననతికాలంబందే మంత్రారాధ్య గేహిని గర్భంబుఁదాల్చె. ఆమీఁద గోలకొండ రాష్ట్రములోనున్న శిష్యప్రముఖు లివ్వారిని సకు టుంబముగఁ దమదేశంబున కాహ్వానింప వీరభద్రారాధ్యుని కుటుంబ

ముతో నతిథి మాహేశ్వరార్చనలకై స్వగృహమందే యుండ నియ
మించి మంత్రారాధ్యులవా రాత్మకుటుంబముతోఁ గదలి కొన్ని
వాసరంబులలో గోలకొండకు సమీపంబందలి మందుగులయను గ్రామం
బుఁ జేరిరి. అందుశిష్యులు పరమానందంబొంది యొక మందిరంబొసంగి
యందు నివసింపఁ జేసిరి. ఆయూగను దత్పరిసరంబులందలి బందుగులును
శిష్యు లత్యంతసంతుష్టులై యాగురుని నాపురమందే కాపురంబుండుట
కర్థించియుంచి వృత్తికై మాన్యంబులను దోటల నొసంగి సేవించుచుం
డిరి. అనంతర మచిరకాలమందు మంత్రారాధ్యార్థాంగి నవమాసంబులు
నిండఁ బంచాంగశుద్ధిగల యొక శుభదినంబందు సుసమయంబున సులగ్నం
బున శివసన్నిభుండగు పుత్రుని గనియె. ఆ సమయంబునం దాకసంబు
నుండి పుష్పవర్షంబు గురియ శైవులకందఱకు మహానందంబు చేకూరె.
మంత్రారాధ్యుఁడు స్నాతుండై శంకరుని స్మరింపుచు శంకరతేజఃపుంజ
విరాజమానుండగు చతుర్థ పుత్రుని గన్గొని ధన్యోస్మి యనుకొని హర్షం
బునొందె. పదకొండవనాఁ డారాధ్యుఁడు పుత్రునకు జాతకర్మం బొన
రించి శంకరారాధ్యుండని పేర్వెట్టి మాహేశ్వరాన్నదానంబు లొన
రించెను. బాలుండు శుక్లపక్షచంద్రుండట్లు దినదినాభివృద్ధినొందుచు
దల్లిదండ్రులను బంధుగుల నాప్తుల నానందపరవశులఁ జేయుచుఁ బెఱు
గుచుండె. ఇట్లు క్రమంబుగఁ బంచహాయనంబుల బాలకుండైనంత జనకుం
డక్షరాభ్యాసంబు సల్పి గర్భాష్టకంబందుపనయనంబు సల్పి శివలింగ
ధారణంబొనరించి వేదశాస్త్రపఠనంబునకై పుత్రుని గురులయొద్ద కని
పెను. శంకరుండు వేదశాస్త్రంబులతోఁ బాటుగ బ్రాక్తనజన్మవిద్యమై
యమరిన సంగీతవిద్యయందుఁ గర్ణాటక హిందుస్తానీ సంగీతంబుల జంత్ర
వాదనంబున మీఁదుమిక్కిలి కృతార్థుండయ్యె. ఇట్లవలీలగ సాహిత్యం
బందు సంస్కృతాంధ్రోభయభాషాకవితయందు మిక్కిలి కౌశల్యంబుఁ
బడసి మతగ్రంథ పఠనంబునకై రాజధానీ నగరంబందు వసించియున్న
ముదిగొండ లింగయ్య శాస్త్రిగారను విద్వాంసుని సన్నిధి కేగి వారి
యొద్దఁ గొంతకాలంబు మతగ్రంథంబులఁ జదివి తద్విజ్ఞానంబు నార్జించెను.
అట్టితఱి నొకనాడు సహపాఠులఁ గూడి రాజవీథియందుఁ గూర్చుండి
యున్నపుడు దేశప్రభుఁడగు హుజూరు షడశ్వయానంబగు శకటంబధి

ష్టించి యవ్వీధి వచ్చుచుండుటఁగాంచి శంకరారాధ్యుండు ధీరుండై పటు గత్తి శకటంబుఁ బట్టికొని మెక్కి యందొక చెక్కపై నిలిచెను. లోన గూర్చుండియున్న ప్రభుండు బాలుని ధైర్యంబున కక్కజంబొంది లోనికిఁ జేరఁదీసికొని తనప్రక్కనఁ గూర్చుండఁబెట్టి యెవ్వరవు? నీ విట్లేల సాహసించితివని యడిగెను. శంకరుండు మందహాసముచేసి దేశప్రభుండవగుట విని దర్శనంబు దారసించితినని యుర్దూభాషలో నుడివె. ప్రభుండు సంతసించి యేమిచదివితివనిన చదువులను గొన్ని జదివితినిగాని ప్రస్తుతమిది వినుఁడని రాగాలాపనచేసి హిందుస్తానిగజల్ ను నొక్కదాని బాడి యేని మనం బానందింపఁజేసె. ఆ ప్రభుఁడు గానకౌశల్యంబారసి మురిసి తద్ వేషంబొక మొహరీనిదీసి బాలునకిచ్చి మరల శకటంబావీధిదనుకరప్పించి యందు శంకరారాధ్యుని వీడ్కొల్పుచు మొహరీ నేమిచేసెదవనిరి. శంకరుండు దీనిమూల్యంబుతో సహపాఠులకు గురునకు భోజనము గావించెదననె. హుజూరదివిని బాలుని యౌదార్యంబునకుఁ బెల్లుగ నానందించి యనిపెను. శంకరుండు ప్రభుదత్తసువర్ణముద్రికను విక్రయించి గురు కుటుంబమునకు సహపాఠులకు భోజనంబులఁ గావించెను. అంతఁ గొంత కాలములోనే గురుఁడగు శ్రీలింగయ్య శాస్త్రిగారింటికిఁ జుట్టము తూర్పు దేశమునుండి కుంకుమ గ్రామాది గ్రామత్రయాగ్రహారికుఁడును బండితుండు నగు శివపురపు కోటిలింగారాధ్యుఁడు విజయముచేసి యందు మతగ్రంథంబులు మున్నగువాని నధ్యయనము చేయుచున్న శంకరారాధ్యునిజూచి తన్మేధాసంపత్తికి విద్యాసామగ్రికి సంగీతకౌశల్యంబునకు దేహసౌష్టవంబునకు లేఁబ్రాయంబున కుత్తమవంశోన్నతికి గడుంగడు హర్షించి గురుఁడగు లింగయ్యశాస్త్రిగారితోఁ దన కొమరిత వివాహార్హయై యున్నదనియు నామెను శంకరారాధ్యున కీయఁ దలఁచితిననియు నీకార్యంబును దయతో సంఘటింపుఁడని యర్థించె. ఆయనయు హర్షించి తగిన సంబంధమని యభిమతించి సత్వరంబుగ కోటిలింగారాధ్యునితో మందుగులకుఁ బోయి మంత్రారాధ్యునకుఁ దత్సతికి కోటిలింగారాధ్యుని నెఱుకచేసి యవ్వారియభిమతంబును దన యామోదంబును దెలిపె. ఆ దంపతులు సమ్మతించి "యట్లే సల్పుఁ" డనిరి. ఆవెంటనే శంకరునిరప్పించి యుద్వాహంబు సమాచారంబు దెలిపి యంగీకారంబు బడసి సుముఖ

హూర్త నిశ్చయంబొనర్చి వివాహలగ్నమునకు కుంకుమ గ్రామంబునకు శ్రీశంకరారాధ్యుని బంధు మిత్ర పరివారాదులతో దోడ్కొని రమ్మని మంత్రారాధ్య దంపతుల నాహ్వానించి రాజధానికేగిరి. కోటిలింగము గారు లింగయ్యశాస్త్రిగారిని పెండ్లికాహ్వానించి తానుఁ బ్రయాణముచేసి కుంకుమ గ్రామము జేరి వివాహప్రయత్న మొనరించిరి. మంత్రారాధ్యులు సకుటుంబపుత్రమిత్రబంధుపరివారుండై శ్రీ లింగయ్యశాస్త్రిగారిని బురస్కరించికొని కుంకుమగ్రామంబుఁ జేరి సుముహూర్తంబందు నాల్గవ కొమరుఁడు శంకరారాధ్యునకు వివాహంబొనర్చిరి. ఆవెంటనే నూత్న దంపతులఁ దోడ్కొని బందుగులతో మరల మందుగులఁ జేరిరి. అటు మీఁద గొన్నినాళ్ళకు శంకరారాధ్యుండు తపోవ్రతాభిలాషతోఁ జేరువ నున్న బీరముగుట్టయను కొండకేగి యందు శివునిబూజింపుచు భక్తి జ్ఞాన వైరాగ్యంబుల నొందియుండె. ఆ సమయంబున శంకరారాధ్యుని యర్ధాంగి శ్రీపార్వతీదేవి యావనదశనొందె. అపుడు శంకరారాధ్యుని యగ్రజులు బంధులు హితులు బీరంగుట్టకేగి యవ్వారిని బ్రతిమాలి యొప్పించి యెట్టకేలకు మరల మందుగులకుఁ దోడ్తెచ్చిరి. శ్రీపార్వతీ శంకరు లన్యోన్యానురాగంబుతోఁ గాపురంబు సల్పుచుండిరి. అంతఁ గొంతకాలంబునకు మంత్రారాధ్యులు తద్గృహిణియు శివలోకంబుఁ జేరిరి. పుత్రులు త్తరక్రియలు సల్పిరి. మంత్రారాధ్యుని యాదేశంబునఁ దత్సోదరుఁడు వీరభద్రారాధ్యుఁడు నందిగామలోనే వ్యవసాయవృత్తిఁ జేసికొనుచు మహేశ్వర మాహేశ్వరార్చనలు సల్పుచు నాయూరియందలి సుంకరి పుల్లయ్యాయను నతఁ డర్థింప పలనాటిరెడ్డివీరుల చరిత్రంబు నాంధ్ర ప్రబంధంబు రచించి యవ్వానికిఁ గృతియొసఁగె. మఱియు శికింద్రాబాదు నందు శ్రీపతి పండితారాధ్య వంశోద్భవులగు పండితారాధ్యస్వామిగారి వాంఛితంబున శ్రీశైవద్వాదశారాధ్య చరిత్రంబురచించి యవ్వారికిఁ గృతి నొసఁగె. వీరికవిత్వము మృదుమధురపదభూయిష్ఠమై ద్రాక్షా పాకంబున నలరుచుండును. వీరికుమారుఁడు శంకరయ్యగారు నందిగామ లోనేయుండిరి. అనంతరము శంకరారాధ్యులు భక్తజనులచే నర్థింపఁ బడి మందుగులఁబాసి యగ్రజుల సెలవుతో రాజధానీ నగరంబుఁజేరి యందు భక్తులచే నిర్మితమై యర్పింపఁబడిన స్వగృహమందుఁ బ్రవేశించి

శైవగణార్చనల నారంభించి యొనర్చుచుండెను. శ్రీశంకరారాధ్యులవారి సంగీతసంశోభితశివభక్త్యుపన్యాసంబులందు తద్వచోమృతధారల నాస్వాదించి హర్షించి పెక్కురు భక్తులై శివలింగధారణంబొందిరి. ఇట్లి వ్వీటికి వందలకొలఁది బ్రాహ్మణులు వైశ్యులు కాపులు కురుమలు నొచ్చుగ శిష్యులై భక్తులై శంకరారాధ్యుని సేవింపుచుండిరి. శంకరుం డేనాఁడు లభించిన ద్రవ్యంబానాఁడే శైవగణార్చనంబునకు వినియోగిం పుచు మిగిలిన రూకలను మాహేశ్వరులకు సంభావన లిచ్చుచుండెను. గురువరుఁ గొదవరానీక శిష్యులరయుచు శంకరుని యన్నదానవ్రతంబు నిర్విఘ్నముగ నిర్వహింపుచుండిరి. శంకరారాధ్యుని యున్నతిని నుప న్యాస వైభవంబు నారసి రాజధానికంటియున్న శికింద్రాబాదునందలి ప్రముఖ వైశ్యభక్తులు శంకరారాధ్యుని శికిందాబాదుకుఁ గొనివచ్చి యచ్చటఁగూడ నవ్వారిచే నుపన్యాసంబులనువిని భక్తితో నందు ఓంకార సమాజంబని యొక సంఘంబు నేర్పఱచి యందు సోమవారంబులందు శివభక్త చరిత్రంబులను శివతత్త్వంబును దెలిసికొనుచు శంకరుని సేవించు చుండిరి.

సీ। ఎవ్వాని శుభనామ ♦ మేప్రొద్దు నుడివిన
జనులకుఁ బాపసం ♦ చయముదొలఁగు
ఎవ్వాని చారిత్ర ♦ మేశైవమండలి
కెల్లనాదర్శమై ♦ యెసక మెసఁగు
ఎవ్వాని దాతృత్వ ♦ మెల్ల దేశములందు
విఖ్యాతిఁగాంచి కా ♦ వించె దనివి
ఎవ్వాని సద్బోధ ♦ కెంతకాలంబేని
విసుగుఁగాంచక యె కా ♦ వించుభక్తి

గీ। ఎవఁడు చేసిన పాట్కాలి ♦ కేష్టలింగ
పూజగావించెఁ బరులకుఁ ♦ బులకతతుల
అట్టి శ్రీశంకరారాధ్యుఁ ♦ డార్యబోధ్యుఁ
డనుపమానయశస్కుఁడై ♦ యవనిఁదనిరె ॥

శివపురాణ పీఠిక.

శంకరారాధ్యునకుఁ బార్వతీదేవియందుఁ గ్రమంబుగ నొకకొమరితయు నొక కుమారుండు జన్మించిరి. కుమారునకుఁ గుమారస్వామి యని జనకుఁడు నామకరణంబొనర్చెను. కొమరితయుఁ గుమారుండును బెఱుఁగుచుండిరి. ఇఁకనటుమీఁద దక్షిణదేశమునుండి యొక పాంచరాత్రుండు వచ్చి యొక సభఁగావించి యందు శివపంచాక్షరీమంత్రము వైదికము గాదనియుఁ దాంత్రికంబనియు వేదమార్గసంచారు లద్దానినుపాసింపగూడదని యుపన్యసించె నందుచే శైవజనులకందఱకు ద్వేగమంపొడమె. శంకరారాధ్యుఁడవ్వార్తవిని తోడనే శికింద్రాబాదుకువచ్చి పత్రికాముఖంబున బాంచరాత్రునితో వాదించి చివరకు మహాసభకుఁ బిల్పించి గొప్ప విద్వాంసులను బేరైన న్యాయవాదులను ఆంధ్ర ద్రావిడ మహారాష్ట్ర బ్రాహ్మణవర్యులను బెక్కురిని రప్పించి సభయందుఁ బంచాక్షరీమంత్రంబును వేదసిద్ధంబనియు వేదాంతప్రతిపాదితఁబనియు సర్వశ్రుతి స్మృతీతిహాసపురాణోపబృంహితంబనియు స్పష్టముచేసి మంత్రము యొక్క వైశిష్ట్యమును బుజువు చేసెను. సభయందలి పండితు లఖిలజనంబును సత్యము సత్యమని పలికిరి. పాంచరాత్రుండు పరాజితుండై మిన్నక సభనుబాసి వెడలిపోయెను. సభ్యులందఱు శంకరుని వాదంబునకు జయము చెప్పిరి. శంకరారాధ్యుఁడంత సంతోషముతో రాజధానికేగెను. శైవులెల్ల రానందించిరి. ఇట్లు దేశమందెల్లెడ శంకరారాధ్యుని కీర్తి నిండుగ వ్యాప్తంబగుడు దేశమందలి ప్రముఖ భక్తులు పెక్కుఱువచ్చి శంకరారాధ్యునిచే శివదీక్ష నొందుచుండిరి. అపుడు శంకరారాధ్యుఁడు సుతునకుఁ గర్భాష్టకమారసి ఉపనయన వ్రతంబును శివలింగధారణ దీక్ష నొనరించి కూతునకుఁ బండితారాధ్యవంశ్యుఁడగు నొక వరున కిచ్చి యుద్వాహంబుఁగావించెను. అటుమీఁదఁ గొంతకాలంబులోనే దైవేచ్ఛచే నల్లుఁడుమృతినొందె. కూతురు వైధవ్యమొంది దుఃఖముచేఁ గృశించి కొన్నినాళ్ళలోనే మరణించె.

అటుమీఁదఁ గొండొకకాలమందే శంకరారాధ్య దేవియగు పార్వతీదేవిగూడ వ్యాధివశంబున శివలోకంబు నొందె. శంకరుఁడొక్కింతయు దుఃఖింపక జ్ఞాన వైరాగ్యధీరుండై కర్దమ గర్తంబుఁబాసి వెడలినట్లు భావించి తత్కాలోచిత కర్మంబుల నెరవేర్చి నిత్యంబు షట్కా

లంబులం దిష్టలింగంబును బూజింపుచు మాహేశ్వర గణార్చనల సల్పుచు సేవలు శివభజన కీర్తనంబుల రచించి గానంబు సేయుచు భక్తజనులకు శివభక్తి నుపన్యసింపుచు నిత్యసంతుష్టుండై యుండె.

ఇంక వైదికవిద్యావృద్ధికై శివధర్మవర్ధని యను నిధిని నిలిపి వేదశాస్త్ర పాఠశాలను శికింద్రాబాదునందు నెలకొల్పె. అందుఁ బలువురు విద్యార్థులు చేరి చదువుచు విద్యలందు త్తీర్ణులగుచుండిరి. కొంతకాలంబున కారాధ్యుని ద్రవ్యంబు కొరంతను గన్గొని మార్వాడీ శ్రీరామగోపాల్ సేటుగా రా పాఠశాలను శ్రీజగన్నాథస్వామ్యాలయ గోపురమందుఁ జేర్చి తాము నిర్వహించుచుండిరి. శంకరారాధ్యునకు భక్తులొసఁగినట్టి ధనంబును హిరణ్యారాజితవస్తువులను దుకూలాంబరంబుల సేలువలను మాహేశ్వరులెవ్వరేని వచ్చి యడిగినఁ గొంకక తత్కాలమందే శంకరుండిచ్చుచుండెను. ఇట్లు శంకరునికీర్తిచంద్రికలు దిగంతవ్యాప్తంబులగుచుండ లాతిమతంబువారలు గొందఱోర్వక శంకరారాధ్యుని ఖ్యాతికిఁ గళంకంబుఁ గూర్పవలెనని శ్రమతోఁ బెక్కు యత్నంబు లొనర్చిరి. అద్దాన శంకరారాధ్యుఁడు సుంతశ్రమంబొందెఁగాని యంతకన్నఁగించిత్తేని హాని యొనరలేదు. హైదురాబాదునందు శికిందాబాదునందుఁ దిరుమలగిరియందలి భక్తులపుడపుడు శంకరారాధ్యుని స్వస్తివాదముతో దివ్యవాద్యములతోఁ గరదీపికాసహస్రముతో గజారోహణోత్సవము మున్నగు మహోత్సవములతోఁ దోడ్కొని పోయి రాత్రులందు మల్లెపూలతోడను సేవంతికా సుమంబులతోడ నుంజిలీలను (ఉయ్యెలలను) గూర్చి యూగింపుచు నవ్వారిచే శివభక్త చరిత్రోపన్యాసంబుల నాలకింపుచు హర్షించుచుందురు. శ్రీశంకరారాధ్యుఁ డుపన్యాసవేదియందుఁ గూర్చుండి తంబుర మీటుచు సుస్వరమధురకంఠధ్వనితో శ్రుతిపురాణవాక్యంబులను సత్కవివిరచిత హృద్య పద్యంబులను స్వరచితశివకీర్తనంబులను జదువుచు శివభక్తచరిత్రంబుల నుపన్యసించునపుడు కైలాసంబునుండి శంకరుండే ప్రత్యక్షంబుగ వచ్చి భక్తిమహిమ నుపన్యసించునట్లు తోచును. నాస్తికుఁడైనను బ్రబోధాకౌశల్యంబునకు గాత్రమాధురికి సంతుష్టుఁడై శంకరునిచే శివదీక్ష నొందుచుండును. ఒకప్పుడు శ్రీశంకరారాధ్యుఁడు శ్రీశైలమునకేగి యందు శివరాత్రియందు మల్లేశ్వర

మంటపమందుఁ గూర్చుండి శివభక్తినిగూర్చి యుపన్యసించునపుడు తద్స్థలంబుఁజేరి యందు జగదేక పండితులును న్యాయ వైశేషిక పూర్వోత్తరమీమాంసాశాస్త్రపారంగతులునునగు శ్రీశ్రీశ్రీ అచ్యుతస్వాముల వారు మల్లికార్జునస్వామివారిని సేవించి పోవుచు శంకరారాధ్యుని యుపనిషద్వచనార్థపు బోధా కౌశల్యంబును మధురకంఠస్వరగానంబును వచనామృత మాధురీప్రకారంబు నారసివిని హర్షించి యక్కజంబంది తాను యతియును బండితప్రకాండుండగుట నపు డవ్వారి సముఖమున కేగుట రసభంగంబని యూహించి ధ్వజస్తంభంబు చాటున నిలిచి తదుపన్యాసంబును సమగ్రంబుగ నాలకించి యానందించితి నని యొకనాఁడొక్కచో నుపన్యసించిరి. ఇట్లు మహాపండితులు మొదలుచేసి పామరులవఱకు శంకరారాధ్యోపన్యాసంబులు హృదయాకర్షకములై యానందప్రదములై యుండెను. ఆమీఁద శంకరారాధ్యులవారు లక్షతొంబదియారువేల గణార్చన నారంభించి హైదరాబాదునందును శికిందరాబాదునందును అన్నదాన వ్రతములఁ గావించుచు శ్రీమల్లికార్జున పండితారాధ్య వంశ్యులగు శ్రీరాజలింగారాధ్యులను వారికి గురుపూజ సేయుచు మాహేశ్వరార్చనఁ జేయుచుండిరి. మాహేశ్వరులనేకులుచేరి యందు శంకరారాధ్య సన్నిధిని రేఁబవలు శివపూజలొనర్చుచు భుజించుచుండిరి. శంకరునకపుడు నలువది వత్సరముల ప్రాయము వచ్చినను గూడ వేదవిద్యాసక్తిచే వేదవిద్వాంసులను రప్పించి వారియొద్ద నధ్యయనముచేసి యజుస్సంహితను సంపూర్తిగ నేర్చెను. శంకరుండు వేదవేదాంతవేదియు సాహిత్య నిధియు కర్నాటక హిందుస్థానీ సంగీత కుశలుఁడును ఆంధ్రగీర్వాణోభయభాషాకవియును దాతయును నగుటచే నేప్రొద్దు పెక్కురు వేదశాస్త్రవేదులు గాయక శ్రేష్ఠులు సుకవి వర్యులు సంగీతపారీణులగు గణికలు శంకరుని సన్నిధానముఁ జేరి తమ వైదుషిని రూపించి యానందింపఁజేసి బహుమానంబులొందుదురు. మఱియు శంకరునియందు నాస్తియనుమాట లేనందున రిక్తులగు బ్రాహ్మణులు వచ్చి కూడ శంకరు నర్థించి తగురీతి నర్థంబొంది పోవుదురు. అంత నోరుగల్లు నందలి భక్తజనులు శంకరారాధ్యునియందుభక్తినొంది వచ్చి యవ్వారి యుపన్యాసంబుల కానందించి యోరుగంటికి శంకరుని దోడ్కొనిపోయి.

అందు నివసింపఁజేసి వారియన్నదానసత్రం బందుఁగూడ జరుపింపఁదలంచి శిష్యులును వైశ్య ప్రముఖులునగు మ. రా. శ్రీ ఆకారపు వెంకన్న చన్నయ్యగారలు తమతోటయందలి యొక విశాలభవనమును శంకరారాధ్య సత్రమునకై యొసంగి ధనంబిచ్చుచుండిరి. ఇతర ధనిక వైశ్య భక్తులుగూడ ధనంబిచ్చి శంకరునిచే నవిచ్ఛిన్న శైవ గణార్చనా వ్రతం బునల్పింపుచుండిరి. అపుడపుడు శంకరారాధ్యునకు గజోత్సవాది మహోత్సవంబులను సల్పి యానందించుచుండిరి.

సీ॥ వరియన్న మో భగ ♦ వంతుఁడా యని మ్రొక్క-
నయ్యలకెల్ల గా ♦ ల్యన్న మిచ్చె
వస్తుల సల్పెడు ♦ పరిపాటి చనెననఁ
జేదశైవులకు సం ♦ ప్రీతినొసఁగె
నోరెడన్నంబును ♦ నోరెడు నేతితోఁ
దినుచుంటిమను వృద్ధు ♦ లను నలర్చె
దొంటికెఁ బెన్నిధియిఁకఁ ♦ గలవులేదను లింగ
ధారుల మదుల ను ♦ త్సాహపఱచె
గీ॥ శంకరుఁడె యిట్లవతరించి ♦ శైవజనుల
సాధులను జేదలను మన్పఁ ♦ జాలెనన్న
ప్రథను జెందిన శంకరా ♦ రాధ్య గురుని
బోలువారలు గలరె యీ ♦ పుడమిలోన॥

అపుడు శంకరారాధ్యుఁడు సత్రాన్నదాననిర్వహణంబునకై మధ్యమధ్య ప్రాంతగ్రామంబుల కేగి యందలి జనమున కుపన్యాసముచే భక్తిని బుట్టించి యవ్వారిచే ధనం బార్జించి తెచ్చి సత్రంబున కిచ్చుచుండురు. మఱియు నాయాగ్రామంబులందలి శివమూర్తులను గుఱించి తత్స్థ గ్రామ పంచరత్నంబులను పద్యంబులను రచించుచుండిరి.

ఇఁక శంకరారాధ్యస్వాలకులకు శివపురపు వీరయ్యగారు తమ కళత్రముతో సత్రంబందు వసించి శంకరారాధ్యుని యన్నసత్రంబును అర్థరాత్రిగణార్చనా వ్రతంబును నిర్విఘ్నంబుగ నిర్వహింపుచుండిరి.

ఆమీఁద శంకరుని లక్షతొంబదియాఱువేల గణార్చనా వ్రతంబు ముగియఁగా మఱల శంకరారాధ్యుఁ డాఱులక్షల గణార్చనావ్రతంబు

మొదలిడి యందే సల్పుచుండిరి. ఓరుగల్లునందు శైవబాలురు పలువు రుండుటారసి ఆరాధ్యవర్యుఁ డందు వేదశాస్త్రపాఠశాలను బ్రతిష్ఠించి విద్యార్థులకు వేదశాస్త్రంబులను జెప్పించుచుండె. అందు శంకరారాధ్య తనయుఁడు కుమారస్వామియు మఱికొందఱు వటువులు యజుస్సంహిత యందుత్తీర్ణులైరి. అపుడు శ్రీమల్లికార్జున పండిత గురువంశ్యుఁడగు నొక మాహేశ్వరుఁడు శంకరారాధ్యుని బ్రార్థించి తత్పుత్రునకుఁ గుమార స్వామికి తనతనయనిచ్చి వివాహమొనరించెను. వధువచిర కాలంబుననే యౌవనంబునొంది భర్త్తయొద్దకు వచ్చి కాపురము చేయుచుండె. ఆ దంపతులకొక కొమరిత జన్మించెను.

సీ॥ అర్థరాత్రమున న ♦ న్నార్తులై రైల్దిగి
వచ్చిన వారల ♦ కిచ్చుభుక్తి
నడురేయి నాబాట ♦ నడువఁగా వినఁబడు
ఘణఘణ యనేఁడు జా ♦ గంటమ్రోత
కష్టమేమియు లేక ♦ కడుపార భుజియించి
తఱుగ దెప్పుడు లింగ ♦ ధారిజనము
సతతంబు శైవభో ♦ జనపాత్రములఁ బాసి
యమరదేవేళల ♦ నాజ్యధార
గీ॥ శంకరారాధ్య శైవాన్న ♦ సత్రవైభ
వంబు నుడువంగఁ దరమె? జ ♦ గంబునందు
వేదనాదంబు సంగీత ♦ వాదనంబు
కావ్యపాఠంబు లెప్పొద్దు ♦ గరిమమీఱు॥

శంకరారాధ్యుఁడు హైదరాబాదునందును శికింద్రాబాదు నందును నోరుగల్లునందును మాహేశ్వరులకు గురుఁడగు శ్రీరాజలింగా రాధ్యకు నుచితరీతి వెండిగిన్నెలను వెండి పళ్ళెరంబులను నిచ్చియుండియు నొకనాఁడు సంకల్పించి బంగారు నవరసులను శతాధికంబుగఁ దెప్పించి మాహేశ్వరుల కందఱకు సమర్పించి "ధన్యోస్మి" యనికొనియె. తత్పు త్రుఁడగు కుమారస్వామియుఁ గూడ తండ్రిగారి యౌదార్యంబున కను మతించి యమ్మహాకార్యంబునకుఁ దోడ్పడియె.

సీ॥ వెండిగిన్నెలనిచ్చె ♦ వేలఁకొలదిశైవ
జనములకెంతో హ ♦ ర్షంబుదనర
వెండి తళియలిచ్చె ♦ విందుగా గురుజనం
బులకు సంతోషంబు ♦ పొంగిపొరల
సేలువులిచ్చెఁ గా ♦ శ్మీర నిర్మితముల
విద్వజ్జనములకు ♦ వేడ్కమీఱ
బంగారు నవరసుల్ ♦ ప్రౌఢి నొసఁగె నోరు
గంటి శైవులకు న ♦ క్కజముగాఁగ
గీ॥ ఇట్టి వరదాత గల్గునే ♦ యిట్టిఘనుఁడు
గల్గునే యెందునేని జ ♦ గాన నేఁడు
ననుచు జనములు పొగడగ ♦ నవని వెలసె
శంకరారాధ్య దేశిక ♦ చక్రవర్తి॥

ఇప్పటికి శంకరారాధ్యులవారు శ్రీశైలము కాశి గయా ప్రయాగ జగన్నాథములను శ్రీకాళహస్తి తిరుపతి మొదలుచేసి శ్రీరామేశ్వరము ధనుష్కోటివఱకు దక్షిణయాత్రను గురునితో మాహేశ్వరునితో సల్పిరి. శ్రీవారేయూరనందేని నేకొండయందేని ఎట్టి యడవియందేని నున్నను తాఁ బవలు పంక్తియందార్గురు మాహేశ్వరులతోఁ గూడ భోజనము చేయుచుందురు. రాత్రియందు గురుపూజను ఇష్టలింగమహాపూజ నొనర్చి యార్వురు మాహేశ్వరులతో భుజింతురు. ఇఁక శంకరులు భక్తివర్ధకములగు శివభజన కీర్తనలు 3 భాగములను భావలింగ శతకమును శివమానసపూజాయుగ్మమును మల్లికార్జునశతకమును ఆత్మప్రకాశినీ కంఠమాలను గైర్వాణియందు శ్యామలా పంచరత్నములను విరచించి ప్రచురించిరి. వీరికవిత్వముహృద్యముద్రాక్షాస్వాద్యము. ఆరులక్షలగణార్చనము గూడ మూడువంతులు ముగియవచ్చినది. ఇట్లు సర్వజనామోదంబుగఁ గొంతకాలంబు జరిగినమీఁద నొకప్పుడొక యూరనున్న నొక యారాధ్యున కాపదఁ దీర్చుటకై తదాహ్వానంబున శంకరారాధ్యుండటకేఁగి కొన్నిదినంబులుండి ఆయారాధ్యుని యాపదను బాపిరి. శ్రీశంకరారాధ్యుఁడు స్వరచిత ద్విపదమానస పూజయందు "నాకేమియు నక్కఱ లేదు. నీవే నాబంధుండ వాడయడవు. నీవే కావలయు"నని కోరుటచేత నొ

యన్నట్లు శంకరారాధ్యుని కొమరుఁడు కుమారస్వామి యాకస్మికంబుగ నొక్క దినము రుజనొంది యీశ్వరుని జేరె. శంకరారాధ్యుఁ డట్టి నాల్గుదినంబుల కోరుగంటికి వచ్చుటతోడ నివార్త దెలిసె. శంకరుఁడు సర్వజ్ఞుఁడగుటయు విరాగితల్లజుఁడగుటయు సుతునికై విలపింపక ధైర్యముచెంది మనస్సును స్థిమితంబొనర్చెను. అటుపిదపఁ గొన్ని నెలలకు బంధుగులయొక్క కోరిక ననుసరించి కోడలి కొక సన్నిహిత జ్ఞాతి పుత్త్రుని దత్తునిగ సల్పి వివాహంబునెఱవేర్చె. యథాపూర్వకంబుగ గణార్చనా వ్రతం బన్నదానంబు జరుపుచు భక్తులకు శివభక్తిని జ్ఞాన వైరాగ్యంబులను గూర్చి యుపన్యసించుచు శివానందంబుగనే గురువర్యులు నాల్గు వత్సరంబులు గడపిరి. ఆపై శంకరుఁడు సిద్ధార్థి సంవత్సరంబందు వేసవిలో నత్యుష్ణముచేఁ గడుబడలి తమకిష్టభక్తావాసంబగు శికింద్రాబాదునకు వచ్చి యందును వ్యాధిచే బాధింపఁబడి యంత్యావసయందు సన్యసించి ఆ సంవత్సర వైశాఖ బహుళపంచమియందు మధ్యాహ్న సమయమునఁ దమపార్థివ తనువుఁబాసి శివుని జెందిరి. బంధుగులు శిష్యులు భక్తులు సర్వజనంబులు శంకరుని కైలాసయాత్రకు వగచిరి. భక్తులు తత్సమయమందు హైదరాబాదు శికిందాబాదులకు మధ్యమందున్నట్టి కవాడిగూడెము గ్రామ బహిస్థలంబందుఁ గొన్ని యకరములభూమినిగొని యందు శంకరారాధ్యస్వామి భౌతికదేహంబునునిచి సమాధిచేసి కొన్నివేలరూప్యములతో నాస్థలమందొక ధర్మశాలను నిర్మించి సమాధిపై గుడిని గట్టి యావరణమందంతటను పుష్పవృక్షంబులను బిల్వవృక్షంబులను ఫలవృక్షంబులవేసిరి. అచిరకాలంబుననే యందు శంకరారాధ్య శిష్యుండును ధనికుండునునగు మ॥రా॥శ్రీ జాలిదె రామన్నగారు శంకరారాధ్య సమాధి స్థల నిర్మాతాలయంబందు నిగమాగమ విధిప్రకారము శివలింగంబును నందికేశ్వరునిఁ బ్రతిష్ఠగావించి ధ్వజంబు శిఖరంబు స్థాపించిరి. మ॥రా॥శ్రీ పొద్దుటూరి వీరన్నగారిక్కార్యంబునకుఁ జేయూత నొసఁగి కొన్నివేల ద్రవ్యంబు నన్నదానాదికంబులకు కర్చుచేసి నిర్వహించి సంపూర్ణ సహాయంబుచేసిరి. ఇట్టి శ్రీశంకరారాధ్య లింగంబునకు బ్రతి దినార్చనా నైవేద్య దీపంబులు జరుపుచు సంవత్సరమునకొకమారు ఆరాధన తిథియందు మహేశ్వరార్చన నొన

ర్పుచున్నారు. ఈ మఠమందలి ధర్మగృహమందొక శైవకుటుంబమును గాపురంబుంచి వారిచే శంకరారాధ్య లింగంబున కర్చనను సల్పింపు చున్నారు. ఓరుగల్లునందు శ్రీశంకరారాధ్యాన్న సత్రమందిరమున నచ్చటి భక్తులు శంకరారాధ్యుని శిలావిగ్రహంబు నొకదాని నిర్మింపఁజేసి యందుఁ బ్రతిష్ఠించిరి. అందు శంకరారాధ్యారాధనా తిథియందు మహేశ్వరార్చ నాన్నదానంబుల సల్పుచున్నారు. శంకరారాధ్య దత్తపౌత్రుని కిద్దఱు పుత్రులను శంకరారాధ్య పౌత్రి జేజెమ్మ కిద్దఱు పుత్రులును వర్ధిల్లు చున్నారిది మహనీయుఁడగు శంకరారాధ్యుని చరిత్రము శ్రుతిపవిత్రము సర్వదురితలతాలవిత్రము.

సీ॥ పుట్టినాఁడెవ్వాఁడు ♦ భువనవిఖ్యాతమహా
ఉద్భటారాధ్య వంశోరుశాఖ
పట్టినాఁడెవ్వాఁడు ♦ ప్రౌఢిమై యాఋుల
క్షులఁ జెందు శైవభో ♦ జనపువీక్ష
నెట్టినాఁడెవ్వాఁడు ♦ నిశ్చితశివతత్త్వ
బోధనంబున శ్రోత్ర ♦ బుద్ధిరజము
కట్టినాఁడెవ్వాఁడు ♦ గరిమతో వేనవేల్
కొలఁదిగ శివలింగ ♦ ములనుఁ బ్రజకు

గీ॥ చుట్టినాఁడెవ్వఁ డాకాశి ♦ దొట్టిసేతు
వవధిఁగల్గిన సర్వపు ♦ ణ్యస్థలముల
అట్టి శంకరారాధ్యుఁడా ♦ యభవమూర్తి
మనల నందఱ నిరతంబు ♦ మనుచుఁగాత.

ద్వితీయభాగము సమాప్తము.



కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ప్రెస్, [illegible].